# ఎమెస్కో వచన మహాభాగవతం

I



శ్రీ పోతన మహాభాగవతమునకు అనుసృతి

అయినంపూడి గు[illegible]

# ఎమెస్కో వచన మహాభాగవతం

(మొదటి సంపుటం)

For Sri D. Ramalingam garu
with regards

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుసృతి

అయినంపూడి గురునాథరావు



215

యం. శేషాచలం అండ్ కంపెనీ,
మచిలీపట్నం-సికింద్రాబాద్

EMESCO VACHANA MAHA BHAGAVATAM-1

As reto d by
Sr AYINAMPUDI GURUNATHA RAO

F rst Edition
July 1984

294 5924

Publishers .
M SESHACHALAM & Co
Machilipatnam - Secunderabad - 3

C-13204

Printers :
25002
PRASAD PROCESS
Secunderabad - 500 023.

D stributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
8237 Rashtrapathi Road Secunderabad-500 003

Price Rs 15-00

# శ్రీ
# మహా భాగవతం
## (ప్రథమ స్కంధం)

### మంగళాచరణం

సకలలోక పాలకుడూ సాధుజన సంరక్షకుడూ అసుర సంహర్తా అఖిల బ్రహ్మాండభాండ నిర్మాతా అయిన నందనందనుడు శ్రీకృష్ణుని కైవల్య ప్రాప్తి[1] కోసం నిరంతరం ధ్యానిస్తాను

### ఇష్టదేవతా స్తుతి

తాండవ నృత్యకేళీ విలోలుడూ గిరిజా[2] మనోహరుడూ బాలచంద్ర శేఖరుడూ మన్మథ గర్వభంజనుడూ నారదాది మునిజన సంసేవితుడూ అయిన మహేశ్వరునకు నా నమోవాకాలు[3]

చరాచర భూతకోటి విధాతా సరస్వతీ మనోనంద ప్రదాతా వేదార్థ నిర్ణేతా సకల తాపసలోక పథప్రదాత అయిన ధాతకు[4] నా కైమోడ్పులు.

పార్వతీ మనోనురాగ పాత్రుడూ విఘ్నహర్తా విచ్ఛేదకుడూ మోదక ప్రియుడూ మూషక వాహనుడూ అయిన విఘ్ననాయకునకు నా భక్తిపూర్వక నమస్కారాలు.

అక్షమాల శుకం పుస్తకం చేదాల్చి పద్మసంభవుడైన బ్రహ్మదేవుని మనోహారిణియైన సర్వాంగశ్లక్ష్ణ[5] వాణికి మువ్వురు శక్తులకూ మూలకారణమైన

---

1 మోక్షప్రాప్తి 2 పార్వతి 3 నమస్కారాలు 4 బ్రహ్మ
5 శరీరమంతా చల్లనైనది.

గిరిజహా ఆ వాణీ గిరిజలకు నెచ్చెలియై సంపదలకు పట్టుకొమ్మయై శ్రీహరికి పట్టపుదేవియైన లక్ష్మికి నా ప్రణామాలు

ఆదికవి వాల్మీకి మహర్షికీ వేదవిభాగ నిర్ణేత వ్యాసమౌనికీ భాగవత కథామృత రసాస్వాది శుకయోగికీ నా నమస్సుమాంజలి.

మృదుమధుర వచన రచనా పల్లవిత స్థాణువు బాణునకూ[1] మహాకావ్య నిర్మాణ కళావిలాసుడు కాళిదాస మహాకవికీ కవికమల రవి[2] భారవికీ విదళితాఘుడగు[3] మాఘునకూ నా ప్రణతులు

నన్నయ తిక్కనాది ప్రాచీనాంధ్ర కవులకు నా జోహారులు వర్తమాన కవులకు నా జేజేలు భావికవులకు నా శుభాకాంక్షలు

## భాగవత ప్రాశస్త్యం

భాగవతం భూలోక కల్పతరువు* ఇది కృష్ణమూలం వ్యాసాలవాలం శుకాలాపాభిరామం లలిత స్కంధం మంజులతా శోభితం సుమనస్సుజ్ఞేయం సుందరోజ్జ్వల వృత్తం మహాఫలం సద్విజశ్రేయం అంతేకాదు భాగవతం వేద

1 తన మధుర వచన రచనచే మోడునుకూడా చిగిరింపజేయగలవాడు (బాణుడు కాదంబరి అను వచన కావ్యం సంస్కృతంలో రచించాడు )

2 కవులనెడి కమలములకు సూర్యునివంటివాడు

3 పాపరహితుడు

*భాగవతం కల్పవృక్షంతో పోల్చబడ్డది కనుక ఈ క్రింది పదాలకు భాగవతపరంగా ఒక అర్థమూ వృక్షపరంగా మరో అర్థమూ వుంటుంది.

| | |
|---|---|
| వ్యాసాలవాలం | వ్యాసుడు పాదుగా గలది విస్తారమైన కుదురు కలది |
| శుకాలాపాభిరామం | శుకమహర్షి భాషణములచే మనోహరమైనది చిలుక పలుకులచే మనోహరమైనది |
| స్కంధం | భాగవత భాగం చెట్టుబోదె |
| మంజులతా శోభితం | మంజులతచే (మనోహరత్వంచే) శోభించేది మనోహరమైన లతలచే శోభించేది |
| సుమనస్సు | వేలుపు పువ్వు |
| వృత్తం | పద్య విశేషం వర్తులమైనది |
| మహాఫలం | గొప్ప ఫలితాన్ని ఇచ్చేది మహాఫలాలు కలది |
| సద్విజశ్రేయం | సజ్జనులైన ద్విజులకు మేలుకూర్చేది చక్కని పక్షులకు ఆశ్రయమిచ్చి మేలు కలిగించేది |

మనెడి దేవవృక్షంనుండి రాలిపడిన పండు శుకముఖ వినిస్సృతమైన[1] ఆ ఫల రసాన్ని ఆస్వాదించడానికి రసభావ విశేషజ్ఞులు అర్హులు

మహర్షి విరచితమైన ఆ మహాభాగవతాన్ని భక్తితో వినేవారికి శ్రీకృష్ణుడు సులభంగా లభిస్తాడు ఇతర శాస్త్రాలవల్ల ప్రయోజనం లేదు మాత్సర్యం కాపట్యం లేనివారి తాపత్రయాలను అణచి పరమార్థాన్ని అందించేది ఈ మహాభాగవత మొక్కటే

సత్యం పరం ధీమహి అని చెప్పడంవల్ల భాగవతం గాయత్రీ మంత్రార్థాన్ని వ్యక్తం చేస్తుంది గాయత్రిని ఆశ్రయించి ధర్మాన్ని ప్రబోధిస్తూ వృత్రాసురవధను అభివర్ణించేది భాగవతమని మత్స్య పురాణోక్తి

## భాగవత కథ ప్రారంభం

నైమిశం పరమ పవిత్రమైన మహారణ్యం అది విష్ణుక్షేత్రం శౌనకాది మహర్షులు ఒకప్పుడక్కడ శ్రీహరి సాయుజ్యాన్ని కాంక్షించి దీర్ఘకాలికమైన యొక యజ్ఞాన్ని సంకల్పించారు దాని అనుష్ఠాన కాలం వేయేండ్లు దానికి దీర్ఘసత్ర యాగం అని పేరు ఆ యాగం చూడడానికి మహర్షులందరూ వచ్చారు అలా వచ్చిన వారిలో సూత మహర్షి ఒకడు ఆ మహర్షి ఒకనాడు ప్రాతస్సమయంలో నిత్యనైమిత్తిక[2]హోమాలు ఆచరించి సుఖాసీనుడై యుండగా మహర్షులందరు ఆయన్ను దర్శించి సాంజలులై యిలా అన్నారు—

"మహర్షీ నీవు పురాణేతిహాసాలూ ధర్మశాస్త్రాలూ ఎన్నో పఠించి ప్రవచించావు వ్యాసాదులకు తెలిసిన సమస్త విషయాలూ వారి అనుగ్రహానికి పాత్రుడవైన నీకున్నూ తెలుసు నీవు మాకు గురుతుల్యుడవు గురువులు శిష్యులకు పరమ రహస్యాలను కూడా చెప్పెదరు కదా కనుక మానవులకు నిశ్చలమైన కళ్యాణం ఎలా కలుగుతుందో నిశ్చయించి మాకు బోధించు

నీవు చిరజీవివి అనేక గ్రంథార్థాలు ఆకళింపు చేసుకున్నవాడవు సజ్జన గోష్ఠుల్లో నీవు ఎన్నో విన్నావు రానున్నది కలియుగం కలిలో అందరూ అలసులు మందబుద్ధులు అల్పాయుష్కులు వ్యాధిగ్రస్తులు అయ్యేవారు ఎవ్వరూ సత్కర్మానుష్ఠానం చెయ్యరు కనుక మునీంద్రా ఆత్మశాంతి యెలా

---

1 శుకముఖ వినిస్సృతం — శుకమహర్షి నోటినుండి వెల్వడినది చిలుక నోటినుండి జారినది

2 నైమిత్తికం — ఏదో ఒక కారణం వలన అప్పుడప్పుడు చేయవలసిన కర్మ

కలుగుతుందో సర్వసౌఖ్యాలు ఎలా కరతలా మలకా లవుతాయో చెప్పి మమ్మల్ని చరితార్థులను చెయ్యి

ఎవని అవతారం అఖిల భూతకోటికి సుఖాన్ని కలిగిస్తుందో ఎవని శుభ నామం స్మరించడంవల్ల సంసార బంధాలు నశించి మృత్యుభీతి తొలగిపోతుందో ఎవని పాదాబ్జాతాలనుండి వెల్వడిన పావనగంగా నదీజలం సేవించిన మాత్రంచేత సకల పాపాలూ హరిస్తాయో తాపసు లెవరి చరణాలనుండి ఆత్మశాంతి పొందు తారో ఆ వాసుదేవుని కథలు వినాలని మాకు కుతూహలంగా వుంది

శ్రీహరి గుణభాషణాలు వాణికి భూషణాలు మృత్యు విభీషణాలు[1] హృదయ తోషణాలు[2] కల్యాణ విశేషణాలు ప్రతిపద రసోదయమైన శ్రీకృష్ణుని మధురగాథ వినాలని రసజ్ఞులైనవారు ఆకాంక్షించడంలో ఆశ్చర్యంలేదు మహర్షి శ్రీహరి కథామృతం అనే వర్షధారచే కాక జన్మపరంపరాగతమైన పాపం అనే దావాగ్ని మరే వుపాయం చేతనూ ఆరదు

పాపారణ్యాలను హరినామ కథనం కార్చిచ్చులా దహింపచేస్తుంది, దుఃఖ మేఘాలను శ్రీహరి దర్శనం ఝంఝామారుతంలా చెల్లాచెదరు చేస్తుంది సంతాప కుంజరాలను[3] శ్రీహరి ధ్యానం సింహంలా కూల్చివేస్తుంది అరిషడ్వర్గం అనే చీకట్లను శ్రీహరి స్మరణం సూర్యకాంతిలా పటాపంచలు చేస్తుంది. ఈ సంసార సముద్రాన్ని దాటడానికి శ్రీహరి భక్తి నావలాంటిది వెయ్యి మాటలు దేనికి మహర్షి మాకు శ్రీవిష్ణు మహిమను తెలిపి మమ్మల్ని తరింపచెయ్యి

కపట చక్రవర్తి అగమ్యుడూ అయిన శ్రీకృష్ణుడు బలరామునితోగూడి అతి మానుష కార్యాలెన్నో చేశాడట అవన్నీ మాకు వచించి మా కోర్కె తీర్చు కలిభయావిష్టులమై మేమందరమూ ఈ నైమిశారణ్యంలో ఈ దీర్ఘసత్ర యాగ కారణంగా శ్రీహరి కథలు ప్రతిసమయంలో వినవచ్చునని కుతూహలపడి వచ్చాం మా అదృష్టవశాత్తు సముద్రాన్ని దాటగోరేవారికి కర్ణధారుడు[4] దొరికినట్లు కలి దోషాన్ని ఎలా పరిహరించగలమా అని అభిలషిస్తున్న మాకు నీవు లభించావు సకల ధర్మభారం వహించిన శ్రీకృష్ణుడు తనువు చాలించి ఆత్మ పదానికి వెళ్ళిన తర్వాత ఆ ధర్మం ఎవ్వరి నాశ్రయించిందో - మహాభాగా మాకు ఆ విషయా లన్నీ చెప్పండి" అని జిజ్ఞాసతో[5] ఆ మహర్షులందరూ అర్థించేసరికి రోమ హర్షణునకు జన్మించి ఉగ్రశ్రవసుడను పేరుతో విఖ్యాతి వహించి నిఖిల పురాణ పైఖరీ సమేతుడైన సూతుడు ఇష్టదేవతలనూ వ్యాసమహర్షినీ శుకయోగినీ సంస్మరించి యిలా చెప్పడం మొదలు పెట్టాడు

---

1 భయం కలిగించేవి 2 మనస్సంతోషం కలిగించేవి 3 తాపా లనే ఏనుగులను 4 ఓడ నడుపువాడు 5 తెలుసుకోవాలనే కోరికతో.

# సూతుడు నారాయణ కథను ప్రశంస చేయుట

"మునీంద్రులారా మీరు నన్ను సకలలోక శుభంకరమైన ప్రశ్న అడిగారు. ఆత్మ ఎలా ప్రసన్నం అవుతుందనిన్నీ అహేతుకమైన హరిభక్తి ఏ రూపంలో కలుగుతుందనిన్నీ కదా మీరు నన్ను ప్రశ్నించింది వినండి మానవుని తరింపజేసే ఒకే ఒక సాధనం హరిభక్తి హరిభక్తివలన వైరాగ్య విజ్ఞానాలు లభిస్తాయి శ్రీహరి కథా శ్రవణంవలన తెలిసిన కాని ధర్మాలు మోక్ష పర్యంతమైన సకల వాంఛితాలనూ తీరుస్తాయి ఇతర ధర్మాలు నిరర్థకాలు

ధర్మానుగుణమైన అర్థానికి కామం ఫలం కాదు ఇంద్రియ సుఖమే లక్ష్యంగా గల కామం నిష్ఫలం అది అశాశ్వతం తత్త్వ జిజ్ఞాస గలవానికి కర్మాచరణంవలన సిద్ధించే ఫలంకూడా నిరర్థకమే తత్వ జిజ్ఞాస అంటే ధర్మ జిజ్ఞాస అన్నమాట కనుక ధర్మమే తత్వమని కొందరి భావన అద్వయమైన జ్ఞానమే తత్వమని తత్వవిదుల మతం

ఆ తత్వాన్నే ఔపనిషదులు[1] "బ్రహ్మ" మనిన్నీ బ్రహ్మవాదులు "పరమాత్మ" అనిన్నీ సాత్వతులు[2] భగవంతుడనిన్నీ అంటారు వేదాంత శ్రవణంవలన జ్ఞాన వైరాగ్యాలు కలుగుతాయి ఆ జ్ఞాన వైరాగ్యాలతోగూడిన భక్తిచేత జిజ్ఞాసువైనవాడు క్షేత్రజ్ఞుడైన ఆత్మయందు[3] పరమాత్ముని దర్శించగలుగుతాడు

ఎవరి వర్ణాశ్రమ ధర్మాలు వారు పాటించాలి నిత్యమూ శ్రీహరి కథలు వినాలి శ్రీహరి ధ్యానమనే ఖడ్గం అహంకార నిబద్ధమైన కర్మను త్రుంచి వేస్తుంది పుణ్యతీర్థాలు సేవించడంవలన భగవంతునియందు శ్రద్ధకలుగుతుంది కర్మ నిర్మూలన హేతువులైన భగవత్కథలయందు ఆసక్తి కలవారికి అన్య కథలు రుచింపవు భాగవతసేవవల్ల నిశ్చల భక్తిభావం ఏర్పడుతుంది నిశ్చల భక్తిభావంవలన రజస్తమో గుణాలవల్ల కలిగే కామక్రోధాలు తొలగిపోతాయి సత్వగుణంవల్ల మనస్సు ప్రసన్నమౌతుంది ప్రసన్న మనస్కుడు ముక్తసంగుడౌతాడు అలా నిస్సంగుడైనవానికి ఈశ్వర తత్త్వం కరతలామలక మౌతుంది దానివలన అహంకారం నశిస్తుంది అహంకారం నశించగానే సకల సంశయాలు విచ్ఛిన్నమై అద్వైతభావం అంటే అంతా ఒకటే అనే భావన కలుగుతుంది.

---

1 ఉపనిషత్తుల అంతర్యం తెలిసినవారు. 2 వైష్ణవాగమాన్ని అనుసరించేవారు. 3 క్షేత్రం అంటే శరీరం. క్షేత్రజ్ఞుడైన ఆత్మ అంటే జీవాత్మ అని అర్థం

పరమపురుషు డొక్కడే సర్వశక్తి సంపన్నుడు ఆతడే లోకాలను సృజించడానికి రజోగుణంతో బ్రహ్మగా పాలించడానికి సత్వగుణంతో విష్ణువుగా లయం చెయ్యడానికి తమోగుణంతో ఈశ్వరుడుగా మూర్తీభవిస్తాడు ఆ త్రిమూర్తులలో సత్వగుణ ప్రధానుడైన శ్రీహరి చరాచరకోటికి సకల శుభాలూ కలుగజేస్తాడు

మరో విశేషం చెపుతాను వినండి కట్టెకంటె పొగ పొగకంటె త్రయీమయ[1] మైన అగ్ని ఎలా విశిష్టమైనదో అలాగే తమోగుణంకంటె రజోగుణం రజోగుణంకంటె సత్వగుణం విశిష్టమైనది అందుచేతనే పూర్వం మహర్షులు సత్త్వమయుడైన శ్రీహరి నాశ్రయించారు

అస్థిరాలైన సిరిసంపదలు కాంక్షించేవారు అన్యదైవాలను ఆరాధిస్తారు కాని ముక్తిని కాంక్షించేవారు మాత్రం శ్రీహరినే సేవిస్తారు శ్రీహరి కొక్కనికే ముక్తినిచ్చే శక్తివుంది వేదాలు యాగాలు యోగాలు ధర్మాలు తపస్సు జ్ఞానం – ఇవన్నీ వాసుదేవునకు సంబంధించినవే వాస్తవానికి పరమేశ్వరుడు గుణాతీతుడు అయినా త్రిగుణాత్మికమైన తన మాయా బలంచేత చరాచర భూతకోటిని సృజించి అందులో ప్రవేశించి గుణాత్మకుడులాగా గోచరిస్తాడు

అగ్ని ఒక్కటే అయినా అనేక వృక్షాల్లో అనేకంగా తోస్తున్నట్లే విశ్వాత్మకుడైన పురుషుడు ఒక్కడే అయ్యిందిన్నీ తానై సృజించిన వివిధ భూతకోటిలో అంతర్యామియై ప్రకాశిస్తూ వుంటాడు కాని ఆ గుణాల్లో మాత్రం చిక్కుపడడు ఆ పరమేశ్వరుడే అనేక యోనుల్లో అవతరించి లోకాలను రక్షిస్తూ వుంటాడు ఇక ఆ శ్రీమన్నారాయణుని దివ్యరూపం ఎలా వుంటుందో చెపుతాను వినండి

మహత్తు (బుద్ధి తత్వం) అహంకారం తన్మాత్రలు[2] – వీనితోగూడి షోడశ కళాప్రపూర్ణుడై పంచమహాభూత భాసితుడై శుద్ధసత్త్వ స్వరూపుడై సర్వాతిశాయియైన పరమేశ్వరుని విరాడ్రూపం అద్భుతంగా వుంటుంది ఆ విరాట్పురుషునకు లెక్కింప నలవికాని కరచరణా ద్యవయవాలు వుంటాయి అసంఖ్యాకమైన దివ్యాంబరాలు కేయూరాలు (భుజకీర్తులు) హారాలు కుండలాలు కిరీటాలు ధరించి ధగధగలాడుతూ వుంటాడు అలాంటి పరమ పురుషుడు సకల లోకాలనూ రక్షించే యత్నంలో అంతులేని సముద్రం నడుమ యోగనిద్రా ముద్రితుడై ప్రకాశిస్తూ వుంటాడు భగవంతుని అవతారా లన్నింటికీ మూల

---

అగ్ని మూడు విధాలు. దక్షిణాగ్ని గార్హపత్యం ఆహవనీయం

2 శబ్దం స్పర్శ రూపం రసం గంధం – ఈ గుణాలకు తన్మాత్ర లని పేరు

భూతమైన ఆ దివ్యరూపాన్ని పరమ యోగీంద్రులు మాత్రమే దర్శింప గలుగుతారు ఇక ఆ పరమేశ్వరుని ఇతరావతారాలను అభివర్ణిస్తాను వినండి

## భగవంతుని యిరవై యొక్క అవతారాలు

పరమేశ్వరుని నాభికమలంనుండి సృష్టికర్తలలో శ్రేష్ఠుడైన ఆదిమ బ్రహ్మ ఉదయించి లోకాలను సృష్టించాడు ఆయన తొల్తగా కౌమారం అనే సృష్టిని ఆశ్రయించి దుశ్చరమైన బ్రహ్మచర్య వ్రతం ఆచరించాడు

రెండవమారు జగజ్జననంకోసం రసాతలంనుండి భూమిని ఎత్తి యజ్ఞేశుడై వరాహరూపం ధరించాడు

మూడవసారి నారదుడుగా నవతరించి కర్మ నిర్మోచకమైన వైష్ణవ తంత్రం చెప్పాడు

నాలవసారి నరనారాయణావతారం ధరించి దుశ్చరమైన తపస్సు చేశాడు.

అయిదవది కపిలావతారం ఈ అవతారంలో సిద్ధేశుడై ఆసురి అనే బ్రాహ్మణునకు సాంఖ్యం ఉపదేశించాడు

ఆరవ అవతారంలో అత్రి మునికి అనసూయా దేవియందు జన్మించి అలర్కునకు ప్రహ్లాదాదులకు ఆత్మవిద్య చెప్పాడు

ఏడవ శరీరం యజ్ఞుడు ఆకూతియందు రుచి అనెడి మునివలన జన్మించి యామాది దేవతలతోకూడి స్వాయంభువ మన్వంతరాన్ని రక్షించాడు

ఎనిమిదవ అవతారంలో మేరుదేవియందు నాభికి ఉరుక్రముడుగా జన్మించి విద్వజ్జనులకు పరమహంస మార్గాన్ని ఉపదేశించాడు

తొమ్మిదవ జన్మలో పృథు చక్రవర్తియై భూమిని గోవుగాచేసి సమస్త వస్తు జాతాన్ని పిదికాడు

పదోసారి చాక్షుష మన్వంతరంలో ప్రళయ జలధిలో మీనావతారం ధరించి భూమిని నావగాచేసి వైవస్వత మనువును ఉద్ధరించాడు

పదకొండవమారు కమఠాకారం (తాబేలు) వహించి సముద్ర మథన సమయంలో మందరాచలాన్ని తన వీపుపై నిలిపి మునిగిపోకుండా చేశాడు

పన్నెండవ అవతారంలో ధన్వంతరియై క్షీర సముద్రంలోనుండి అమృత భాండం చేదాల్చి బహిర్గతు డయ్యాడు

పదమూడవ అవతారం మోహిని దేవదానవులకు మోహం కల్పించి దేవతలకు అమృతం ఇచ్చాడు.

పదునాల్గవదియైన నరసింహ రూపంలో హిరణ్యకశిపుని సంహరించాడు

పదునైదవది అయిన వామనావతారంలో బలిచక్రవర్తిని యాచించి మూడు లోకాలూ ఆక్రమించాడు

పదునారవదియైన పరశురామావతారంలో క్రుద్ధుడై విప్రద్రోహులయిన రాజులను ఇరువది యొక్కమారులు వధించి భూమిని క్షత్ర విహీనం చేశాడు

పదునేడవ అవతారంలో వ్యాసుడుగా జన్మించి అల్ప మతులను ఉద్ధరించడానికి వేద వృక్షానికి శాఖలు ఏర్పరిచాడు

పదునెన్మిదవదైన రామావతారంలో దేవహితం కోసం సముద్ర బంధనాది మహాద్భుత కార్యాలు ఆచరించాడు.

రామకృష్ణులు పందొమ్మిది ఇరవై అవతారాలు యదువంశంలో జన్మించి భూభారం నివారించారు

ఇరవై ఒకటో అవతారంలో బుద్ధ నామధేయంతో కీకట దేశాల్లో కలి యుగారంభమందు జినసుతుడై జన్మించి రాక్షస నిర్మూలనం చేస్తాడు

యుగసంధిలో రాజులు చోరప్రాయులు కాగా విష్ణు యశుడను బ్రాహ్మణునకు కల్కియను పేరుతో కొడుకై జన్మిస్తాడు

ఒకే సరస్సునుంచి ఎన్నో కాల్వలు పుట్టినట్లుగా ఒకే విష్ణువునుండి ఇలా అనేకాలైన అవతారాలు ఉద్భవించాయి రాజులు దేవతలు బ్రాహ్మణులు మునులు తాపసులు - వీరందరూ వాస్తవానికి విష్ణ్వంశలో జన్మించినవారే శ్రీహరి ప్రతీ యుగంలో రాక్షస వ్యథ పెచ్చుపెరిగినప్పుడు ఏదో యోనిలో జనించి లోకాలను రక్షిస్తాడు పరమ రహస్యమైన హరిజన్మ కథనం రేపూ మాపూ భక్తితో పఠించేవానికి సాంసారిక దుఃఖాలు ఇట్టే తొలగిపోతాయి

రూపహీనుడు జ్ఞాన స్వరూపుడు అయిన భగవంతుని మాయాగుణ పరిణామాలైన మహదాదులచే ఆత్మయందు కల్పింపబడి కంటి కగపడు ఈ విశ్వమంతా ఆ భగవంతుని రూపమే కాని జ్ఞానహీనులు ఆకాశంయొక్క వాస్తవిక తత్వం తెలియక మేఘాలనుబట్టి ఆకాశానికీ వాయుతత్వం తెలియక ధూపరాగాన్నిబట్టి వాయువునకూ భ్రాంతిచే రూపకల్పనచేయు రీతిగా పరమాత్మ తత్వం తెలియనివారు ద్రష్టయైన జీవునియందు దృశ్యత్వాది ధర్మాలు కలిగిన శరీరాన్ని ఆరోపిస్తారు

దృశ్యమానమైన ఈ స్థూల శరీరంకంటె జీవునకు మరో రూపం ఉంటుంది అది సూక్ష్మశరీరం అది అదృష్టగుణం అశ్రుతం దానికి కరచరణాదు లుండవు. అంచేత అది బాహ్యేంద్రియాలకు గోచరం కాదు అదే జీవుని ఉత్పత్తి వినాశాలకు నిమిత్తం కారణమైన సూక్ష్మశరీరం కార్యమైన స్థూల శరీరం (ప్రపంచం) ఈ రెండూ ఆత్మయందు అవిద్యా కల్పితాలే కాని వాస్తవాలు కావు

సరియైన ఆత్మజ్ఞానంచే ఈ విషయం ప్రతిషేధం కావింపబడ్డప్పుడు జీవుడు జ్ఞానస్వరూపుడైన బ్రహ్మ మవుతాడు ఆ జ్ఞాన విశేషంచేత అవిద్యయైన మాయ నివర్తితమై[1] విద్యగా పరిణమిస్తుంది అపుడు జీవోపాధియైన స్థూల సూక్ష్మరూపాన్ని దహించి జీవుడు కాష్ఠం లేకుండా తేజరిల్లే అగ్నిలాగా దానియందే ఉపరతుడై[2] బ్రహ్మ స్వరూపాన్ని పొంది పరమానందం చెందుతాడని తత్వజ్ఞు లంటారు

జనన కర్మలచేత సర్వాంతర్యామియై ప్రకాశించే శ్రీహరికి కవులు జన్మకర్మల నాపాదించి అభివర్ణిస్తారు అని వేదరహస్యాలు తెలుసుకుంటే జీవున కున్నట్లుగా శ్రీహరికి జన్మకర్మ సంబంధం అనేది అసలే లేదు శ్రీహరి లీలలు అమోఘాలు లోకాలను సృజిస్తాడు పాలిస్తాడు హరిస్తాడు భూతకోటికి తానే ఆత్మయైనా ఇంద్రియ జన్యాలైన సుఖదుఃఖాలకు దూరంగా వుంటాడు

శ్రీహరి తత్వం అగోచరం అగమ్యం ఎంతటి తార్కికశక్తి కలవాడైనా అతని లీలలనూ కేవల కల్పితాలైన అతని నామరూపాలను దృష్టియందుంచుకొని ఆ దివ్య తత్వానికి రూపకల్పన చెయ్యడం అసంభవం అగణ్యమైన ఒక మహానటుని నర్తన క్రమాన్ని అజ్ఞుడు సన్నుతింపగలడా?

ఏ విధమైన మాయా మర్మం లేకుండా నిశ్చల భక్తితో శ్రీహరి పాదాంబుజ సౌగంధ్యాన్ని సేవించేవానికి ఆ దేవదేవుని అద్భుతకర్మ మార్గాలు తెలుస్తాయి కాని బ్రహ్మాదులకు కూడా అవి అంతంతమాత్రాన గోచరంకావు విప్రోత్తములారా మీ రెంతటి ధన్యులో హరిచరణ సేవాసక్తితో మీ మనస్సులు నిరంతరం శ్రీహరియందు లగ్నంకావడం మీ సుకృతం కనుక మీకు జన్మాంత వ్యథా యోగాలు ఏవిన్నీ వుండవు అయినా మీరు అర్థించారు కనుక మీకు భగవన్మహిమను గురించి సవిస్తరంగా చెపుతాను వినండి

## శ్రీ మహాభాగవత రచనాది వృత్తాంతం

భాగవతం పురాణాలన్నింటిలో మహోత్కృష్టమైనది లోకేశుని చరిత్రయైన అది బ్రహ్మతుల్యం లోకశ్రేయస్సుకోసం సాక్షాద్భగవంతుడైన వ్యాస భట్టారకుడు దాన్ని సంతరించి తన కొడుకు శుకునిచేత పఠింపచేశాడు సకల వేదేతిహాసాల సారభూతమైనది ఈ పురాణం వైరాగ్య భావనతో గంగానది నడుమ మునిజన పరివేష్టితుడైయున్న పరీక్షిన్మహారాజు అర్థించగా శుకయోగి ఆ పార్థివేంద్రునికి భగవత పురాణాన్ని చెప్పాడు

1. మరలినదై. 2. నశించనివాడై

కృష్ణుడు తనువు చాలించి ధర్మజ్ఞానాదులతో నిజలోకానికి వెళ్ళినపుడు కలిదోషాలు చీకట్లలాగా ముసురుకొనగా ప్రజలు అంధప్రాయులయ్యారు ఆపుడు వారికి ఈ పురాణం సూర్యకాంతిలాగా భాసించింది ఆనాడు నేను బ్రహ్మర్షి అయిన వ్యాసుని వలన పఠించిన ఆ పురాణాన్ని నాకు తోచినరీతిని వినిపిస్తాను" అని సూతు డనేసరికి శౌనకు డిలా అన్నాడు—

మహర్షీ ఏ యుగంలో ఎక్కడ ఏ హేతువుచేత ఏ ఋషుల అర్థిస్తే వ్యాసుడీ భాగవతాన్ని వ్రాశాడూ? ఆ మహర్షి కొడుకు శుకుడు పరీక్షిత్తునకు ఈ పురాణకథ ఎందుకు చెప్పవలసి వచ్చిందీ? శుకుడు మహాయోగి సమదర్శనుడు ఏకాంతమతి ఉతనికి ఏ విధమైన భేదమున్నూ లేదు. ఏమీ తెలియని మూఢుడులాగా వుంటాడు

ఒకప్పుడా శుకుడు గోచీకూడా ధరించకుండా వెళ్తూవుంటే నదీజలాల్లో వివస్త్రలై జలక్రీడ లాడుతూన్న దేవకన్యలు చూచికూడ సిగ్గుపడలేదు. కాని ఆ వెనువెంటనే పుత్ర వ్యామోహంతో హా పుత్రా అని కేకలువేస్తూ వచ్చిన వ్యాసునిచూచి వారు సిగ్గుతో తటాలున బట్టలు కట్టుకున్నారట దిగంబరుడు, యువకుడు అయిన శుకుణ్ణి చూచి సిగ్గుచెందకుండా చీరెలు కట్టుకోకుండా నిర్వికారంగావున్న దేవకన్యలు వస్త్రధారీ వృద్ధుడూ అయిన తనను చూడగానే లజ్జాభారంతో చీరెలు ధరించడంచూచి అలా చేయడానికి కారణం ఏమి? అని ఆ దేవకన్యలను అడిగేసరికి వారు - మహర్షీ నీ కొడుకు శుకుడు మహాయోగి అతనికి స్త్రీ పురుష లనెడి భేదభావంలేదు అతడు నిర్వికారుడు నీకూ అతనికీ ఎంతో అంతరం వుంది అని అన్నారట.

అలాంటి శుకుడు కురు జాంగల దేశాల్లో ప్రవేశించి హస్తినాపురానికి వెళ్ళినపుడు పౌరు లాతణ్ణి ఎలా గురుతుపట్టారు? పిచ్చివాడిలాగా మూగవాడు లాగా జడుడులాగా వుండే ఆ మహా యోగికి రాజర్షి అయిన పరీక్షిత్తునకూ సంవాదం ఎలా జరిగిందీ? భాగవతం చెప్పాలంటే ఎంతో కాలం పడుతుంది కాని శుకుడు గృహస్థుల ముంగిళ్ళల్లో ఆవును పాలుపితకడానికి ఎంతకాలం పడుతుందో అంతకంటె అధికంగా ఒక నిముషంకూడా వుండడంటారే మరి? ఆ కొలది కాలంలోనే ఆయన అడుగుపెట్టిన స్థలం పుణ్యతీర్థ మవుతుందని ప్రతీతి కనుక అంత దీర్ఘకాలం శుకు డెలా వున్నాడు? భాగవతోత్తముడైన పరీక్షిన్నరేంద్రుని జన్మకర్మ లెలాంటివి?

పరీక్షిత్తు పాండవవంశ వర్ధనుడు శత్రు భీకరుడు ద్రోణుడూ కర్ణుడూ మొదలైన కౌరవ వీరులను చీల్చి చెండాడిన అభిమన్యుని కొడుకు భీష్మాచార్యు డంతటివానిని ఒంటరిగా నెదిర్చి గోవులను విడిపించిన వీరాగ్రణి అర్జునకు

మనుమడు. అంతటి మహావీరుడు విడువరాని రాజ్యలక్ష్మిని విడిచిపెట్టి గంగానది నడుమ ప్రాయోపవేశం చెయ్యడమేమిటి ?

ఉత్తములు ఎన్నడూ స్వీయ సౌఖ్యం కాంక్షించరు. ఇతరులకు ధనధాన్య సంపత్తిని కల్పించి నిరంతరం వారి హితాన్నే కాంక్షిస్తారు అలాంటప్పుడు పరీక్షిత్తునకు విరక్తి ఎందుకు కలిగినట్లూ ? మహర్షీ నీకు తెలియనిది ఏదిన్నీ లేదు మహా పండితుడవు నీకు రాని కథఅంటూలేదు కనుక మా సందేహాలను తీర్చి మమ్మల్ని చరితార్థులను చెయ్యవూ ?" అని యడిగిన శౌనకాదులకు సూతుడిలా చెప్పడం మొదలు పెట్టాడు

## వ్యాసుని చిత్తవైకల్యం

'మూడవ ద్వాపరయుగం ముగిసే సమయంలో ఉపరిచరవసువు వీర్యం వలన వాసవి అని ప్రసిద్ధికెక్కిన సత్యవతి జన్మించింది ఆ సత్యవతి యందు పరాశరునకు నారాయణాంశంలో వ్యాసుడు పుట్టాడు వ్యాసుడు మహా జ్ఞాని. త్రికాలజ్ఞుడు ఒకనాడు ఆయన బదరికాశ్రమంలో సరస్వతి నదీజలాల్లో స్నానం చేసి నిత్యకర్మలు నిర్వర్తించి సూర్యోదయ సమయంలో ఏకాంతంగా కూర్చుండి-కాలవేగం ఎవరికీ తెలియదు భూలోకంలో యుగధర్మాలకు సాంకర్యం కలుగుతుంది క్రమక్రమంగా శారీరకశక్తి సన్నగిల్లిపోతుంది పురుషులు అశక్తులు ధైర్యశూన్యులు మందబుద్ధులు అల్పాయుష్కులు అవుతారు - అని తన దివ్య దృష్టితో చూచి వర్ణాశ్రమాలకు హితం చేయదలచి ఎందరో హోతలుంచేకాని అనుష్ఠించడానికి వీలులేని యజ్ఞాలను నలుగురు హోతలు నిర్వహించేలా చేసి అంతవరకూ ఒకటిగావున్న వేదన్ని ఋగ్వేదం యజుర్వేదం సామవేదం అథర్వణవేదం - అని నాలుగు వేదాలుగా విభజించాడు పురాణేతిహాసాలను అయిదో వేదమన్నాడు

అలా వేద విభాగంచేసి వ్యాసమహర్షి ఆ వేదాలనూ పురాణాలను తన శిష్యులచేత చదివించాడు పైలుడు ఋగ్వేదం జైమిని సామవేదం వైశంపాయనుడు యజుర్వేదం సుమంతుడు అథర్వణవేదం పఠించారు మా తండ్రి రోమహర్షణుడు పురాణేతిహాసాలు అభ్యసించాడు ఆ మహర్షులు ఎవరి వేదాన్ని వారు తమతమ శిష్యులకు చెప్పారు ఆ శిష్యులు వారి ఆత్మీయ శిష్యులకు ఆ వేదాలను ఇంకా ఎన్నో భాగాలుగా విభజించి బోధించారు అలా వేదం అనేక శాఖలుగా భూలోకంలో బ్రాహ్మణ సంఘమందు విస్తరించిది స్త్రీలు శూద్రులు వేదాలు వినడానికి అర్హులుకామ కావున వారి హితంకోరి వ్యాసుడు భారతం రచించాడు అయినా ఆయనకు ఎందుకో మనశ్శాంతి లేకుండా పోయింది సరస్వతీ తీరాన

ఒంటరిగా కూర్చుండి దానికి కారణం ఏమై వుంటుందా ? అని వితర్కించుకుంటూ—

నేను వ్రతాలు ఆచరిస్తానే వేదాలను అగ్నిని గురువులను మన్నిస్తానే ఏ కొంచెతా రానీయకుండా విహితకర్మలన్నీ చేస్తానే స్త్రీలకూ శూద్రులకూ హితం చేయాలనే సంకల్పంతో సకలవేద ధర్మాలకు నిధియైన భారతం రచించానే, అయినా నాకు ఆత్మశాంతి లేకుండా పోయింది నాలోవున్న ఈశ్వరునకు నే చేసిన ఆవేవీ సంతృప్తిని కలిగించినట్లులేదు - అని కొంచెంసేపు ఆలోచించి ఔను నిజమే నేను తప్పుచేశాను ఎన్నో వ్రాశాను కాని భగవంతునకు యోగులకు వాంఛనీయమైన భాగవత పద్ధతి చెప్పనైతిని మఱచిపోయాను' - అని విచారిస్తూ వుండగా అక్కడకు నారద మహర్షి వచ్చాడు.

ఆ మహర్షి నోటితో హరినామ సంకీర్తనం చెయ్యడమేకాక తన వీణా తంత్రులమీదకూడా హరినామాన్ని పలికిస్తున్నాడు ఆ శబ్ద మాధుర్యానికి యోగీంద్రులు సైతం పరవశించి పోతున్నారు. ఆయన కపిల జటలయొక్క కాంతి పుంజంతో దిక్కులు ప్రాభాతకాంతి వహించినట్లున్నాయి ఆయన మెడలో ధరించిన తులసిమాల సువాసనలు గగనాంతరాళం అంతా గుబాళిస్తున్నాయి నారదర్షి అలా వచ్చేసరికి వ్యాసుడు లేచి ఆయన్ను యథోచితంగా పూజించాడు

అపుడా దేవర్షి మందహాసంచేస్తూ వీణాతంత్రులను వ్రేళ్ళతో మృదువుగా మీటుతూ - పరాశరాత్మజా నీవు వేదవిభాగం చేశావు పంచమ వేదమైన భారతాన్ని రచించావు కామక్రోధాదులను జయించిన మహా యోగివి బ్రహ్మ తత్వం తెలిసినవాడవు నీ మనస్సు ఏదో వికలంగా వున్నట్టుంది? కారణ మేమిటి? - అని ప్రశ్నించగా వ్యాసమహర్షి అన్నాడు—

దేవర్షీ నీవు బ్రహ్మకడుపున పుట్టావు నిరంతరం హరినామ సంకీర్తనం చేస్తూవుంటావు ఆత్మతత్వ రహస్యం నీకు కరతలామలకం అదీకాక నీవు సూర్యుడిలాగా ముల్లోకాలూ తిరిగి వస్తుంటావు వాయువులాగా సకల జనుల్లో మెలగుతూ ఉంటావు నీవు సర్వజ్ఞుడవు నీకు తెలియనిదీ నీవు చూడనిదీ ఏదీ లేదు నా మనో వైకల్యానికి కారణం నాకు తెలియకుండా వుంది నీవే చెప్పాలి - అనేసరికి నారదు డిలా అన్నాడు

మునీంద్రా నీవు ఎన్నో ధర్మాలు చెప్పావు అయితేనేమి? ఎక్కడా శ్రీహరి గుణ విశేషాలను వర్ణించలేదు అందుచేతనే నీ మనస్సు ఇలా వికలమై నీకు శాంతి లేకుండాపోయింది. హరినామ స్తవం చేసే కావ్యం స్వర్ణకమలాల తోను రాజహంసలతోను నిండిన మానస సరస్సులాంటిది హరినామ సంకీర్తనం చెయ్యని గ్రంథం బ్రాముపాము పుట్టలాంటిది. శబ్ద దోషాలున్నా సరే శ్రీహరి

చరిత్ర సకల పాపాలనూ హరిస్తుంది కనుకనే సాధువులు శ్రీహరిని నిరంతరం ధ్యానిస్తూ జపిస్తూ కీర్తిస్తూ కృతార్థులౌతారు

మునీంద్రా హరిభక్తికాని జ్ఞానం నిష్ఫలం ఏ కర్మచేసినా నిష్కామంగా ఈశ్వరార్పణంగా చెయ్యాలి భక్తివిహీనమైన జ్ఞానంకాని వాక్కుకాని కర్మకాని నిరుపయోగం నీవు మహానుభావుడవు నీకు తెలియని దేముంది? కనుక సంసారబంధ విముక్తికోసం భక్తిపూర్వకంగా వాసుదేవుని లీలా విశేషాలను అభివర్ణించు అంతేకాని ఎక్కడో ప్రస్తావశంగా ఏవో కారణాంతరాలు కల్పించి శ్రీహరి రూపనామాలు చెప్పినంతమాత్రాన ప్రయోజనంలేదు దాని వలన మతి పెద్రతోవద్రొక్కి పెనుగాలికి అటూనిటూ కొట్టుకొనిపోతూ గమ్యం చేరని నావలాగా అవుతుంది.

అదీకాక నీవు చేసిన మరో దోషం చెపుతాను విను ఏవో కోరికలు పెట్టుకొని కర్మలు ఆచరించేవారికి నీవు చెప్పిన ధర్మాలు వారికి తత్త్వజ్ఞానాన్ని కలిగించవు అలా ఏవో కామ్యకర్మలు చేస్తుంటే బాలనుకుంటారు అవే జీవిత లక్ష్యం అనుకుంటారు కనుక మనోమోహాన్ని కల్పించక తత్వం బోధించు నీ వ్యధ తొలగిపోతుంది జ్ఞానవంతుని విషయం చెప్పనక్కరలేదు అతడు కర్మలను కాదని శ్రీహరి స్వరూపాన్ని తెలుసుకుంటాడు కాని వివేకం లేనివాడు దేహంమీద ధనాదికంమీద అభిమానంతో శ్రీహరిని తెలుసుకోలేడు కనుక అటువంటి వానికి తెలిసేలాగా ఈశ్వర లీలలను అభివర్ణించు.

తన కులధర్మాలను విడిచి శ్రీహరి చరణకమల సేవనం చేసినవాడు ఈ జన్మలో వాంఛితఫలం పొందకపోయినా మలుజన్మలోనైనా పొందగలడు అలా కాక హరిభక్తి విడిచి కులధర్మాలు ఎంత పాటిస్తేమాత్రం ఏం ప్రయోజనం?

కనుక తెలివిగలవాడు శ్రీహరిని సేవించాలి. కాలక్రమంలో సుఖ దుఃఖాలు ప్రాప్తించినా హరిసేవ వ్రతం విడువరాదు. హరిసేవవలన బ్రహ్మ లోక పర్యంతం సంచరించేవి ప్రాణికోటికి అపార లాభం కలుగుతుంది హరి సేవకుడు ఒకవేళ నీచజన్మ యెత్తినా ఇతరుల్లాగా సంసార బంధంలో చిక్కు కొనడు భక్తిరస పారవశ్యంతో హరిపాద సంస్మరణం విడిచిపెట్టడు

విశ్వమంతా విష్ణుమయం జగత్తులో విష్ణువుకంటె భిన్నమైనది మరేదీన్నీ లేదు సృష్టి స్థితి సంహారాలు చేయవి ఆ దేవదేవుడు అది నీకు తెలుసు అవి చెప్పిందికూడా నీవేకదా లోక శ్రేయస్సుకై శ్రీహరి కళలో జన్మించినవాడవు నీవు కనుక శ్రీహరి లీలలూ ప్రతిభా ప్రాభవాలూ క్రమంగా వర్ణించు పఠనం శ్రవణం తపం ధ్యానం - వీటన్నింటికీ సార్థక్యత పుణ్యశ్లోకుడైన శ్రీహరిని స్తుతించినవాడే నా స్వీయ వృత్తాంతమే ఇందుకు నిదర్శనం. చెపు తాను విను.

# నారదుని పూర్వజన్మ వృత్తాంతం

నేను పూర్వకల్పంలో తొలి జన్మలో వేదవిదుల యింట ఊడిగంచేసే ఒక దాసికి జన్మించాను నా చిన్నతనంలో నేను అక్కడే పెరిగాను ఒక వర్షాకాలంలో చాతుర్మాస్యం చెయ్యడానికి యోగులందరూ ఒకచోట సమావేశమయ్యారు నా తోడి బాలురు ఎందరో వున్నారు అయినా వారితో నేను ఆట పాటలకు పోకుండా భయభక్తులతో ఆ యోగిజనాలకు పరిచర్యలుచేస్తు ఏ జంజాటమూ లేకుండా వున్నాను మంగళమని భావించి వారి యెంగిలి తినేవాణ్ణి ఎండా వానాకూడా లక్ష్యపెట్టకుండా వారి యెదుట నిలబడి వారికి నానా సపర్యలు చేసేవాణ్ణి ఇలా వర్షాకాలం శరత్కాలంకూడా గడచిపోయాయి వారున్నూ నన్నెంతో ప్రేమభావంతో చూచేవారు వారు శ్రీకృష్ణుని లీలలు చదువుతూ, నటిస్తూ గానంచేస్తూవుంటే ఆ నాదం అమృతంలాగా నా చెవుల్లో పడేది అపుడు నేను పులకించి పోయేవాణ్ణి అప్పటినుండి నేనుకూడా ఇతర విషయాలుమాని కేవలం విష్ణు సేవలో లీనమైపోయాను

ఇలా శ్రీహరి సేవ చేయడంవల్ల నేను లోకాతీతుడ నయ్యాను. నాకు బ్రహ్మత్వం సిద్ధించింది స్థూల సూక్ష్మరూపకమైన ఈ శరీరం మాయా కల్పితమని తెలుసుకున్నాను రజ స్తమో గుణాలను పోగొట్టగలిగింది ఒక్క భక్తి మాత్రమే అనిగ్రహించాను చాతుర్మాస్యం అయిపోయింది ఆ యోగులు యాత్రకు బయలుదేరుతూ అన్నినాళ్ళూ ఏ అపచారం లేకుండా భక్తి తాత్పర్యంతో పరిచర్యలు చేసినందుకు వారికి నా యందు కరుణ కలిగి నాకు ఈశ్వర తత్త్వ రహస్యం ఉపదేశించారు

వారి ఉపదేశంవలన వాసుదేవుని మాయానుభవం నాకు అవగతమైంది ఈశ్వర సమర్పితంగా చేసిన కర్మమాత్రమే తాపత్రయాన్ని నిర్మూలిస్తుందని తెలుసుకున్నాను. ఏ ద్రవ్యంవల్ల ఏ రోగం వస్తుందో ఆ ద్రవ్యం ఆ రోగాన్ని పోగొట్టలేదు ఇతర ద్రవ్యాలతో చికిత్సచేస్తేకాని ఆ వ్యాధి పోదు అలాగే కర్మలు సంసార బంధానికి హేతువు లయ్యిండిన్నీ అవి ఈశ్వరార్పితాలైతే అవి విచ్ఛేదమై పోవడమేకాక అవి విజ్ఞానాన్ని కలిగించి ఈశ్వరుణ్ణి సంతోష పెడతాయి. భక్తి యోగాన్ని కలిగిస్తాయి

ఓంకార పూర్వకంగా, వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణ అనిరుద్ధ - అనే నాలుగు నామాలు భక్తితో పలికి నమస్కరించి మంత్రమూర్తియు మూర్తి రహితుడునయిన యజ్ఞపురుషుని పూజించువానికి సరియైన ఆత్మదృష్టి కలుగుతుంది నేను ఈ రీతిగా చెయ్యగా శ్రీహరి నాకు ఆత్మజ్ఞానాన్ని కలిగించాడు. నా అనుష్ఠానం ఆయనకు తెలుసు నీవున్నూ అలా చెయ్యి నీయంతటి వినికిలి

కలవాడు మునుల్లో ఎవ్వరూలేరు కనుక శ్రీహరిని కీర్తించు దానివలన నీకే కాదు లోకంలో అవి విన్నవారందరికి కూడా దుఃఖశాంతి కలుగుతుంది - అని నారదుడు తన జన్మకర్మలను గురించి చెప్పేసరికి వ్యాసుడు - నారదా ఆ యోగులు నీకు జ్ఞానోపదేశంచేసి వెళ్ళిన తర్వాత నీ జీవితం యెలా గడిచింది? నీకు పూర్వజన్మ జ్ఞానం ఎలా కలిగింది? ఆ శరీర త్యాగం ఎలా చేశావు? అని అడిగాడు

అపుడు నారదు డిలా చెప్పడం మొదలు పెట్టాడు - వ్యాసభట్టారకా విను ఆ భిక్షువులు నాకు తత్త్వోపదేశంచేసి యాత్రార్థం వెళ్ళిన తర్వాత నేను ఇంటివద్దనే మోహరహితుడనై నిరంతరం హరిని స్మరిస్తూ మౌనంగా వుండేవాణ్ణి మా అమ్మ మాత్రం అనుదినమూ తన యజమాని యింటికివెళ్ళి యథావిధిగా అన్ని పనులూచేసి నేను ఏమైపోయానో? అలసిపోయానో? ఆకలిగొన్నానో? అని రేపూ మాపూ ఆదరబాదరగా ఇంటికివచ్చి నన్ను కౌగిలించుకొనేది ముద్దాడేది నా పిల్లజుట్టును దువ్వేది నా ఒళ్ళు సవరించేది

అలా వుండగా ఒకనాటి రాత్రి ఆమె చీకట్లో ఆవుపాలు పిదకడానికి వెళుతూ దారిలో ఒక పామును త్రొక్కేసరికి అది ఆమె కాలును కాటేసింది దారుణమైన ఆ సర్ప విషాగ్నికి ఆమె నేలమీద కూలి ప్రాణాలు విడిచింది అయినా నా మనస్సు కలత చెందలేదు మాతృవ్యామోహానికి నేను లోనుకాలేదు ఇదీ ఒక మేలుకే అనే నిస్సంగ భావం కలిగింది- అపుడు నేను నిశ్చలంగా శ్రీహరిని ధ్యానిస్తూ ఇల్లు విడిచి ఉత్తరాభిముఖంగా బయలుదేరాను దారిలో ఎన్నో పల్లెలు పట్టణాలు వనాలు ఉపవనాలు గిరులు నదులు కొలకులు దాటి పోతూ పోతూ ఆకలిగాని దప్పికగాని వేస్తే ఏదో ఒక నది మడుగులో స్నానంచేసి ఇన్ని నీళ్ళు త్రాగేవాణ్ణి

అలా వెళ్ళి వెళ్ళి ఒక దట్టమైన అరణ్యంలో అడుగుపెట్టాను సింహ శార్దూలాది నానావిధ క్రూర మృగాలతో అరణ్యం భయంకరంగా వుంది సన్న వెదుళ్ళతోను పొదలతోను తీగెలతోను కాలుమోపడానికి వీలులేకుండా వున్న ఆ అడవిలో ఒక రావి చెట్టు కనబడ్డది ఆ చెట్టు క్రింద కూర్చుండి నేను వినిన రీతిగా నా హృదయగతుడైన పరమాత్మ స్వరూపాన్ని చింతించడం మొదలు పెట్టాను నా కనులవెంట ఆనంద బాష్పాలు స్రవించడం మొదలుపెట్టాయి నా శరీరం గగుర్పొడిచింది అలా శ్రీహరి పదధ్యానంలో నిమగ్నుడనైన నా స్మృతి పథంలో ఆ పరమాత్మ గోచరించినట్లు అనుభూతి కలిగింది ఆనందాబ్ధిలో మునిగిపోయాను నా శరీరం నాకు తెలియలేదు నా హృదయంలో సాక్షాత్కరించిన ఆ దేవ దేవుని కూడా చూడలేకపోయాను నాకేదో మైకం కమ్మినట్లయింది.

అపుడు నేను అక్కడినుంచి లేచి తిరిగీ ఆ దివ్యాకారం ఎలా కంటబడు తుందా అనే ఆవేదనతో పిచ్చివానిలాగా నిర్జనమైన ఆ వనంలో తిరుగుతూంటగా శ్రీహరి నా శోకాన్ని ఉపశమింపచేస్తూ మధుర గంభీర వాక్కులతో ఇలా అన్నాడు-

కుమారా ఎందుకు శోకిస్తావు ఈ జన్మలో నీవు నన్ను చూడలేవు. కామక్రోధాదులైన అరిషట్కాన్ని జయించి కర్మ నిర్మూలనం కావించిన ముని ముఖ్యులకుగాని నేను అందరికీ కనబడను. నీ కోరిక నాకు తెలుసు అది ఈడేరా లనే తలంపుతోనే నేను నీ యెదుట సాక్షాత్కరించాను నా యెడల నీకు జనించిన కోరిక ఎన్నడూ వృథాకాదు అది నీలోని దోషాలన్నింటినీ హరించివేస్తుంది నా సేవ వలన నీకు నా యెడల భక్తి భావం కలుగుతుంది. ఈ జన్మలో నీకు కలిగిన భక్తి జన్మాంతరంలోకూడా పోదు

ఈ సృష్టి లయమైపోయి వేయి యుగాలు గడిస్తే రాత్రి అవుతుంది అపుడు మళ్ళీ సృష్టి ప్రారంభమౌతుంది. పరిపూర్ణమైన పూర్వస్మృతితో నీవపుడు పునర్జన్మయెత్తి సాత్వికులలో అగ్రగణ్యుడవవుతావు- అని ఆకాశం మూర్తిగా ఋగ్వేదాదులు ఊర్పులుగా సత్వనియామకుడైన పరమేశ్వరుడు పలికి ఊర కుండేసరికి నేను తలవంచి మహానందం చెందాను

కామక్రోధాలు విడిచి శ్రీహరి అసంఖ్యాక నామాలను పఠిస్తూ అఖిల శ్రేయస్సులూ ప్రసాదించే ఆ దేవదేవుని చరిత్రలు గానంచేస్తూ నిర్మల మనస్సుతో విషయ వాంఛలు విడిచిపెట్టి తగినకాలం కోసం ఎదురు చూస్తుండగా మెరుపు మెరిసినట్లు మృత్యువు తోచింది వెంటనే పాంచ భౌతికమూ కర్మ స్వరూపమూ అయిన పూర్వ శరీరాన్ని వర్జించి శ్రీహరి కృపాకటాక్షంచేత శుద్ధ సత్వమయమైన భాగవత దేహంలో ప్రవేశించాను

అపుడు ముల్లోకాలను లయింపజేసి ప్రళయ జలధిలో యోగనిద్ర కుపక్ర మించిన పరమేశ్వరుడగు బ్రహ్మ నిశ్వాసం వెంట నేను అతనిలో ప్రవేశించాను. వేయి యుగాలకాలం గడిచాక లేచి పునస్సృష్టి చెయ్యడానికి బ్రహ్మ యత్నిస్తూం డగా అతని ప్రాణవాయువుల నుండి మరీచి మొదలైన మునులు నేను జన్మించాం.

అనంతరం నేను అఖండ బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ శ్రీహరి అనుగ్రహం చేత అతని కథాగానంచేస్తూ ముల్లోకాలూ స్వేచ్ఛగా తిరుగుతున్నాను ఇదిగో ఈ వీణె ఆ భగవంతుడిచ్చిందే భగవంతుని వ్యక్తంచేసే సప్త స్వరాలు ఈ వీణా తంత్రులమీద వాటంతటవి పలుకుతూ వుంటాయి అలాంటి ఈ వీణెను చేవాల్చి నేను నారాయణ కథాగానంచేస్తూ తిరుగుతూ వుంటాను

తన కథాగానంచేస్తున్న నాకు పూజ్యపాదుడైన శ్రీహరి పిలిచినట్లుగా వచ్చి నా మనస్సులో సాక్షాత్కరిస్తాడు మునీంద్రా విను సంసార సాగరంలో

మునిగి కర్మ కాంక్షలతో వేదన చెందే వానికి శ్రీహరి గుణానువర్ణనం తెప్ప లాంటిది. యమనియమాది యోగాలవల్ల ఆత్మ వశంగతమైనా కామక్రోధాదుల యొక్క ప్రభావం దానిమీద వుండనే వుంటుంది అంచేత ఆత్మకు శాంతి లభించడం వల్ల క్రమ క్రమంగా విష్ణుసేవ వలన మాత్రమే ఆత్మ శాంతి చేకూరుతుంది అంతేకాని అది అన్యథా సాధ్యంకాదు- అని ఈ రీతిగా నారదుడు తన జన్మ కర్మల రహస్యం చెప్పి వ్యాసమునీంద్రుని వీడ్కొలిపి తన యిచ్ఛ వచ్చినట్లు వెళ్ళిపోయాడు ఆ దేవర్షి నిరంతరం వీణె మ్రోగిస్తూ శ్రీహరి కథాగానంతో ముల్లోకాలకు చెవుల పండువచేస్తూ పాపాలను ఖండిస్తూ వుంటాడు అంతటివాడు మరెవడున్నాడు?-" అని సూతుడనేసరికి శౌనకుడు- 'అయితే నారద నిర్గమనానంతరం వ్యాసమహర్షి యేం చేశాడు?" అని ప్రశ్నించేసరికి సూతుడు తిరిగి ఇలా చెప్పడం మొదలుపెట్టాడు-

"బ్రహ్మకు ప్రియమైన సరస్వతీనది పడమటి యొడ్డున శమ్యాప్రాసం అనే ప్రసిద్ధాశ్రమం వుంది అది రేగు చెట్లతో ఎంతో మనోహరంగా వుంటుంది ఋషులు అక్కడ సత్త్రయాగం చేశారు వ్యాసు డక్కడకు వెళ్ళి ఆచమించి సాంధ్యోపాసన నిర్వర్తించి నిశ్చల భక్తితో ధ్యానమగ్నుడై కూర్చుండి మనస్సులో ఈశ్వరుణ్ణి దర్శించాడు ఈశ్వర కృతమైన మాయకు వశుడై జీవుడు త్రిగుణాతీతుడయ్యుండిన్నీ త్రిగుణాత్మకుడ ననుకొని దేహాభిమానం పెంచుకుంటున్నాడనిన్నీ అందువలన తానేకర్తననీ తానే భోక్తననీ భావిస్తున్నాడనిన్నీ ఆ మహానర్థంనుండి బయట పడాలంటే శ్రీహరి భక్తియోగం ఒక్కటే మార్గమనిన్నీ నిశ్చయించుకొన్నాడు

వెంటనే భాగవతం రచించాడు అది వేదతుల్యం దాన్ని పఠిస్తే మానవునకు శ్రీహరిపై నిశ్చల భక్తి కుదురుతుంది. భవబంధాలు విచ్ఛిన్నమౌతాయి. అది లోక క్షేమంకరమైనది అలా భాగవతామ్నాయాన్ని[1] రచించి వ్యాసుడు మోక్షార్థియైన తన కొడుకు శుకునిచేత పఠింపజేశాడు"- అని సూతుడు చెప్పేసరికి శౌనకుడు- "మహాభాగా శుకుడు మహాయోగి సర్వసంగాలు విడిచి మోక్షార్థియైనవాడు ఆతడు భాగవతం పఠించడం దేనికి?-" అని అడిగాడు

అపుడు సూతుడీరీతిగా చెప్పడం ప్రారంభించాడు "మునీంద్రా విను ఏ కోరికలు లేకుండా ఆత్మానందంలో మునిగి తేలుతూ వుండే మునులు సహజంగానే శ్రీహరి భజను చేస్తూ వుంటారు దానికి కారణం ఏం కావాలి? ప్రసన్నారాయణుడు మహా మహిమాన్వితుడు కనుకనే వారు అలా చేస్తారు అలానే శుకయోగి శ్రీహరియందుగల తత్పరత్వంతో ముల్లోకాలకు శ్రేయస్సు కూర్చే భాగవత వేదాన్ని పఠించాడు ఇతర వేదాలు వెయ్యి చదివినా ముక్తి సుగమం

1. వేదాన్ని

కాదు కాని భాగవతాన్ని పఠిస్తే అది ఇట్టే కరగతమౌతుంది-' అని పలికి సూతుడు అనంతరం శౌనకాది మునీంద్రులకు రాజర్షియైన పరీక్షిత్తు జన్మ కర్మలు మోక్ష ప్రాప్తి పాండవుల మహా ప్రస్థానం శ్రీకృష్ణుని చరిత్ర- వీటిని గురించి ఇలా చెప్పడం ప్రారంభించాడు

మహ భారత యుద్ధంలో మహావీరులందరు మరణించిన తర్వాత గదా యుద్ధంలో భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టాడు అశ్వత్థామ దుర్యోధనుని యెడ-గల అభిమానంతో అందుకు ప్రతీకారంగా ద్రౌపదికొడుకు లయిదుగురి శిరస్సులు ఖండించి తెచ్చి రాజరాజుకు సమర్పించాడు. అంతటి క్రూర కర్మకు ఒడిగట్టిన అశ్వత్థామను అందరు ముక్త కంఠంతో గర్హించారు.

ఈ ఘోర వార్త విని ద్రౌపది గగ్గోలుపడిపోయింది భోరుమని యేడుస్తూ నేలపై కుప్పకూలి పోయింది అపుడర్జునుడు ఆమెను లేవదీసి యిలా అనునయించాడు- నీవు రాకుమారివి నీకు ఇలా శోకించడం తగదు ద్రోణి నిష్కరుణుడై మహా పాతకం చేశాడు ఇప్పుడే నేను వెళ్ళి నా గాండీవంతో ఆతని తల ఖండించి తెచ్చి నీ కాళ్ళ ముందు పడవేస్తాను దాన్ని త్రొక్కి అనంతరం స్నానం చెయ్యి -

ఇలా అర్జునుడామెకు కొంతకు కొంత ఊరట కల్పించి తనకు సఖుడు, సారథియైన శ్రీకృష్ణుడు తనను ప్రశంసిస్తుండగా రథారూఢుడై అశ్వత్థామ వెంట పడ్డాడు అలా తనను చంపడానికి గాండీవం ధరించి మహోగ్రుడై వస్తున్న పార్థునిచూచి అశ్వత్థామ ఎలాగైనా ప్రాణాలు దక్కించుకోవాలని పూర్వం మృగాకారంతో తన కన్నకూతురినే మోహించి క్రీడించనున్న బ్రహ్మ, శివుణ్ణి చూచి పారిపోయినటు మహా వేగంతో పరుగులు పెట్టడం ప్రారంభించాడు

ఇలా ఒపినంత దూరం పరుగెత్తి వెనుకకు తిరిగి చూచాడు పార్థుని రథాశ్వాలు అలసినట్లు గ్రహించాడు ఆగి ప్రాణ రక్షణకోసం వేరే ఉపాయం లేదని గ్రహించి ఆచమించి ఏకాగ్రచిత్తుడై అర్జునునిమీద బ్రహ్మశిరో నామకాస్త్రం ప్రయోగించాడు అతనికి ఆ అస్త్ర ప్రయోగం తెలుసుకాని ఉపసంహారం తెలియదు. అయినా అతడు తన ప్రాణ సంరక్షణార్థం అలా ప్రయోగించిన ఆ అస్త్రం ప్రచండ తేజంతో దిఙ్మండలం అంతా నిండి సకల ప్రాణి భయంకరంగా తోచేసరికి పార్థుడు కలతచెంది శ్రీకృష్ణునితో అన్నాడు-

కృష్ణా నీవు మానవాకృతిలో అవతరించిన సాక్షాత్పరమేశ్వరుడవు. ప్రకృతికి అతీతుడవు ఆది పురుషుడవు సంసారాగ్నిని శమింపజేయగలవారు నీవు తప్ప ఇంకెవ్వరూ లేరు ముక్తాత్మయందు మాయను అణచి వేస్తావు మాయలో మునిగిన వారికిన్నీ కృపాదృష్టితో శుభం చేకూరుస్తావు సజ్జనులను రక్షించడానికి అవని యందు జన్మిస్తావు కమలనయనా భూమి ఆకాశం,

దిక్కులు నిండి సర్వం నాశనం చేస్తూ ఆ యెదురుగా వస్తూన్న తేజ పుంజాన్ని చూడు ఏమిటది? నాకేదో భయంగా వుంది -

అని పార్థుడనేసరికి శ్రీహరి చేయకూడని మహాపాతకం చేసిన అశ్వత్థామ ప్రాణేచ్ఛతో బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు ఆ వచ్చేది ఆ బాణాన్ని బ్రహ్మాస్త్రంతోగాని దాన్ని మరలించడం సాధ్యంకాదు ఆ బ్రాహ్మణునకు ఆ అస్త్రాన్ని ఉపసంహరించడం తెలియదు కనుక నీవుకూడా నీ బ్రహ్మాస్త్రాన్ని దానిమీదికి వదులు - అన్నాడు

అపుడర్జునుడు జలం ఉపస్పృశించి శ్రీహరికి ప్రదక్షిణంచేసి ద్రోణనందనుడు వేసిన బ్రహ్మాస్త్రంమీద తన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు ఆ మహాస్త్రాలు రెండున్నూ భూమ్యాకాశాలు నిండి సూర్యాగ్ని కిరణాల్లాగా పరస్పరం పోరాడుతూవుంటే ముల్లోకాలు గజగజలాడిపోయాయి ఏదో అకాల ప్రళయం వచ్చిందని ప్రజలందరూ భయకంపితులయ్యారు అపుడు శ్రీకృష్ణుని ఆదేశాన్ని అనుసరించి పార్థుడు ఆ రెండు మహాస్త్రాలను ఉపసంహరించాడు

అలా అస్త్రద్వయాన్ని ఉపసంహరించాక ధనంజయుడు ద్రోణనందనుని తరిమి పట్టుకొని క్రోధారుణలోచనుడై యాజ్ఞికుడు త్రాడితో పశువును బంధించినట్లు బంధించి శిబిరం దగ్గరకు తీసుకుని వచ్చి వధించాలని యత్నించగా శ్రీహరి అన్నాడు*-

అర్జునా ఎదురు తిరగలేని అశక్తులు అస్త్రవిద్యల్లో ఆరితేరినవారు పసిపాపలు అందులో నిద్రాసక్తులు- అట్టివారిని క్రూరంగా వధించిన యీతడు బ్రాహ్మణుడా మహా పాతకుడు అయినా వేడి నిట్టూర్పులు పుచ్చుతూ పారి

---

* పోతన భాగవతంలో పాఠభేదాలు చాలా వున్నాయి వాటిల్లో పరస్పర విరుద్ధార్థాలను వ్యక్తం చేసేవికూడా వున్నాయి ఈ క్రింది పద్య పాదాలు చూడండి

పాటెఱిఁ బిలిఁ గావుము కృపామతి నర్జున పాప వర్జనా
పాటెఱిఁ బిలిఁ గావకు కృపామతి నర్జున పాప వర్జనా (పాఠాంతరం)
1 (ఈ) విప్రున్ దండితుఁ జేయనేటికి? మహా విభ్రాంతితో నుండగన్
విప్రున్ దండితుఁజేయు మేటికి? మహా విభ్రాంతితో నుండగన్ (పాఠాంతరం)

ఒక పాఠాన్ని బట్టి కృష్ణుడు అశ్వత్థామ సాపరాధియైనా వధించరాదు అనే అర్థం రాగా మరొకదాన్ని బట్టి వధించుమని ప్రోత్సహించినట్లు స్ఫురిస్తుంది ఈ పట్టున పూర్వాపర సందర్భాలనుబట్టి మొదటి పాఠమే సమర్థనీయమన్నది ఈ రచయిత భావన

25002

పోతున్నాడు కరుణించి యితణ్ణి చంపకు భీరువును దీనుని ఉన్మత్తుని నిద్రలో మైమరచిన వానిని కడుపార మధువు సేవించిన వానిని దెబ్బతిని పారిపోయే వానిని సాధువును జడుని రక్షించుమని నోరువిప్పి అర్థించే వానిని స్త్రీలను చంపడం ధర్మంకాదు నిష్కారణంగా ఇతరులను చంపి తన ప్రాణాలు కాపాడుకోవాలనుకునేవాడు తుదకు దుర్గతి పాలవుతాడు రాజదండనం వలన అతనికి సుగతి కలుగుతుంది కనుక భ్రాంత చిత్తుడైన ఈ బ్రాహ్మణుని వధించడం దేనికి? -

అని కృష్ణుడనేసరికి బ్రాహ్మణుడు కృతాపరాధుడైనా వధ్యుడు కాడను ధర్మాన్ని తలపోసి అర్జునుడు అశ్వత్థామను చంపాలనే యత్నం మానుకున్నాడు అప్పుడతనికి తాను ద్రుపదరాజ పుత్రికిచేసిన ప్రతిజ్ఞకూడా స్ఫురణకు వచ్చింది అందేత అర్జునుడు పాశబద్ధుడైన ద్రోణిని ద్రౌపది శిబిరానికి తీసుకొని వచ్చి ఆమెకు అతణ్ణి చూపించాడు

పసిపిల్లలను చంపానే అనే పుట్టెడు సిగ్గుతో అశ్వత్థామ ద్రౌపది ముఖం చూడలేక పెడముఖం పెట్టాడు అపుడు ద్రౌపది దుఃఖాన్ని దిగద్రావి సహజంగా సత్స్వభావం కలది కనుక అతనికి మ్రొక్కి యిలా అన్నది-

విప్రోత్తమా పూర్వం మా మగవారందరూ బాణాలు ప్రయోగించడం ఉపసంహరించడం మొదలైన ఆయుధ విద్యలన్నీ నీ తండ్రి ద్రోణాచార్యువలన నభ్యసించారు నీవు పుత్రాకారంలోవున్న ద్రోణుడవు ఈ స్థితిలో అణుమాత్రం కూడా జాలిలేకుండా శిష్య సుతులను వధించడం నీకు న్యాయమేనా? నాయనా నీవు బ్రాహ్మణుడవు బుద్ధిమంతుడవు దయాశాలివి వీరాగ్రేసరుడవు శిశు హత్య ధర్మమా? రాక్షసకృత్యం కాదా?-

పోనీ వారు నీపైకి ఉద్రేకంతో వచ్చిపడ్డారా? కనీసం యుద్ధరంగంలో వున్నారా? కాక నీకేమైనా కించిత్తు ద్రోహం చేశారా? ముద్దులు మూటకట్టే పసికందులు యుద్ధం అంటే ఏమిటో యెరుగనివారు అందులో నిద్రాసక్తులు- అలాంటి వారిని కటిక చీకటిలో ఒళ్ళోద్రేకంతో వధించడానికి నీకు చేతులెలా వచ్చాయి తండ్రీ పుత్రశోకంతో నేనిక్కడ ఎలా దుఃఖిస్తున్నానో అలాగే పార్థుడు నిన్ను బంధించి ఇక్కడకు ఈడ్చుకొని వచ్చారనే వార్త విని నీ తల్లి అక్కడ ఎంత దుఃఖంతో పాపం క్రుంగిపోతున్నదో - అని కృష్ణార్జునులవైపు తిరిగి

పుత్రప్రేమతో కృపి ద్రోణునితో సహగమనం చెయ్యకుండా ఇంటపడి వుండి నేనెలా పుత్ర శోకంతో విలపిస్తున్నానో అలాగే ఆమె ఈతణ్ణి మీరు బంధించి తీసికొని వచ్చినందుకు ఎంతగా శోకిస్తూందో ఇతడు ప్రాణత్యాగం చేస్తే మనకు మహా పాపం చుట్టుకుంటుంది కనుక బ్రాహ్మణ హత్య మానండి. రాజులు

బ్రాహ్మణులకు ఆగ్రహం కలిగించరాదు. వారికి కోపం వచ్చిందా! ఆ కోపాగ్ని క్షత్రియ కులారణ్యాలను దహించి వేస్తుంది. భూమి కంపించిపోతుంది'-

అని ద్రౌపది యిలా ధర్మబద్ధంగా, సకరుణంగా, నిష్కపటంగా, సమంజసంగా, ప్రశంసనీయంగా మాట్లాడేసరికి ధర్మరాజు మహానందభరితుడయ్యాడు. నకులుడు, సహదేవుడు, సాత్యకి, అర్జునుడు, కృష్ణుడు కూడా సమ్మతించారు. కాని భీముడు మాత్రం ఒప్పుకోకుండా-

'తన కన్నకొడుకులను పట్టి చంపాడనే కోపం లేకపోగా శిశు హంతకుడైన వీడిని విడిచిపెట్టమంటుందేమిటి? ద్రౌపదికి ఏదో వెర్రి పట్టినట్లుంది వీడు విప్రుడా? విడిచిపెట్టడం దేనికి? వధించండి. ఆ పని మీవల్ల కాకపోతే నా పిడికిటి పోట్లతో వీని తలను మీరందరు చూస్తుండగా ఛిన్నం చేస్తాను చూడండి'- అని ఉరిమేసరికి ద్రౌపది భీమునకు అడ్డుపడింది. భీముని సంరంభంచూచి శ్రీహరి చతుర్భుజుడై రెండు చేతులతో భీముని వారించి కడమరెంటను ద్రుపద పుత్రికను తొలగించి నవ్వుతూ- 'భీమసేనా! ఇతడు శిశుహంత. దురాత్ముడు. ఆకతాయి. కనుక తప్పకుండా వధించవలసిందే. కాని బ్రాహ్మణుడు. 'బ్రాహ్మణో న హంతవ్యః' అని వేదప్రమాణం వుంది. కావున ఆ వేదోక్తి ననుసరించి ధర్మ దృష్టితో వీనిని రక్షించడం కర్తవ్యం'-

అని సమరసంగా మాట్లాడి భీమసేనుని ఒప్పించి యర్జునునివైపు తిరిగి 'నీ వింతకు ముందు చేసిన ప్రతిజ్ఞను నెరవేర్చు. అది ద్రౌపదికి, నాకు, భీమ సేనునకు సమ్మతం కాగలదు'- అని ఆదేశించేసరికి మహా పరాక్రమశాలి యయిన అర్జునుడు పదునైన కత్తితో అశ్వత్థామ తల గొరిగివేశాడు. అందాకా అతని జుట్టులో గుప్తంగా వున్న శిరోరత్నం బయటపడ్డది. పార్థుడు ఆ రత్నాన్ని తీసికొని అతణ్ణి శిబిర ప్రాంగణంనుండి బయటకు త్రోసివేశాడు.

అలా అర్జునివలన అవమానితుడైన అశ్వత్థామ మణితోపాటు ఆత్మతేజాన్ని కూడా కోల్పోయి లజ్జాభారంతో బయటపడ్డాడు. అతని ఒంటి మదం అణిగి పోయింది. చంపదగిన దుష్కర్మ చేసినా బ్రాహ్మణునకు రాజు విధింపదగ్గ శిక్షలు మూడున్నాయి. అతని ధనం అంతా తీసికొనడం, తల గొరిగి విడిచి పెట్టడం, ఇంటినుండి వెళ్ళగొట్టడం- అంతేకాని వధించరాదు. పాండవులలాగే అశ్వత్థామను ప్రాణావశిష్టుణ్ణిగా చేసి విడిచిపెట్టారు.

పాండవులు పాంచాలీ సహితులై మృత కుమారులకోసం ఎంతో విలపించారు. అనంతరం రణరంగంలో మృతులైన బంధువు లందరికి దహనాది సంస్కారాలు నిర్వర్తించి వారందరు గంగకు వెళ్ళి తిలతర్పణాలు వదిలి స్నాతులై వుండగా శ్రీకృష్ణుడు మునులను వెంటబెట్టుకొని శోకాతురులై అక్కడేయున్న గాంధారీ ధృతరాష్ట్రులను కుంతీ ద్రౌపదులను ఓదార్చాడు.

ద్రౌపదిని కొప్పు పట్టుకొని నిండు సభలోనికి ఈడ్చుకొచ్చిన పాపానికి ఫలితంగా కౌరవులు క్షీణాయుష్మంతులయ్యారు వారి సంపద్గర్వం అణిగిపోయింది ఈ పరిణామాల కన్నిందికి కారణభూతుడైన శ్రీకృష్ణుడు కౌరవుల మరణానంతరం ధర్మరాజుకు రాజ్యం ఇప్పించడమేకాక అతనిచేత దేవేంద్ర వైభవంతో మూడు అశ్వమేధ యాగాలు చేయించి అతనికి అఖండ ఖ్యాతి కల్పించాడు

## శ్రీకృష్ణుడు ఉత్తరా గర్భస్థుడగు బాలుని రక్షించుట

అనంతరం శ్రీకృష్ణుడు వ్యాసాదులచే పూజితుడై ద్వారకా నగరానికి వెళ్ళేందుకు రథారోహణం చేసే సమయంలో తత్తరపాటుతో ఉత్తర వచ్చి దీనంగా అతనికి ఇలా అన్నది-

దేవా అదేదో ప్రళయాగ్ని సమానమైన బాణం నా గర్భస్థ శిశువును దహింపజెయ్యడానికి మహా తేజంతో వస్తోంది ఆ తేజాన్ని నేను చూడలేకుండా వున్నాను నీ పాద పద్మాలను తప్పితే నేను అన్యమేమీ ఎరుగను నీవే నాకు దిక్కు ఆ బాణాగ్నిని హరించి రక్షించు ఆ బాణాగ్నికి నా కడుపులో వున్న శిశువు విలవిల్లాడిపోతున్నాడు నేను నీ చెల్లెలి కోడలును నీ మేనల్లుడు శత్రువులచేత నిహతుడయ్యాడు ఈ బాణాగ్నిని చల్లార్చి నా శిశువును ఎలాగైనా రక్షించు కడుపులో సకల బ్రహ్మాండ భాండాలను ధరించిన నీకు ఒక అబల గర్భాన్ని రక్షించడం బరువా?

ఉత్తర దీనాలాపాలు విని శ్రీకృష్ణుడు అశ్వత్థామ లోకాన్ని అపాండవం చెయ్యడానికి విడిచిన దివ్యాస్త్రమని గ్రహించాడు ఆ దివ్యాస్త్రంనుండి వెలువడిన వాడి బాణాలు పాండవులమీదికి మహా వేగంతో వస్తున్నాయి అయినా వారు చలింపక అస్త్రధారులై ఎదుర్కొనడానికి సిద్ధంగా వున్నారు తన పాదసేవ తప్పితే అన్య చింతన ఏమీలేని పాండు కుమారులను రక్షించాలని సంకల్పించి కృష్ణుడు ద్రౌణి ప్రయోగించిన దివ్యాస్త్రాన్ని వారించడానికి తన చక్రాయుధాన్ని వేదాల్చాడు.

సకల ప్రాణికోటి హృదయాంతరాళాల్లో జ్యోతి స్వరూపుడై భాసించిన శ్రీకృష్ణుడు కురువంశాంకురాన్ని రక్షించడానికి అలా చక్రపాణియై ఉత్తర గర్భాన్ని వైష్ణవ మాయచే కప్పి సరిలంగా ఆ బ్రహ్మాస్త్రాన్ని అణచివేశాడు ఈ రీతిగా ద్రోణనందనుడు ప్రయోగించిన దివ్యాస్త్రం వైష్ణవ తేజం ముందు ఎందుకూ కొరగాకుండా పోయింది తన మాయచేత లోకాలన్నిందినీ సృజించి పెంచి లయంచేసే పరమేశ్వరుడు ఒక బ్రాహ్మణుడు ప్రయోగించిన అస్త్రాన్ని నివారించడంలో విచిత్రమేముంది? అపుడు కుంతి మహానందంతో పాండవ పాంచాలి సహితయై శ్రీకృష్ణుని సమీపించి యిలా అన్నది-

# కుంతి శ్రీకృష్ణుని సన్నుతించుట

శ్రీహరీ నీకు నా ప్రణామాలు నీవు ప్రకృతికి అతీతుడవైన పరమ పూరుషుడట. అవినాశివి సకలాంతర్యామివి అగోచరుడవు పరమేశ్వరుడవు తెరచాటున నాట్యంచేసే నటుడులాగా నీవు మాయాయవనిక (తెర) మరుగున నుండి పరమహంసలు నిర్మలాత్ములైన మునులకే గోచరించవే యిక మౌఢ్యంతో సంసార బంధాల్లో చిక్కుకున్న మాకు ఎలా కనబడతావు కృష్ణా వాసుదేవా నందనందనా హృషీకేశా నీ యందున్న భక్తి విశేషంచేత నీకు నమస్కరించి నే చెప్పేది విను

ధార్తరాష్ట్రులు లక్కయింటికి నిప్పు పెట్టినపుడు అందులో దగ్ధం కాకుండా నన్ను నా కొడుకులను రక్షించావు. కౌరవనాథుడు విధించిన విషాన్నంతో భీమసేనుడు చావకుండా కాపాడావు ధార్తరాష్ట్రుడు నిండు కొలువులో ద్రౌపది వలువలను ఊడుస్తుంటే ఆమె మానాన్ని నిలబెట్టావు రణరంగంలో భీష్మ ద్రోణ కర్ణాదుల చేతుల్లో నిహతులుకాకుండా నా బిడ్డలకు ప్రాణభిక్ష పెట్టావు ద్రోణనందనుని బాణాగ్నికి ఉత్తర గర్భస్థమైన చూలు అంతరించ కుండా అనుగ్రహించావు ఇంకా ఎన్నో విధాల మమ్మల్ని ఆదుకున్నావు ఇలాంటివి నిన్ను నేను వర్ణింప గలదాననా?

క్రూరాత్ముడగు కంసుని చేతుల్లో పడరానిపాట్లు పడ్డ నీ తల్లిని నీవెలా కాపాడావో అలాగే ధార్తరాష్ట్రుల చేతుల్లో నానా బాధలు పడకుండా నన్ను కంటికి రెప్పలా కాపాడావు అంతటి కరుణాసముద్రుడవైన నీ గుణగణాలను సన్నుతించడం నా తరంకాదు మహానుభావులకుగాని గోచరుడవుకాని నిన్ను కులం ధనం ఐశ్వర్యం విద్యాదికయంగల మదోన్మత్తులు ఎలా చూస్తారు? నీ గుణగణాలను ఎలా సన్నుతిస్తారు?

దేవదేవా నీవు భక్తధనుడవు ధర్మార్థ కామాలకు విషయవాసనలకు అతీతుడవు నీకు రాగద్వేషాలు లేవు ముక్తిప్రదాతవు- కాలస్వరూపుడవు సర్వ నియంతవు నిగ్రహానుగ్రహదక్షుడవు నిన్ను స్తుతించడం నాకు సాధ్యమా? నీకు నాకై మొక్కు

సామాన్య మానవుడులాగా నటించే నీ లీలలు అగోచరాలు నీకు హితులూ లేరు అహితులూలేరు నీకు జన్మలేదు కర్మలూ లేవు నీవు మనుష్యుల్లో శ్రీరామాది రూపంతోన ఋషుల్లో వామనాది రూపాలతోను జంతువులయందు వరాహాది రూపాలతోను జలచరాల్లో మత్స్యాది రూపాల్లోను అవతరించడం లోక విడంబనం[1] కోసమేకాని భవబంధంవల్లకాని కర్మ ఫలితంవల్లనగాని కాదు

---

1 అనుకరించడం

కృష్ణా నీ చిననాటి చేష్టలు తలచుకుంటే నవ్వొస్తుంది కోపంతో నీవు పెడగుకుండను బ్రద్దలు కొట్టినపుడు నీ యమ్మ యశోద నిన్ను త్రాళ్ళతో కట్టి వేయలేదూ అపుడు నీవు ఏం చేశావు? నీ కాటుక కన్ను నలుపుకుంటూ కన్నీటి ధారలకు తడిసిన నీ కట్టుపుట్టాన్ని చేతులతో దాముతూ నిట్టూరుస్తూ ఏమీ యెరుగని పసివానిలాగా నీవు చేసిన నటన చూస్తే ఎవరికైనా చోద్యంగా వుంటుంది

శ్రీహరీ మలయ నగమందు చందన లాగా భూమిపై ధర్మనందనుని కీర్తిని నలుదిక్కులా వ్యాపింపజేయడానికై నీవు యదువంశంలో జన్మించావని కొందరి భావన. పూర్వజన్మలో దేవకీ వసుదేవులు దారుణ తపస్సుచేసి నిన్ను వేడగా రాక్షస సంహారంకోసం నీవు వారి కడుపున పుట్టావని కొందరి యూహ నడిసముద్రంలో మునిగిపోయే ఓడలాగా దుస్సహమైన భారంతో కృంగి పోతున్న భూమిని ఉద్ధరించడానికి బ్రహ్మదేవుని కోర్కెపై అవతరించావని మరికొందరి తలంపు. మతివిహీనులై కామ్య కర్మలు చేస్తూ వేదనాతురులైనవారిని ఆ దారినుండి మళ్ళించి వారికి మోక్షం సుగమమయ్యేందుకు శ్రవణ చింతన వందనార్చనాదుల కనువగు భక్తియోగాన్ని బోధించడానికి మానుషాకారంలో జన్మించావని మరికొందరి ఆశయం

విశ్వేశా నిన్నే స్మరిస్తూ నిన్నే కీర్తిస్తూ నిన్నే నుతిస్తూ నీ చరిత్రనే వింటూ ప్రొద్దులు గడిపేవారు మాత్రమే జన్మపరంపరానిర్మూలకమూ యోగి జన సన్నుతమూ అయిన నీ చరణాంబుజ యుగ్మమును చూడగలరుగాని అన్యులు చూడలేరు విశ్వంభరా నీ చరణారవిందాలు తప్పితే మాకు మరే దిక్కున్నూ లేదు మేము నీకు ఆత్మీయులం అలాంటప్పుడు నీవు మమ్మల్ని విడిచి యెక్కడికో వెళ్ళిపోవడం దేనికి?

కృపారసం తొణికిసలాడే క్రీగన్నులతో నీవు నిత్యం మమ్మల్ని చూడక పోతే జీవంలేని ఇంద్రియాల్లాగా కీర్తిని సంపదను కోల్పోయి ఎందుకూ కొరగాని అల్పులమైపోతాం. శుభలక్షణ లక్షితాలైన నీ అడుగుదమ్ములచేత అంకితమైన మా యీ నేల నీవు వెళ్ళిపోతే శోభా విహీనమైపోతుంది. నీ కృపా విలోకనామృతం చేతనే ఇచటి జనపదాలన్నీ నానావిధాలైన ఓషధులతోను తరు లతా నికుంజాలతోను సుమ ఫల భరితాలై కనువిందు చేస్తుంటాయి నదీనదాలు మధుర జలప్రపూర్ణాలై ప్రవహిస్తుంటాయి

విశ్వేశ్వరా! బంధువులైన యాదవులందును ఆత్మీయులైన పాండవులందును నాకు ఏలాటి వ్యామోహమున్నూ లేకుండాచేసి సముద్రాన్ని చేరే గంగలాగా నా బుద్ధి నీ పదాంబుజ ధ్యానంలో లగ్నమయ్యేలాగా చెయ్యి. శ్రీకృష్ణా యదుభూషణా! నర సఖా శృంగార సాగరా దుష్ట నరేంద్ర వంశదహనా!

లోకేశ్వరా! గో బ్రాహ్మణ దుఃఖాపహారా మోక్ష ప్రదాయకా నీ కిదే నా ప్రణామాంజలి సంసారబంధం నుండి నాకు విముక్తి కల్పించి నన్ననుగ్రహించు-

అని కుంతి అర్థించేసరికి శ్రీకృష్ణుడు నవ్వి అలాగేనని హస్తినగరానికి వచ్చి కొన్నాళ్ళుండి అనంతరం కుంతిని సుభద్రను వీడ్కొని ద్వారకా నగరానికి వెళ్ళడానికి ఉద్యుక్తుడుకాగా ఈమారు ధర్మరాజు అడ్డుపడి మరికొన్నాళ్ళుండమని అర్థించాడు కృష్ణుడు కాదనలేకపోయాడు

వ్యాసుడు ధౌమ్యుడు మొదలైనవారు ధర్మరాజు మనోవైకల్యాన్ని పోగొట్టడానికి ధర్మోపదేశం చేస్తున్నారు అయినా అదేమీ ఆకని మనస్సుకెక్కడంలేదు ఆతడు ఇలా చింతించడం మొదలుపెట్టాడు.

తన శరీర సంరక్షణంకోసం అనేక మృగాలను వధించెడి కిరాతకుడులాగా రాజ్యకాంక్షతో నేను యుద్ధరంగంలో అక్షౌహిణులకొలది యోధులను గురువులను బ్రాహ్మణులను బంధువులను చంపించాను లక్ష సంవత్సరాలు గడచినా ఎన్ని జన్మలెత్తినా నాకు నరకావాసం తప్పదు ప్రజాపాలన చేసే రాజు ధర్మయుద్ధంలో శత్రువులను వధించటం అధర్మంకాదని శాస్త్రవిదులంటారు కాని జ్ఞానదృష్టితో చూస్తే అది సమర్థనీయం కాజాలదు

ఈ యుద్ధంలో అసంఖ్యాక వీరులు నిహతులయ్యారు వారి భార్యల సంగతేమిటి? వారికి నే చేసిన ద్రోహానికి పరిహారం ఏముంటుంది? గృహస్థులైనవారు అశ్వమేధ యాగాలుచేసి బ్రహ్మ హత్యాది పాతకాలనుంచి విముక్తులౌతారని వేదాలు విధిస్తున్నాయి అంతేకాని బురదతో బురదనేలా కల్లుతో కల్లుకుండా పరిశుద్ధమవుతాయా? బుద్ధిపూర్వకంగా జీవహింసకు పాల్పడినవాడు ఎన్ని యాగాలు చేసినా వానికి పాప విమోచనం కలుగదు అవి పేరుకొని పోతూనే వుంటుంది అనుభవింపక తప్పదు- అని ధర్మరాజు చలించిపోయాడు ఆహారం మానివేశాడు. శ్రీకృష్ణ సహితుడై బాణశయ్యాగతుడైన భీష్మాచార్యుని చూడడానికి బయలుదేరాడు

## ధర్మజుడు భీష్ముని కడకు వెళ్ళడం

అపుడు శ్రీకృష్ణుడూ పాండవులూ రథారూఢులై వెంట వస్తుండే ధర్మనందనుడు యక్షసహితుడైన కుబేరుడులాగా వున్నాడు అలా సమస్త పరివారంతో కురుక్షేత్రానికి వెళ్ళి దివినుండి భువిపై కూలిన దేవతలాగా సంగ్రామ రంగంలో నేలకొరిగిన గాంగేయునకు నమస్కరించాడు ఇంతలో ఎందరో రాజర్షులు బ్రహ్మర్షులు శిష్య సమేతంగా అక్కడకు వచ్చేసరికి భీష్మాచార్యుడు వారినందరిని యథావిధి పూజించాడు మాయా విశేషంచేత మానవ శరీరం ధరిం

చిన లోకేశ్వరుడు శ్రీకృష్ణుని బహుధా మన్నించాడు. పాండుకుమారులను కూర్చుండ నియమించాడు. అనంతరం ప్రేమ బాష్పాకులనయనుడై యిలా అన్నాడు-

'పాండుకుమారులారా! ధరవీసువులను, హ్రుని, ధర్మాన్ని ఆశ్రయించి విశుద్ధ జీవితం గడపిన మీరు ఎన్నో ఆపదలకు లోనయ్యారు. ఇంతకంటె విచిత్ర మేముంది? ఈ కుంతి దుస్థితిని ఏమనాలి? మృగశాప విశేషంచేత ఆమె భర్త పాండురాజు మృతిచెందాడు. పసిపాపలైన మిమ్మల్ని పెంచి యింతవారిని చేసింది. ఆమెకు అన్నీ దుఃఖాలే. సౌఖ్యం ఎలా వుంటుందో ఆమె యెరుగదు.

కాలతంత్రం విచిత్రం. దుస్తరం. వాయువశంచేత మేఘాలు ఆకాశంలో కలుస్తూ వుంటాయి. విడిపోతూ వుంటాయి. అలాగే కాలవశంగతులై ప్రాణులు కలుస్తూ వుంటారు. విడిపోతూ వుంటారు. దీనికంతకూ కారణం కాలతంత్రం మీ ప్రతిభ సామాన్యమైనదా?

రాజు ధర్మనందనుడు. విలుకాడు ఇంద్రసూనుడు. విల్లు శాత్రవోద్వేజక మైన గాండీవం. సారధి సర్వశ్రేయోదాయకుడైన శ్రీకృష్ణుడు. సహాయకుడు ఉగ్ర గదాధరుడైన భీమసేనుడు. ఇంతటి యోధాను యోధులైన మీకు ఈ ఆపదలేమిటి? దీనినిబట్టి కాలం ఎంతటి బలవత్తరమైనదో యూహించండి. ఈశ్వరు డెప్పు డెవనికి ఏం చేస్తాడో తెలియదు. ఆతని మాయలకు విజ్ఞులు కూడా వశులై అంధుల్లాగా వర్తిస్తారు

కాబట్టి దైవ విధికి విచారించి ప్రయోజనంలేదు. దీనులను రక్షించడానికి శ్రీమన్నారాయణుడు యదువంశంలో శ్రీకృష్ణుడుగా జన్మించాడు. కాని తన దివ్య తేజాన్ని మాత్రం ఎపటికీ వ్యక్తం చెయ్యడు. తన మాయా ప్రభావంచేత లోకాలను మోహాక్రాంతం చేస్తాడు. ఆతని రహస్యం పరమేశ్వరునకు తెలుసు. దేవర్షి నారదునకు తెలుసు. సాక్షాద్భగవత్స్వరూపుడైన కపిలమునికి తెలుసు.

కాని మీరు మాత్రం అతణ్ణి మీ బావమరిదిగా భావించి దూతగా, మంత్రిగా, సారధిగా, బంధువుగా, మిత్రుడుగా అతన్ని యెన్నో పనుల్లో నియోగించారు. అయినా మీ తప్పులేదు. కాని అతనికి మాత్రం రాగద్వేషాలు లేవు. అహంకారం లేదు. ఆతడు అద్వయుడు. సమదర్శనుడు. సర్వాత్మకుడు. పరాత్పరుడైన అతనికి వీరు తక్కువని వారెక్కువని ఏ విధమైన భేదభావమున్నూ వుండదు. అయినప్పటికీ భక్తవత్సలుడు కనుక ఏకాంత భక్తులకు మాత్రం సులభుడై వుంటాడు.

ధర్మనందనా! నా అదృష్టం ఏమని చెప్పను? అచంచలమైన భక్తితో నెవనియందు మనస్సును నిలిపి, ఎవని నామస్మరణచే కామ కర్మలు విడిచి యోగులు దేహ త్యాగం చేస్తారో ఆ లోకేశ్వరుడు నా ప్రాణావసాన సమయంలో

వికసితముఖాంబుజంతో కమల దళాయత నేత్రాలతో చతుర్భుజాలతో అదిగో నా కనుల యెదుట నిలిచివున్నాడు నేనెంతటి సుకృతానికి నోచుకున్నానో

అని పార్థుడు కల్పించిన శరపంజరంపై శయనించిన కురుకుంజరుడు భీష్మాచార్యుడు ధర్మనందనుని అభ్యర్థనపై మహర్షులందరు వింటూండగా మానవ సామాన్య ధర్మాలు వర్ణాశ్రమ ధర్మవిభాగాలు రాగవైరాగ్యాలకు సంబంధించిన ప్రవృత్తి నివృత్తి మార్గాలు దాన ధర్మ విశేషాలు రాజధర్మాలు స్త్రీ ధర్మాలు, శమదమాదులు ధర్మార్థ కామ మోక్షాలు ఇంకా అనేకానేక కథలు ఇతిహాసాలు చెప్పాడు

ఇంతలో స్వచ్ఛంద మరణంకోసం యోగీశ్వరులు ఎదురు చూచెడి ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చింది మహారథియైన గాంగేయుడు అది తనకు మరణోచిత కాలమని నిశ్చయించుకున్నాడు మౌనం వహించాడు మనస్సును బుద్ధియందు లగ్నం చేశాడు చూపులు శ్రీహరి ముఖ కమలమందు నిలిపాడు ఆ దేవదేవుని కారుణ్య దృష్టి వలన బాణ వ్యథ తొలగిపోయినట్లు అనుభూతి కలిగింది మహానందం చెందాడు ఇలా స్తోత్రం చెయ్యడం మొదలుపెట్టాడు

## భీష్ముడు శ్రీకృష్ణుని నుతించడం

ముల్లోకాలను మోహింపజేసెడి శ్యామల శరీరంతో బాలభానుని కాంతిలా మిల మిలలాడెడి పీతాంశుకంతో నల్లని ముంగురులతో ముద్దులు గులికెడి మోము దమ్మితో మా విజయుని చేరువనుండు మనోహరాకారుడు శ్రీహరి నా హృదయంలో ఎల్వేళలా నధివసించుగాక

గుర్రపు డెక్కల త్రొక్కిడికి రేగిన ధూళితో ధూసరాలై[1] చెదరిన ముంగురులతోను, శ్రమ సంజనితములైన చెమట నీటి బిందువులతోను నిగనిగలాడెడి ముఖంతో నా బాణాహతులకు నొచ్చుకొనియు ఏలాగైనా అర్జునునకు విజయం చేకూర్చాలని రణకేళిలో అతణ్ణి ప్రోత్సహించెడి మహానుభావునకు నా కైమోడ్పులు

పార్థుని అభ్యర్థన విని సత్వరంగా ఉభయసేనల నడుమ రథం నిలిపి అతనికి శత్రురాజులను పేరు పేరునా చూపిస్తూ చూపుతోనే తేజోవిలాసంగా వారి ప్రాణాలను హరిస్తూ గురుజనులను బాంధవులను ఒక్కొక్కరిని చేసి వధించడానికి శంకించి వెనుకంజ వేస్తున్న అర్జునునకు ఆత్మ తత్త్వాన్ని బోధించి యుద్ధోన్ముఖుని చేసిన దేవదేవుడు నా హృదయ మందిరంలో నిరంతరం ప్రకాశించుచుండుగాక

పాదాలతో నేను తట్టి నాగంపైని చెరిపప్పు ఎగిరి నిలిచి ...

---

1 బూడిద రంగుగలవి 2 రథంపోలు

కుండలాలకాంతి ఆకాశం అంతా అలముకొనగా నా బాణాహతులు సహింపలేక క్రుద్ధుడై కడుపులో నున్న చతుర్దశ భువనాల బరువుకు భూమి అదిరిపోయేలాగా క్రింది కురికి చక్రాయుధం చేపాల్చి గమన వేగానికి పైన వేసుకొన్న పీతాంశుకం జారిపోతుండగా నావైపు వస్తూన్నపుడు అర్జునుడు- బావా నన్ను నవ్వుల పాలు చేయకు నా స్వబలంతో విజయం సాధించగలననే విశ్వాసం నాకుంది నీవు చేయి చేసికోవద్దు - అని వారింపగా- అర్జునా నన్ను విడిచిపెట్టు నే నీ వేళ భీష్ముని సంహరించి నిన్ను రక్షిస్తాను - అంటూ మదగజంమీదికి లంఘించెడి సింహం లాగా నాపై కురికెడి ఆ దేవదేవుడే నాకు దిక్కు

అర్జునుడు నాకు నమ్మినబంటు అతణ్ణి రక్షించడం నా ధర్మం అని అతనికి సారథియై పగ్గాలను సవిలాసంగా పట్టుకొని ములుకోల ఝళిపిస్తూ రథాశ్వాలను తోలుతూ చూచేవారి నందరిని మోహింపజేసెడి శ్రీకృష్ణ భగవానునకు నా ప్రణామాలు

నవ్వులతో నడకలతో పలుకులతో పొలయలుకలతో[1] చూపులతో గోపాంగనల సహనాన్ని సడలింపజేసెడి వన్నెకాడు వసుదేవ నందనునకు నా నమస్సులు

ధర్మజుడు రాజసూయ యాగం చేసినప్పుడు యాగమండపంలో మునులు రాజన్యులు చూస్తూండగా అనేక చిత్ర విచిత్ర మహిమలు గన్పరచిన లీలా మానుష విగ్రహుడగు ఆదిదేవుడు ఎల్లప్పుడూ నా దృష్టిపథంలో మెలగుగాక

సూర్యు డొక్కడేయైనా సకల జీవులకు వేర్వేరుగా ఒక్కొక్కడై కన్పడు నట్లు తన మాయా లీలచే జనించిన ప్రాణికోటి హృదయాంతరాలలో నానావిధ రూపాలతో ప్రకాశించెడి శ్రీహరిని నేను పరిశుద్ధమైన మనస్సుతో నిరంతరం ప్రార్థిస్తాను -

అని భీష్ముడు మనస్సుతో వాక్కుతో చూపుతో శ్రీహరిని తన హృదయంలో నిలుపుకొని తుదిశ్వాస విడిచి ఉపాధిరహితమైన వాసుదేవ బ్రహ్మంలో విలీనమైపోయాడు

ఆ సమయంలో అక్కడనున్న వారందరు దినాంతమందు కలకలం మాని నిశ్శబ్దంగా వుండే పక్షుల్లాగా మౌనం వహించారు దేవతలు దుందుభులు మోగించారు పుష్ప వర్షం కురిపించారు సాధువులు భీష్మాచార్యుని వేయివిధాల కీర్తించారు ధర్మరాజు పితామహునకు పరలోక క్రియలు నిర్వర్తించి కృష్ణ సహితుడై హస్తి నగరానికి వెళ్ళాడు. మునీంద్రులున్నూ ఎవరి ఆశ్రమానికి వారు వెళ్ళారు

---

1. ప్రణయకలహం

హస్తినాపురం వెళ్ళిన తర్వాత ధర్మనందనుడు ధృతరాష్ట్రుని నొదపరచి వాసుదేవుని ఆమోదంతో పితృపైతామహమైన రాజ్యాన్ని గ్రహించి ధర్మబద్ధంగా పరిపాలించాడు"- అని సూతుడనేసరికి శౌనకుడు- 'మునీంద్రా ధర్మజుడు తన సర్వస్వం అపహరించి యెన్నో కష్టాలుపెట్టిన ఆతతాయులను ఆహవరంగంలో అంతంచేశాడు సరే కాని బంధుమరణదుఃఖంతో ఆతడు రాజ్యభారం వహించడానికి ఎలా అంగీకరించాడూ?"- అని ప్రశ్నించగా సూతమహర్షి యిలా చెప్పడం మొదలుపెట్టాడు-

"అది కృష్ణుడు చేసిన పని కృష్ణుడు పరీక్షిత్తును కురు వంశాంకురంగా జేసి తాత్కాలికంగా రాజ్యపాలనా భారాన్ని ధర్మరాజునకు అప్పగించాడు ధర్మరాజు ధరాపాలనం చేస్తూండగా నెలకు మూడు వానలు కురిశాయి గోభూముల్లో గోవులు పాలు వర్షించాయి లతలు చక్కగా పుష్పించాయి తరువులు ఫలభారంతో వంగి వుండేవి అన్ని ఋతువుల్లోను పంటలు సమృద్ధిగా పండేవి ప్రజలు ధర్మబద్ధంగా వుండేవారు ఎవరికీ ఏ విధమైన వ్యాధులున్నూ లేవు

కొంతకాలం అయ్యాక కృష్ణుడు ద్వారకకు వెళ్ళదలచి కొందరికి నమస్కరించి కౌగిలించుకున్నాడు కొందరు తనకు నమస్కరించగా వారిని సాదరంగా దగ్గరకు తీసికొని ఆలింగనం చేశాడు అనంతరం రథారోహణం చెయ్యగా సుభద్ర ద్రౌపది కుంతి ఉత్తర గాంధారి ధృతరాష్ట్రుడు విదురుడూ యుయుత్సుడు కృపాచార్యుడు ధౌమ్యుడు పాండునందనులు కంటనీరు పెట్టారు సత్సాంగత్యంతో దుస్సంగాలు విడిచిన విజ్ఞుడు సకృత్తుగా శ్రీహరి యశోగానం విన్నా పరవశించి విడిచిపెట్టలేదు అలాంటి స్థితిలో వారందరు శ్రీకృష్ణుని ఎంతోకాలంగా చూస్తూ మాట్లాడుతూ కలిసి భుజిస్తూ శయనిస్తూ కాలం గడపడంచేత ఆయన్ను విడిచిపెట్టలేక ఆయన తిరిగి రావాలని ఆకాంక్షిస్తూ దీనాననులై ఎక్కడి వారక్కడ నిలబడిపోయారు.

సౌధాగ్రాలమీదనుండి కౌరవ స్త్రీలు కృష్ణునిపై పుష్ప వర్షం కురిపించారు. అర్జునుడు చుట్టూ ముత్యాల వరుసలు వ్రేలాడుతున్న శ్వేతచ్ఛత్రాన్ని పట్టుకున్నాడు ఉద్ధవుడు సాత్యకి చెరొకవైపునా వింజామరలు వీస్తున్నారు. నానావిధ వాద్య ధ్వనులు దశదిశలూ మారుమ్రోగుతున్నాయి బ్రాహ్మణులు సగుణ నిర్గుణ స్తోత్రాలు చేస్తున్నారు

రథం బయలుదేరి రాజమార్గం మీదుగా సాగిపోతోంటే అప్పుడు పౌరాంగనలు దారికిరువైపులా సౌధాగ్ర భాగాలను నిలబడి నందనందనుని దర్శించి పరవశించిపోతూ చేతులు చాచి చాచి అడుగో గోపాల సుందరుడని ఒకరికొకరు చూపుతూ ఇలా వితర్కించడం మొదలుపెట్టారు.

ప్రళయ సమయంలో లోకాలన్నీ కనుమరుగైపోయిన తర్వాత ఏకాకియై

ప్రకాశించేది పరమాత్మ ఇతడే అని కొందరంటే జీవులకు బ్రహ్మత్వం సిద్ధించినపుడు ఇంకా లయ మేమిటి? అని కొందరు సందేహాన్ని వ్యక్తం చేశారు జీవుని ఉపాధికి కారణభూతమైన సత్వాది గుణలయాన్నే జీవ లయం అంటారు అని కొందరు సమాధానం చెప్పారు అయితే తిరిగి సృష్టి ఎలా జరుగుతుంది? అని కొందరు ప్రశ్న వేస్తే పరమేశ్వరుడే తన అంశతో జీవులను సృజించి నామ రూపాలు లేని ఆ జీవులకు నామరూపాలు కల్పించడంకోసం వేదాలను కల్పించి తన తేజస్సుతో సంప్రేరితమైన మాయను అనుసరిస్తాడని కొందరు మారు పలి కారు భక్తులకు జితేంద్రియులకు విద్వాంసులకుగాని ఈ మహానుభావుని దర్శనం లభించదని కొందరంటే అలాకాదు యోగమార్గం ద్వారాగాక మరో విధంగా ఆయన్ను దర్శించడం సాధ్యంకాదని మరికొందరన్నారు

ఇలా పౌర సుందరులు శ్రీకృష్ణుని తత్వాన్ని గురించి వితర్కిస్తూవుంటే విని ఆయన మందహాసం చేశాడు రథం దూరం సాగిపోయింది

అప్పుడు కామపరవశయైన యొక పౌరాంగన హృదయభారంతో మరొ కర్తెను చూచి చెలీ చూడు రథం కనుమరుగవుతోంది శ్రీహరి మనకిక కనబడడు ఆ కమలేక్షణుని చూడకపోతే దినం ఒక యుగంగా తోస్తుంది మనం ఇక్కడ ఉండడం దేనికి? మనంకూడా ఆయన దగ్గరకు వెళ్ళి ఆయనకు పరిచర్యలు చేద్దాం అన్నది.

ఇతడు కేవలం యాదవనాథుడు కాదు వేదవ్యక్తుడు సృష్టి స్థితి సంహారకారకుడైన లీలావినోది ఈశ్వరుడు ఆ దేవదేవుని దర్శనం నాకు లభించింది నా జీవితం సార్థకమైంది చాలు అని పులకించిపోయింది మరొకర్తె

తామసగుణోపేతులైన రాజులు ప్రజలను బాధిస్తుంటే వారిని తుద ముట్టించడానికి ప్రతి కల్పంలోను సత్వశరీరుడై పరమేశ్వరుడు ఇలా అవత రిస్తూంటాడు ఈ మహానుభావుని జన్మతో యాదవకులం తరించింది ఈ పుణ్య శ్లోకుడు నడయాడడంచేత మధురానగరం మహిమాన్వితమైంది ఈ పురుషోత్త ముని నిత్యమూ దర్శించడం వలన ద్వారకావాసులు ధన్యులయ్యారు అమిత బలాఢ్యుడైన ఈయన కారణంగా భూమి నిష్కంటకమైంది జగన్మోహనాకారు డైన ఈ దేవదేవుని చూచి గోపాంగనలు కామవివశలై ఆయన అధరామృతం త్రాగుతూ దివ్యానందంలో మునిగి తేలుతూ వుంటారు ఈ కమలలోచనుని ఈ కరుణా సముద్రుని ఈ జగన్మోహనాకారుని పతిగా చేకొన్న రుక్మిణీ సత్య భామలు తొలి జన్మల్లో ఎంతని నోములు నోచారో? అని-

పౌరాంగనలు అంటుంటే విని నవ్వుతూ వారిని కటాక్షించి శ్రీకృష్ణుడు హస్తినాపురాన్ని విడిచిపెట్టాడు ఆయన వియోగం సహించలేక ధర్మరాజాదులు చతురంగబలంతో ఆయన్ను కొంతదూరం వెంబడించి శోకాకులులై వెనుతిరిగారు.

అలా వారందరు వెళ్ళిపోయిన తర్వాత శ్రీకృష్ణుడు కురు జాంగల పాంచాల దేశాలు దాటి శూరసేన యామున భూములు గడచి బ్రహ్మవర్త కురుక్షేత్ర మత్స్య సారస్వత మరు ధన్వ సౌవీరా భీర సైంధవ దేశాలు అతిక్రమించి సూర్యాస్తమయ వేళకు ద్వారకా నగరం చేరి పాంచజన్యం పూరించేసరికి ద్వారకా వాసులు మహానందంతో ధనకనక వస్తువాహనాలను కాన్కలుగా తీసికొని వేణు నాదాలు భేరీ నినాదాలు మిన్నుముట్టగా శ్రీకృష్ణ దర్శన లాలసులై ఎదురు వచ్చారు శ్రీకృష్ణుడు వారు పెట్టిన కాన్కలను సూర్యభగవానుడు భక్తు లర్పించిన దీపమాలికలను స్వీకరించినట్లు సహర్షంగా స్వీకరించాడు

అలా ఆత్మారాముడు పూర్ణకాముడు అయిన ఆ పరమేశ్వరునకు కాన్క లర్పించి మొక్కులిడి గద్గద కంఠంతో వారిలా అన్నారు-

దేవా నీ పాదాంబుజాలను బ్రహ్మ అంతటివాడు పూజిస్తాడు నీ సేవ సంసారతాపాన్ని పోగొట్టుతుంది నిన్ను భక్తితో ఆరాధించేవారికి సకల శ్రేయాలు కల్పిస్తావు నిన్ను బ్రహ్మాదులుకూడ వర్ణింపలేరు

నీ అనుగ్రహాతిశయంచేత సుఖంగా వున్నాం. నీ పరాక్రమగాథలు విన్నాం. నేడు నీ పాద పద్మాలను తిరిగీ కనులారా చూచి పరవశించిపోయాం మాకు ఏ ఆరాటమున్నూ లేదు మా గృహాలన్నీ సుఖశాంతులతో తులతూగుతున్నాయి చోరభయం ఎక్కడాలేదు ఇకపోతే నీ వియోగం మాత్రం సహించలేక ఎంతో వ్యథ చెందాం

తండ్రుల కందరికి తండ్రియైన బ్రహ్మకు నీవు తండ్రివి అలాంటి నీవు మాకు తండ్రివి తల్లివి పతివి దైవమవు మా సర్వస్వం నీవే ఏ తండ్రులైనా నీలాగా బిడ్డలను ఇలా కృతార్థులను చేశారా? మాలాగా నీ ముఖాంబుజాన్ని కనులారా చూచే భాగ్యం దేవతలకుకూడా లేదు

ఇక నీవు ఎక్కడికి వెళ్ళకుండా ద్వారకలోనే వుండాలి నీ వియోగం భరించలేం నీవు హస్తినాపురంలో వున్న ఒక్కొక నిమిషం మాకు ఒక్కొక యుగంగా తోచింది సూర్యభగవానుడు పశ్చిమ సముద్రంలో క్రుంకగానే లోకాలన్నీ అంధకార బంధురమైనట్లు నీవు కనబడకపోతే మేమంతా చీకటిలో మునిగిపోయినట్లుంటాం-' అనేసరికి శ్రీకృష్ణుడు వారినందరిని తన కృపాకటాక్షాలతో సంతుష్టుల్ని చేశాడు

ఇంతలో శ్రీకృష్ణుని రాక విని ఉగ్రసేనుడు అక్రూరుడు వసుదేవుడు బలభద్రుడు ప్రద్యుమ్నుడు సాంబుడు చారుదేష్ణుడు గదుడు మొదలైనవారు ఏనుగులు గుర్రాలు రథాలు అధిరోహించి ఒక భద్ర గజాన్ని వెంటబెట్టుకొని ఎదురు వచ్చారు వందిమాగధులైవారాలు బ్రాహ్మణుల ఆశీర్వాదాలు నానావిధ

మంగళ వాద్యాల నినాదాలు వారకాంతల సంగీతాలాపాలు మిన్నుముట్టాయి శ్రీకృష్ణుడు వారి నందరిని అర్హరీతిని ఆదరించి సకల సంపదన్వితమై కుబేర నగరాన్ని కూడా ధిక్కరించెడి ద్వారకానగరంలో కాలుపెట్టాడు

ప్రహరిని అనుదినమూ చూచే వారైనప్పటికి క్రొత్తయైనట్లు, నూతనోత్సాహంతో నగరాంగనలు సౌధాగ్రాల నుండి చే సైగలతో ఒకరి కొకరు ఆయన సౌకుమార్యాన్ని చూపిస్తూ నిక్కి నిక్కి చూస్తూ పరవశించి పుష్పవర్షం కురిపిస్తూండగా- లక్ష్మిని వక్షస్థలమున ధరించిన సొగసుకాడూ జనదృక్చకోరాలకు[1] అమృత కిరణంలాంటి ముఖం కలవాడూ, దిక్పాలకులకు పట్టుకొమ్మయైన బాహు దండం కలవాడూ ఆశ్రితులకు చేరుగడ[2]లైన పాదాంబుజాలు కలవాడూ భువన మోహనాకారుడూ అయిన పురుషోత్తముడు రాచబాట వెంట సాగిపోయాడు

శ్వేతాత పత్రంతో వింజామరలతో, పీతాంబరాలతో మణిభూషణాలతో శ్యామల శరీరుడైన శ్రీకృష్ణుడా సమయంలో సూర్యబింబంతో, చంద్రధ్వజంతో నక్షత్ర సమూహంతో ఇంద్రధనువుతో విద్యుల్లతతో భాసించెడి నీలమేఘంలాగా మిల మిలలాడుతున్నాడు తొలుత్తగా అతడు తన తల్లిదండ్రుల నివాసానికి వెళ్ళాడు దేవకి మొదలైన తల్లు లేడుగురికి వరుసగా నమస్కరించాడు

అపుడు వారందరు పరవశించి అతణ్ణి ఒళ్ళో కూర్చోపెట్టుకున్నారు వాత్సల్యాతిశయంతో వారి చనుమొనలనుండి పాలు స్రవించాయి ఆనందాశ్రువులతో వారు అతణ్ణి ముంచెత్తారు. గోపాలుడలా మాతృవాత్సల్యాన్ని చూరగొని అనంతరం అసంఖ్యాకములైన కాంచన సౌధాలతో మనోహరమైన తన అంతఃపురంలో అడుగుపెట్టాడు

అతని కక్కడ పదారువేల నూటఎనిమిదిమంది ప్రియురాండ్రున్నారు ఒకరి యింటికి ముందువెళ్ళితే వేరొకరిత మనస్సులో బాధపడి సరసాలాపాలాడదేమో ప్రేమ భావంతో చూడదేమో వికలత్వం చెందుతుందేమో అని భావించి ఆశ్చర్యకరంగా అతడు ఏకకాలంలో అనేక రూపాలతో వ్యక్తమై అందరి యిండ్లకు వెళ్ళాడు. అలా వస్తూన్న కమలాక్షుని చూచి విరహవ్యథతో కృశించిన ఆ గోపాంగనలు పిల్లలను చంకన బెట్టుకొని సిగ్గుతో ఒడ్డాణాలు జారిపోతుండగా తడబడుతూ గృహద్వారాల దగ్గర కతనికి ఎదురుగా వెళ్ళారు.

ఎవరికి వారు తన మనోవల్లభుడు మాధవుండు తొలుత్తగా తనయింటికే వచ్చాడని అనితరలభ్యమైన ఆనందంతో మురిసిపోతూ అతనికి ప్రణయ పురస్సరంగా సపర్యలు చేశారు అపుడా మాయామానుష విగ్రహుడు వారిని యథోచితంగా పలకరిస్తూ- కొమ్మలు మీకు భక్తి విధేయులై యుంటారా? కోడండ్రు

1 జనుల చూపులనెడి చకోర పక్షులకు 2 దిక్కు ఆశ్రయం

చెప్పినమాట వింటారా? ఇల్లు చక్కగా గడుస్తోందా? సాధుసత్కారం చేస్తున్నారా? భూషణాంబరాలు, ఇంకా ఇతర వస్తు సమూహం సరిపడవున్నాయా? ఇంట్లో ఏ కొరతలు లేకుండా సుఖంగా వుంటున్నారా?' అని ఎవరికి వారిని ప్రశ్నించి వారి యోగక్షేమాలు తెలుసుకున్నాడు.

అనంతరం వారిని దగ్గరకు తీసికొని- 'అయ్యో! బొట్టు పెట్టుకోలేదేమి? పువ్వులు తురుముకోవా? కస్తూరి అందకోవా? నగలేవీ? కలహంసను పెంచుతున్నావా? చిలుకకు పాఠాలు చెపుతున్నావా? తీగెలకు నీళ్ళు పోస్తున్నావా? జలక్రీడలాడుతున్నావా? లేడిపిల్లకు మేత పెడుతున్నావా? గురువులను పూజిస్తున్నావా? బంధువులను ఆదరిస్తున్నావా?' అని ఒకొక్కరిని ఒకొక్క విధంగా అడిగాడు.

నిష్కల్మష ప్రేమ స్వరూపలైన ఆ గోపాంగనలకు ఆ యదునందనుని తోడిదే బ్రదుకు. అంచేత అతడు దగ్గరలేనప్పుడు వారు శరీర సంస్కారం చేసికోరు. కేళీ వినోదాలకుగాని, వనవిహారాలకుగాని ఇచ్ఛగింపరు. అంచేత అతడు రాగానే వివశలై క్షణక్షణం నవనవంగా అనుభూతమైన అనురాగంతో ఆశక్తి గాఢంగా కౌగిలించుకున్నారు. మన్మథుని దహించిన శివునిసైతం మూర్ఛిల్ల చేయగల ఆ మనోహరాకారుల శృంగార చేష్టలకు మాయాతీతుడైన మాధవుడు అణుమాత్రంకూడా చలించలేదు.

అతడు సంగ విరహితుడు. అయినా అజ్ఞానులైన లోకుల దృష్టిలో అతడు సంసార లంపటుడు. లోక సామాన్య మానవుడు. ఆత్మాశ్రయమైన బుద్ధి ఆత్మానందాన్ని అనుభవించదు. అలాగే ప్రకృతితోగూడిన ఈశ్వరుడు ఆ ప్రకృతి గుణాలైన సుఖ దుఃఖాలను పొందడు. ఒకదానితో నొకటి ఒరసికొను వెదుళ్ళ వలన అగ్నిని పుట్టించి అరణ్యాలను దహింపజేసే వాయువులాగా భూమి భారకులైన భూపతులకు పరస్పర వైరం కల్పించి నిరాయుధుడై వారినందరిని నేల కూల్చి శాంతుడై ప్రాకృత పురుషునిలాగా శ్రీహరి ప్రియాంగనల నడుమ అలా విహరిస్తున్నాడు.

యతీశ్వరులుకూడా ఈశ్వర మహిమ నెరుగరు. అలాంటప్పుడు అప్రమేయుడైన అతని ప్రతిభ ముగ్ధలైన గోపికలకు ఏం తెలుస్తుంది! అంచేత అతడు నిజంగా కాముకుడనుకొని అతనితో కేళీవినోదాలతో కాలం గడుపుతూ వుంటారు. అతడు ఎప్పుడూ తమ యిండ్లలోనే వుంటాడని, శ్రియఃపతికి తాము ప్రియురాండ్రమని, వారు మురిసిపోతూ వ్యామోహంలో మునిగి తేలుతూ వుంటారు-" అని సూతుడనేసరికి శౌనకుడు-

# ఉత్తరకు పరీక్షిత్తు జనించుట

ద్రోణనందనుడు ప్రయోగించిన బాణాగ్నికి ఉత్తర గర్భం కంపించి పోగా శ్రీకృష్ణుడు తిరిగి గర్భ సంరక్షణం చేశాడంటారు ఎలా చేశాడు? ఆ బాలుడు జన్మించి యెన్నేండ్లు జీవించాడో ఎలా గడిపాడో శుక మహర్షి ఆతనికి ఏ రీతిగా జ్ఞానోపదేశం చేశాడో అనంతరం ఆ నరేంద్రుడెలా దేహత్యాగం చేశాడో వినాలని వుంది సవిస్తరంగా చెప్పండి"- అని అరించగా సూతమహర్షి ఈ విధంగా చెప్పడం మొదలు పెట్టాడు—

'ధర్మజుడు రాజ్యపాలనా భారం వహించాక ఆతని కీర్తి దిగంత వ్యాప్త మైంది సకలవిధ సంపదలతో తులతూగుతున్నాడు నిరంతరం విద్వద్వినోదాలతో పరమానందం చెందుతున్నాడు అనేక యాగాలు చేశాడు అయినా అన్ని కోరికలు చంపుకొని కామక్రోధాదులను నిర్జించి శ్రీహరి చరణారవిందాలనే ధ్యానిస్తూ ధర్మ బద్ధంగా రాజ్యం చేస్తున్నాడు. ఆకలితో నకనకలాడేవాడు చందనాదులతో సంతృప్తి చెందనట్లు అంతులేని వైభవంతో తులతూగుతున్నా ధర్మనందనుడు మాధవుని పాదసేవనంతో తప్పితే మరో రీతిగా తృప్తిపడేవాడుకాదు

అలా వుండగా కొన్ని దినాలకు ఉత్తర నిండు చూలాలైంది పదో నెల వచ్చింది కాని అశ్వత్థామ బాణాగ్ని ప్రభావంచేత గర్భస్థ శిశువు తల్లడిల్లిపోతూ ఈ రీతిగా మొరపెట్టాడు—

నాకు అరచే శక్తికూడా లేదు గర్భగోళంలో వున్నాను నాకు దిక్కెవ్వరు? తాను అనాథనని మా అమ్మ అంటూంటుంది ఈ బాణాగ్ని పోగొట్ట డానికి మార్గమేది? నన్ను రక్షించే తండ్రి యెవ్వరు? గర్భజనితమైన వేదన ఎవనికి తెలుస్తుంది? ఈ బాణాగ్నికి వేగి నేను గర్భంలోనే మృతి చెందితే మా అమ్మకూడా గర్భవేదనతో మరణించడం నిశ్చయం ఈ అగ్నిజ్వాలల నుండి రక్షించడానికి శ్రీహరి వస్తాడని మా అవ్వ అందరితో అంటూంటుంది ఆ మాటే నిజమవుతుందా?

సర్వాంతర్యామియైన ఆ శ్రీహరి ఇక్కడలేడా విప్రుని శరాగ్నిని తొలగించి నన్ను రక్షించడా? తనను ఆశ్రయించిన వారిని ఆతడిదివరకు ఎంత మందిని కాపాడలేదు? నా కర్మ యెలాంటిదో? అని వచ్చే పోయే ప్రాణంతో కొట్టుమిట్టాడుతూ గర్భగతుడైన శిశువు చింతిస్తూండగా శ్రీహరి ప్రత్యక్ష మయ్యాడు

ఆ దేవదేవుని మేనిపైనున్న పచ్చని పట్టుబట్ట మేఘంమీది క్రొమ్మెరుగులాగా మిలమిలలాడుతోంది చెక్కిళ్ళపై మకరకుండలాలు మణికాంతులు ప్రసరిస్తు న్నాయి బాణాగ్నిని అణచివేయాలనే సంరంభంలో కన్నులు కెంపుల్లాగా ఎర్ర

వారాయి కాంచన మణిమయమైన కిరీటం బాలభాను మండలలాగా మెరిసిపోతోంది అతడు బంగారు మురుగుల బాహు పురులు వనమాల ధరించాడు

అంగుష్ఠమాత్ర దేహుడై అలా ఆవిర్భవించిన శ్రీహరిచేతిలో ఒక గద వుంది మార్తాండుడు[1] మంచును విడగొట్టినట్లు మాధవుడు మహోల్క[2]లాగా జ్వలిస్తున్న తన గదను గిరగిర త్రిప్పుతూ ద్రౌణి బాణాగ్నిని పటాపంచలుచేసి గర్భంకందకుండా కాపాడాడు అలా గదను చేపట్టి శరాగ్నిని చెండాడి తనను రక్షించిన ఆ దయాశాలి యెవ్వడా? అని గర్భ శిశువు చింతిస్తూ ఎదురు చూస్తూం డగా మాధవుడు మటుమాయమయ్యాడు

అనంతరం సకల శుభ గ్రహాలతో సకల గుణోత్తర ఫలసూచకమైన శుభ లగ్నంలో ఉత్తర పాండవ వంశోద్ధారకుడైన శిశువును కన్నది ధర్మనందనుడు వెంటనే ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులను రావించి పుణ్యాహ[3] వాచనమూ జాతకర్మా చేయించాడు ధన కనక వస్తు వాహనాలతో వారిని సత్కరించాడు అందరికి షడ్రసోపేతంగా మృష్టాన్నం పెట్టాడు అపుడు ఆ బ్రాహ్మణులు సంప్రీతులై - ధర్మనందనా దైవయోగంచేత పౌరవ సంతతి[4] అంతరించకుండా శ్రీ విష్ణువు అనుగ్రహించి ఈ బాలకుని రక్షించాడు కనుక ఈతడు విష్ణురాతు డనే పేరుతో జగద్విఖ్యాతి చెందగల డని ఆశీర్వదించారు

అపుడు ధర్మజుడు ఆ బ్రాహ్మణుల నుద్దేశించి- మహానుభావులారా మీకు నమస్కరిస్తున్నాను. నామాట వినండి మా పెద్దలందరూ నిర్మల కీర్తిని గడించి రాజర్షులై జీవితం గడిపారు ఈ పసివాడుకూడా శ్రీహరి చరణాంబుజ భక్తి యుక్తుడై వుంటాడా? చూచి చెప్పండి- అనగా విప్రులిలా అన్నారు-

మహానుభావా మీ మనుమడు మనుపుత్రుడైన ఇక్ష్వాకునిలాగా ప్రజా రక్షణం చేస్తాడు శ్రీరామచంద్రుడులాగా బ్రహ్మణ్యుడు[5] సత్యవ్రతుడు అవుతాడు డేగ వెంటపడగా భయంతో వణుకుతూ వచ్చిన పావురాన్ని రక్షించిన శిబి చక్రవర్తి రీతిగా శరణాగత రక్షకుడు దానశీలి అవుతాడు దుష్యంత సూనుడు భరతుడులాగా చంద్రవంశానికి అఖండ యశస్సును తెస్తాడు ధనంజయ[6] కార్తవీర్యుల్లాగా మహాధానుష్కుడౌతాడు అగ్నిలాగా భయంకరంగా సముద్రంలాగా దుస్తరంగా సింహంలా మహా విక్రమశాలిగా వుంటాడు భూదేవి లాంటి సహనశీలి అవుతాడు సూర్యుడులాంటి ప్రతాపవంతుడౌతాడు శ్రీహరి లాగా సర్వభూత హితుడౌతాడు తల్లిదండ్రుల్లాగా సహిష్ణు వవుతాడు

ధర్మనందనా అదేకాదు నీ మనుమడు సమతా దృష్టిలో బ్రహ్మకు

---

1 సూర్యుడు 2 పెద్దకొరవి 3 అశుద్ధినివారక కర్మము
4 పురుచక్రవర్తి సంతతియైన కురువంశం 5 వేదాధ్యయనం చేసినవాడు
6 అర్జునుడు

ప్రసన్నతాగుణంలో శివునకు గుణసంపదలో శ్రీహరికి ధర్మగుణంలో యయాతికి హరిభక్తిలో ప్రహ్లాదునకు ఔదార్యంలో రంతి దేవునకు ఆశ్రిత రక్షణంలో హిమవన్నగానికి సాటిరాగలవాడౌతాడు మహా యశస్సు నార్జిస్తాడు పెద్దలను ఆదరిస్తాడు అశ్వమేధ యాగాలు చేస్తాడు దుష్టులను దండిస్తాడు సమర్థులైన కొడుకులను కంటాడు

కలి ప్రేరితాలైన పాపాలను హరిస్తాడు రామభద్రుడులాగా భూ భారం వహిస్తాడు నిరంతరం వేద శాస్త్ర విహితమైన మార్గంలో చరిస్తాడు విశేషించి హరిభక్తిగల వాడౌతాడు. ఇలా అనేక సంవత్సరాలు జీవించి ఒక విప్రశాపం కారణంగా తక్షక విషాగ్నివలన తనకు మరణం ప్రాప్తిస్తుందని తెలిసికొని సర్వ సంగాలు విడిచిపెట్టి శ్రీహరి పాదారవిందాలను సేవిస్తూ శుకయోగీంద్రునివలన ఆత్మజ్ఞానం పొంది గంగాతీరాన శరీరత్యాగంచేసి భయ శోకాలులేని ఉత్తమ లోకంలో ప్రవేశిస్తాడు - అని బ్రాహ్మణులు ఆ బాలుని జాతక ఫలాలు చెప్పారు ధర్మనందనునివలన కోరిన కానుకలందుకొని నిజవాసాలకు వెళ్ళిపోయారు

తల్లి గర్భంలో వున్నప్పుడు తాను చూచిన దేవదేవుడు విశ్వమంతటా వున్నాడని పరీక్షించి చూడడంచేత అందరూ అతనికి పరీక్షిత్తు అని నామకరణం చేశారు శుక్లపక్షంలో చంద్రుడులాగా ఆ బాలకుడు తాతల పెంపకంలో క్రమ క్రమంగా అభివృద్ధి చెందాడు

బంధుహనన దోషం ధర్మనందనుని ఇంకా వెంటాడుతూనే వుంది ఆ దోష పరిహారం కోసం అశ్వమేధయాగం చేయాలనుకున్నాడు. కాని తగినంత ధనంలేదు కప్పంగాను దండనీతి క్రిందా ప్రజలిచ్చేవి చాలదు ఎలాగా అని విచారిస్తూ శ్రీకృష్ణుని స్మరించేసరికి ఆతడు వచ్చాడు

ఆతని ఆదేశానుసారం భీమార్జునులు పూర్వం మరుత్తుడనే రాజు యజ్ఞం చేసి ఉత్తరదిక్కున భూమిలో సువర్ణ పాత్రికలో నిక్షేపించిన ధనాన్ని తెచ్చి యిచ్చారు

అపుడు ధర్మరాజు సకల బంధు సమేతంగా శ్రీకృష్ణు నాహ్వానించి పురుషోత్తమ ప్రీతిగా మూడు యాగాలు చేశాడు అనంతరం కృష్ణుడక్కడ కొన్ని నెలలుండి అర్జునుని వెంటబెట్టుకొని నిజనగరానికి వెళ్ళాడు

అంతలో విదురుడు తీర్థయాత్రలు ముగించుకుని హస్తి నగరానికి వచ్చాడు తీర్థాటన సమయంలో అతడు మైత్రేయుని కర్మకు యోగానికి జ్ఞానానికి సంబంధించిన అనేక ప్రశ్నలు అడిగి ఆత్మ తత్వ రహస్యం అంతా తెలిసికొన్నాడు విదురుని రాకకు ధృతరాష్ట్రాదు లందరు సంతోషం చెంది అతణ్ణి ఎంతో పొగిడారు ధర్మరాజు విదురునకు స్నాన భోజనాది సత్కారాలు చేసి అనంతరం ఇలా అన్నాడు—

మహాభాగా ఇంతకాలమూ ఎక్కడున్నావు? ఏయే తీర్థాలు చూచావు? మహాజ్ఞానివైన నీయందే శ్రీహరి వుండగా నీకు తీర్థాటనం దేనికి? నీవే ఒక మహా తీర్థానివి నీకంటె పుణ్యతీర్థా లేమున్నాయి? ఇతర తీర్థాలకోసం వెదుకుతూ వెళ్ళడం దేనికి? నీవు మాతో భాషిస్తేనే చాలు మాకు సకల తీర్థయాత్రల ఫలం దక్కుతుంది లోకంలో అందరు మమ్మల్ని గురించి ఏమనుకుంటున్నారో చెప్పు

మా తండ్రి మరణానంతరం మా పెదతండ్రి కొడుకులు మా యింటికి నిప్పు పెట్టి మాకు సర్ప విషం కుడువబెట్టి చెప్పరాని బాధలు పెట్టారు అప్పుడు మేమూ మా యిల్లాండ్రూ నశించిపోకుండా రక్షించింది నీవేకదా అదంతా జ్ఞాపకం వుందా?

రెక్కలురాని పిల్లలను పక్షులు తమ రెక్కలతో దాచి రక్షించినట్లు నీవు అశుభమూ శుభమూ తెలియని బాల్యావస్థలో మమ్మల్ని మా యందుండే పక్షపాతంతో రక్షించావు కనుకనే ఈనాడు బ్రతికి వున్నాం నీవు నీ తీర్థాటనంలో ద్వారకకు వెళ్ళావా? శ్రీకృష్ణుని కారుణ్య విశేషంచేత యాదవులు సుఖంగా వున్నారా? ఒకవేళ నీవు అక్కడకు వెళ్ళకపోయినా లోకులవలన వారి యోగ క్షేమాలు విన్నావా? -

అని యుధిష్ఠిరుడు అడిగేసరికి విదురుడు క్రమంగా అన్ని విషయాలు చెప్పాడు కాని అతడు శోకభారంతో కృంగిపోతాడని భావించి యదు క్షయ వృత్తాంతం మాత్రం చెప్పలేదు మంచి చెపితే మంచివారంటారు చెడు చెబితే చెడ్డ వారంటారు అందులో అతడు శూద్రుడు శిష్టమరణం చెప్పరాదు

విదురునకు శూద్రత్వం ఎలా ప్రాప్తించిందంటే మాండవ్యముని శాపంచేత పూర్వం యముడు శూద్రయోనియందు విదురుడుగా జన్మించాడు నూరేండ్లు పాపకర్ములను దండించే బాధ్యత సూర్యభగవానుడు వహించాడు ధర్మరాజు రాజ్యభారం వహించి దిక్పాల సమానులైన సహోదరులతో మనుమని ముద్దు చేస్తూ పెద్దకాలం మహావైభవంతో సుఖంగా వున్నాడు

## గాంధారీ ధృతరాష్ట్రుల దేహ త్యాగం

అలావుండగా కాలగతి యెరిగిన విదురుడొకనాడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు- దార సుతాదులను బంధు మిత్రులను సిరిసంపదలను చూచు కొని చిరకాలం జీవించాలనుకునేవారిని కాలం వంచిస్తుంది కాలగతి దురవగాహం నీకిప్పుడు దుష్కాలం ప్రాప్తించింది దీనికి ప్రతీకారం ఆలోచించు

నీవు పుట్టుగ్రుడ్డివి పెద్దవాడవయ్యావు నీ శక్తి సామర్థ్యాలు ఉడిగి పోయాయి- వార్ధక్యంపైబడ్డది అనుభవించదగిన భోగాలా లేవు బంధువులందరు

మరణించారు మీ ఆలుమగలిద్దరూ శోకమగ్నులై దాయాదుల పంచలో వుండటం ఏమంత భావ్యం? వారిని నీ కొడుకులు ముప్పతిప్పలు పెట్టిన సంగతి నీకు తెలియదా? వారున్నఇంటికి చిచ్చుపెట్టారు వారి అర్ధాంగి ద్రౌపదిని నిండు సభలో అవమానించారు వారిని అరణ్యాలపాలు చేశారు అటువంటివారిని ఆశ్రయించి వారింత పెడితే తిని బ్రతకకపోతేయేం?

బిడ్డలకు బుద్ధిచెప్పలేని యీ పుట్టుగ్రడ్డి మనకెక్కడ దాపురించాడు? ఇంత పిండం వండి పడవెయ్యండి అని భీముడు హీనంగా అంటూంటే నీకు అన్నం ఎలా రుచిస్తుంది? నీకింకా జీవితాశ యెందుకు? ఇంకా బిడ్డలను కంటావా? బ్రతికి నన్నాళ్ళు బ్రతుకుతావా? మనుమలతొక్కు పలుకులు విని ఆనందించేదిపుందా? రమ్మని అర్థులకు దానమిచ్చేందుకు నీ చేతిలో ఏమైనా వుందా? దేహం నిత్యం కాదని తెలిసికొని మోహాన్ని విడిచి వానప్రస్థం స్వీకరించిన వానికి ముక్తికరతల మాలకం అవుతుంది -

అని విదురుడు ధృతరాష్ట్రునకు విరక్తి మార్గాన్ని ఉపదేశించేసరికి అతని ప్రజ్ఞానేత్రం వికసించింది మోహపాశాలను త్రెంచుకొన్నాడు జ్ఞానమార్గంలో అడుగుపెట్టి హస్తినగరాన్ని విడిచిపెట్టి హిమవన్నగ ప్రాంతానికి వెళ్ళిపోయాడు. అతనితో గాంధారికూడా వెళ్ళింది. ఆమె మహాసాధ్వి అంధుడైన పతినిచేబట్టి పతి భావాసక్తితో కళ్ళకు గంతలు కట్టుకొని జీవయాత్ర సాగించింది ఇపుడతడు హిమవంతానికి వెళ్ళేసరికి రణరంగంలో మడుమ్రతిప్పని వీరుడులాగా రాజదండనానికి వెరవని ధీరుడులాగా ఆమెకూడ నిర్భయంగా పతిని అనుగమించి వెళ్ళింది విదురుడుకూడా వారివెంట వెళ్ళాడు

మరునాడు ఉదయం ధర్మనందనుడు ప్రాతస్సంధ్యాదికల నిర్వర్తించి యథరీతిని ధృతరాష్ట్ర మందిరానికి వెళ్ళేసరికి అక్కడ గాంధారీ ధృతరాష్ట్రులు గాని విదురుడుగాని కనబడలేదు సంజయుడుమాత్రం వున్నాడు ధర్మరాజాతని జూచి- సంజయా మా తల్లిదండ్రులు మందిరంలో లేరే? వారెక్కడికి వెళ్ళినట్లు? సౌజన్యనిధి మా ప్రాణసఖుడు విదురుడుకూడా కానరాడే? ఆ ముగ్గురు మందబుద్ధులమైన మమ్మల్ని విడిచి యెక్కడకు వెళ్ళారో? మా తండ్రి తన పాపాలను ప్రక్షాళనం చేసుకునేందుకు ఏ గంగకో వెళ్ళి వుంటాడు అతడు కరదాసముద్రుడు. మా తండ్రి మా చిననాడే దివంగతుడైతే మమ్మల్ని పెంచి పెద్దవాళ్ళను చేశాడు- అని పలవించాడు.

వాస్తవానికి శోకభారంతో కృంగి కృశించియున్న సంజయునకుకూడా వారి పోకడ తెలియదు కన్నీరు తుడుచుకుంటూ ధైర్యాన్నికూడ గట్టుకొని- ధర్మజా అన్ని విషయాలు నన్నెపుడూ అడిగితెలిసికొనేది మీ పెదతండ్రి

నిన్నంతా విదురునితో ఏవో మంతనాలాడాడు నేడులేడు నన్నుకూడా వంచించి వారెక్కడికి పోయారో? అని సంజయుడు శోకాకులుడయ్యాడు

అపుడు తుంబురునితోకూడి నారద మహర్షి అక్కడకు వచ్చేసరికి కౌంతేయాగ్రజుడు వారిని అర్ఘ్యాదులతో పూజించి మహాత్మా నా తలిదండ్రులు ఇంట లేరు ఎక్కడకు వెళ్ళారో తెలియదు మా అమ్మ అపుదినం బిడ్డలను పేరు పేరునా తలచుకొని తల్లడిల్లిపోతూ వుంటుంది. ఆమెకూడా ఎక్కడకు వెళ్ళిందో తెలియదు నీవు విపత్సముద్రాన్ని దాటి చడానికి తెప్పలాంటివాడవు వారి సంగతి తెలిస్తే చెప్పండి - అని అర్థించాడు అంతట నా దేవర్షి ధర్మజునికిలా అన్నాడు-

ఈ విశ్వం ఈశ్వరవశం ఈశ్వరుడే జీవకోటిని పరస్పరం కలుపుతూ వుంటాడు విడదీస్తూ వుంటాడు ముకుతో రంధ్రించేసి ముక్కులో కట్టిన త్రాళ్ళు మెద త్రాళ్ళతో కలిపి ఎడ్లను బంధించినట్లు ఇది కర్తవ్యం ఇది అకర్తవ్యం అనెడి విధి నిషేధాలతోగూడిన వేదలక్షణమైన వాక్తంత్రి[1] యందు జీవులను వర్ణాశ్రమ లక్షణాలుగల పేర్లతో బంధిస్తాడు ఈశ్వరాదేశాన్ని అనుసరించి సమస్తలోకము ప్రవర్తిస్తూ వుంటుంది ఆటల్లో పాచికలూ, బంతులూ ఎలాగో అలాగే ఈశ్వరునకు క్రీడా సాధనాలైన జీవులు కలుస్తూ విడిపోతూ వుంటారు. సమస్త జనం జీవరూపంలో స్థిరం దేహ రూపంలో అస్థిరం మరో పక్షంలో స్థిరమూకాదు అస్థిరమూకాదు శుద్ధ బ్రహ్మస్వరూపం అనిర్వచనీయం[2] అది రెండూ కె యుంటుంది

కొండచిలువ నోటిలో పడ్డవాడు అన్యులను ఎలా రక్షిస్తాడూ? అలాగే పంచభూతాలతోగూడి కాల కర్మ గుణాలకు అధీనమైన శరీరం ఇతరులను రక్షించటానికి సమర్థంకాదు. చేతులుగల జంతువులు చేతులులేని చతుష్పాత్తులను[3] తింటాయి కాళ్ళున్న జంతువులు కదలలేని తృణాదులను భక్షిస్తాయి అలాగే పెద్ద జంతువులకు అల్పమృగాలు ఆహారమౌతాయి

సకల ప్రాణుల్లోనూ జీవుడుంటాడు. కనుక జీవుడే జీవన వస్తువు నానా రూపాలతోగూడిన ఈ విశ్వమంతా ఈశ్వరుడే అని గ్రహించు ఈశ్వరునకు భిన్నమైనది మరేదీలేదు తన మాయా విశేషంచేత మాయావియై జాతి భేదరహితుడైన ఈశ్వరుడు అనేక విధాల తానే భోగిగా తానే భోగ్యవస్తువుగా లోపలా పైనా ప్రకాశిస్తూ వుంటాడు కనుక అనాథులు దీనులునైన నా తల్లిదండ్రులు నన్ను విడిచి యేమయ్యారో ఎలా వున్నారో అని విచారించడం అనవసరం. ప్రేమ

1 వేదవాక్యములనెడి త్రాడియందు
2 ఇలా వుంటుందని చెప్పటానికి వీలులేనిది
3 నాలుగుకాళ్ళుగల జంతువులు

అజ్ఞాన మూలకం దానివలన మనస్సు వికలమౌతుంది కనుక ఆ మమకారాన్ని విడిచిపెట్టు

కాలస్వరూపుడు అఖిలాత్ముడూ అయిన విష్ణువు దుష్ట సంహారంకోసం కృష్ణుడుగా అవతరించి ఆ కార్యం నెరవేర్చాడు ఇక తక్కిన పనికోసం ఎదురు చూస్తున్నాడు ఆతను ఈ భూమిమీద ఎంతకాలం వుంటాడో అంతకాలమే మీరుండేది అందుచేత భ్రాంతిని విడిచిపెట్టు కాలాన్ని ఎవరూ అతిక్రమించలేరు ఇక గాంధారీ ధృతరాష్ట్రుల వృత్తాంతం చెపుతాను విను

ధృతరాష్ట్రుడు గాంధారిని విదురుణ్ణి వెంట బెట్టుకొని హిమవన్నగ దక్షిణ భాగంలో ఒక మునివనం చేరుకున్నాడు పూర్వం సప్తఋషులను సంతోష పెట్టటానికి గంగ ఏడుపాయలుగా చీలిన పుణ్యతీర్థంలో స్నానంచేసి హోమంచేశాడు ఆహారంమాని జలభక్షణం మాత్రం చేస్తున్నాడు సకల కర్మలు వదిలిపెట్టాడు కోరికలన్నీ చంపుకున్నాడు యోగాసనాసీనుడై ప్రాణాయామం చేస్తున్నాడు

పంచేంద్రియాలను మనస్సును వశపరచుకున్నాడు అనుక్షణమూ శ్రీహరినే భావిస్తున్నాడు రజస్సత్వతమోరూపాలైన మలాలు మూడింటినీ విడిచిపెట్టాడు మనస్సును అహంకారానికి స్థానభూతమైన శరీరంనుండి వెదలదీసి బుద్ధిలో ఏకీకరణం చేశాడు అలాంటి విజ్ఞానంతోగూడిన ఆత్మను దృశ్యవస్తువు నుండి విడదీసి క్షేత్రజ్ఞుని[1] లో చేర్చాడు ఈశ్వర సాక్షాత్కారం అయ్యేందుకు ఆ క్షేత్రజ్ఞునికూడా త్రోసివైచి మహాకాశంలో ఘటాకాశాన్ని కలిపినట్లు ఆధార భూతమైన బ్రహ్మయందు కలిపి లోపలి గుణక్షోభం కాని వెలుపలి ఇంద్రియ విక్షేపంగాని లేకుండా మాయాగుణవాసనలను నిర్మూలించాడు

ఇపుడొక పర్ణకుటీరంలో జితేంద్రియుడై నిరాహారుడై స్థాణువులాగా వున్నాడు నేటికి సరిగా అయిదోనాడు తన భౌతిక కాయాన్ని యోగాగ్నిలో ఆహుతి కావించి ఈశ్వర సాయుజ్యం చెందపోతున్నాడు ఈ విషయం యెరిగి గాంధారి అటూ ఇటూ పోకుండా అక్కడే వుండి తన ప్రాణవల్లభునితోపాటు అగ్నిప్రవేశం చేస్తుంది అలా వారిద్దరు మృతి చెందటంమాచి విదురుడు చింతించి కొంతకాలానికి తీర్థయాత్రలకు వెళ్తాడు - అని నారదుడు ధర్మనందనునకు విదురాదుల వృత్తాంతం చెప్పి తుంబుర సహితుడై స్వర్గలోకానికి వెళ్ళాడు అపుడు ధర్మరాజు భీముని చూచి యిలా అన్నాడు-

---

1 శరీరం క్షేత్రం జీవుడు క్షేత్రజ్ఞుడు

# ధర్మరాజు దుర్నిమిత్తాలు చూచి చింతించుట

తమ్ముడా కాలగమనంలో ఎంత మార్పు వచ్చిందో చూదావా? సకల ఋతువుల్లోను ఫలించే ఓషధులు ఒక కాలంలో ఫలిస్తాయని వేరొకకాలంలో ఫలించవని అంటారు లోకంలో క్రోధం లోభం క్రౌర్యం బొంకు పెచ్చు పెరిగి పోతుందని ఏ వ్యవహారము సమరసంగా పరిష్కృతంకాదని నిష్కల్మష మైన స్నేహానికి తావుండదని మగల యెడల ఇల్లాండ్రు మాత్సర్యం వహిస్తారని కొడుకులు తండ్రులను శిష్యులు గురువులని తిరస్కరిస్తారని శాస్త్రమార్గం సాగదని పండితులుకూడ న్యాయపద్ధతిని విడిచిపెడతారనికూడా అంటారు ఎంతలో ఎంత మార్పు?

అర్జునుడు శ్రీకృష్ణుని చూడటానికి వెళ్ళి ఏడునెలలయింది అక్కడనుండి దూతలుకూడా ఎవ్వరూ రావడంలేదు యాదవులు సదోన్మత్తులు శ్రీకృష్ణుడు ఎలా వున్నాడో నా మనస్సు వికలంగావుంది వృకోదరా ఈశ్వరకృతం ఎలా వుంటుందో తెలియదు. మనం అర్థించకముందే మన మానం ప్రాణం రాజ్యం కాపాడదానికి ముందుకువచ్చి యింతకాలమూ ఇక్కడ గడపిన మాధవుడక్కడ ఎలా వున్నాడో వారడుడన్నట్లు చేటుకాలం వచ్చింది నాకెన్నో దుర్నిమిత్తాలు కనబడుతున్నాయి.

అదిగో చూడు ఆ కుక్క నా యెదురుగా మోరపైకెత్తి ఎలా మొరుగు తోందో సూర్యోదయ సమయంలో నక్క సూర్యుని కెదురుగా నిలబడి రోదిస్తూ ఊళవెయ్యడం చూదావా? అటు చూడు గ్రద్దలు గాడిదెలు గుంపులు గుంపులుగా చేరుతున్నాయి గుర్రాలు కన్నీరు కారుస్తున్నాయి ఏనుగులు మదజలాన్ని స్రవించ డం మానివేశాయి యమదూతలాగా ఒక పావురం నన్ను సమీపించింది హోమ శాలలో అగ్ని మండటంలేదు నలుదిక్కులా పొగలు క్రమ్మాయి సూర్యుడు తేజోహీనుడయ్యాడు భూమి కంపిస్తోంది

గాలికి ధూళిరేగి ఆకాశాన్ని క్రమ్మివేస్తోంది పిడుగులు పడుతున్నాయి మేఘాలు రక్తం వర్షిస్తున్నాయి గ్రహాలు ఆగ్రహంతో పరస్పరం పోరాడు తున్నట్లున్నాయి పంచభూతాల కలకల ధ్వనులు వినబడుతున్నాయి భూమికి ఆకాశానికి గల మధ్య ప్రదేశం అగ్నికుండంలా కనబడుతోంది.

ఆవులు దూడలకు పాలీయవని ఇవ్వాలనుకున్నా అవి చన్నులు కుడువ వని శారీరక వ్యాధులు విడిచిపెట్టడంలేదని దూడలు తరిపి[1]నైనా అచ్చుదెడ్లు[2] గోవులను కలియడంలేదని విగ్రహాలు చెమర్చి కన్నీరుకారుస్తూ కదలిపోతున్నా యని వింటున్నాను

---

1 ముదరు 2 అచ్చుపోసిన ఆబోతులు

కాకులు గ్రద్దలు పట్టపగలు నగరంలో చుట్టూ తిరుగుతు అరుస్తున్నాయి లోకాలన్నీ తేజోవిహీనంగా కనబడుతున్నాయి నా ఎడమ కన్ను ఎడమ భుజం ఊరికే అదురుతోంది ఏ భయంకర పరిస్థితి రానున్నదో ఊహించలేకుండా వున్నాను పద్మ శంఖాదికరేఖాలంకృతుడైన మాధవుని పవిత్ర పాద పద్మాలతో భూదేవికి ఇక ఋణం తీరిపోయిందనుకుంటాను మురవైరి వృత్తాంతం ఏమీ తెలియకుండా వుంది - అని ధర్మరాజు భీమునితో విచారిస్తూండగా ద్వారకనుంచి అర్జునుడు వచ్చి బోటబోట కన్నీరుకారుస్తూ ఆయన పాదాలమీద వ్రాలాడు

వికలమైన మనస్సుతో తల్లడిల్లిపోతూన్న తమ్ముణ్ణి చూచి ధర్మజుడు తెల్లబోయి అన్నాడు- అర్జునా అలా వున్నావేమి మన మాతామహుడు శూరుడు క్షేమంగా వున్నాడా? మన మేనమామ కుశలమేనా? మనమేనత్తలు నలుగురు ముగ్గురూ ఎలా వున్నారు? వారి కొడుకులకు భద్రమేనా? అక్రూరుడు కృతవర్మ ఉగ్రసేనుడు సజీవులై వున్నారా? గదసారణాదులు సుఖంగా వున్నారుకదా? ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు ఎలా వున్నారు? బలరాముడేమంటున్నాడు? సంతోషంగా వున్నాడా?

మరి అంధకుడు భోజుడు మొదలైన యదువీరులు హరికుమారులైన సాంబ సుషేణాదులు ఆయన అనుచరులు సహచరులు ఉద్ధవాదులు సునంద నందాదులు సుఖంగా వున్నారా? అని ధర్మజుడు అందరి యోగక్షేమాలు అడిగి మళ్ళీ అన్నాడు-

పార్థా పలకవేమి? వైకుంఠవాసుల్లాగా యాదవులు ఎవ్వని పాదపద్మాలు సేవిస్తూ ఆనందిస్తారో ఎవ్వడు దేవతల కొలువుకూటాన్ని తన చరణ సేవకులైన బంధుమిత్రాదులతో చిందరవందర చేయించి వజ్రపాణియైన యింద్రని ప్రాణ వల్లభ శచీదేవి అమృతంపోసి చేజేత పెంచిన పారిజాతాన్ని పెల్లగించి తెచ్చి సత్యాదేవి పెరటితోటలో నాటించాడో ఆ కృష్ణభగవానుడు క్షేమంగా వున్నాడా?

అన్నా వల్లణా భక్తవత్సలుడు బ్రహ్మణ్యుడు ఆపన్న శరణ్యుడు అరవిందాయతనేత్రుడు జగద్రక్షకుడు గోవిందుడు సుధర్మపీఠాన్ని అలంకరించి బలభద్రాదులతో కొలువుతీరిచి సంతోషంగావున్నాడా? రామకృష్ణుల యెడల నీకు కానని భక్తిభావం వుంది వారూ ఇంకా ఇతర బంధుజనం నిన్ను గారాబంగా చూదారా?

పూర్వం భయదారణ్యంలో వరాహంకోసం శివునితో పోరాడేటప్పుడు యుద్ధరంగంలో కాంకేయులను వధించేటప్పుడూ గంధర్వులచే అవమానితుడై వైభవాన్ని కోల్పోయిన దుర్యోధనుని పగవు కాపాడడానికి ఆ గంధర్వులను పారద్రోలేటప్పుడుకూడా కంటతడిపెట్టవే తండ్రీ ఇప్పుడిలా శోకాకులడవయ్యా వెందుకు? ఇంతకూ కృష్ణుడు క్షేమంగా వున్నాడా? అదికాకపోతే-

నీవేమైనా శత్రువులచేతిలో పరాజయం పొందావా? సాధువులను దూషించావా? పరస్త్రీ గమనం చేశావా? లేక వీరులెవరైనా నిన్ను అవమానించారా? ఆడితప్పావా? కూట సాక్ష్యం ఏమైనా చెప్పావా? ఎవరియెడలనైనా కృతఘ్నుంగా ప్రవర్తించావా? శరణాగతులను బ్రాహ్మణులను స్త్రీలను రోగులను బాధించావా? బ్రాహ్మణులను దూషించావా? బాలురను వృద్ధులను గురువులను విడిచి ఒంటరిగా భుజించావా? ఆశ్రితులను విడిచిపెట్టావా? అదీకాక లోభంతో పరుల విత్తాన్ని అపహరించావా? ఎందుకిలా కన్నీరు కారుస్తున్నావు? -

అని ధర్మనందనుడు గుచ్చి గుచ్చి అడిగేసరికి అర్జునుడు కన్నీరు తుడుచుకుంటూ గద్గద కంఠంతో పెన్నిధిని కోల్పోయిన పేదవానిలాగా నిశ్వసిస్తూ ఇలా అన్నాడు-

అగ్రజా మన సారథి మన సచివుడు[1] మన వియ్యము మన మిత్రుడు మన బాంధవుడు మన విభుడు మన గురువు మన దేవుడు శ్రీహరి మనల్ని విడిచిపెట్టిపోయాడు దురాత్ములైన రాజులందరూ చూస్తుండగా ఎంతో యెత్తున తిరుగుతున్న మత్స్య యంత్రాన్ని ఒకే ఒక బాణంతో కొట్టించి ద్రౌపదిని గ్రహించామంటే ఆయన కరుణ వలననే కదా

అనంతమైన సేనావాహినితో నెదుర్కొనిన దేవేంద్రుని జయించి ఖాండవ వనాన్ని దగ్ధం చేశాను అపుడు అగ్నిదేవుడు సంప్రీతుడై నాకు గాండీవాన్ని ఇచ్చాడు. ఆ దేవదేవుని అనుగ్రహమే లేకపోతే అది నాకు సాధ్యమయ్యేపనేనా? నానా దేశాధీపలను జయించి వారి ధనసర్వస్వం తీసుకొని రావడంలోను మయ సభ నిర్మాణంలోను రాజసూయయాగ నిర్వహణంలోను మనకు దండగా నిలబడిం దెవరు? ఆ మహానుభావుడుకాదూ?

అన్నా దుర్వాసుని వృత్తాంతం జ్ఞాపకం వుందా? ఒకనాడు మనము పాంచాలి భోజనంచేసి కూర్చుండగా ఆ మహర్షి పదివేలమంది శిష్యులతో వచ్చి భోజనం పెట్టమని అడిగాడు. నీవు పెడ్తానని మాట యిచ్చావు పెట్టకపోతే శపిస్తానని చెప్పి ఆయన శిష్యులతో స్నానానికి వెళ్ళాడు వంటపాత్రల్లో అన్నం గాని కూరా నారగాని ఏమీలేవు అపుడు పాంచాలి పర్ణశాలలోనికి వెళ్ళి శ్రీకృష్ణుని స్మరించేసరికి ఆ దయ మయుడు వచ్చి పాత్రల్లో ఎక్కడో అంటుకొని మిగిలివున్న ఒక్క అన్నం మెతుకును కూరముక్కను తినేసరికి ఆ ఋషికి ఆయన శిష్యులకు కడుపులు నిండిపోయాయి దుర్వాసుడు ఆగ్రహంమాని అపుడు మెదలకుండా వచ్చినదారిని వెళ్ళిపోయాడు ముల్లోకాలను అలా తృప్తి పరచగల దక్షత యెవని కుంటుంది?

1 సహాయుడు

నేను ఫాలాక్షునితో పోరాడి పాశుపతాస్త్రాన్ని తెచ్చినా సశరీరంగా స్వర్గానికి వెళ్ళి ఇంద్రుని అర్ధ సింహాసనాన్ని అలంకరించినా కాలకేయాది మహా వీరులను వధించినా గోగ్రహణ సమయంలో కురువీరుల నెదిర్చి గెలిచినా బొమ్మ పొత్తికలకు కర్ణ సైంధవాది కౌరవుల తలపాగకుచ్చులు కోసి తెచ్చి విరాట రాజ పుత్రిక ఉత్తర ముద్దుతీర్చినా ఆ కృష్ణుని కరుణా విశేషంచేతనే కాని అందులో నా ప్రతిభ అణుమాత్రమున్నూ లేదు

భీష్మద్రోణాదులు కలిసి పన్నిన భయంకరమైన కౌరవయుద్ధంలో నాకు సారథియై నా బాణాలు శత్రు రాజులకు తగలకముందే నను ప్రోత్సహిస్తూ తన చూపులతో వారి బలాన్ని ఉత్సాహాన్ని ఆయువును హరించిన ఆ మహానుభావుని నే నెలా మరవగలను? హిరణ్యకశిపుడెన్ని దుష్కృత్యాలకు పాల్పడినా అవేవీ ప్రహ్లాదుని ఏమీ చెయ్యలేకపోయాయి అలాగే కృపుడు అశ్వత్థామ భీష్ముడు కర్ణుడు ద్రోణుడు నాపై ప్రయోగించిన బాణాలు నన్ను అంటనైనా అంటలేదు ఎంచేత? ఆ దేవదేవుని అనుగ్రహాతిశయంచేత కాదూ

సైంధవుని వధించిననాడు నా రథహయాలు అలసిపోయాయి వాటికి నీరు పెట్టడానికి జలాశయం ఎక్కడాలేదు. అపుడు నేను నా బాణాలతో భూమిలో కొలనును కల్పించి శత్రువులు చూస్తూండగా నీరుపెట్టాను శ్రీకృష్ణుడే నాకు అండగా నిల్వకపోతే నేనంతటి సాహసాన్ని చేసేవాడనా?

చెలికాడా రావోయీ అని నన్ను చేరదీస్తాడొకసారి ఒకసారి ఏమోయీ మరదీ అని మన్నిస్తాకు ఒకసారి బంధు భావంతో ఆదరిస్తాడు ధన ధాన్యా లిస్తాడు ఒకప్పుడు మంత్రియై నాకు రాజ్యాంగ రహస్యాలు చెపుతాడు ఉపదేశ కుడై ఒకవేళ నీతిబోధ చేస్తాడు ఒకసారి చనవుకో నాకు రథ సారథ్యం చేస్తాడు. ఒక్కొక్కప్పుడు నాతో ఆటలాడుతాడు నన్ను గేలిచేస్తాడు. నాతోపాటు ఒకే పాన్పుమీద శయనిస్తాడు ఒకే ఆసనంమీద కూర్చుంటాడు నేనేదైనా తప్పుచేస్తే నా చేతులు పట్టుకొని తండ్రిలాగా నన్ను కాస్తాడు నా ప్రక్కన కూర్చుండి నాతోపాటు ఆరగిస్తాడు అన్నా అలాంటి ఆ దివ్య పురుషుని మరచిపోదామన్నా మరవగలనా?

రాకపోకల్లో నా భుజాలు తట్టుతూ నా తల నిమురుతూ విజయా, ధనంజయా కపిధ్వజా, పార్థా పాండునందనా ఇంద్రసమానుడా అర్జునా అని నా కెన్ని పేర్లున్నాయో అన్ని పేర్లతో ముద్దు ముద్దుగా నన్ను పిలిచి యెంత ఆనందించేవాడో ఆ నంద నందనుడు?

అగ్రజా ఆ మహానుభావునకు నాపై ఎంత విశ్వాసమో చూడు ఆయన భార్యలు కానరాని ప్రేమతో ఆయనతో వాదులాడి అలిగితే వారి అలక తీర్చ డానికి నన్ను వారి యిండ్లకు పంపేవాడు నా తొడమీద కూర్చుండి అంతః

పురంలో తన ప్రాణ వల్లభిలు రహస్యంగా తనకు చెప్పిన ముచ్చటలుకూడా అరమరలేకుండా మెల్లగా నా చెవిలో వూదేవాడు

అలా నన్ను గారవించే కరుణాసముద్రుడు శ్రీ కృష్ణుడు స్వర్గతుడైతే అతనితో పోక నా ప్రాణాలు లోభవశంచేత నా దేహాన్ని అంటిపెట్టుకొని వున్నాయి నేను పూర్వజన్మలో ఎంతటి దుష్కర్మకు పాల్పడ్డానో తెలియదు నేనా మహానుభావునకు చేసిన సేవ నేడు వ్యర్థమైపోయింది నా బ్రతుకు నిష్ఫల మైంది నేనెందుకూ పనికిరాకుండా పోయాను చూడు

నేను శ్రీకృష్ణుని అంతఃపురకాంతలు పదారువేలమందిని వెంటపెట్టుకొని అరణ్యమార్గాన వెళ్తుండగా మదోన్మత్తులైన బోయలు వారిని నిలువునా దోచుకున్నారు నేను అబలలాగా చూస్తూ వూరుకున్నాను కాని వారినుండి విడిపించలేకపోయాను అదే రథం అదే గుర్రాలు అదే గాండీవం అవే బాణాలు అన్నీ దగ్గరే వున్నాయి పూర్వం నేను వాటితో ఎందరో శత్రుయోధుల మదమడంచాను. కాని ఈనాడు శ్రీకృష్ణుడొక్కడు లేకపోయేసరికి అవన్నీ బూడిదెలో పోసిన నెయ్యిలాగా గారడీవాని మాయాతంత్రంలాగా చవిటినేలలో వేసిన విత్తనంలాగా నిరర్థకమైపోయాయి నేను నిర్వీర్యుడనైపోయాను.

ముని శాపంచేత కాలాధీనులైన యదువీరు లందరు ఒళ్ళు తెలియకుండా తప్పత్రాగి ఒకరితో నొకరు తలపడి కొట్టుకొని చివరకు అందరు చచ్చారు నలుగురైదగురు మిగిలారేమో భూతమయుడైన ఈశ్వరుడు ప్రాణికోటికి పంచభూతాలవల్లనే జననంగాని మరణంగాని నిర్ణయిస్తాడు. బలంగల చేపలు దుర్బల మైన చిరు చేపలను తినునట్లు బలవంతులైన యాదవులు అకారణ వైరిభావం వహించి దుర్బలులైన వారిని వధించారు భగవదాయత్తం ఎవరికేమి తెలుస్తుంది? భూ భారాన్ని హరించడానికి బలవంతులకు బలహీనులకు పరస్పర వైర భావం కల్పించి వారి వినాశనానికి దోహదంచేసి కృతకృత్యుడై ఆ సర్వేశ్వరుడు వెళ్ళిపోయాడు. సకల తాపాలూ పోగొట్టే శ్రీహరి మాటలు నా స్మృతిపీథిలో మెలగు తున్నాయి నా చిత్తం పరాయత్తమైంది - అని అర్జునుడు మౌనంగా వుండిపోయాడు

నిరంతరం శ్రీహరిని స్మరిస్తూ వుండడంచేత అతని మనస్సు నిర్మలంగా వుండి దుఃఖం తొలగిపోయింది కామక్రోధాదులను జయించాడు. పూర్వం రణ రంగంలో ఉభయ సేనా మధ్యమున అచ్యుతుడు తెలిపిన గీతలు స్మరణకు తెచ్చుకున్నాడు కాలం కర్మం భోగం- వీటివలన మరుగుపడిన జ్ఞానాన్ని తిరిగి పొందాడు తనలో తాను వితర్కించుకొని శోక హేతువూ అహంకారా

త్మకమూ అయిన ద్వైతభ్రాంతికి కారణం దేహమనిన్నీ దేహానికి బీజం లింగ[2] మనిన్నీ లింగానికి మూలం గుణాలనిన్నీ గుణాలకు మూలహేతువు ప్రకృతి యనిన్నీ గ్రహించాడు అహంబ్రహ్మాస్మి[3] అనే భావన కలిగినపుడు ప్రకృతి నశిస్తుందనిన్నీ ఎప్పుడైతే నిర్గుణత్వం సిద్ధిస్తుందో అపుడు కార్యలింగాలు నశిస్తా యనిన్నీ కార్యలింగ వినాశనంవలన జన్మరాహిత్యం కలుగుతుందనిన్నీ కూడా అవగాహన చేసికొని విరక్తి భావంతో నిశ్చలంగా వున్నాడు

ధర్మరాజు శ్రీకృష్ణుని వృత్తాంతం యాదవ వినాశనం విని నారద వాక్యాలు స్మరించుకొని నిశ్చలమైన మనస్సుతో స్వర్లోకయాత్రకు సంసిద్ధు డయ్యాడు

యాదవనాశనం కృష్ణావతారం ముగియడం విని కుంతీదేవి సంసారబంధం త్రెంచుకొని మనస్సులో నిరంతరం హరిచరణార విందాలను ధ్యానిస్తూ విరక్తు రాలైంది

ఈ రీతిగా ముల్లును ముల్లుతో పెకలించి అనంతరం ఆరెండిని పరిహరించి నట్లు శ్రీహరి యాదవ రూపకమైన శరీరంతో లోకకంటకాలైన అన్యశరీరాలను హరించి తన శరీరాన్ని చాలించాడు పరిహరించటంలో ఈశ్వరునకు నిజ పర శరీరాలు రెండూ ఒక్కటే భేదభావంలేదు నిజరూపంలో వుంటూ అనేక రూపాలు ధరించి తుదకు తెరమరుగయ్యే నటుడులాగా లీలావినోదియైన శ్రీమన్నారాయణుడు మత్స్య కూర్మాదులైన అనేక రూపాలు ధరించి తిరిగి ఉపసంహరించుకుంటాడు ఏ దినాన శ్రీహరి భూమిమీద తాను ధరించిన మానవ శరీరం విడిచి తిరిగి పరమ పదానికి వెళ్ళిపోయాడో ఆనాటి నుండి కలియుగం ప్రారంభమైంది" అని సూతుడు మళ్ళీ ఇలా చెప్పడం ప్రారంభించాడు—

"కలి ప్రభావంచేత ఎక్కడచూచినా అధర్మం వ్యాపించింది. అది గ్రహిం చిన ధర్మనందనుడు విరక్తుడై పరీక్షిత్తుని హస్తి నగరానికి రాజుగా చెయ్య డానికి నిశ్చయించుకున్నాడు. సముద్ర జలాలు తెప్పించి సకల జన సముక్షంలో అతణ్ణి అభిషిక్తుణ్ణి చేశాడు చతురంగ బలాలను, సకల సంపదలనూ అతని కైవశం చేశాడు. అలాగే అనిరుద్ధుని కుమారుడు వజ్రుని మధురానగరానికి పట్టం గట్టాడు.

అహంకార మమకారాలను తెగత్రెంచుకున్నాడు ప్రాజాపత్యం అనే యజ్ఞం చేశాడు త్రేతాగ్నులను ఆరోపించి ఆత్మార్పణం చేసుకున్నాడు. సకలేంద్రియాలను మనోగతం కావించాడు ప్రాణానికి అధీనమైవుండే మనస్సును

---

1 జీవాత్మవేరు పరమాత్మవేరు అనే భ్రమ
2 సూక్ష్మ శరీరం 3 నేనే బ్రహ్మను

ప్రాణంలోను ప్రాణాన్ని అపానంలోను ఉత్సర్గ సహితమైన[2] అపానాన్ని మృత్యువులోను మృత్యువును పంచభూతాత్మకమైన శరీరంలోను, శరీరాన్ని గుణత్రయంలోను గుణత్రయాన్ని అవిద్య[3]లోను ఆరోపాలన్నింటికీ[4] కారణమైన అవిద్యను జీవునియందును జీవుడైన తనను అవ్యయమైన బ్రహ్మమందును లయం చేశాడు

సకల బహిరంగ వ్యాపారాలు విడిచిపెట్టాడు నారచీరలు ధరించాడు మౌనం వహించాడు ఆహారం వర్జించాడు జుట్టు విరియ బోసుకొని పిచ్చివాని లాగా చెవిటి వానిలాగా జడుని లాగా అయిపోయాడు అన్ని కోర్కెలు చంపుకున్నాడు చిత్తాన్ని బ్రహ్మయత్తం చేశాడు విజ్ఞాన ధనులకు నిలయమైన ఉత్తర దిశకు బయలుదేరాడు

ధర్మనందను డలా వెళ్ళిపోవడం చూచి అతని తమ్ములు వృకోదరాదులు కూడా కలి రాకవలన ప్రబలిన అధర్మాచరణం చూచి విరక్తులై సకల విషయ వాసనలను విడిచిపెట్టి శ్రీహరి చరణ కమలములందు మనస్సును లగ్నంచేసి విజ్ఞాన మనెడి కార్చిచ్చులో కర్మలను దగ్ధంచేసి ఏకాంతులైన పుణ్యాత్ములకు లక్ష్యభూతమై వెలిగెడి నారాయణ స్థానానికి వెళ్ళారు

అపుడు ప్రభాస తీర్థంలోవున్న విదురుడు శ్రీహరియందు చిత్తాన్ని నిలిపి ప్రాణత్యాగంచేసి పూర్వజన్మలో తాను యముడు[5] కనుక పితృవర్గంతోగూడి నిజాధికార స్థానానికి వెళ్ళాడు

భర్తలు అలా వెళ్ళిపోయేసరికి ద్రౌపది కూడా శ్రీహరియందు చిత్తాన్ని లగ్నంచేసి పరమ పదం చేరింది పాండవుల ఈ మహా ప్రస్థాన కథను చెప్పినవాడు విన్నవాడు హరిభక్తుడై కైవల్యం పొందుతాడు

హస్తినగరానికి అభిషిక్తుడైన పరీక్షిత్తు దైవజ్ఞులు చెప్పినట్లే బ్రాహ్మణోత్తములవలన సకల విద్యలు నేర్చి మహాభాగవతోత్తము డయ్యాడు ఉత్తరుని కుమార్తె ఇరావతిని వివాహమాడి జనమేజయుడు మొదలైన నలుగురు కొడుకులను కన్నాడు

గంగానది పులిన తలాల్లో[6] కృపాచార్యుడు ఆచార్యుడుగా దేవతా సమక్షంలో మూడు అశ్వమేధాలు చేశాడు అనంతరం దిగ్విజయ యాత్రకు బయలు

1 వెలికిపోవు అపాన వాయువు 2 విడుపు గలది
3 మాయ 4 ఆరోపము=లేనిదానిని కల్పించుట
5 మాండవ్య ముని శాపంచేత యముడు శూద్ర యోనియందు విదురుడుగా జన్మించాడు
6 ఇసుక తిన్నెల్లో

దేరి వెళ్తుండగా ఒకచోట శూద్రు డొకడు గోమిథునాన్ని తన్నడం చూచాడు అతడు రాజ చిహ్నాంకితు డవడంచేత అతడే కలి యని గ్రహించి అతణ్ణి నిగ్రహించాడు అని సూతు డనేసరికి శౌనకు డీ రీతిగా అన్నాడు.

## పరీక్షిత్తు భూ, ధర్మ దేవతల సంవాదం ఆలకించుట

మునీంద్రా రాజ చిహ్న ముద్రితుడైన శూద్రుడు గోవును ఎందుకు తన్నాడూ ? పరీక్షిత్తు అతణ్ణి ఎలా నిగ్రహించాడూ ? చెప్పండి శ్రీహరి చరణ కమల మకరందాన్ని గ్రోలెడి సత్పురుషుల చరిత్రలు వినాలికాని దుష్టాత్ముల గాథలు వించే మాత్రం ఏం ప్రయోజనం ? వృధా కాలహరణమేకాని సంసార వ్యామోహం తొలగుతుందా ఏమైనా ?

శరీరం అనిత్యమని మరణం తప్పదని గ్రహించి మోక్షాన్ని కాంక్షించే మేము దుష్టుల కథలు వింటూ బంగారంలాంటి స్వల్పమైన ఈ జీవిత కాలాన్ని పాడుచేసికొనడం ఎందుకు ? కనుక శ్రీహరి పాద కమల మకరందాన్ని మేము తనివితీరా త్రాగేలాగా చెయ్యి మేం చేసే ఈ సత్రయాగానికి మునిజనుల ఆహ్వానంపై దండధరుడు కూడా వచ్చాడు చూడు ఈ యాగం పరిసమాప్త మయ్యేదాకా ఒక్కని ప్రాణాలుకూడా హరించడు విష్ణు కథలు వింటూంటాడు మందబుద్ధులైన వారికి మాత్రం శ్రీహరి గాథలు వినే అదృష్టం వుండదు అనగా సూతు డిలా చెప్పడం మొదలు పెట్టాడు

చతురంగ బలాలతో సంరక్షితమైన తన రాజ్యం కురుజాంగల దేశంలో యుద్ధకాంక్షతో కలి ప్రవేశించాడని పరీక్షిత్తు విని ధనుర్బాణాలు తీసికొని రథా రూఢుడై బయలుదేరాడు ఆ రథానికి పూన్చిన గుఱ్ఱాలు నల్లని మేఘాల్లాగా వున్నాయి రథంపైన సింహధ్వజం రెపరెప లాడుతోంది చతురంగ సేనలు వెంటనంటి వస్తున్నాయి దిగ్విజయార్థం బయలుదేరి పరీక్షిత్తు చతుస్సముద్ర మధ్యంగతాలైన ఇలావృతాది సకల దేశాలు జయించాడు. ఆయా దేశవాసులు సమర్పించిన కానుకలు సాదరంగా గ్రహించాడు

మంగళ పాఠకులు పూర్వ గాథలు ఎన్నో గానం చేశారు ఆ గాథల్లో పాండవులకు భక్తవత్సలుడైన శ్రీహరి కావించిన సారథ్యం, సఖ్యం సాచివ్యం దౌత్యం మొదలైన ఉదంతాలు విని పులకించిపోయాడు. అశ్వత్థామ అస్త్ర తేజం నుండి కృష్ణుడు తనను సంరక్షించడం, యాదవ పాండవుల స్నేహానుబంధం శ్రీహరి భక్త వాత్సల్యం విని నివ్వెఱపోయాడు వందిమాగధులను యథోచితంగా సత్కరించాడు. అతని మనస్సు శ్రీహరి పరతంత్రమైంది ఆ సమయంలో ధర్మ దేవత వృషభ రూపంలో ఒంటికాలితో కుంటుకుంటూ దగ్గఱ లేగదూడలేని లేగటి

యావులాగా తేజోహీనయై కన్నీరు కారుస్తూ గోరూప ధారిణియైన భూదేవితో ఇలా అన్నాడు

తల్లీ ఎందుకలా కన్నీరు మున్నీరుగా శోకిస్తున్నావు? నీ శరీరం చిక్కి సగమైపోయింది నీ ముఖం వాడిపోయింది నిన్ను కళ్ళల్లో పెట్టుకొని చూచే నీ చుట్టాలకు ఆపదలేవీ రాలేదుకదా ఎందుకు నీకీ దుఃఖం?

ఒంటి కాలితో తిరుగుతూన్న నన్ను హీనజాతులు పట్టి బాధిస్తారనా? ఎవరూ యాగాలు చెయ్యకపోవడంచేత దేవతలకు యజ్ఞ భాగాలు లేకుండా పోతాయనా? భార్యలు భర్తలను కొడుకులు తండ్రులను చూడరనా? సరస్వతి దుర్జనుల చేతుల్లో పడుతుందనా? బ్రాహ్మణులు రాజసేవకు పాల్పడతారనా? ఇంద్రుడు వర్షాలు కురవక పోవడంతో ప్రజలు బాధపడతారనా? హీన జాతులు రాజ్యాలేలతారనా? ప్రజలు హరిభక్తి విడిచి కేవల భౌతిక సుఖాల్లో మునిగి తేలుతూ వుంటారనా? తల్లీ నీ వెందుకిలా ఆక్రోశిస్తున్నావు?

నీ భారం హరించడానికి శ్రీహరి ఇన్ని సంవత్సరాలు నరాకారంతో వర్తించి నీకు నిత్యానందం కలిగించి పోయేసరికి అనాథ నయ్యాను ఇక ఏ దుర్జనుడు శాసిస్తాడో అని దుఃఖిస్తున్నావా? దుష్టమైన కాలమహిమచేత నిరంతరం దేవతలకు కూడ మనోనందాన్ని కలిగించే నీ సౌభాగ్యం శ్రీకృష్ణుడు పరమ పదానికి వెళ్ళేసరికి రూపుమాసింది అనే సరికి భూదేవి యిలా అన్నది

'పూర్వం నీవు ఈ లోకంలో నాలుగు పాదాలతో చరించేవాడవు ఇప్పుడు శ్రీకాంతుడు లేకపోయేసరికి మూడు పాదాలు కుంటుపడి పోయాయి ఒంటి కాలితో తిరుగుతున్నావు గుణ సమూహాలన్నీ ఆ శ్రీహరియందే వర్తిస్తాయి

సత్యం శౌచం, దయ, క్షమ సంతోషం త్యాగం శమం దమం ఆర్జవం తపం, సమత్వం పరాపరార్థ సహనం శాస్త్ర విచారజ్ఞానం, ఐశ్వర్యం శౌర్యం స్వాతంత్ర్యం జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోబలాలు సౌభాగ్యం గాంభీర్యం స్థైర్యం శ్రద్ధ కీర్తి మానగర్వా భావం - మొదలైన సకల సద్గుణాలకు ఆటపట్టు ఆ శ్రీహరి సకల గుణాకరుడైన ఆ శ్రీహరి వెళ్ళిపోయే సరికి ఘోరమైన కలి ప్రేరణంతో పాపాసక్తులైన ప్రజలను చూచి శోకిస్తున్నాను

కలి ప్రేరణంతో దేవతలకు, ఋషులకు పితృదేవతలకు నాకు నీకు యోధగణానికి నానా వర్ణాశ్రమాలకు గోవులకు బాధ కలుగుతుందని కూడా నేను చింతిస్తున్నాను. తపోనిరతులై బ్రహ్మాదులు ఎవని కృపాకటాక్ష వీక్షణాలను వాంఛిస్తారో, కమలాలయం[1] విడిచి కమల (లక్ష్మి) యెవని పదకమలాలను సేవి

1 లక్ష్మీదేవి నివాస స్థానమైన పద్మం

25002

స్తుందో ఎవనిని యోగీంద్రులు నిరంతరం హృదయంలో నిలుపుకొని ధ్యానిస్తూ వుంటారో వేదాలు సైతం ఎవనిని వర్ణించలేవో ఆ దేవదేవుడు కనుమరుగై పోయాడు వజ్రాంకుశ చక్రచాప చిహ్నితాలైన ఆయన పాదాంబుజాల స్పర్శను ఇక నేను నోచుకోలేదుకదా అని దుఃఖిస్తున్నావు

ఇంతవరకు శ్రీహరి పాదస్పర్శ సోకేటి అదృష్ట లభించింది కనుక నన్ను అఖిల లోకాలు సేవించాయి ఆ భాగ్యం స్థిరం అనుకున్నాను శ్రీహరి యిప్పుడు నా గర్వం హరించాడు మాధవుడు లీలామానుష విగ్రహంతో ఇన్నాళ్ళు దుష్ట సంహారం చెయ్యడానికి నిన్ను (ధర్మం) నాలుగు పాదాలతో నడిపించాడు

ఆ మధురాలాపాలూ ఆ మందహాసం ఆ దయారసం ఆ ముద్దు ముచ్చటలు ఆ తగవులు ఆ మందగమనం ఆ ప్రేమార్ద్ర దృక్కులు చూచి ఆనందించే అదృష్టం నా కికలేదు కాంతా జనమేకాదు, కర్మ జాలాన్ని చంపుకున్న పరమయోగులు కూడ ఆయన వియోగాన్ని సహించలేరు

ఆ యదువల్లభుడు నాపై మృదువుగా అడుగు మోపితే చాలు మోహవశంచేత నా శరీరం ఝల్లుమనేది ఆ మనోహరాకారుడు నడచినంత మేరా పచ్చని పైరులు ఏపుగా మొలిచి నాకు రోమాంచం కలిగినట్లు కన్పట్టేవి - అని యిలా పూర్వ వాహినియైన సరస్వతీ నదీ తీరాన ధర్మదేవతా భూమీ - వృషభ ధేను రూపాల్లో సంభాషిస్తూండగా రాజర్షియైన పరీక్షిత్తు వారి దగ్గరకు వచ్చాడు

## కలిపురుషుడు ధర్మదేవతను తన్నుట

ఇంతలో యముడులాగా దండం ధరించి రాజలక్షణ లక్షితుడైన శూద్రుడొకడు మహోగ్రుడై కైలాస పర్వతంలాగా గంభీరంగావున్న ఆ వృషభాన్ని నిష్కారుణ్యంగా కాలితో తన్నాడు క్రూరమైన ఆకని పదాహతికి ఆ వృషభం భయకంపితమై మూత్ర విసర్జనం చేసింది ఆ నీచుడు వృషభాకారంలోవున్న ధర్మ దేవతను అలా తన్నడం చూచి గోరూపంలో వున్న భూమి గజగజ వణికిపోయింది కళ్ళవెంట కన్నీరు కాల్వకట్టింది అంబా అని అరచింది లేబచ్చికపు పుడి జిహ్వాగ్రంమీద అలాగే నిలిచిపోయింది హృదయం కంపించిపోయింది దూడ ప్రక్కనే వుంది. దుఃఖం పెల్లుబికి వస్తోంది శరీరం అంతా చెమటలు క్రమ్మాయి అలా శోకాకులయైవున్న ఆ ధేనువును గూడా ఆ నీచుడు నిర్దాక్షిణ్యంగా ఎగిరి తన్నాడు

ఆలా గో వృషభాల రెంటిని తన్నిన రాజలక్షణ లక్షితుడైన శూద్రుని చూచి కాంచన రథారూఢుడైన పరీక్షిత్తు విల్లు నెక్కుపెట్టి గంభీరంగా అన్నాడు—

ఓయీ ఈ గోవులు నిన్నేం చేశాయి? నీ మీద పడ్డాయా? నిన్ను కొమ్ములతో చిమ్మాయా? నిర్భయంగా ఇలా వాటిని నీ వెందుకు తన్నినట్లు? నేను పరిపాలించే ఈ నేలలో ఎవ్వరూ ఏలాంటి నేరాలకు పాల్పడరాదని యెఱుగవా? అందులో నరపాలుడు లాగా వున్నావు ఈ ధూర్తత్వమేమిటి? ఇంతకూ అసలు నీ వెవ్వడవు? దుర్మార్గుడా మాను నిన్నిప్పుడే శాసిస్తాను

కృష్ణార్జునులు ఈ మర్త్యలోకం విడిచిపోగా మదోన్మత్తుడవై నిరపరాధులైన వారిని దారుణంగా దండిస్తావా? వాస్తవంగా నీవు దండనార్హుడవు - అని పరీక్షిత్ వృషభాన్ని ఉద్దేశించి అన్నాడు—

వృషభేంద్రా కురువంశ రాజులు పరిపాలించేటి ఈ నేలలో కంటతడి పెట్టిన వాణి నిన్నొకర్తి తప్ప ఇంకెవ్వరినీ చూడలేను ఇదిగో చూస్తూవుండు. నిన్నిప్పుడే వధిస్తాను

తృణభక్షణం చేస్తూ నదీ జలాలు త్రాగుతూ సాధు జీవితం గడిపే నీ కాళ్ళు నరికిన ఆ నిర్దయుడు ఎవ్వడైనా ఆకాశానికి ఎగిరి పోయినా నేలలో దాగినా పట్టుకొని వాని బాహువులు ఖండించి తీరుతాను అని గోరూప ధారిణియైన భూదేవితో ఇలా అన్నాడు —

తల్లీ లోకోత్తర వైభవం గల శ్రీహరి వెళ్ళిపోయాడని దుఃఖంతో కృంగిపోకు కన్నీరు కార్చకు ఆ నీచుణ్ణి నా నిశిత బాణ పరంపరతో ఇప్పుడే వధిస్తాను భయపడకు నా పౌరుషం మొద్దువుగాని సాధువులను బాధించే దుష్టులను అణచకుండా రాజు వుండి ప్రయోజనమేముంటుంది? అలాంటి రాజాధముని దగ్గర కింకరులు నిత్యావు వారు అల్పాయుష్కులౌతారు. వారికి ఏ రీతిగాను స్వర్గం లభించదు బ్రహ్మ నరేంద్రులను దుష్టులను నిగ్రహించడానికి శిష్టులను అనుగ్రహించడానికి కాదా సృష్టించింది? అనే సరికి వృషభాకారంలో వున్న ధర్మదేవుడు పరీక్షిత్తుతో ఈ రీతిగా అన్నాడు—

నరేంద్రా దుష్టశిక్షణం సాధు సంరక్షణం చేసిన పౌరవ వంశంలో జన్మించావు ఎంత పుణ్యవంతుడవు పూర్వం మీవారు అలాంటి వారు కనుకనే భక్త వశంగతుడైన శ్రీకృష్ణుడు వారి పక్షం అవలంబించి వాళ్ళకి దౌత్యం చేశాడు. ఇక మా సంగతి విను మేము ఏ ప్రాణినీ హింసించే వాళ్ళం కాము మా వల్ల ఎవరికి ఏ విధమైన దుఃఖమున్నా కలుగదు మరో విషయం చెబుతా విను

తర్క వితర్కాలతో యోగులు భ్రాంతులై సుఖదుఃఖాలకు ఆత్మ కారణమంటారు దైవజ్ఞులు గ్రహాలవల్ల సుఖదుఃఖాలు సంప్రాప్తిస్తయ్యంటారు. మీమాంసకులు కష్టసుఖాలకు కర్మ కారణం అంటారు లోకాయతికులు అవి సహజంగానే వస్తాయని వాదిస్తారు వాస్తవంగా చూస్తే పైన చెప్పిన వేటికీ కూడా సుఖదుఃఖాలను కల్పించే శక్తిలేదు కనుక పరులవల్ల వచ్చే దుఃఖాన్ని చూచి

ఆది పరులు చేరారని అనుకొనడం భ్రమ తర్కించడానికిగాని నిర్దేశించడానికి గాని సాధ్యంకాని ఆ పరమేశ్వరు డొక్కనివల్లనే సర్వమూ జరుగుతూ వుంటుంది అనగా ధర్మదేవునకు ధర్మనందనుని మనుమడు పరీక్షిన్మహారాజు ఇలా అన్నాడు

ధర్మదేవా ఔను పాపాత్ముడు చేసిన పాపాన్ని ఎత్తిచూపిస్తే దానివల్ల వచ్చే ప్రయోజన మేమిన్నీలేదు మనకు కూడా ఆ పాపాత్ముని గతే పడుతుంది నీవు ధర్మసూక్ష్మం వచించావు

దైవమాయవలన చంపేదేదో చంపబడేదేదో ప్రాణికోటికి సులభంగా తెలియదు నీవు ధర్మదేవతవు. కృతయుగంలో తపస్సు శౌచం దయ సత్యం అనేవి నాలుగు నీకు పాదాలంటారు కాని త్రేతా యుగంలో తపస్సు ద్వాప రంలో శౌచం దయా నశించిపోగా కలియుగం వచ్చేసరికి సత్యం ఒకటి మిగిలింది అలా మిగిలిన సత్య మనే ఒక కాలినీ కూడా కలియుగాంతంలోగా భగ్నం చెయ్యాలని అధర్మం యత్నిస్తోంది ధర్మదేవా నీ స్థితి యిలా వుంది ఇక భూదేవి పరిస్థితి కూడా ఎంత దయనీయంగా వుందో చూడు భూభారం హరించి రమాధవుకు తన పాదాంబుజాలను తనపై మెల్లగా మోపి నడుస్తువుంటే ఆ చరణ స్పర్శకు పరవశించిపోయెడి భూదేవి యిప్పు డా హరి తనువు చాలించే సరికి ఏ శూద్ర కులజుడు శాసిస్తాడో యిక - నని కన్నుల్లో నీరు నింపుకొని శోకిస్తోంది చూశావా ?

## పరీక్షిత్తు కలిని నిగ్రహించి ధర్మపాలనం చెయ్యటం

అని యిలా ధర్మదేవతను భూదేవిని బుజ్జగించి పరీక్షన్నరేంద్రుడు కలిని నిగ్రహించడానికి బయలుదేరాడు తీక్ష్ణమైన కత్తిని ఝళిపించాడు. ఆ ఖడ్గ కాంతులు క్రొక్కారు మెఱుగులను తిరస్కరిస్తూ దశదిశలా వ్యాపించాయి పరీక్షిత్తు అలా తనపైకి రావడం జూచి కలి కంపించిపోయాడు రాజ రూపం వదిలేశాడు ముఖం కాంతి హీనమైంది భయాక్రాంతుడై చేతులు చాచి ఆయన పాదాలమీద తలమోపి నమస్కరించి - రాజేంద్రా శరణార్థిని నన్ను చంపకు - అని వేడేసరికి జనపతి నవ్వుతూ అతనితో ఇలా అన్నాడు—

దురాత్ముడా నిర్మల యశస్కుడైన అర్జునుని మనుమడ్జి నేను భయా విష్టులైన వారిని పరాజితులైనవారిని చంపను. ఇక నీవు నీ దుర్జనత్వం విడిచి వెళ్ళిపో. నీవు పాపబంధుడవు నా రాజ్యంలో వుండే అర్హత నీకు లేదు. నీలో అసత్యం లోభం చౌర్యం దౌర్జన్యం దురాచారం, మాయ, కపటం కాలుష్యం అలక్ష్యం మొదలైన అన్ని దుర్గుణాలు వున్నాయి కనుక నీ కిక్కడ స్థానం

లేదు. సత్య ధర్మాలకు నివాస స్థానమైన బ్రహ్మావర్త దేశంలో యాజ్ఞికులు యజ్ఞేశ్వరుడైన హరిని ఉద్దేశించి యజ్ఞం చేస్తున్నారు. సకల భూతాంతర్యామి యైన శ్రీహరి జంగమ స్థావరములకు లోపలా వెలుపలా సంచరించే వాయువులా ఆత్మ రూపంలో వారి కోర్కెలు తీరుస్తున్నాడు. కనుక నీ విక్కడ వుండరాదని దండపాణియైన యముడులాగా ఖడ్గం దూసేసరికి కలి ఆ నరేంద్రునితో ఇలా అన్నాడు—

'రాజేంద్రా! నీ కత్తి తళ తళ కాంతులు చూస్తుంటే నా గుండెలు పగిలి పోతున్నాయి. ఎక్కడకని పోను? ఎటువైపు చూచినా విల్లెక్కుపెట్టిన నీ భీకరాకారమే నాకు కనబడుతోంది! నే నుండదగిన తావేదో సెలవిస్తే వెళ్తాను' అని ప్రాధేయ పడ్డాడు.

అపుడు పరీక్షిన్నరేంద్రుడు - ప్రాణివధ, స్త్రీలు, ద్యూతం, మద్యపానం అనేవి ఈ నాలుగు స్థానాల్లో వుండు పొమ్మన్నాడు. ఇవేనా? అని కలి నెమ్మదిగా గొణిగేసరికి, అయితే ధనం కారణంగా గల్గిన అసత్యం, మదం, కామం, హింస, వైరం - ఈ అయిదు స్థానాలు కూడా ఇస్తున్నాను. అంతే ఇతర స్థలాలేవీ ముట్టుకోరాదు! అని శాసించాడు. ధర్మదేవత పోగొట్టుకున్న తపం, శౌచం, దయ అనేవి మూడు పాదాలు అతను తిరిగి లభించేలా చేశాడు. భూదేవికి అపార సంతోషం కల్పించాడు. అనంతరం హస్తినగరానికి తిరిగి వెళ్ళి రాజ్యలక్ష్మిని చేపట్టాడు.

ఇలా శ్రీకృష్ణుని అనుగ్రహంచేత అశ్వత్థామ బాణాగ్నివలన బ్రతికి బయటపడిన పరీక్షిత్తు బ్రాహ్మణ శాపంచేత తక్షక విషాగ్నికి భీతిల్లి, మరణం తప్పదని సర్వసంగ పరిత్యాగంచేసి శుకునకు శిష్యుడయ్యాడు. తత్వజ్ఞానం గడించాడు. తుదకు తనువు చాలించాడు. శ్రీహరి కథలు వింటూ నిరంతరం ఆతని చరణార విందాలను స్మరించేవారికి మోహంగాని భ్రాంతిగాని వుండవు.

శ్రీకృష్ణ నిర్యాణానంతరం కలి జన్మించి ధాత్రీతలం అంతా వ్యాపించాడు. కాని పరీక్షిన్నరేంద్రుని కాలంలో మాత్రం ఎక్కడా తలెత్తకుండా అణగిమణగి వున్నాడు. కూడని పని చేస్తేనేగాని పాపాలు అంటవు. సత్కార్యాలు చెయ్యడానికి సంకల్పించినా, చేస్తానని అన్నా కలియుగంలోనైనా పుణ్యం లభిస్తుంది. ఈ రహస్యం తెలిసిన పరీక్షిత్తు ఉల్లాసంతో తేనె త్రాగి పువ్వును త్రుంచివేయకుండా విడిచి పెట్టెడి తుమ్మెదలాగ కలిలోని మంచిని మాత్రం గ్రహించి ఆతణ్ణి వధించకుండా విడిచిపెట్టాడు. మరో విశేష మేమిటంటే -

ప్రమత్తులై భీరువుల్లాగా వుండేవారినే కలి తోడేలులాగా పొంచి చూచి బాధిస్తాడుకాని ధీరులైన వారిని అత దేమీ చెయ్యడు. ఆ కారణంచేత కూడా

పరీక్షిన్మహారాజు కలిని అంతం చెయ్యకుండా విడిచిపెట్టాడు - అని సూతుడు చెప్పేసరికి మునులు ఇలా అన్నారు

పౌరాణిక శిరోమణీ నీవు వేయేండ్లు జీవించు శ్రీహరి నిర్మల కీర్తిని గానంచేసి మరణ శీలురమైన మమ్మల్ని ఉద్ధరించావు మేము సంకల్పించిన ఈ యజ్ఞంలో హోమాగ్నినుండి లేచిన పొగలకు మతి చలించిన మాచేత శ్రీహరి చరణ మకరందాన్ని త్రావించావు ధన్యాత్ముల మయ్యాం స్వర్గంగాని మోక్షం గాని భాగవతుల సఖ్య లేశంతోకూడా సాటిరావు ప్రకృతికి గుణాలకు అతీతంగా వుండే శ్రీహరి శుభగుణాలు బ్రహ్మరుద్రాదులు కూడా తెలిసికోలేరు అలాంటి దేవదేవుని చరిత్ర విని చాలు ఇక వినలేను వద్దు అనే వెఱ్ఱి వాడుంటాడా ?

శ్రీహరి కథాలాపాలు లక్ష్మీప్రదాలు సంతాప హరాలు దురితాంధకారాన్ని పోగొట్టేటి దివ్వెలు పాషండులకు దుర్లభాలు అలాగే శ్రీహరి చరణ సేవలు పరమ పావనాలు పాపతాప విచ్ఛేదకాలు సకల మంగళ ప్రదాలు. ప్రాభవోజ్జీవనాలు

మహాత్మా పరమ భాగవతోత్తముడైన పరీక్షిజ్జనపతి శుకుని ఉపదేశంతో నిర్మల మనస్కుడై మోక్షానికి మూలమైన శ్రీహరి చరణ సాన్నిధ్యాన్ని ఎలా పొందాడు ? యోగనిష్ఠా కలితము విష్ణుకథా లలితము సకల కల్యాణ గుణ గణ్యము భాగవత జనాపేక్షితము అయిన పరీక్షిత్తుని పుణ్య కథను చెప్పండి అని అర్థించేసరికి సూతుడా మహర్షులకు ఈ రీతిగా చెప్పడం ప్రారంభించాడు.

మహర్షులారా మీవంటి వృద్ధులు నన్ను మన్నించి కమల నేత్రుని చరిత్ర చెప్పమని అడగడం చెప్పే భాగ్యం నాకు లభించడం నా అదృష్టం నా జన్మ సఫలమైంది శ్రీహరి కథలు చెప్పేవాడు కులహీనుడైనవాడు మఱు జన్మలో కులీనుడుగా జన్మిస్తాడు శ్రీహరి ప్రతిభా విశేషం ఏమని చెప్పను ?

ఆ మహామహుని గుణాలను వర్ణించడానికి నాలుక ఆడక బ్రహ్మాదులే ఆతణ్ణి అనంతు డన్నారు తనను అర్థించిన దేవతల నందఱిని త్రోసిపుచ్చి లక్ష్మి ఆతని పాదధూళికోసం అఱ్ఱులు చాచింది బ్రహ్మదేవుడు ఆతని పాద పద్మాలను కడిగి ఆ పవిత్ర జలాన్ని జనులందఱికీ యిచ్చాడు భగవంతుడనే శబ్దానికి లక్ష్యభూతు డతడొక్కడే మునీంద్రులు కూడా ఆతణ్ణి ఆశ్రయించి నిస్సంగులై పరమహంసలై పునా రహితమైన మోక్షాన్ని పొందుతారు పక్షి క్రమక్రమంగా ఆకాశంలో ఎంత దూరమైనా ఎగురుగాక దాని అంతాన్ని చూడగలదా ? అలాగే శ్రీహరి మహిమను ఎవ్వరైనా ఏదో కొంత గ్రహించగలరే కాని సర్వమూ నాకు తెలుసుననే వాడు లేడు కనుక నా మనస్సుకు తోచినంతవఱకు చెబుతాను వినండి

# పరీక్షన్మహారాజు శృంగి వలన శాపం పొందుట

ఒకనాడు పరీక్షన్నరేంద్రుడు ధనుష్పాణియై అరణ్యానికి వేటాడడానికి వెళ్ళాడు. గోతులు త్రవ్వి వలలు పన్ని క్రూరమృగాలెన్నింటినో వధించాడు. అతని మృగయా చాతురి[1]కి కొమ్ములు తిరిగిన వేటగాండ్రు కూడా నివ్వెఱపోయారు. మృగధరుడైన[2] శివుని దగ్గర వుండే మృగం[3] ఒక్కటి తప్ప అతని చేతికి చిక్కని వన్యమృగం ఏదీ లేదు ఏ కారణంచేతనైనా ఆ శివుని చేతిలోని లేడి అక్కడకు వచ్చివుంటే దానికి కూడా అదే గతి పట్టేది

నరేంద్రుడలా అడవి జంతువులను తరిమి తరిమి వధించేసరికి అలసిపోయాడు ఆకలిగొన్నాడు దప్పికతో విలవిల్లాడాడు ఎక్కడైనా జలాశయం ఉందేమో అని వెదక్కుంటూ పోయి ఒక తపోవనంలో ప్రవేశించాడు

అక్కడొక మునీంద్రుడు తపోనిష్ఠలో నిశ్చలంగా కూర్చున్నాడు అయినా అతనిలో జడత్వం లేదు ప్రాణాలకు మనస్సుకు బుద్ధికి పంచేంద్రియాలకు వెలుపలవుండే ప్రకృతితో అతనికేమీ సంబంధం వున్నట్టు లేదు అవస్థాత్రయాన్ని[4] దాటి పరమపదంచేరి బ్రహ్మీభూతుడై వున్నాడు నిడుపాటి జడలు అటూ ఇటూ చెదరి వున్నాయి లేడి చర్మం ధరించాడు

పరీక్షిత్తు ఆ మహర్షిని సమీపించాడు దప్పికతో దవడలు ఎండిపోయాయి నోటిలో తడిలేదు మాట పెగలడంలేదు మందస్వరంతో నీళ్ళు ఇమ్మని అడిగాడు కాని సమాధి నిష్ఠలోవున్న ఆ ముని పలుకలేదు రాజు ఆగ్రహించాడు - ఔరా ఈ బ్రాహ్మణుని కింత గర్వమా? మాట్లాడకపోతేపోనీ చేతి సైగలతోనైనా నాకు సమాధానం చెప్పడే దాహంతో ప్రాణాలు పోతున్నాయంటే నీళ్ళివ్వడే? రాజేంద్రుడని నన్ను అణుమాత్రం కూడా మన్నించడే? ఇతని తపః ప్రభావం అంత ముదిరి పోయిందన్న మాట

దాహం తీర్చమంటే చల్లని నీరివ్వటం ఎంతటి వానికైనా అనివార్యమైన ధర్మం కాని యీ ముని ఆ మాత్రపు ధర్మాన్ని కూడా పాటించడే? - అని మృగయా పరిశ్రాంతుడూ పిపాసార్తితుడూ[5] అయిన నరేంద్రుడు ఆగ్రహించి కోపవశుడై తన వింటి కొప్పుకో ఒక మృత సర్పాన్ని తెచ్చి ఆ ముని భుజాల మీద వేశాడు అలా వ్యర్థమైన రోషంతో పరీక్షిత్తు మునిని అవమానించి హస్తి నగరానికి వెళ్ళిపోయాడు

---

1 వేటాడుటలో నైపుణ్యత   2 శివుడు   3 లేడి

4 జాగ్రదవస్థ నిద్రావస్థ సుషుప్త్యవస్థ.

5 దప్పికగొన్నవాడు.

ఆ మహర్షి పేరు శమీకుడు ఆ దగ్గరలో వున్న ముని కుమారులు ఆ నరేంద్రుని అకృత్యం చూచి ఆ విషయం ఆ మునీంద్రుని కొడుకు శృంగి చెవిని వేశారు శృంగి కోపోద్దీపితుడై యిలా అన్నాడు - ఔరా ఆ రాచవానికి ఎంత పొగరు? నా తండ్రి మెడలో మృత సర్పాన్ని వేశాడా? నా తండ్రి ఎవ్వరిని దూషించడు ఆశ్రమ వాసులుగాని పరులను కన్నెత్తి చూడడు కందమూలాలు మాత్రమే భుజిస్తాడు అంతర్దృష్టితో ఎప్పుడూ సమాధి చిత్తుడై వుంటాడు శ్రీహరిని విడిచి పర ప్రపంచాన్ని చూడడు అలాంటి మహనీయుడు ఆయన

మేము హిరణ్య దానాలు పుచ్చుకొనడానికి వెళ్ళం ధనాన్ని ఆశించం వంచించి ఎవ్వరినీ వ్యర్థంగా దీవించం అరణ్యాల్లో తపోనిష్ఠలో కాలం గడుపుతూ వుంటాం రాజులు ధరాధిపత్యం వహించి పుడమి జనులందరూ కైవారాలు చేస్తూండగా నా అంతటివాడు లేడని అహంకరిస్తూ మహా భోగాలు అనుభవిస్తే అనుభవించవచ్చు అంతేకాని అడవుల్లో నానా బాధలు పడుతూ తపః క్లేశంతో కృశించిన బ్రహ్మ మునీంద్రుని భుజంపై చచ్చిన పామును వేస్తాడా?

శ్రీహరి తన అవతారం చాలించి ఈ లోకాన్ని విడిచి వెళ్ళేసరికి ఇక తమను ఎవ్వరూ దండించేవాడు లేరనా దుష్టులైన రాజాధములు ఇలా సాధు హింస చెయ్యడం? - అని ముని కుమారుడు శృంగి కోపం పట్టలేకపోయాడు తోడి బాలురను వెంటబెట్టుకొని కౌశికీ నదీ తీరానికి వెళ్ళి జలం ఉప స్పృశించి - మృత సర్పాన్ని తెచ్చి మౌనియైన నా తండ్రి మెడలో వేసిన దుర్మదుడగు రాజు నేటికి ఏడవనాడు తక్షక విషాగ్నికి మరణిస్తాడు హరిహరాదులు కూడా అతణ్ణి ఆదుకోలేరు అని శపించి నిజాశ్రమానికి వెళ్ళాడు

తండ్రి మెడలో మృతోరగం వ్రేళ్ళాడుతోంది చూచాడు ఆయనను నమస్కరించి అన్నాడు తండ్రీ నీ మెడలో ఇలా చచ్చిన పామును వేసిన ఆ రాజాధముణ్ణి ఏం చెయ్యాలి? మద గర్వితులైన రాజులకు దయా దాక్షిణ్యాలు వుండవు —

అని తండ్రి మెడలోని పామును తీసివేయాలనుకొన్నాడు కాని పసివాడు కనుక అది ఇంకా బ్రతికున్నదేమో? కాటేస్తుందేమో? అని భయపడ్డాడు శోకిస్తూ ఆ సమీపంలోవున్న తాపసులను సహాయానికి రమ్మని బిగ్గరగా కేకలు పెట్టాడు ఆ కేకలకు శమీక మహర్షి సచేతను డయ్యాడు తన మూపున వ్రేలాడుతూన్న సర్పాన్ని చూచాడు దాన్ని తీసి పారవైచి శృంగి నుద్దేశించి - మనం ఎవ్వరికి ఏ కీడూ చెయ్యమే? మనకు అందరూ సమానులేనే? ఈ సర్పం నా మెడలోకి ఎలా వచ్చింది? నీ వెందుకలా దుఃఖిస్తున్నావు? - అని అడిగే సరికి రాజేంద్రుడు రావడం ఆగ్రహించి అతడు పామును అతని మెడలో వెయ్యడం తాను శపించడం వివరంగా వినిపించాడు.

కొడుకు చెప్పింది విని ముని పరితాపం చెంది అన్నాడు. 'ఔరా! ఎంత పని జరిగిందీ? తక్షక విషాగ్నికి పాలుకమ్మన్ని నీ వాతని శపించడానికి ఇదేమంత ఘోరకృత్యమని? అందులో అతడు రాజేంద్రు డయ్యే. అతడు సామాన్యు డనుకున్నావా? తల్లి కడుపులో దగ్ధుడై శ్రీహరి కరుణవలన బ్రతికిన పుణ్యమూర్తి. బాహుపరాక్రమాలతో ప్రజాపాలనం చేస్తున్నాడు. చిట్టితనంతో ఇలా అతన్ని తిట్టడం తగునా?

శ్రీకృష్ణుని నిర్యాణానంతరం ఈ భూమండలంలోని ప్రజలు కాపరి లేని గొర్రెల్లాగా వున్నారు. కంటకులైన చోరులు స్వైర విహారం చేస్తున్నారు. అలాంటప్పుడు రాజేంద్రుడు ప్రజలకు ఏ బాధా రానియకుండా సుబుద్ధితో పరిపాలిస్తున్నాడు. ఏ కారణం చేతనో ఈపాటి ద్రోహంచేస్తే దాని కంతటి ఘోరశాపమిస్తావా?

నీ కారణంచేత మన ముని కులానికే పాపం సంప్రాప్తించింది. రాజు నశిస్తే బలవంతులు బలహీనులను బ్రతకనివ్వరు జారులు, చోరులు హద్దుమీరి చరిస్తారు. ప్రజల్లో అన్యోన్య కలహాలు అంకురిస్తాయి. వైదికములైన వర్ణాశ్రమ ధర్మాలు అడుగంటుతాయి. ఎప్పుడు ధర్మం నశిస్తుందో అపుడు లోకులు కేవలం అర్థానికి కామానికి దాసులైపోతారు. కోతులూ, కుక్కల్లాగా ప్రజల్లోకూడా వర్ణ సాంకర్యం ఏర్పడుతుంది.

అశ్వమేధయాగంచేసి మహా యశస్సు గడించిన నరేంద్రుడు దప్పికగొని వచ్చి అర్థిస్తే ఆయన్ను సత్కరించి ఆయన కోర్కె తీర్చకపోగా ఇంత చిన్న తప్పిదానికి అంత ఘోర శాపం ఇస్తావా? బిడ్డా! ఎంత అధర్మం చేశావు? తిట్టినా కొట్టినా పరమ భాగవతులు సహిస్తారు. అంతేకాని తిరిగి అపకారం చెయ్యరు. లేకపోతే ఆ నరేంద్రుడు నిన్ను విడిచిపెట్టే వాడేనా? సుఖదుఃఖాలు ఆత్మకు అంటవు. ఆ విషయం తెలిసిన సాధువులు పరుల వలన కీడు కలిగినా చలించరు. కృష్ణా! పరమేశ్వరా! అజ్ఞాన వశంచేత నా కొడుకు ఘోరకృత్యం చేశాడు. క్షమించు' అని శమీకుడు ఎంతో సంతాపం చెందాడు.

శమీకుడు పంపిన ఒక ముని కుమారునివలన పరీక్షిత్తు శృంగి శాపం విని కామక్రోధాది విషయాసక్తుడైన తనకు ఈ శాపం విరక్తిహేతు వవుతుందని ఒక విధంగా ఆనందించి హస్తినగరానికి వెళ్ళి యిలా వితర్కించడం మొదలు పెట్టాడు.

## పరీక్షిత్తుని ప్రాయోపవేశం

ఔరా! దైవయోగం దాటటం ఎవ్వరి తరమూకాదు. నేను వేటకు వెళ్ళట మేమిటి? మునీంద్రుడు సమాధి నిష్ఠలో వుండగా ఆయన మెడలో మృత సర్పాన్ని

చెయ్యాల్సిన దేమిటి? ఎంతటి పాపానికి పాల్పడ్డాను? నాకు కీడు తప్పదు. తక్షక విషాగ్ని కీలలకు నా ప్రాణం పోతే పోయింది. అంతేకాని నా యీ రాజ్యం సకల జనం భోగభాగ్యాలు పోతే పోయాయి. మెరుపు తీగలా చంచలమైన ఈ జీవితం శాశ్వతమా? అలాంటప్పుడు నేనా ముని కుమారుని తిరిగి శపించటం అవివేకం కదా

రాజ్యాహంకారంతో నేను సిరికోసం వెళ్ళి ముసలి ముని మెడలో చచ్చిన పామును వేస్తే ఆ ముని కొడుకు నన్ను శపించడా మరి? గోవులకు బ్రాహ్మణులకు, దేవతలకు కీడుచేస్తే పాపం కాదా? దాన్ని ఎవరు వారించగలరు? అని విరక్తించి తక్షక విషాగ్ని జ్వాలకు తన మరణ మెలాగూ తప్పదని నిశ్చయించుకొన్నాడు. భోగాలు అశాశ్వతాలని భావించాడు. రాజ్యం విడిచిపెట్టి ప్రాయోపవేశం చెయ్యటానికి నిశ్చయించుకొన్నాడు. శ్రీహరి పాదపద్మాల కంటెనూ పవిత్రమైనదీ సకలలోక సౌభాగ్యానికి హేతుభూతమైనదీ కలిదోషాన్ని పరిహరించేదీ అయిన ఆకాశగంగ దగ్గరకు వెళ్ళి ఆ దివ్య నదీ తీరాన ఏ విధమైన తత్తరపాటూ లేకుండా నిశ్చలమైన మనస్సుతో శ్రీహరిని ధ్యానిస్తూ మౌనియై ప్రాయోపవిష్టు డయ్యాడు

ఈ వార్త విని పవిత్ర క్షేత్రాలను కూడా పవిత్రం చెయ్యగల దేవర్షులు బ్రహ్మర్షులు రాజర్షులు, నానా గోత్ర సంజాతులైన అనేక ఋషులు శిష్యులతోనూ ప్రశిష్యులతోనూ అక్కడకు వచ్చేసరికి పరీక్షిన్మహారాజు వారికి మొక్కి యథావిధిని పూజించి ప్రాంజలియై యిలా అన్నాడు—

'మహాత్ములారా చచ్చిన పామును తెచ్చి మదోన్మత్తుడనై ముని మూర్ధన్యుని మూపున వేసిన పాపిని నేను. పాపన్యాసాన్ని దహించి వేయగల అగ్ని వంటివారు మీరు. నాకు పాపవిముక్తి ఎలా కలుగుతుందో చెప్పండి. భూదేవుల పాదధూళి సకల దురితాల ప్రక్షాళనగా చేస్తుంది. నేను మీ పాదాలకు నమస్కరించటంచేత మీ చరణ రేణువు నా శరీరానికి సోకి నా పాపాన్ని తుడిచివేసింది. కృతార్థుడ నయ్యాను. ఏమి చేస్తే నాకు మోక్షం లభిస్తుందో చెప్పండి.

భయంకరమైన ఈ సంసార బంధంలోంచి నేను విసిగిపోయాను. ఈ శరీరాన్ని త్యజించటం ఎలాగా అని ఆలోచిస్తున్న నాకు తక్షక విషాగ్ని మోక్ష కారణమైంది. అహంకారంతో మునిని తేలికచేసిన నాకు శ్రీహరి బ్రాహ్మణ శాప వ్యాజం[1]తో మోక్షానికి దారి కల్పించాడు

తక్షక విషాగ్నికి నా శరీరాన్ని ఆహుతి చెయ్యటానికి నేనేమాత్రమూ సందేహించను. ఈశ్వర సంకల్పం ఏ విధంగానూ మారదు కదా. కాని నా భవిష్య

1 మిష

# శుకమహర్షి రాక

అతడు వ్యాస మహర్షి కొడుకు అవధూత అనుక్షణమూ పరబ్రహ్మాన్ని చూస్తూ సొక్కిపోతూవుంటాడు. అతనికి బాహ్య దృష్టి లేనేలేదు తామర పువ్వు మీద తుమ్మెదల్లాగా అతని ముఖంమీద నీలి కుంతలాలు చలిస్తూ వుంటాయి అతడు మాయాతీతుడు దిగంబరుడు అతనికి ఏ సంగమూ లేదని దాటు భూతాలా అన్నట్లు పిల్లలు అతని వెంటబడి పరిహసిస్తూ వుంటారు అతని ప్రతి అవయవమూ మహనీయంగా గోచరిస్తుంది

తా నడిగింది ఇవ్వలేదని ఎవరికీ ఎగ్గులాడడు ఆస లతనికి కోరికలంటూ ఏమీలేవు అతను ఎవరితోనూ కలియడు దైవచింతనం తప్పితే అన్యమేమీ యెఱుగడు ఇంతకూ అతని వయస్సు పదహారేండ్లు ఆతని వయస్సు రూపం గమనం గుణం విలాసం చూచి ముక్తికాంతయే మోహించిందంటే ఇతర కాంతల సంగతి చెప్పడం దేనికి ?

అతడు వాస్తవానికి వెట్టి కాదు విజ్ఞానమూర్తి బ్రహ్మ భావంతో తిరుగుతూ వుంటాడు. కాని స్త్రీలూ పిల్లలు వెట్టితనంతో అతణ్ణి ఒక వెట్టివానినిగా భావించి అతని వెంట పడతారు ఇలా వ్యాసనందనుడైన శుకమహర్షి అక్కడకు వచ్చేసరికి అతని మహిమ తెలిసినవారు కాబట్టి ఋషు లందఱు లేచి అతనికి ఎదురు వెళ్ళారు

పరీక్షిన్నరేంద్రుడున్నూ ఆ యోగీంద్రునకు పాదాక్రాంతుడై అతిథి పూజ చేశాడు గ్రహ నక్షత్ర తారకా మధ్యమందు వెలుగొందు ఇందు బింబంలాగా సకల ఋషి మండలం మధ్య కూర్చుండి వెలుగులు చిమ్ముతూన్న శుక యోగీంద్రునకు నరేంద్రుడు కేలుమోడ్చి—

మహాత్మా ఈ నాటికి నా భాగ్యం పండింది పవిత్రమూర్తివి పుణ్య కీర్తివి వివేక భూషణుడవు దివ్య భూషణుడవు. నా అదృష్టకొలదీ వచ్చావు అవధూత శిరోమణీ నా జన్మ సార్థకమైంది నీ పేరు స్మరిస్తే చాలు పాపాలు నశిస్తాయి. ఇక నిన్ను దర్శించి నీ పాదాలు కడిగి నీ మాటలు వింటే మోక్షం కరతలామలకం[1] కావడంలో ఆశ్చర్య మేముంది ?

యోగీంద్రా! శ్రీహరిచే అసురులు అణగిపోయినట్లు నీ పద స్పర్శచే పాపాలు పటాపంచలై పోతాయి మేనమఱదియై యే దేవదేవుడు మా తాతలను కంటికి రెప్పలాగా కాపాడి చతుస్సముద్ర ముద్రితమైన భూమండలానికి పట్టం

---

1 చేతిలోని ఉసిరికాయలాగా స్పష్టంగా కనబడడం

కట్టాడో ఆ ఈశ్వరుడే నాకు దిక్కు నన్ను ఆపన్నముద్రంనుండి గట్టెక్కించ గలవా రితరు లెవ్వరూ లేరు నేనా మహానుభావునే ప్రార్థిస్తూ వుంటాను

మహర్షి నీ మార్గం ఎవ్వరికీ తెలియదు నీ దర్శనం వృథాకాదు కోరిన కోర్కెలను సిద్ధింపజేస్తుంది నేడో రేపో శరీర త్యాగం చెయ్యనున్న నాకు ఏం చింతిస్తే ఏది జపిస్తే ఏది వింటే ఏది సేవిస్తే పునర్జన్మ రహితమైన పుణ్య పదవి కలుగుతుంది? నీవు మహా యోగివి నిన్ను ఉండమని అర్థించడానికి వీలు లేదు ఆవుసు పిదికిన యంత సేపు కూడా నీవు ఒక చోట నిలువవు కనుక తండ్రీ నాకు ముక్తిమార్గం ఉపదేశించు అని అర్థించాడు



# మహా భాగవతం

## ద్వితీయ స్కంధం

పరీక్షిన్నరేంద్రు డడిగిన ప్రశ్నకు శుకమహర్షి యిలా చెప్పడం మొదలు పెట్టాడు రాజేంద్రా నీవు ఆత్మవేత్తలు మెచ్చదగిన ప్రశ్న అడిగావు. వినదగిన ఉత్తమ విషయాలు ఎన్నో వున్నాయి కాని నీ వడిగినది ఉత్తమోత్తమం చెబుతాను విను

గృహమేధులు ఆత్మతత్వం అణుమాత్రం కూడా తెలిసికోవాలని యత్నించరు పగలంతా కుటుంబ పోషణకోసం నానా యాతనలు పడుతూ గడుపుతారు రాత్రిళ్ళు విషయ భోగాలతోను నిద్రతోనూ గడిపేస్తారు ఇక వారికి ఆత్మ విచారం చేసేందుకు తీరిక యెక్కడ? భౌతికమైన సకలమూ శాశ్వతం అను కుంటారు చివరకు ఇట్టే కన్నుమూస్తారు వారి జీవితం నిరర్థకం

కనుక మోక్షార్థి యైనవాడు సర్వాత్మకుడైన శ్రీహరిని నిరంతరం భావించాలి. సేవించాలి ఆ దేవదేవుని కథలు చెవులారా వినాలి మానవులకు భక్తి యోగం, ధర్మనిష్ఠ అవసరం మానవజన్మ ఎత్తినందుకు ఫలం నిరంతర హరి చింతనం. అంత్య కాలంలో మానవుని ఉద్ధరించేది అదొక్కడే అంచేతనే నిర్మల మతులైన మహర్షులు కూడా విధి నిషేధాలను త్రోసిపుచ్చి నిర్గుణ బ్రహ్మను ఉపాసిస్తారు నిరంతరం శ్రీహరిని చింతిస్తారు.

ద్వాపర యుగంలో మా తండ్రి వ్యాస మహర్షి విరచించిన బ్రహ్మ సమ్మితమైన భాగవతం పఠించాను అందులో పరమ భాగవతోత్తముల గాథ లెన్నో వున్నాయి ఆ గాథలు బ్రహ్మ తత్పరుడనైన నా మనస్సును ఎంతో ఆకర్షించాయి నీవు హరిభక్తుడవు కనుక నీకా భాగవత విశేషాలు చెపుతాను విను. దాని వలన విష్ణు సేవాబుద్ధి ప్రబల మౌతుంది మోక్షార్థికి మోక్షం సిద్ధిస్తుంది భవభయం వుండదు గృహస్థులకే కాదు యోగులకు కూడ శ్రీహరి నామ చింతనంకంటె ఉత్తమమైన వ్రతంలేదు సంవత్సరాల తరబడి సంసార లంపటంలో పడి హరిని చింతించని వెఱ్ఱివానికి ముక్తి యెన్నడూ లభించదు

వానికి జన్మబంధం ఎప్పుడూ తప్పదు ముహూర్తమాత్రం శ్రీహరిని స్మరిస్తే చాలు మోక్షం కరతలామలకం అవుతుంది

పూర్వం ఖట్వాంగు డనే రాజున్నాడు అతడు మహావీరుడు ఏడు దీవులనూ ఏకచక్రాధిపతిగా పాలించాడు దేవదానవులకు యుద్ధం సంభవించినపుడెల్లా అతడు దేవతల కోర్కెపై భూలోకంనుండి స్వర్లోకం వెళ్ళి వారికి బాసటగావుండి రాక్షసులను వధించేవాడు ఒక పర్యాయం దేవతలు అతని సహాయానికి మెచ్చి యేదైనా వరం అడుగు ఇస్తామన్నారు అపు డా నరేంద్రుడు నా జీవితకాలం ఎంతో చెప్పండి అన్నాడు ఇంకా ఒక ముహూర్తకాలం (రెండు ఘడియలు) మాత్రం వుందన్నారు

అది విని అతడు గగనమార్గాన భూలోకానికి వచ్చాడు కాంతా జనాన్ని బంధు మిత్రులను సకల పరివారాన్ని విసర్జించాడు భౌతిక భోగాలన్ని విడిచి పెట్టాడు వైరాగ్యం వహించి నిశ్చలమైన మనస్సుతో ఆ రెండు ఘడియలు శ్రీహరి భక్తిలో మునిగి కైవల్యపదం చేరాడు రాజేంద్రా నీ కింకా ఏడు రోజులు ఆయువుంది అంతవరకు నీవు మోక్షహేతువులైన కార్యాలు చేయవచ్చు

అంత్యకాలం వచ్చిందే అని దుఃఖించకు అన్ని సంగాలు విడిచిపెట్టు మానవుడు సంసార వృక్షాన్ని నిష్కామ మనెడి ఖడ్గంతో నరికివెయ్యాలి ఇల్లు విడిచి పుణ్యతీర్థంలో స్నానంచేసి ప్రశాంతమైన ఒక శుచి ప్రదేశంలో దర్భాసనం కల్పించుకుని ఆసీనుడుకావాలి బ్రహ్మబీజమైన ప్రణవాన్ని (ఓంకారాన్ని) స్మరించాలి శ్వాసను బంధించాలి బుద్ధిని సారథిగా మనస్సును పగ్గాయిగా చేసికొని విషయాలవెంట పరువులెత్తే ఇంద్రియాలనే గుర్రాలను బిగబట్టి స్వాధీనం చేసికోవాలి

కర్మకు వశంగతమై అటు ఇటు చలించెడి మనస్సును బుద్ధిబలంతో నిరోధించాలి భగవదారాధనతో దాన్ని కట్టివెయ్యాలి అలా నిశ్చలమైన మనస్సులో శ్రీహరి మూర్తిని భావించి ధ్యానించాలి రజస్తమోగుణాలవలన చిత్తం మలిన మవుతుంది ధారణా నియమంతో ఆ మాలిన్యాన్ని తుడిచివెయ్యాలి అపుడు మానవునకు విష్ణుపదం సులభసాధ్యమౌతుంది ధారణా నియమంవలన భక్తి యోగం సిద్ధిస్తుంది- అని శుకమహర్షి అనేసరికి-

ధారణ యెలా నిలుస్తుంది? అది యెలా వుంటుంది? అసలు ధారణ అంటే యేమిటి? ధారణ పురుషుని మనో మాలిన్యాన్ని ఏ రీతిగా నిర్మూలిస్తుంది? అని పరీక్షిత్తు ప్రశ్నించాడు అపుడు శుకయోగి ఇలా చెప్పడం మొదలుపెట్టాడు

రాజేంద్రా శ్వాసను నిరోధించి సర్వసంగాలు విడిచిపెట్టి ఇంద్రియ

గర్వం అణచివైచి శ్రీహరి అనంతరూపంలో చిత్తాన్ని చేర్చాలి ధారణ అంటే అదీ వివరంగా చెబుతాను- విను

భగవంతుడైన శ్రీహరియొక్క విరాడ్రూపంలో త్రికాలాత్మకమైన విశ్వం దృశ్యమానమౌతుంది భూమి నీరు తేజస్సు గాలి గగనం అహంకారం మహత్తు- ఈ యేడు ఆవరణాలచేత ఆవృతమైన మహాండకోశమను శరీరంలో ధారణచేత ఆశ్రయింపదగిన విరాట్పురుషుడు ప్రకాశిస్తూ వుంటాడు

ఆ మహాత్మునకు పాదమూలం (అరికాళ్ళు) పాతాళం కాలి మడమలు పాదాల పైభాగం రసాతలం. చీలమండలు మహాతలం కాలిపిక్కలు తలాతలం. మోకాళ్ళు సుతలం తొడలు వితలాతలాలు పిరుదు భూమి నాభి రంధ్రం ఆకాశం రొమ్ము నక్షత్రలోకం మెడ మహర్లోకం ముఖం జనలోకం నుదురు తపోలోకం శిరస్సు సత్యలోకం బాహువులు ఇంద్రాదులు చెవులు దిశలు శ్రవణేంద్రియం శబ్దం ముక్కుపుటాలు అశ్వినీదేవతలు ఘ్రాణేంద్రియం గంధం. ముఖం అగ్ని నేత్రాలు అంతరిక్షం నేత్రేంద్రియం సూర్యుడు రేయింబవళ్ళు కనురెప్పలు. కనుబొమలు బ్రహ్మపదం దౌడలు జలం జిహ్వేంద్రియం రస

పలుకులు వేదాలు కోరలు యముడు దంతాలు పుత్రాది స్నేహకళలు నవ్వులు జనులను పిచ్చియెత్తించెడి మాయావిశేషం కడగంటి చూపులు దురంతమైన సృష్టిజాలం పెదవులు వ్రీడా (సిగ్గు) లోభాలు స్తనాలు ధర్మం. వెన్ను అధర్మమార్గం గుహ్యావయం ప్రజాపతి వృషణాలు మిత్రావరుణులు కడుపు సముద్రాలు. ఎముకలు పర్వతాలు నాడులు నదులు. వెంట్రుకలు వృక్షాలు నిశ్వాసాలు వాయువులు వయస్సు నిరవధికమైనకాలం కర్మలు నానావిధ జంతువుల జీవిత విధానాలు శిరోజాలు మేఘాలు కట్టుబట్టలు సంధ్యలు. హృదయం ప్రధానం సర్వవికారాలకు మూలమైన మనస్సు చంద్రుడు చిత్తం మహత్తత్వం[1]

అహంకారం రుద్రుడు గోళ్ళు గుర్రాలు ఒంటెలు ఏనుగులు మొదలైన పశు మృగాదులు విచిత్రములైన శిల్పనైపుణ్యాలు పక్షులు బుద్ధి మనువు నివాసం పురుషుడు షడ్జాది స్వర విశేషాలు గంధర్వాప్సరలు స్మృతి ప్రస్తావ ప్రముఖులు వీర్యం దైత్య దానవ సమూహం

ఇదీ విరాట్పురుషుని స్వరూపం ఇంకా విను ఆ మహా విభునకు ముఖం బ్రాహ్మణులు భుజాలు క్షత్రియులు ఊరువులు వైశ్యులు పాదాలు శూద్రులు నామాలు నానావిధాలైన వసురుద్రాది దేవతాహ్వయాలు[2] ద్రవ్యాలు హవిర్భాగాలు కర్మలు యజ్ఞప్రయోగాలు అలాంటి సర్వమయుడైన పరమేశ్వరుని విగ్రహాన్ని మోక్షార్థియైనవాడు మనస్సులో సంధించుకోవాలి - అని ఇంకా ఇలా చెప్పటం మొదలుపెట్టాడు-

---

1 బుద్ధి తత్వం 2 దేవతల పేర్లు

ఈ విశ్వమంతా హరిమయం కనుక హరి విశ్వమయుడు హరిమయం కాని దేహిన్నీలేదు జీవుడు కలలో అనేక దేహాలు ధరించి ఇంద్రియాలద్వారా ఎన్నో విషయాలు చూస్తాడు కాని జాగ్రదవస్థలో తనను దాను గుర్తిస్తాడు అలాగే సర్వాంతరాత్మకుడైన పరమేశ్వరుడు అఖిల జీవుల హృదయాల్లో వుండి వారి బుద్ధి వ్యాపారాలను చూస్తూ వుంటాడు అంతే గాని వాటికి బద్ధుడుమాత్రం కాడు అతడు నిత్యుడు ఆనందమయమూర్తి విజ్ఞానఘని అలాంటి దేవదేవుని సేవించాలిగాని అన్యులను సేవిస్తే కైవల్యం ప్రాప్తించదు సంసారబంధం విడి పోనూ పోదు

బ్రహ్మ అంతటివాడు అనేక సంవత్సరాలు సృష్టి చెయ్యలేక నానా అవస్థలు పడ్డాడు చివరకు శ్రీహరిని ప్రార్థించేసరికి అతనికి జ్ఞానోదయం అయింది. బుద్ధి వికసించింది అపుడు ప్రాచీలోకాలను సృష్టించగలిగాడు

మూఢుడు శబ్దమయమైన వేదాల్లో చెప్పబడిన కర్మలయొక్క ఫలాన్ని దృష్టిలో పెట్టుకొని కామ్యబుద్ధితో ఆ కర్మలను ఆచరించి నిరర్థకాలైన స్వర్గాది సుఖాలను కాంక్షిస్తాడు జాగ్రదవస్థలో మాయావశంచేత భ్రాంతుడై విషయ వాసనలు అనుభవించి నిద్రావస్థలో వాటినే కలలుకంటూ పరిభ్రమిస్తూ వుంటాడు అంతేకాని అవ్యయమైన సుఖాన్ని పొందలేడు అందేత విద్వాంసుడైనవాడు దేహ ధారణకు ఎంత అవసరమో అంతటి భోగాన్ని మాత్రమే ఆకాంక్షిస్తాడు. మితి మీరిన సంసార సుఖాలకు అర్రులు చాచడు.

శయనించేందుకు భూమిలేదూ? దూది పరుపులు కావాలా? భుజించడానికి సహజమైన దోసిల్లు లేవూ? వెండి బంగారుపాత్రలు కావాలా? ధరించేందుకు నార చీరలు లేని చర్మాలూ చాలవూ? చీనాంబరాలు ఎందుకూ? నివసించడానికి కొండ గుహలులేవూ? పెద్ద పెద్ద మేడలు దేనికి? వృక్షాలు ఫలరసాన్ని పుష్కలంగా కురియవూ? నదులు మధురజలాన్ని ఇవ్వవూ? పుణ్యస్త్రీలు భిక్ష పెట్టరూ? వీటి కోసం తాపసులు ధన మదాంధులను ఆశ్రయించడం వారికి అడుగులకు మడుగు లొత్తడం అవ్యక్తంకాదూ?

దీనజన రక్షకుడైన శ్రీహరి వుండగా ఆత్మజ్ఞానం గలవాడు రక్షింపు మని అసమర్థు నెవనినో ఆశ్రయించడం దేనికి? కనుక స్వతస్సిద్ధుడూ, నిత్య సత్యుడూ అయిన భగవంతుని సేవిస్తే సంసారహేతువైన అజ్ఞానం నశిస్తుంది బుద్ధిమంతుడు చేయదగినపని అది అలా కాక ఇంద్రియ సుఖాలు మరిగి జీవి తాన్ని వ్యర్థంగా గడిపేవాణ్ణి యమకింకరులు వావగొట్టి యమసదనానికి ముందుం డేటి వైతరణీ వహ్ని జ్వాలలో పడవేస్తారు అక్కడా మంటల్లో కాలి బూడిదై పోతాడు అంతేనా? యమభటులు అతనిని ఇంకా ఎన్నోవిధాల బాధిస్తారు గదలతో బాదుతారు కత్తులతో శరీరాన్ని ముక్కలు ముక్కలుగా నరికివేస్తారు.

శ్రీహరిని సేవించనివారు కర్మబద్ధులై అలా యమద్వార సమీపంలోవున్న వైతరణిలో భగభగ మండుతూన్న అగ్నిలో దగ్ధులై ఘోషిస్తూవుంటే విజ్ఞానవంతులైన హరిభక్తులు మాయను జయించి నిరంతరం శ్రీహరిని చింతిస్తూ వుంటారు రాజేంద్రా ఆ దేవదేవు డెలా వుంటాడో చెపుతాను. శ్రద్ధగా విను

అంగుష్ఠ పరిమాణం[1]గల దేహంతో ప్రకాశిస్తూ వుంటాడు ఆయన చతుర్భుజుడు ఆ భుజాలు ఐరావతం దంతాల్లాగా వుంటాయి ఆయన చేతుల్లో పద్మం శంఖం, చక్రం గద మెరుస్తూ వుంటాయి ముఖం పున్నమినాటి చంద్రబింబంలా వుంటుంది సౌందర్యంలో కోటి మన్మథులుకూడా ఆయనకు సాటిరారు. ఆయన ముఖంలో సౌభాగ్యం వుట్టిపడుతూ వుంటుంది ప్రాభాత సూర్యుని తిరస్కరించెడి పద్మరాగమణులు పొదిగిన కిరీటం ధరిస్తాడు

వక్షస్థలమందు శ్రీవత్సం[2] మెడలో కౌస్తుభరత్నం మెరుస్తూ వుంటాయి హారాలు బాహుపురులు మొదలైన ఇంకా అనేక ఆభరణాలు ధరిస్తాడు. నుదుటి మీద నల్లని ముంగురులు వ్రేలాడుతూ వుంటాయి. చిరునవ్వులు వెన్నెలలను కురిపిస్తూ వుంటాయి కనుకొలకులలో కరుణారసం తొణికిసలాడుతూ వుంటుంది మహాయోగుల హృదయపీఠంపై అధివసించి వుంటాడు. నిరంతరానందమయుడైన ఆ పరమేశ్వరుని మనస్సులో ప్రతిష్ఠించుకొని ఆయన సకలావయవములను ధ్యానిస్తూ ఎంతకాలానికి పరిపూర్ణమైన నిశ్చలభక్తియోగం సిద్ధిస్తుందో అంతకాలమూ శ్రీహరి చింతాతత్పరులై వుండాలి - అని శుకయోగి పరీక్షిత్తునకు ఇంకా ఇలా చెప్పడం మొదలుపెట్టాడు-

నరేంద్రా ఇంకో రహస్యం విను శరీరత్యాగం చెయ్యాలని భావించే యోగి కాలదేశాలకోసం ఎదురు చూడడు ఆ కోరిక పుట్టిన వెంటనే భద్రాసనం మీద కూర్చుంటాడు మనో బలంతో శ్వాసను బంధిస్తాడు బుద్ధిబలంతో మనో వేగాన్ని అరికడతాడు బుద్ధిని క్షేత్రజ్ఞునితో (జీవునితో) సంయోగం చేస్తాడు క్షేత్రజ్ఞుని ఆత్మలో చేరుస్తాడు అనంతరం ఆత్మను బ్రహ్మలో లీనంచేసి ఏకం చేస్తాడు ప్రశాంతంగా సకల కర్మలు విసర్జించి శాశ్వతమైన సుఖంకోసం ఎదురు చూస్తూ వుంటాడు

దేనికైనా ఆ పరమాత్మ కొక్కనికే సామర్థ్యం వుంది అంతేకాని కాల వేగానికుగాని సత్వరజస్తమోగుణాలకుకాని అహంకారానికిగాని మహత్తత్వానికి గాని ఏ శక్తిన్నీలేదు. కనుక సత్పురుషులు దేహమందు ఆత్మభ్రాంతి వదిలి అన్య సంబంధాలు విసర్జించి శ్రీహరి పాదాలను మనస్సులో నిలుపుకుని వైష్ణవమైన పరమపదాన్ని తెలుసుకుంటారు ఈ రీతిగా యోగి జ్ఞానాగ్నిలో విషయ వాసనలను దహింపచేసి సర్వసంగాలను విడిచిపెడతాడు

---

1 బొటనవ్రేలియంత 2 శ్రీహరి రొమ్ము నందుండెడి మచ్చ

క్రమంగా అలా అన్ని కోర్కెలను విడిచిన పరమయోగి పాదమూలం మందున్న మూలాధార చక్రాన్ని అదిమిపెట్టి ప్రాణాన్ని బిగియపడతాడు అనంతరం ఆ ప్రాణ వాయువును అక్కడనుండి క్రమంగా నాభిస్థానానికి నాభి నుండి హృదయానికి ఎగబట్టి ఉరస్సీమ[1]లో లగ్నం చేస్తాడు తిరిగి దాన్ని ఆ స్థానంనుండి తాటమూలానికి[2] తరిమి ఆ పిమ్మట కనుబొమల నడిమి భాగానికి చేరుస్తాడు అపుడు కన్నులు చెవులు ముక్కు నోరు మూసివైచి ఒక అర్ధ ముహూర్తకాలం ఇంద్రియ సాంగత్యం వదలి భ్రూ మధ్యగతమైన[3] ప్రాణమును బ్రహ్మ రంధ్రం దగ్గరకు పోనిచ్చి దాన్ని చీల్చుకొని బ్రహ్మమందు కలిసి పోతాడు

దేహత్యాగ కాలంలో ఇంద్రియ సాంగత్యం విడువనివానికి బ్రహ్మత్వం సిద్ధించదు అతడు గుణ సముదాయ రూపమైన బ్రహ్మాండంలో ఖచరులు[4] సిద్ధులు తిరిగేదీ అణిమాది సకలైశ్వర్యాలతో తులతూగుతూ వుండేదీ అయిన పరమేష్ఠి పదం పొందుతాడు విద్య తపస్సు యోగం సమాధి శ్రీహరిసేవ- వీటిల్లో నిమగ్నులై పవనాంతర్గత సూక్ష్మశరీరులైన యోగులకు బ్రహ్మాండ బహిరంతరాళాలేగతి కర్మనిరతులకు ఆ సద్గతికూడా లభించదు

యోగియైనవాడు బ్రహ్మలోకానికి ఆకాశమార్గానపోతూ సుషుమ్నానాడి వెంట అగ్నిని అధిదేవతగా జేసికొని జ్యోతిర్మయమైన తేజంతో మలిన రహితుడై ఎక్కడా చిక్కువడకుండా తారామండలంపైన నుండేటి సూర్యమండలాన్ని, ధ్రువపదాన్ని క్రమక్రమంగా అతిక్రమించి హరి సంబంధమైన శింశుమారచక్రం చేరతాడు అక్కడినుండి ఏకాకియై పరమాణుభూతమైన సూక్ష్మశరీరంతో బ్రహ్మవిదులకు స్థానభూతమైన మహర్లోకంలో ప్రవేశిస్తాడు

అక్కడాతడూ మహాకల్పకాలం అనంతంతో క్రీడిస్తూ కల్పాంతంలో అనేక ముఖాలతో ప్రజ్వరిల్లెడి అగ్నికి దగ్ధమయ్యే ముల్లోకాలనూ చూచి ఆ దాహ భావం సహించలేక బ్రహ్మలోకానికి వెళ్ళిపోతాడు ఇక ఆ లోకంనుండి తిరిగి రాడు రాజేంద్రా ఆ బ్రహ్మలోకం ఎలా వుంటుందో సంక్షిప్తంగా చెప్తాను విను—

భూమిమీద పదునాలుగు మనువులూ పరిపాలించిన కాలం ఆ బ్రహ్మలోకంలో ఒక దినం క్రింద లెక్క మహనీయులైన సిద్ధుల విమానాలు సూర్యుని తేజాన్ని తిరస్కరిస్తూ అక్కడ నిరంతరం తిరుగుతూ వుంటాయి అక్కడ దుఃఖం ముసలితనం చావు భయం- ఏవీ వుండవు శ్రీహరి ధ్యానం చేయలేని వారి యేడ్పులు అక్కడకు విన్పిస్తూ వుంటాయి పరమపదాని చేర్చే యోగి

1 రొమ్ములో 2 దౌడల మొదటికి 3 కనుబొమల నడుమ నిలిచియున్న
4 ఆకాశమార్గాన సంచరించేవాడు

జనుల భాషణామృతం పొంగి పొరలుతూ ఎంతో శ్రవణపేయంగా వుంటుంది అలాంటి బ్రహ్మపదం పొందిన యోగి శాశ్వతంగా అక్కడే వుండిపోతాడు

మరో విశేషం ఏమంటే పుణ్యాతిశయంచేత బ్రహ్మపదం చేరినవారు మరో కల్పంలో వారు చేసిన పుణ్యముల తారతమ్యాన్నిబట్టి తగిన అధికారాన్ని పొందుతారు బ్రహ్మాది దేవతలను భజించి బ్రహ్మలోకం వెళ్ళినవారు బ్రహ్మ జీవిత కాలందాకా అక్కడ నివసించి ముక్తులవుతారు ఇక శ్రీహరి చరణ కమలాలను సేవించి బ్రహ్మలోకం చేరినవారు వారి యిష్టాన్ని అనుసరించి సంచరిస్తూ బ్రహ్మండాన్ని ఛేదించుకొని మహోన్నతమైన వైష్ణవపదాన్ని పొంది ప్రకాశిస్తూ వుంటారు

ఈశ్వరుని అధీనంలో ఉన్న ప్రకృతియొక్క అంశంవల్ల మహత్తత్వం ఏర్పడతుంది మహత్తత్వం యొక్క అంశంనుండి అహంకారం అహంకారాంశంలో శబ్దతన్మాత్రలు[1] ఉత్పన్నమౌతాయి

అలాగే శబ్దాంశంవల్ల ఆకాశం ఆకాశంయొక్క అంశం నుండి స్పర్శ స్పర్శనుండి వాయువు, వాయువువలన రూపం రూపంవల్ల తేజస్సు తేజస్సువలన రసం రసంవలన జలం జలాంశంవలన గంధం గంధంయొక్క అంశంనుండి భూమి ఏర్పడతాయి ఈ తత్త్వాలన్నింటి సమ్మేళనంవలన పదునాలుగు లోకాలకు ఆత్మయైన విరాట్స్వరూపం సముత్పన్నమౌతుంది

ఆ విరాడ్రూపానికి కోటి యోజనాల వైశాల్యంగల పృథ్వి తొలి ఆవరణం కొందరు దాని వైశాల్యం యాభై కోట్ల యోజనాలంటారు తొలి ఆవరణమైన పృథివిమీద జలం తేజస్సు వాయువు గగనం అహంకారం మహత్తు అనేవి ఆవరణాలు ఒకదానికంటె నొకటి పదిరెట్లు వైశాల్యం గలిగివుంటాయి పృథివితో గూడి ఈ ఆవరణాలు ఏడు

ఈ యేడింటిమీద ప్రకృతి ఆవరించి వుంటుంది దానితో బ్రహ్మండం మహా వ్యాపకం అవుతుంది అలాంటి బ్రహ్మండాన్ని ఛేదించుకొని విష్ణుపదానికి వెళ్ళే వానికి ఇక ఏ భయమున్నూ వుండదు అక్కడ క్రమంగా లింగదేహంతో పృథివీతత్వంలో ప్రవేశించి ఘ్రాణంతో గంధాన్ని జలతత్వంతో కూడి రసనేంద్రియంతో రసాన్ని తేజోరూప తత్వంలో విరాజిల్లి దర్శనంచేత రూపాన్ని వాయుతత్వంలో లీనమై శరీరంతో స్పర్శను గగనాత్మకత్వంతో శ్రవణంవల శబ్దాన్ని అతిక్రమించి, భూత సూక్ష్మేంద్రియ లయస్థానమైన అహంకార తత్వంలో ప్రవేశిస్తాడు అక్కడ మనోమయము దేవమయము అయిన సాత్వికాహంకార గమనంతో మహత్తత్వంలో ప్రవేశించి గుణత్రయాన్ని జయిస్తే పరమాత్మ తత్వంలో లీనమౌతాడు. ఆ ప్రధానాత్మ తత్వంలో లీనమయ్యాక దేహాన్ని

---

1 శబ్ద స్పర్శ రూప రస గంధములను తన్మాత్రలంటారు

ఉపాధి పరంపరావసానంలో ప్రకృతినీ విడిచిపెట్టి ఆనందమయుడై పరమాత్మ రూపమైన వాసుదేవ రూపంలో కలిసిపోతాడు — అని శుకుడు ఇంకా ఇలా అన్నాడు

రాజేంద్రా పరమ భాగవతులు విష్ణుపదం చేరడానికి సాధించే పద్ధతి ఇదీ ఆ దారిని యోగి పయనిస్తే ఎన్నటికీ ఇక తిరిగిరాడు సద్యోముక్తి యెలా వస్తుంది? క్రమక్రమంగా ముక్తి పొందాలంటే యేం చెయ్యాలి అని కదా నీ ప్రశ్న ఈ రెండు మార్గాలు కూడా వేదంలో వివరింపబడ్డాయి పూర్వం భగవంతుడైన వాసుదేవుడు ఈ రెండు పద్ధతులను బ్రహ్మకు చెప్పాడు సంసారంలో మునిగితేలడానికి తపస్సు యోగం మొదలైన మోక్షమార్గాలు ఎన్నో వున్నాయి వాటిలో భక్తిమార్గం కంటె సులభమైనది మరేదీ లేదు

## శుకుడు పరీక్షిత్తునకు భక్తిమార్గం ముఖ్యమని తెలుపుట

పూర్వం బ్రహ్మ మోక్షమార్గం తెలిసికోవాలనుకొని వేదాలను మూడుసార్లు సాకల్యంగా పరిశీలించాడు విమర్శించి చూచాడు ఇతర మార్గాలన్నీ నిరర్థకములనీ భక్తి ఒక్కటే మోక్ష సాధనమనీ భావించి భక్తిమార్గాన్ని నిర్ణయించుకొని ఆత్మాకారంలో నిర్వికారుడై జనార్దనుని సేవించాడు

అఖిల భూతాల్లోనూ ఈశ్వరుడు ఆత్మరూపంలో వుంటాడు ఆత్మస్వరూపుడైన ఆ ఈశ్వరుడు ఎల్లప్పుడూ బుద్ధి విశేషంచేత దృష్టిగోచరమౌతూ వుంటాడు ఆ దేవదేవుడు భక్తవత్సలుడు నిత్యమూ సేవింపదగ్గవాడు నమస్కరింపదగ్గవాడు ఆత్మరూపకుడైన ఆ శ్రీహరి కథామృతాన్ని ఆస్వాదించే ధన్యాత్ములు కుటిలమైనటువంటిన్నీ విషయవాసనలచే మలినమైనటువంటిన్నీ శరీరాన్ని విడిచిపెట్టి విష్ణుదేవుని పదాంబుజాల సన్నిధికి చేరడం నిశ్చయం మానవ జన్మం యెత్తిన తర్వాత మరణం అనివార్యం. అయినా మహాజ్ఞానులైనవారు చేయవలసిన విధానం చెపుతాను విను.

బ్రహ్మతేజం కాంక్షించేవాడు వేదాలకు అధిపతియైన బ్రహ్మదేవుని సేవించాలి ఇంద్రియ పాటవం కావాలనుకునేవాడు ఇంద్రుని సంతానం కోరేవాడు దక్షుడు మొదలైన ప్రజాపతులను భోజనార్థియైనవాడు అదితిని స్వర్గకాముకుడు ఆదిత్యులను రాజ్యకాంక్ష గలవాడు విశ్వదేవతలను దేశప్రజా సాధనలను కోరేవాడు సాధ్యులను[1] ఆరాధించాలి

అలాగే సిరికి దుర్గను తేజస్సునకు అగ్నిని ధనానికి వసువులను వీర్యానికి రుద్రులను, ఆయుష్షునకు అశ్వినీదేవతలను పుష్టికి భూమిని ప్రతిష్ఠకు

1 గణదేవతలు

లోకమాతలైన ఆకాశదేవతను, భూదేవతను సౌందర్యానికి గంధర్వులను కాంతా జనానికి అప్సరసయైన ఊర్వశిని సర్వాధిపత్యానికి బ్రహ్మను కీర్తికి విష్ణువును యజించాలి

ఆ విధంగానే విత్త సంచయం కాంక్షించేవాడు వరుణదేవుని విద్యాభిలాషి ఉమాధవుడైన ఈశ్వరుని దాంపత్యసుఖం అర్థించేవాడు ఉమాదేవిని ధర్మార్థ కామాలను కోరేవాడు శ్రీ మహావిష్ణువును సంతానార్థి పితృదేవతలను రక్షణ కాంక్షించేవాడు యక్షులను బలకాముకుడు మరుద్గణాలను రాజత్వం కోరేవాడు మనురూప దేవతలను శత్రుమరణకాంక్షి నైరృతి దిక్పాలకులకుడైన రాక్షసుని భోగకాముకుడు ఇంద్రుని ఆరాధించాలి

ఏ కోరికవున్నా లేకపోయినా తత్త్వ నిపుణుడైనవాడు తప్పక ముక్తిని కాంక్షించి తనలో వ్యాపించియున్న పరమపురుషుని నియమ నిష్ఠలతో సేవిస్తాడు రాజేంద్రా! వెయ్యి మాటలు దేనికి? అమరేంద్రాదులను సేవించినట్లుగా కమలాక్షుని సేవిస్తే మానవునకు జ్ఞానం వైరాగ్యం, మోక్షం- ఇట్టే లభిస్తాయి ఆ రమాధవుని కథామృత రసవాహినీ తరంగధ్వని ఎవనికి శ్రవణ పర్వంగా వుండదు? —

అని శుకయోగి పరీక్షిత్తునకు చెప్పా"డని సూతుడనేసరికి శౌనకుడన్నాడు- "మునీంద్రా శుకుని పలుకులువిని పరీక్షిన్నరేంద్రుడు ఇంకేమని అడిగాడు? శుక మహర్షి యేమని చెప్పాడూ? శ్రీహరి కథలేవైనా చెప్పాడా? ఆ కథలు నీవు మధురాతి మధురంగా చెపుతుంటే వినాలని మా చిత్తంలో కోర్కెలు కుప్పలు కుప్పలుగా ఉత్పన్నమౌతున్నాయి"- అని అర్థించేసరికి సూతుడు శౌనకునకు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు-

"మునీంద్రా పిల్లజుట్టు అల్లలాడుతూండగా తోడిపిల్లలతో ఆటలాడేది లేవయసులోనే పరీక్షిత్తు శ్రీహరి పాదాంబుజాలను సేవిస్తూ వుండేవాడు అంతటి భాగవతోత్తముడైన పాండవేయునకు శుకయోగి ఏం చెప్పాడో చెపుతాను విను

విష్ణు కథలు వింటూ కాలం గడిపే పుణ్యాత్ముని ఆయువుతప్ప మిగిలిన వారి ఆయువును ఉదయాస్తమయ వేళల్లో సూర్యుడు వంచించి హరిస్తూ వుంటాడు ఈ సంగతి తెలియక జీవితం శాశ్వత మనుకొని మూర్ఖుడు సంసార లంపటంలో పడి భౌతిక సుఖాలు అనుభవిస్తూ వుంటాడు. ఇంతలో ఆయువు తీరగా యమ కింకరులు వచ్చి కొడుతూ తన్నుతూ తీసుకొని వెళ్తుంటే అయ్యో పుణ్యం చేయనైతినే? పాపకృత్యాలతో జీవితాన్ని వ్యర్థంగా గడిపానే? అని దుఃఖిస్తాడు అలాంటి బ్రతుకు బ్రతికి దేనికి?

లతలతో పెనవైచుకొని అడవుల్లో చెట్లు ఆకాశం అంత ఎత్తు పెరగవూ? ఎందుకూ? గ్రామసీమల్లో పశువులు ఆహార మైథునాల్లో మునిగి కాలంగడపవూ?

ఏం ప్రయోజనం? తోలుతిత్తులు గాలిని పీలుస్తూ విడుస్తూ వుంటాయి దానివలన ఒరిగేదేముంది? పందులు కుక్కలు ఇంటింటా హేయమైన పనులకు పాల్పడి తిరుగుతూ వుంటాయి ఒంటెలు గాడిదెలు ఎంతెంత బరువులైనా మోస్తూ వుంటాయి ఎందుకూ ఆ బ్రతుకు? అలాగే పురుష పశువులుకూడా అడవుల్లో కాని గృహాలోకాని కేవలం ప్రాణాలమీది ఆశతో విషయ భోగాసక్తితో వుండే వారి బ్రదుకులుకూడా నిరర్థకంకాదూ?

విష్ణు కీర్తనలు వినని చెవులు చెవులుకావు- కొండ గుహలు శ్రీహరి కథలు పల్కని నాల్కలు నాల్కలుకావు- కప్పనాలుకలు శ్రీనాథుని చూడని కన్నులు కన్నులుకావు- నెమలియీకల కన్నులు కమలనేత్రుని పూజించని చేతులు చేతులుకావు- ప్రాణవిహీనమైన శవం చేతులు శ్రీహరి పాదపూజకు వినియోగించిన తులసి పరిమళాన్ని ఆఘ్రాణించని ముక్కు ముక్కుకాదు- పంది ముక్కు గరుడ గమనుని సేవించడానికి వెళ్ళని కాళ్ళు కాళ్ళుకావు- చెట్లవేళ్ళు

అలాగే శ్రీమన్నారాయణుని దివ్యనామాక్షరాలు చెవిని పడగానే కరగని మనస్సు మనస్సుకాదు గండశిల శ్రీహరి కథలు వినబడగానే పులకించని శరీరం శరీరంకాదు కటికమ్రోడు దేవదేవునకు మ్రొక్కని మూర్ధము ధరించిన కనక కిరీటం కిరీటంకాదు. కట్టెమోపు మాధవార్పితంకాని మానవుని సంపద సంపదకాదు- అడవిని కాసిన వెన్నెల శ్రీపతిని సేవించనివాడు గాలిలో కదలెడి శవంలాంటి వాడు విష్ణుపదాన్ని కాంచలేని వాని బ్రతుకు పసిడికాయిలోని ప్రాణి బ్రతుకు లాంటిది —

అని శుకయోగి చెప్పేసరికి పరీక్షిత్తు హృదయం స్పందించింది మనస్సు లోని మాలిన్యం తొలగిపోయింది వెంటనే దారసుతాదులను హితులను బాంధవులను రాజ్య సంపదలను- విడిచిపెట్టాడు కళ్ళు తెరిచాడు కమలనాభునిమీద మనస్సు నిలిపాడు.

అలా మృత్యు భయాన్ని విడిచిపెట్టి ధర్మార్థ కామాలను సన్యసించి శ్రీహరియందు చిత్తాన్ని విన్యసించి ఆ దేవదేవుని లీలా విశేషాలు తెలిసికోవాలనే కుతూహలంతో రాజేంద్రుడు శుకయోగీంద్రుని ఇలా అర్థించాడు

'భూసురేంద్రా సర్వాత్మకుడైన వాసుదేవుని సర్వజ్ఞుడవైన నీవు నుతించే సరికి నా సకల భ్రాంతులు ఇట్టే తొలగిపోయాయి సర్వశక్తి సమన్వితుడు అవ్యయుడు- అలాంటివాడు మొదట ఏయే శక్తులను ఆశ్రయించి బ్రహ్మేంద్రాది రూపాలు ధరించాడు? ప్రకృతిని గుణాలను ఏక కాలంలో గ్రహించాడా? లేక క్రమంగా గ్రహించాడా? ఒకడైయుండే ఈశ్వరుడు అనేక రూపాలలో అనేక విధాలుగా ఉండటానికి కారణం ఏమిటి? అలా ఉండకపోతే వచ్చేదేముంది?

నా యీ సందేహాలు తీర్చండి - అని అర్థించేసరికి శుకయోగి అతనికి సందేహ నివృత్తి చేయటానికి నిశ్చయించుకొని తన మనస్సులో ఈశ్వరుణ్ణి ఇలా ప్రార్థించాడు—

పరాత్పరుడై సృష్టి స్థితి సంహార క్రీడా వినోదియై సత్వ రజ స్తమశ్శక్తి సమేతుడై అంతర్గత జ్యోతియై బ్రహ్మేంద్రాదులకు కూడా అందని దుస్తర మైన మార్గంలో విరాజిల్లెడి శ్రీహరికి తత్త్వాకాంక్షతో మ్రొక్కెదను

సాధు సంరక్షకుడు దుష్టనివారకుడు అఖిల సత్వరూపకుడు పరమ హంసాశ్రమ వాసులైన మునిజనుల హృదయకమలంలో ప్రకాశించేవాడు సత్వ గుణాన్వితుడు భక్తజన సులభుడు సర్వాతిశాయియైనవాడు ఆత్మస్వరూపమైన బ్రహ్మమందు విహరించెడివాడు అయిన పరమేశ్వరునకు నాకై మోడ్పు

ఏ దేవదేవుని వందనం అర్చనం చింతనం నామసంకీర్తనం లీలలు పరమాద్భుతాలో ఏ మహామహుని గాథలు వింటే సకల పాపాలు నశించి శుభాలు చేకూరుతాయో ఆ పరమేశ్వరుని నేను ఆశ్రయిస్తాను

చతురులైనవారు ఎవ్వని పాదాంబుజాలను సేవించి అంతరంగంలో ఇహ పరములయందు ఆసక్తిని విడిచిపెట్టి ఏవిధమైన తాపమూ లేకుండా బ్రహ్మ పథంలో అనాయాసంగా చరిస్తూ వుంటారో ఆ పరాత్పరునకు నా నమస్సులు

తపాలు దానాలు జపాలు ఎన్ని చేసినా నిష్కామ బుద్ధితో వాటి ఫలితాన్ని ఎవనికి చేర్చకపోతే అవన్నీ నిరర్థకాలై ఆపదలకు కారణభూతాలౌతాయో ఆ అనంతుని నేను సేవిస్తాను

యవనులు వ్యాధులు పుళిందులు, హూణులు మొదలైనవారున్నూ ఇంకా ఇతర పాపాత్ములున్నూ ఏ భద్రాత్ముని సేవించి భాగవతుల నాశ్రయించి శుభ వర్తనులూ పుణ్యాత్ములూ అవుతారో ఆ దేవదేవునకు నా ప్రణామాలు

తపోదాన వ్రత ప్రీతితోనా? మంత్ర జపాలతోనా? భక్తితోనా? లేక శ్రుతి స్మృతులు పఠిస్తేనా? ఏ విధంగా లభిస్తాడని బ్రహ్మ రుద్రాదులు ధ్యా నిస్తారో ఆ ముక్తి ప్రదాయకుడు ఆత్మమూర్తి నాకు సులభుడౌ గాక

శ్రీపతి యజ్ఞపతి ప్రజాపతి బుద్ధిపతి, జగత్పతి భూపతి యాదవపతి సమస్త జనులకు గతి అయిన ఆ భగవానుని ఆరాధిస్తాను

అణువో మహత్తో అభేద్యుడో, భేద్యుడో సుగుణుడో లేక నిర్గుణుడో అని తత్వవిదులుకూడా నిర్ణయించలేక ఎవని పాదపద్మాలు సేవించి తత్వ మార్గాన్ని తెలిసికొంటారో ఆ పరమేశ్వరుని సర్వాత్మకుని యజిస్తాను.

లోకాలను సృషించాలనే బుద్ధిని బ్రహ్మదేవునకు కలిగించాలని ఊహించి యే పరమాత్మ సరస్వతిని పంపగా ఆమె ఆ బ్రహ్మను మగనిగా వరించి అతని

సృష్టికార్యంలో పారంగతునిగా చేసిందో ఆ సర్వశక్తి సమన్వితుని నేను సేవిస్తాను

తాను పరిపూర్ణుడయ్యుండి కూడ పంచమహాభూతముల సంయోగంచేత దేహాలనే పురములను సృజించి వాటిలో పురుష భావంతో ఎవడు ప్రకాశిస్తూ వుంటాడో పంచ భూతాలను పదకొండు ఇంద్రియాల్లో[1] ప్రకాశింపజేసి షోడశాత్మకుడై లీలా వినోదియై శోభిస్తూ వుంటాడో ఆ భగవంతుడు అచ్యుతుడు అవ్యయుడు నా మనస్సులో ప్రభవించిన వాక్పుష్పమాలికలో నవరస మందారాన్ని నింపి నన్ను శిష్టమార్గంలో నడిపించుగాక

మానధనులు మహాత్ములు సమాధినిష్ఠులు ఎవ్వని ముఖ పద్మ ధ్యాన మకరందం త్రావి ఆత్మభయం విడిచి మోక్షం పొందుతారో అట్టి మునిలోకశిఖామణికి అజ్ఞానతమో భాస్కరునకు వేదవ్యాసునకు నా సవినయాంజలి-'

అని ఈ రీతిగా హరికి గురువుకు నమస్కరించి శుకయోగీంద్రుడు పరీక్షన్నరేంద్రుని చూచి- నరపాలకా ప్రేమభావంతో నీవు నన్నడిగిన విషయాన్ని పూర్వం బ్రహ్మ మాధవునివలన విని నారదుడడిగేసరికి ఆ మహర్షికి చెప్పాడు అనంతరం నారదుడు నాకవి ప్రసాదించాడు అది మహాద్భుతమైనది. వినదగ్గది నేనిప్పుడది నీకు చెపుతాను విను నీ సంశయాలు విచ్ఛిన్నమై పోతాయి'- అని ఇలా చెప్పడం మొదలుపెట్టాడు-

## నారదుడు బ్రహ్మను ప్రపంచ ప్రకారమును గూర్చి అడుగుట

'నారదుడు బ్రహ్మను ఇలా అడిగాడు- తండ్రీ నీవు సుర జ్యేష్ఠుడవు సృష్టికర్తవు నీ నాలుగు ముఖాల్లో నాలుగు వేదాలూ శబ్దార్థాలతో శోభిస్తూ వుంటాయి భారతీపతి నీ యిల్లాలు. నీకు తెలియనిదేదీ నా సందేహాలు తీర్చు-

ఈ సృష్టిని ప్రారంభించాలనే వివేకం నీకు కల్గించిన దెవ్వరు? ఆ ప్రారంభ సంపత్తికి ఆధారము హేతువు ఏమిటి? సాలెపురుగు తన బొడ్డు నందున్న నూలుతో నిర్విరామంగా గూటిని నిర్మిస్తూ వుంటుంది అలాగే నీవున్నూ నిరంతరం సృష్టి సాగిస్తూ వుంటావు ఎందుకు? దానికి అంతు కనబడదు నీ వర్తనం దురవగాహం

నేను నిన్ను సర్వాధిపతిగా భావిస్తున్నాను వాస్తవంగా నీకంటె అధికు

1 కర్మేంద్రియాలు అయిదు జ్ఞానేంద్రియాలు అయిదు మనస్సు- మొత్తం ఇంద్రియాలు పదకొండు.

దైన వాదెవదున్నాడూ? ఇంతకూ నీవు ఏ లాభం ఆశించి ఈ సృష్టిని సాగిస్తు న్నట్లు? ఈ ప్రాణికోటి ఎలా పుడుతోంది? ఎలా జీవిస్తోంది? తుదకు ఎలా లయమవుతోంది? వాణీపతీ నాకు నిజం చెప్పు

నామ రూప గుణాలతో ఉంటూ లేనట్లూ కనబడే ఈ విశ్వం నీ హృదయా ధీనం నీతో సమానులుకాని నీకంటె ఘనులుకాని ఎవ్వరూ లేరు నీ పదవి మహో న్నతం అలాంటి నీవు ఏ ఈశ్వరుని ఉద్దేశించి తపస్సు చేశావో ఆ విధానమంతా చెప్పి నన్ననుగ్రహించు

పద్మసంభవా నీకున్నూ ఒక ఈశ్వరుడున్నాడంటే ఈ బ్రహ్మాండాన్ని సృజించి పెంచి లయంచేసేది ఎవ్వరు? ఆతడేనా? అయితే ఆతడేరూపంలో వుంటాడు? ఆతణ్ణి సంభావించటం సాధ్యమౌతుందా? ఆ సంగతి సాకల్యంగా చెప్పు ఇతరులు పెడదారిని పడకుండా నేను వారి కది చెబుతాను నీవు త్రికాలజ్ఞుడవు నీకు తెలియనిదిలేదు ఈ విశ్వరీతిని నాకు వివరించి చెప్పు అని నారదు డర్థించేసరికి పరమేష్ఠి నవ్వి యిలా అన్నాడు- బిడ్డా నా దగ్గరకు జ్ఞానులు ఎంతమందిరారు? వారు విరక్తులుకాదూ? అయినా వారెవ్వరూ నన్నిలా అడగ లేదు నీ ఊహ పరిణతమైనది నా రహస్యం అడిగావు

చరాచరాత్మకమైన ఈ విశ్వాన్ని నా యంతట నేను సృజించాలని యత్నిం చాను కాని నాకు ఆ తెలివితేటలు లేకపోయాయి తొట్రుపాటు చెందాను అపుడు ఈశ్వరుడే ఉదారబుద్ధితో ఈ సమస్త సృష్టిని చేసే శక్తిని ప్రసాదించారు నిజానికి ఆ దేవదేవుని ఆజ్ఞయే లేకపోతే ఈ లోకాలన్నీ సృష్టించడం నావల్ల అయ్యేపనేనా? ఈ విశ్వాన్ని ప్రకాశింపజెయ్యటానికి సామర్థ్యం నాకెక్కడిదీ? సూర్యచంద్రులు నక్షత్రాలు గ్రహాలు ఎలా ప్రకాశిస్తాయో? అదే రీతిగా ఎవ్వని తేజస్సుచే లోకాలన్నీ వెలుగుతూ వుంటాయో ఆ ఈశ్వరునకు నా ప్రణా మాంజలి

నారదా విను ఈశ్వరుని దృష్టిపథంలో పడటానికి శంకించి సిగ్గుతో సంకోచించెడి మాయకు లోబడి మతి పోగొట్టుకొని కొందరు జ్ఞానశూన్యులై నన్నూ లోకేశ్వరుడని భావించి ఆరాధిస్తారు అదంతా ఆ మాయా ప్రభావం అని గ్రహించి నేను నవ్వుకొని అలాంటివారినందరినీ తిరస్కరిస్తాను

శరీర నిర్మాణానికి ద్రవ్యములైన మహాభూతములు జన్మ నిమిత్తములైన కర్మలు కర్మ క్షోభకమైన కాలము కాంపరిమాణ హేతువైన స్వభావము భోక్త యైన జీవుడు- ఈ సమస్తమూ వాసుదేవుడే అని గ్రహించు అంతా వాసుదేవ మయం వాసుదేవునకు భిన్నమైనదేదీలేదు. లోకాలన్నింటికీ శ్రీమన్నారాయణుడే నియంత దేవతలందరు నారాయణాంశ సంభూతులే

వేదాలు యాగాలు, తపస్సు, యోగం సమస్తమూ నారాయణపరాలే,

జ్ఞానసాధ్యమైన ఫలం నారాయణాధీనం ఆదిదేవుడు సర్వాత్మకుడు సర్వద్రష్ట అయిన ఈశ్వరుడు కృపాదృష్టితో నన్ను సృజించి ప్రేరేపించడంవలన నేను సృష్టికార్యాన్ని నిర్వహిస్తున్నాను నిర్గుణుడైన ఈశ్వరునివలన సత్వ రజ స్తమో గుణాలు ఉద్భవించాయి సృష్టి స్థితి లయాలకు అవే కారణభూతాలు

కార్యమునకు కారణమునకు కర్తృత్వానికి ద్రవ్యాలైన మహాభూతాలు, జ్ఞానమూర్తులైన దేవతలు క్రియారూపాలైన ఇంద్రియాలు ఆధారంగా ఆ గుణాలు, నిత్యముక్తుడైనా మాయతోగూడి వుండడంచేత జీవుణ్ణి బంధిస్తూ వుంటాయి. జీవులకు ఆవరణాలై ఉపాధి[1] భూతాలైన ఆ మూడు ప్రకృతుల కారణంగా ఇతరులకు కనబడకుండా తనకు మాత్రమే కనబడేటితత్వంలో ఈశ్వరుడు క్రీడిస్తూ వుంటాడు.

ఆ ఈశ్వరు డనంతుడు సకలలోకాలకు సకలప్రాణికోటికి నీకు నాకు, మాయకు ఆ ఈశ్వరుడే అధిపతి అతడు మాయకారణంగా దైవయోగంచేత లభించిన కాలాన్ని జీవాన్ని అష్టప్రకృతులను[2] వివిధంగా చెయ్యడానికి పూనుకొన్నాడు. మహత్తత్వం ఈశ్వరాధిష్ఠితం ఆ మహత్తత్వంనుండి కాలం కాలంనుండి గుణవ్యతికరం[3] ఏర్పడ్డాయి

ఆ గుణ సమ్మేళనంవలన పరిణామం జీవాదృష్టభూతమైన కర్మవలన జన్మ కలిగాయి ఇలా రజసత్వాలచే ప్రవృద్ధమై మార్పుచెందిన మహత్తత్వం నుండి తమోగుణ ప్రధానమైన అహంకారం ఉద్భవించింది ఆ అహంకారం ద్రవ్య జ్ఞాన క్రియాశక్తి సమన్వితం ద్రవ్యశక్తి తామసం క్రియాశక్తి రాజసం జ్ఞాన శక్తి సాత్వికం.

తామసాహంకారంవల్ల ఆకాశం కలిగింది దాని గుణం శబ్దం ఆకాశంవలన వాయువు జనించింది దానికి రెండు గుణాలు శబ్దం, స్పర్శం. ఆ వాయువే శరీరంలో ప్రాణరూపంలో ఉండడంచేత ఇంద్రియాలకు మనస్సుకు శరీరానికి పటుత్వాన్ని ఇచ్చే తేజస్సుకు బలానికి సహనానికి హేతుభూతమైంది వాయువు వలన రూప స్పర్శ శబ్దాలనెడి మూడు గుణాలతో అగ్నిపుట్టింది ఆ అగ్ని (తేజం) వలన రస రూప స్పర్శ శబ్దాలనే నాలుగు గుణాలతో జలం ఉత్పన్నమైంది జలంవలన గంధ రస రూప స్పర్శ శబ్దములనే గుణపంచకంతో పృథివి యేర్పడ్డది

సాత్వికాహంకారంవలన చంద్ర దైవతమైన మనస్సున్నూ దిక్కులు, వాయువు సూర్యుడు వరుణుడు అశ్వినులు, అగ్ని ఇంద్రుడు ఉపేంద్రుడు, మిత్రుడు ప్రజాపతి అనెడి దశదేవతలు ఉద్భవించారు

---

1 కారణం 2 పంచతన్మాత్రలు (పంచభూత గుణాలు) అవ్యక్తం బుద్ధి అహంకారం- ఇవి అష్ట ప్రకృతులు 3 సమ్మేళనం

రాజసాహంకారంవలన దిగ్దైవతమైన శ్రవణేంద్రియం[1] వాయు దైవతమైన త్వగింద్రియం[2] సూర్యదైవతమైన నయనేంద్రియం[3] వరుణ దైవతమైన రసనేంద్రియం[4] అశ్వనీ దైవతమైన ఘ్రాణేంద్రియం[5] అగ్నిదైవతమైన వాగింద్రియం[6] ఇంద్రదైవతమైన హస్తేంద్రియం[7], ఉపేంద్ర దైవతమైన పాదేంద్రియం[8] మిత్ర దైవతమైన గుదేంద్రియం[9] ప్రజాపతి దైవతమైన గుహ్యేంద్రియం[10] అనే దశేంద్రియాలూ జ్ఞానాన్ని కలిగించే అంతఃకరణంలో ఒక భాగమైన బుద్ధి క్రియా జనకమైన అంతఃకరణమగు ప్రాణమూ కలిగాయి

అలా శ్రోత్రాదులైన దశేంద్రియాలతోగూడిన భూతేంద్రియ మనో గుణాలు విడివిడిగా బ్రహ్మాండ శరీర నిర్మాణం చేయలేకపోయినప్పుడు భగవచ్ఛక్తి ప్రేరితాలై అవన్నీ కలిసి చేతనా చేతన రూపకమైన బ్రహ్మాండాన్ని నిర్మించాయి ఆ రీతిగా నిర్మింపబడిన బ్రహ్మాండం ఎన్నో వేల సంవత్సరాల వరకు నీటిలో వుంది కాలకర్మ స్వభావాలకు చిక్కుపడక సమస్తాన్నీ జీవ సహితంగా చేయగల ఈశ్వరుడు అచేతనాన్ని సచేతనంగా చేశాడు

అనంతరం కాలకర్మ స్వభావాలకు ప్రేరకుడైన ఆ ఈశ్వరుడు జీవ రూపంలో నీటి నడుమనున్న బ్రహ్మాండంలో ప్రవేశించి దాన్ని విస్తృతం చేశాడు. ఆపైన దాన్ని పగులగొట్టి బయటకు వచ్చాడు భవనాకారంలో వున్న బ్రహ్మాండానికి అపుడు పదునాలుగు రంధ్రాలుపడ్డాయి

ఆ పరమేశ్వరునకు లెక్కింప నలవికాని పాదాలు భుజాలు నేత్రాలు శిరస్సులు, ఫాలభాగాలు చెవులు ఉంటాయి అన్ని దేహాల్లోనూ ఆయన ఉంటాడు ఆయన అనంతరూపాలను అవయవాలను పండితులు ఊహించి భువన వైభవాన్ని వర్ణిస్తారు. అలాంటి మహనీయమూర్తియైన పరమేశ్వరుడు యోగిజనుల హృదయ పీఠాన్ని అధివసించి ఉంటాడు

పదునాలుగు లోకాల్లో మీది యేడు లోకాలు శ్రీ మహావిష్ణువు కటి ప్రదేశం నుండి ఊర్ధ్వ దేహమనిన్నీ క్రింది యేడు లోకాలు అధోలోకమనిన్నీ అంటారు విశ్వ శరీరుడైన భగవంతుని ముఖంనుండి బ్రాహ్మణకులం బాహువులనుండి క్షత్రియకులం, తొడలనుండి వైశ్యకులం పాదాలనుండి శూద్రకులం జనించాయని కూడా విజ్ఞు లంటారు

ఆ విశ్వపురుషునకు కటిప్రదేశం భూలోకం నాభి భువర్లోకం హృదయం

1 చెవి 2 చర్మం 3 కన్ను 4 నాలుక 5 ముక్కు - ఈ ఐదును జ్ఞానేంద్రియాలు.

6 వాక్కు. 7 పాణి 8 పాదం 9 గుదం (ముడ్డి) 10 స్త్రీ పురుషుల జననేంద్రియం- ఈ ఐదూ కర్మేంద్రియాలు.

సువర్లోకం రొమ్ము మహర్లోకం మెడ జనలోకం కుచద్వయం తపోలోకం శిరస్సు సనాతనమూ బ్రహ్మనివాసమూ అయిన సత్యలోకం కటిప్రదేశం[1] అతలం తొడలు వితలం మోకాళ్ళు సుతలం పిక్కలు తలాతలం చీలమండలు మహాతలం పాదాగ్రాలు రసాతలం అరికాళ్ళు పాతాళం అని లోకమయంగా భావిస్తారు కొందరు పాదతలంవలన భూలోకం నాభివలన భువర్లోకం శిరస్సువలన స్వర్లోకం కలిగాయని లోక కల్పనం చేస్తారు

పురుషోత్తముని ముఖంనుండి సకల జంతువులకు వాక్కూ ఆ వాక్కునకు దేవతయైన అగ్నీ జనించాయి చర్మం రక్తం మాంసం మేదస్సు[2] శల్యం మజ్జ[3] శుక్లం- వీటిని సప్త ధాతువులంటారు పక్షాంతరంలో రోమాలు చర్మం మాంసం ఎముకలు స్నాయువు[4] వీనిని సప్తధాతువులు అంటారు వాటిల్లో రోమాలు ఉష్ణిక ఛందం[5] త్వక్కు (చర్మం) ధాత్రీఛందం మాంసం త్రిష్టుప్ ఛందం స్నాయువు అనుష్టుప్ ఛందం అస్థి (ఎముక) జగతీ ఛందం, మజ్జ పంక్తి ఛందం ప్రాణాలు బృహతీ ఛందం- అని ప్రసిద్ధాలు

హవ్యానికి[6] కవ్యానికి[7] అమృతానికి అన్నానికి మాధుర్యం మొదలైన షడ్రసాలకు రసనేంద్రియానికి[8] రసానికి[9] అధిపతియైన వరుణునకు శ్రీహరి రసనేంద్రియం జనస్థానం సమస్త ప్రాణులకు వాయువునకు శ్రీ విష్ణువు నాసికా రంధ్రం నివాసము సర్వత్రా వ్యాపించే గంధాలకు ఓషధులకు అశ్వినీదేవతలకు భగవంతుని ఘ్రాణేంద్రియం ఆవాసస్థానం

దేవలోక సత్యలోకాలకు తేజస్సునకు సూర్యునకు సకల చక్షువులకు లోక లోచనుడైన దేవదేవుని చక్షురింద్రియం నిలయం శ్రుతి (వేదం) భూతాలైన విషయాలకు శబ్దానికి సర్వేశ్వరుని కర్ణేంద్రియం జన్మస్థానం వస్తు సారాలకు వర్ధనీయాలైన సౌభాగ్యాలకు పరమపురుషుని శరీరం అర్హస్థానం స్పర్శకు వాయువునకు స్నేహపాత్రమైన వాటి కన్నిటికి దివ్యదేహుడైన శ్రీహరి దేహేంద్రియం నిలయం. యూపం[10] మొదలైన యజ్ఞోపకరణ సాధనాలకు తరు గుల్మ లతాదులకు పురుషోత్తముని రోమాలు మూలాలు

సర్వమయుడైన విశ్వేశ్వరునకు శిలలు లోహాలు గోళ్ళు మేఘాలు వెంట్రుకలు మెరపులు శ్మశ్రువులు[11] లోకపాలకుల పరాక్రమాలకు భూమి మొదలైన లోకాల యోగక్షేమాలకు నారాయణుని విక్రమాలు నిలయాలు. సర్వకామాలకు, వరాలకు ఆ దేవేశుని పాదకమలాలు ఉనికి పట్టులు నీటికి శుక్లానికి వర్షాని

---

1 కటి = మొల పిరుదు 2 మెదడు 3 ఎముకలయందలి నెయ్యి
4 సన్నని నరం 5 పద్యం 6 దేవతలకు ఇవ్వదగిన అన్నం
7 పితృదేవతల కియ్యదగిన అన్నం 8 నాలుక 9 నీటికి
10 యజ్ఞ పశువునకు కట్టు కంబం 11 గడ్డాలు మీసాలు

దేవతకు ప్రజాపతి సృష్టికి సర్వేశ్వరుని గుహ్యేంద్రియం జననస్థానం సంతానానికి కామం మొదలైన పురుషార్థాలకు మనోసంచాలకు శరీర సౌఖ్యానికి అచ్యుతుని ఉపస్థేంద్రియం నెలవు

యమునికి మిత్రునికి మలవిసర్జనానికి శ్రీహరి పాయ్విేంద్రియం నివాసం హింసకు నిర్ఋతికి మృత్యువుసకు నరకానికి అభిరూపకుని గుదం సదనం

పరాభవానికి అధర్మానికి అవిద్యకు అనంతుని పృష్ఠభాగం వాసప్రదేశం నదీ నదాలకు ఈశ్వరుని నాడీ సముదాయం నివాసమందిరం పర్వతాలకు శ్రీహరి శల్యాలు జనకస్థలాలు ప్రధానానికి అన్నరసానికి సముద్రాలకు భూ వలయానికి బ్రహ్మండ గర్భుని ఉదరం నిలయం మనోవ్యాపార రూపకమైన లింగ శరీరానికి సర్వేశ్వరుని హృదయం జన్మభూమి

నారదా నీలకంఠునకు నీకు నాకు సనత్కుమారాదులకు ధర్మ సత్వ బుద్ధి తత్వాలకు ఆ పరమేశ్వరుని ఆత్మయే నెలవు అంతేకాదు. సురాసురులు పితృదేవతలు గంధర్వ యక్ష రాక్షస గణాలు నరులు వన్యజంతువులు పశు పక్ష్యాదులు తరువులు నీవు నేను ముక్కంటి మునులు జలచరాలు నభశ్చరాలు, స్థలచరాలూ మొదలైన జీవున్నింటితో నిండియున్న విశ్వమంతా విష్ణుమయం వెయ్యిమాట లెందుకూ ఈ బ్రహ్మండం అంతా ఆ ఈశ్వరుని జేనలో ఇమిడి వుంటుంది సామాన్య బుద్ధికి భగవత్తత్వం తెలియదు భూత భవిష్యత్ వర్తమాన లోకాలన్నీ ఆ మహావిష్ణువుని ఆధీనంలో వుంటాయి

నిజమండలంలో ఉండి సూర్యుడెలా లోకాలన్నింటినీ కాంతివంతం చేస్తాడో అలాగే అచ్యుతుడు బ్రహ్మండంలో వుంటూ బహిరంతరాలను ప్రకాశింపజేస్తూ వుంటాడు.

అలాంటి విశ్వాత్ముని నాభికమలంనుండి నేను పుట్టాను ఆయన్ని సేవించాలని బుద్ధి పుట్టి యజ్ఞం చెయ్యాలనుకున్నాను కాని యజ్ఞోపకరణాలైన వస్తువు యెక్కడా కంటికి కనబడలేదు అపుడు ఆయన నిర్మలమూర్తిని బుద్ధిలో నిలిపి ధ్యానించేసరికి నాకో ఉపాయం తోచింది ఆ మహాత్ముని అవయవాలనే యజ్ఞోపకరణాలుగా కల్పించుకొని ఆయనే యజ్ఞేశ్వరుడుగా యజ్ఞ పురుషుడుగా యజ్ఞభోక్తగా యజ్ఞఫలప్రదాతగా మానస యజ్ఞం చేశాను.

అపుడు బ్రాహ్మణులందరు నన్నుచూచి ఉచితరీతిని ఆ పరమేశ్వరునకు అభిమతాలైన యజ్ఞాలు చేశారు క్రమంగా మనువులు దేవదానవులు రాజేంద్రులు మర్త్యులు వారి వారి యిష్ట దైవాలను సేవిస్తూ నిష్ఠతో యజ్ఞాలు చేశారు యజ్ఞమయుడైన రమాధవుడు ఆ యజ్ఞఫలం స్వీకరించి అందరిని అనుగ్రహించాడు

ఆ రీతిగా గుణరహితుడైన పరమాత్మ లోకాలను సృష్టించడానికి సగుణుడయ్యాడు అతడు విశ్వాత్మకుడు విశ్వమయుడు విశ్వేశుడు అఖిలనేత. విశ్వంలో తాను వుంటాడు తనలో విశ్వం ప్రకాశిస్తూ వుంటుంది

ఆ ఆదిదేవుని ఆజ్ఞానుసారమే నేను సచరాచర భూత సంయుతమైన సృష్టి చేస్తున్నాను అతనే పాలిస్తున్నాడు శివుడు లయం చేస్తున్నాడు కాని వాస్తవంగా సృష్టి స్థితి లయాలు చేయగల శక్తి అచ్యుతుడైన హరికొక్కనికే వుంది నారదా ఇంతెందుకూ? ఆ పరబ్రహ్మయే సమస్తానికి ఆధార హేతుభూతుడు అతడనంతుడ కరుణావార్ధి ఆ విభునికంటె అధికుడెవ్వడూ లేదు

ఇప్పుడు నేను చెప్పినదంతా సత్యం ఆ మహామహుని ధ్యాన మహిమ వలన నా నోటినుండి వచ్చినదంతా సత్యమవుతుంది ఇంద్రియాలను మరచి ఏమరపాటుగా నున్నప్పుడుకూడా అసత్యం పలకను నేను వేదమయుడను భవసాగరం దాటించేదీ సకల సంపదలూ శుభాలూ ఇచ్చేదీ అయిన ఆ దేవదేవుని పాదాంబుజాలకు నేను నమస్కరిస్తూ వుంటాను

నేనా పద్మాక్షుని కుమారుడను ప్రజాపతిని. యోగవిద్యా నిపుణుడను. అయినా నా జననం నాకే తెలియదు ఇక అతని మహత్తు నాకేం తెలుస్తుందీ? ఏదో అతడు కల్పించిన ఈ విశ్వం నాకు కొంత మాత్రమే తెలుసు ఇంకో రహస్యం విను విశ్వాత్మకుడైన ఆ ఈశ్వరుడే మాయయొక్క మహిమను తుదిదాకా తెలిసికోలేడు ఇక నేను నీవు సురేంద్రాదులు ఏం తెలిసికోగలం? కాని ఆ పద్మాక్షుని సర్వజ్ఞతను మాత్రం శంకించడానికి వీలులేదు ఆకాశం తన అంతాన్ని తానెరుగదు అంతమాత్రంచేత శూన్యం లేదనటం సహేతుకమా? అలాగా శ్రీహరిన్నీ

మావంటి వాళ్ళందరూ ఆ మహాత్ముడు ధరించిన అవతార కార్యాలను అనేక విధాల సన్నుతిస్తూ వుంటాము కాని అతణ్ణి తెలుసుకొనడం మాత్రం మావల్లకాదు. అతడు అలఘుడు, అనంతుడు, అవ్యయుడు చిదచిదాత్మకుడు[1], అధీశుడు ఈశుడు ప్రతి కల్పంలోను అతడు లోకాలను కల్పిస్తాడు రక్షిస్తాడు. లయం చేస్తాడు మునీంద్రులుకూడా ప్రసన్నమానసులై యున్నప్పుడు మాత్రమే ఆ పరమ పూరుషుని భూరి కళామయ రూపాన్ని చూడగలుగుతారు అలాకాక కుతర్కం అనే అంధకారంలో మునిగి జ్ఞానరహితులైనపుడు చూడలేరు

నారదా ఇంకనూ విను తేజోనిధియైన ఆ మహనీయుని మొదలి యవతారానికి వేయి శిరసులు వేయిపాదాలు వుంటాయి అది ప్రకృతి ప్రవర్తకమైన

---

1 చిత్ + అచిత్ + ఆత్మకుడు చిత్తు = జ్ఞానము

ఆదిపురుషుని రూపం ఆ రూపంలోనుండి కాలస్వభావాలను శక్తులుదయించాయి అందుండి కార్యకారణ రూపమైన ప్రకృతి జనించింది ప్రకృతివలన మహత్తత్వమూ దానివలన అహంకార త్రయమూ ఉద్భవించాయి

అందులో రాజసాహంకారంవలన ఇంద్రియాలూ సాత్వికాహంకారంవల్ల ఇంద్రియగుణ ప్రధానాలైన అధిదేవతలూ తామసాహంకారంవలన భూతోత్పత్తికి కారణభూతాలైన పంచతన్మాత్రలు (శబ్ద స్పర్శ రూప రస గంధాలు) పుట్టాయి

ఆ పంచతన్మాత్రలవలన భూమి నీరు అగ్ని వాయువు ఆకాశం- అనెడి పంచభూతాలు ఏర్పడ్డాయి అందుండి జ్ఞానేంద్రియ పంచకం, కర్మేంద్రియ పంచకం మనస్సు జనించాయి ఈ అన్నింటి సమూహం నుండి విశ్వరూపుడైన విరాట్పురుషుడు సంభవించాడు అతనివల్ల స్వయంప్రకాశుడైన స్వరాట్టు (బ్రహ్మ) జన్మించాడు. ఆ స్వరాట్టునుండి చరాచరాత్మకమైన జగత్తు కల్పితమైంది. దానినుండి సత్వ రజస్తమోగుణ ప్రధానులమై విష్ణువు నేను రుద్రుడు జన్మించాం

దానివలన సృష్టికి జనకకారకుడైన చతుర్ముఖుడు పుట్టగా వానివలన దక్షుడు మొదలైన తొమ్మిదిమంది ప్రజాపతులు జన్మించారు ఇక ఆపల నీవు సనకసనందాది యోగీంద్రులు నాకలోక నివాసులైన ఇంద్రాదులు, పక్షిలోక పాలకులైన గరుడాదులు నరలోక పాలకులైన మనువూ మాంధాతా మొదలైనవారు పాతాళలోక పాలకులగు అనంతుడు వాసుకి మున్నగువారు గంధర్వ సిద్ధ విద్యాధర చారణ సాధ్య రక్షో యక్షోరగ నాగలోక పాలకులు ఋషులు, పితృదేవతలు దైత్య దానవులు, భూత ప్రేత పిశాచాలు పశుమృగాలు ఉద్భవించాయి

తొలిగా కల్పింపబడిన ఈ జగత్తును మహత్తత్వ సృష్టి అటూరు రెండవది అండ సంస్థితి మూడవది సర్వభూతస్థం అంటి ఐశ్వర్య తేజోబల సంపన్నులైన పురుషులను సర్వాత్మకుడైన శ్రీమన్నారాయణుని అంశంలో జన్మించిన వారినిగా గ్రహించదగు నారదా ఆ పుండరీకాక్షుని లీలావతారాలు అనంతాలు ఆ అవతారాల్లో అతనుచేసిన పనులు అసంఖ్యాకాలు అయినా నాకు తెలిసినంతవరకు చెప్తాను విను

## శ్రీమన్నారాయణుని అవతారాల వర్ణనం

### ఆది వరాహావతారం

హిరణ్యాక్షుడు బలగర్వంతో భూమిని చాపచుట్టచుట్టినట్టు చుట్టి తీసికొనిపోగా శ్రీహరి యజ్ఞ వరాహరూపంతో అతనిని సముద్ర మధ్యంలో పట్టుకొని తన

కోరలతో పొడిచిపై చి భూమిని ఉద్ధరించాడు ఆ రాక్షసుడప్పుడు ఇంద్రుని వజ్రాహతికి కూలిన మహాపర్వతంలాగా భూమిమీద కూలిపడ్డాడు

ఆ యజ్ఞావతారాన్ని గురించి చెపుతాను విను ప్రజాపతి భార్య స్వాయంభువ మనువుకూతురు ఆకూతి అతని కామెయంద సుయజ్ఞుడను నతడు జన్మించాడు ఆ సుయజ్ఞునకు దక్షిణయను నామెయందు సుయములనెడి దేవతలు పుట్టారు. అతడే ఇంద్రుడై ఉపేంద్రాకృతితో లోకబాధలను హరించాడు అతని మాతామహుడైన మనువు ఆతని చరిత్ర విని సంతోషించి లోకబాధలను హరించాడు కనుక అతనికి హరియనిపేరు పెట్టాడు అలా జ్ఞాన నిధియైన సుయజ్ఞుడు హరి యవతార మయ్యాడు

కపిలావతారం

శ్రీమన్నారాయణుడు కర్దమ ప్రజాపతికి దేవహూతి యనునామె యందు కపిలుడుగా జన్మించాడు హరిపదం పొందడానికి ఉత్తమమైన సాంఖ్యయోగం చెప్పింది అతడే దాని నాతడు తన తల్లికి బోధించి ఆమెకు మునిజన సేవితమైన మోక్ష మార్గం చూపాడు.

దత్తాత్రేయావతారం

అత్రిమహర్షి పుత్రకాంక్షతో శ్రీహరిని ప్రార్థించేసరికి శ్రీహరి సాక్షాత్కరించి "నేను నీకు దత్తుడ నయ్యాను" అని ఆ మహర్షికి కొడుకుగా జన్మించి దత్తాత్రేయుడయ్యాడు. ఆ మహాత్ముని పాదధూళితో పవిత్రులై హైహయులు యాదవులు ఐహికాముష్మిక సుఖాలుపొంది మహాకీర్తి నార్జించారు

సనకాద్యవతారాలు

కల్పాదిలో నేను విశ్వసృష్టి చెయ్యడానికి సంకల్పించి తపస్సుచేస్తూ సన (ఇమ్ము) అని అనేసరికి సనకాఖ్యలు (పేర్లు) గల సనందుడు సనకుడు, సనత్కుమారుడు సనత్సుజాతుడు అను నల్వురు మానసపుత్రులు జన్మించి మహావిఖ్యాతి చెందారు కల్పాంతంలో వారు ఆత్మతత్వాన్ని వ్యాపింపజేసి సాంప్రదాయక పద్ధతిని లోకసృష్టిచేశారు వారు శ్రీమహావిష్ణువు కళలతో నలుగురుగా ఉన్నా ఆ శ్రీహరి ఒక్కడే.

నరనారాయణావతారం

ధర్మునకు దక్షుని కుమారెవలన నరనారాయణులు జన్మించారు వారు మహానుభావులు పరమపావన మూర్తులు వారు బదరికాశ్రమంలో తపస్సు చేసు

కుంటూ వుండగా దేవేంద్రుడు తన పదవికి ఎక్కడ హాని కలుగుతుందో అని శంకించి మన్మథ బాణాల్లాంటి అప్సరలను వారి తపస్సును భంగించడానికి పంపాడు ఆ దేవాంగనలు బదరీవనానికి వెళ్ళి తమ అందచందాలతోను శృంగార చేష్టలతోను ఆటపాటలతోను చతురోక్తులతోను నరనారాయణుల తపోనిష్ఠకు భంగం కలిగించాలని ఎంతో యత్నించారు

కాని ఆ మహర్షులు చలించలేదు క్రోధంవల్ల తపస్సు చెడిపోతుందని సత్వగుణోపేతులు కనుక వారు ఆ దివ్యాంగనలపై కోపంకూడా చెంద లేదు కాని నారాయణుడు వారికి గర్వభంగం చెయ్యడానికి తన ఊరువును (తొడను) చీల్చేసరికి అందగత్తె ఊర్వశి మొదలైన సుందరాంగన లెందరో జనిం చారు వారిని చూచి అప్సరలు ఆశ్చర్యపోయారు ఊరువునుండి జనించింది కనుక వారిలో తొలి పుట్టువునకు ఊర్వశి అను పేరు వచ్చింది

అపుడా అప్సరలు ఓడిపోయి మనస్సంకల్పం మాత్రంచేతనే సృష్టి స్థితి సంహారాలు చేయగల ఆ మహాత్ములను వశపరచుకొనడం అసాధ్యమని తలచి సిగ్గుపడి ఊర్వశిని వెంటబెట్టుకొని స్వర్గలోకానికి తిరిగి వెళ్ళిపోయారు రుద్రుడు క్రోధంతో మన్మథుణ్ణి జయించాడు నరనారాయణులు అలాంటి క్రోధాన్నే జయిం చారు. ఇక వారు మన్మథుని జయించారంటే విశేషమేముంది?

## ధ్రువావతారం

ఉత్తానపాదుడను చక్రవర్తి వున్నాడు. అతనికొడుకు ధ్రువుడు. ఒకనాడా బాలుడు తండ్రి దగ్గర నుండగా అతని సవతి తల్లి అతణ్ణి పరుషోక్తులాడింది. అపుడాతడు వికలమనస్కుడై దారుణ తపస్సుచేసి సశరీరంగా ఆకాశంలో ధ్రువ పదం (నిశ్చలమైన స్థానం) అలంకరించాడు అలా మహోన్నతపదం అధిష్ఠించిన అతనిని అంతకు పైనున్న భృగువు మొదలైన మహర్షులు క్రిందనున్న సప్తర్షులు నుతించగా అతడు ధ్రువుడని ప్రఖ్యాతి చెందాడు. అతడు శ్రీహరి తుల్యుడైన పుణ్యాత్ముడు ఇప్పటికీ వున్నాడు

## పృథుని అవతారం

వేనుడనురాజున్నాడు వజ్రాయుధంలాంటి విప్రశాపంచేత అతడు తన బలాన్ని సంపత్తిని కోల్పోయి మృతిచెంది నరకంలో పడ్డాడు. అతని కొడుకు పృథు చక్రవర్తి. అతడు శ్రీహరి కళలో జన్మించినవాడు. అతడు తండ్రిని పున్నామనరకంనుండి రక్షించిన మహానుభావుడు. భూమిని గోవునుగాజేసి సమస్త వస్తువులనూ పిదికి సుసంపన్నంగాచేశాడు అందచేతనే భూమికి పృథివి అని పేరు వచ్చింది. ఇది పృథుని అవతార కథ.

## వృషభావతారం

అగ్నీధ్రుడనువానికి సుదేవివలన నాభి యనువాడు జన్మించాడు అతనికి మేరుదేవి యందు హరి వృషభుడుగా పుట్టాడు వృషభుడు జడస్వభావమైన యోగం ధరించి ప్రశాంతమైన అంతఃకరణంతో నిస్సంగుడై పరమహంస పొంద దగిన మార్గ మిది యని మహర్షులు పొగడుచుండగా ప్రవర్తించాడు ఇది వృషభావ తార చరిత్ర

## హయాననవతారం

శ్రీహరి నేను చేసిన యొక యజ్ఞంలో హయముఖంతో జన్మించాడు అతని మేనిచాయ బంగారంలాగా మెరుస్తూ వుంటుంది అతడు వేదమయుడు యజ్ఞ పురుషుడు అఖిలాంతరాత్మకుడు సాక్షాత్తు భగవంతుడు. అతని ఊర్పులనుండి వేదాలు పుట్టాయి

## మత్స్యావతారం

యుగాంత సమయంలో సముద్రాలన్నీ యేకమయ్యాయి ఆ మహా జల ప్రళయంలో శ్రీహరి అతి విచిత్రంగా భూమి యంతటి మత్స్యావతారం ధరించి సకల జీవులకూ ఆశ్రయమిచ్చాడు జలమధ్యంలో నా నోటినుండి వెల్వడిన వేదాలు చిక్కుపడిపోకుండా శాఖలుగా ఏర్పరచి దాచు తిరిగి తెచ్చి యిచ్చాడు. వైవస్వత మనువును ఒక నావపై నెక్కించి అది మునిగిపోకుండా చూచాడు ఆ అవతారాన్ని నుతించటం ఎవరి తరమూకాదు. శ్రీహరి అలా అనుగ్రహించక పోతే మనువూ వుండేవాడుకాదు వేదాలూ వుండేవికావు.

## కూర్మావతారం

అమృతంకోసం దేవదానవులు మందర పర్వతాన్ని కవ్వంగా చేసి సముద్రాన్ని మథిస్తూండగా ఆ పర్వతం సముద్రంలో మునిగిపోయింది. అపుడు శ్రీహరి కూర్మరూపంతో ఆ పర్వతాన్ని వీపుమీద నిలిపి మునిగిపోకుండా చేసి అమృతోత్పాదనానికి కారణభూతుడయ్యాడు.

## నృసింహావతారం

హిరణ్యకశిపుడు రాక్షసరాజు అతడు మదగర్వితుడై దేవలోకంపై దండెత్తి దేవతలను అణచివేశాడు సురసుర గంధర్వాసులెవ్వరు అతణ్ణి వధించ లేరు అందువేత లోకకల్యాణంకోసం శ్రీహరి నృసింహావతారం ధరించి వాడి గోళ్ళతో అతని వక్షాన్ని చీల్చి వధించాడు.

ఆదిమూలావతారం

జలపానం కొరకు ఒకనాడొక గజేంద్రం అరణ్య మధ్యంలోని తామర కొలనులో దిగేసరికి దాన్ని ఒక భయంకరమైన మొసలి పట్టుకున్నది. దాని పట్టును విడిపించుకొనేందుకా గజేంద్రం వెయ్యి సంవత్సరాలు పోరాడి భగవంతుని ప్రార్థించింది. దేవతలు విశ్వవ్యాపకులు కాకపోవడంచేత దాని మొర వినిన్నీ ఏమీ చెయ్యలేకపోయారు. అపుడు శ్రీహరి గజేంద్రుని మొర ఆలించి వెంటనే నిజస్వరూపంతో వచ్చి ఆ జలచరాన్ని వధించి గజేంద్రుని రక్షించాడు.

వామనావతారం

అదితి సంతానంలో శ్రీహరి కనిష్ఠుడు. కాని గుణ జ్యేష్ఠుడు. బలిచక్రవర్తి భుజబలంతో ముల్లోకాలూ జయించి ధర్మబద్ధంగా రాజ్యం చేస్తున్నాడు. అయినా స్వర్గాధిపత్యాన్ని కోల్పోయిన దేవేంద్రునకు తిరిగి ఆ ఆధిపత్యాన్ని ఇవ్వడానికి హరి వామన రూపంలో బలిని మూడడుగుల నేల అర్థించాడు. శ్రీహరి సర్వేశ్వరుడు కదా! బలి చక్రవర్తిని యాచించటమేమిటి? అంటే? ధార్మికుల సొమ్మును వినయంగా అర్థించి తీసికోవాలిగాని అవివేకంతో నిగ్రహించి తీసికోరాదు అసురాచార్యుడైన శుక్రుడు శ్రీహరి వంచన గ్రహించి బలిని వారించాడు. కాని బలి మహాదాత. స్వర్గాధిపత్యంపోయినా అతనికి లక్ష్యంలేదు. యాచకుల కోర్కె కాదనకుండా తీర్చడమే అతని అభిమతం. అంచేత అతడు వామనుని పాద సరోజాలను కడిగి నెత్తిన చల్లుకొని అతడర్థించిన రీతిని మూడడుగుల నేల యిచ్చాడు. శ్రీహరి ఆ మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించి బలిని నిగ్రహించాడు. బలి వదాన్యతను ముల్లోకాలూ 'భళీ' యని ప్రశంసించాయి.

హంసావతారం

నారదా! నీ భక్తి యోగానికి ఎంతో ఆనందం చెంది శ్రీహరి హంసావతారం ధరించి ఆత్మతత్వాన్ని ఉద్దీప్తంచేసే భాగవత మహాపురాణాన్ని నీకు ఉపదేశించాడు.

మన్వవతారం

శ్రీహరి మనువుగా అవతారం ధరించి స్వీయ తేజంతో అప్రతిహతమైన చక్రాన్ని ధరించి దుష్టులను దండిస్తూ శిష్టపాలనంచేస్తూ తన కీర్తి చంద్రికలు సత్యలోకపర్యంతం వ్యాపింపచేశాడు.

## ధన్వంతర్యవతారం

శ్రీమన్నారాయణుడు ధన్వంతరిగా జన్మించి తన నామస్మరణంచేతనే భూలోకవాసులందరికి సకల రోగ నిర్మూలనంచేస్తూ ఆయుర్వేదాన్ని కల్పించాడు.

## పరశురామావతారం

భూలోక కంటకులైన హైహయ వంశ నరేంద్రులను ఇతర దుష్ట నరాధిపతులను తన కరకుగొడ్డలితో ఇరవైయొక్క మారులు గాలించి గాలించి వధించి శ్రీహరి పరశురాముడుగా విఖ్యాతి చెందాడు అనంతరం బ్రాహ్మణులువేడగా తాను జయించిన సకల ధరాతలాన్ని వారికి దానం చేశాడు

## శ్రీరామావతారం

నారదా మహోత్కృష్టమైన శ్రీరామావతార తత్వాన్ని అభివర్ణిస్తాను. విను అతడు సామాన్యుడుకాడు సూర్యవంశమనెడి పాలసంద్రానికి పున్నమినాటి నిండు చంద్రుడనిపించినవాడు కోసలరాజపుత్రి కౌసల్య గర్భశుక్తికి[1] మంచి ముత్యంలాంటివాడు తన పాదసేవకుల దుఃఖమనెడి కారుచీకటిని పోగొట్టడానికి సూర్యబింబంవంటివాడు దశరథేశ్వరుని యజ్ఞశాల ముంగిట నవతరించిన సాక్షాత్తూ దేవతాకృతి అసురులనెడి అడవికి అగ్నితుల్యుడు రావణాసురుని ఆటోపమనెడి పర్వతానికి ఇంద్రునిబోలినవాడు ఆ శ్రీరామచంద్రుడు లోకోపకారార్థం అవతరించిన ఆ శ్రీరామునకు భరతుడు లక్ష్మణుడు శత్రుఘ్నుడు అను ముప్పురు తమ్ములున్నారు

అతని భార్య సీత జనకరాజ నందిని వనితాజనంలో అంతటి సర్వాంగ సౌందర్యం కలదిలేదు ఆమె చరణాలు చిగురాకుల్లాగా, నుదురు నెలవంకలాగా, బాహువులు తామరతూండ్లులాగా దంతాలు మొల్ల మొగ్గల్లాగా చేతులూ కమ్మ పద్మాల్లాగా మనోహరంగా వుంటాయి కాలి పిక్కలు బాకాలను స్తనాలు చక్రవాకాలను నడుము[2] శూన్యాన్ని పిరుదులు ఇసుకతిన్నెలను కంఠం శంఖాన్ని తలతూగుతూ వుంటాయి చెక్కిలి అద్దాన్ని తనూసౌరభం[3] మంచి గంధాన్ని పెదవి దొండపండును వాక్కు చిలుకపలుకును నడక యేనుగు నడకను చెవి శ్రీకారాన్ని పోలివుంటాయి అలాగే నాసిక సంపెంగ పువ్వునకు ముఖం చంద్రబింబానికి శరీరం బంగారానికి, చూపు మెరపు తీవియకు కనుబొమ ధనువునకు, శిరోజాలు తుమ్మెదలకు హాసం సుధాకరానికి బొడ్డు సుడిగుండానికి వంకలు

---

1 ముత్తెపు చిప్ప 2 లేనట్టు చాల సన్నగా వుంటుందని భావం
3 శరీరపు సువాసన

దిద్దుతూ మనోజ్ఞంగా వుంటాయి శివధనుర్భంగాన్ని ఉంకువ[1]గా పెట్టి శ్రీరాముడామెను వివాహమాడాడు.

దశరథుడు కారణాంతరంచేత నీలమేఘశ్యాముడైన రాముని వనవాసానికి పంపాడు సీతాలక్ష్మణులు అనుగమింపగా ఆతడు భయద మృగాలతో ప్రచండంగా వుండే దండకాటవికి వెళ్ళి అక్కడ వుంటూండగా రాక్షస పీడితులైన మునిజనులకు అభయమిచ్చి తన భీకరశరాలతో ఖరాదులను వధించాడు

అనంతరం వాలిని వధించి సుగ్రీవుని వానర సామ్రాజ్యానికి అభిషిక్తుణ్ణి చేశాడు. లోక కంటకుడైన లంకేశుడు రావణుడు సీతను అపహరించగా అతణ్ణి వధించడానికి కపిసేనతో బయలుదేరాడు కాని సముద్రుడు దారి యివ్వలేదు. అపుడు కోపంతో శ్రీరాముని కనుబొమలు ముడివడ్డాయి కనులు ఎర్రబారాయి. ఆ భీకరాకారాన్ని చూచి సముద్రుడు తపించి సకల జలచరశ్రేణితో ఇంకిపోయాడు. అప్పుడాతడు గత్యంతరంలేక కాకుత్థ్సుని శరణువేడాడు దయాసముద్రుడైన దాశరథి కరుణించేసరికి సముద్రుడు యథాస్వరూపం వహించాడు.

అపుడు నలుడు సేతువును నిర్మించాడు రాముడా సేతువుమీదుగా వెళ్ళి త్రిపురాలను ఒక్క బాణంతో నిర్మూలించిన శివుడులాగా, గోపురాలతో విశాలములైన ముంగిళ్ళతో మహోన్నతంగావున్న రాజసౌధాలను నిర్మూలించాడు శస్త్రమందిరాలను నాశనం చేశాడు చతురంగబలాలతో రాక్షసులను ఉన్మూలించాడు అలా లంకా పట్టణాన్ని విధ్వంసంచేసి లోక విద్రావణుడైన రావణుని వధించి ఆతని తమ్ముడైన విభీషణుని రక్షోనాథునిగా చేశాడు.

శ్రీరాముడు ధర్మ రక్షకుడు అయినా ధర్మ విధ్వంసకత్వానికి[2] పూనుకున్నాడు ఖరదండనానికి[3] అభిముఖుడుకాడు కాని ఖరదండవాది ముఖ్యం వహించాడు పుణ్యజనులను రక్షించేవాడు అయినా పుణ్యజనులను[4] అంతంచేశాడు. ఆశ్రితజన విభీషణుడుకాడు అయితేనేమి? ఆశ్రిత విభీషణత్వం[5] వహించాడు అలా తన సితకీర్తిని దశదిశలా వ్యాపింపచేసిన శ్రీరాముని అవతార విశేషాన్ని వర్ణించడం తరమా?

---

1 ఓలి శుల్కం

2 – 5 రెండేసి అర్థాలు :

2 ధర్మం = పుణ్యం, విల్లు 3 ఖరదండనం = తీక్ష్ణమైన దండనం, ఖరాసుర దండనం 4 పుణ్యజనులు = పుణ్యాత్ములు రాక్షసులు

5 ఆశ్రిత విభీషణత్వం = ఆశ్రయించిన విభీషణునకు అభయమివ్వడం.

## కృష్ణావతారం

రాక్షసాంశలో జన్మించిన రాజులు ధర్మదూరులై భూదేవిని బాధించడం మొదలుపెట్టారు అపుడు భూదేవి శ్రీహరిని ప్రార్థింపగా నాతడు భూ భారాన్ని హరించడానికి యదువంశంలో రామకృష్ణులుగా అవతరించాడు. యాదవుడైన వసుదేవునకు రోహిణి దేవకి అను ఇద్దరు భార్యలున్నారు బలరాముడు రోహిణి కడుపునా కృష్ణుడు దేవకి కడుపునా జన్మించారు.

బలరాముడు తెల్లగా కృష్ణుడు నల్లగా వుంటాడు. వారలా వుండటానికి కారణమేమిటంటే - వారు శ్రీహరి సితాసితకేశద్వయంనుండి[1] జన్మించారు సిత కేశంనుండి రాముడు అసితకేశంనుండి కృష్ణుడు పుట్టటంచేత వారికి ఆ వర్ణం వచ్చింది భూభారం నిర్మూలించడానికి తన కేశద్వయం చాలునని శ్రీ మహా విష్ణువే తన ప్రభావాన్ని చాటడానికి ఆ రీతిగా చేశాడు

వారిలో కృష్ణుడు మానవుడుగా చరించినా అతి మానుషకర్మలు చెయ్యడం వల్ల కేవలం పరమేశ్వరుడయ్యాడు ఆ మహాత్ముని లీలలు ఇన్నీ అన్నీ కావు. వాటిని లెక్కించడం ఎవరికీ సాధ్యంకాదు అయినా నాకు తెలిసినంతవరకు చెపుతాను విను

కృష్ణుడు పురిటింటిలో ఇంకా పొత్తిళ్ళలోనే వున్నాడు అపుడు అతణ్ణి చంపడానికి పూతనయను రక్కసి నూతన విషాన్ని స్తనాలయందు నింపుకొని అందాల భామగా వచ్చి చన్నుకుడిపింది. కృష్ణుడు ఆవురావురని దాని పాలుత్రావి దాని ప్రాణవాయువులనుకూడా పీల్చివేశాడు

కృష్ణునకు మూడోనెల వచ్చింది అపుడాతణ్ణి అపహరించడానికి శకటా సురుడనే రాక్షసుడు వచ్చాడు భక్తులను రక్షించడానికి అవతరించిన కృష్ణుడు అంతటి లేత వయసులో ఆ రాక్షసుణ్ణి వికటంగా ఒక తన్ను తన్నేసరికి అతడు అక్కడే విగతజీవుడై పడిపోయాడు

కృష్ణుడు కొంచెం పెద్దవాడయ్యాడు అతని అల్లరి భరించలేక గొల్లలు ఇంటిపై వచ్చిపడగా తల్లి అతన్ని త్రాటితో రోలుకు కట్టివేసింది ఆమె కనుమరుగున బాలకృష్ణుడు ఆ రోలును లాక్కుంటూ ఆకాశపర్యంతం పెరిగిన రెండు పెద్ద మద్దిచెట్లమధ్యగా పోయేసరికి దాని తాకిడికి ఆ చెట్లు నేలకూలాయి. ఆ దృశ్యం చూచిన వారందరూ విస్మయం చెందారు.

నారదా శ్రీకృష్ణుడు యశోద బిడ్డడని చేసి నమ్మకు. ఒకనాడాతడు మట్టి తిన్నాడని ఎవరో ఆమెకు చెప్పారు ఆమె దండించబోయేసరికి అతడు నోరు

---

1 తెల్లని నల్లని రెండు వెంట్రుకలనుండి

తెరిచి చూపాడు అపుడామెకు ఆతని కుక్షిలో చరాచరాత్మకాలైన సమస్త లోకాలూ కనిపించాయి ఆమె నివ్వెరపోయింది అలాంటి కృష్ణుడు సామాన్యుడా

యమునా నది మడుగులో కాళియుడనే సర్పరాజున్నాడు ఆతనికి విష భరితాలైన రెండు నాల్కలున్నాయి యమునా జలాలను ఆతడు విషమయంగా చేసివేయడంచేత ఆ నీళ్ళు త్రాగిన వారందరు చనిపోవడం మొదలుపెట్టారు అపుడు శ్రీకృష్ణుడు ఆ పన్నగేంద్రుని మర్దించి గోపకులను గోగణాన్ని రక్షించాడు

ఒకరాత్రి గోపకులు అరణ్యంలో నిద్రిస్తున్నారు అపుడు నలుమూలల నుండి వారిని కార్చిచ్చు చుట్టుముట్టింది వారు భయకంపితులై శ్రీకృష్ణుని రక్షింపుమని వేడేసరికి ఆతడు "మీరందరు కళ్ళు మూసుకోండి నేను దావాగ్నిని ఆర్పివేస్తా' నన్నాడు వారు అలాగే కళ్ళు మూసుకునారు కృష్ణుడు వెంటనే సవిలాసంగా ఆ దావాగ్నిని మ్రింగి తోటి గోపకుల ప్రాణాలను కాపాడాడు

ఒకనాటి వేకువను నందుడు యమునలో స్నానం చెయ్యడానికి వెళ్ళాడు. నీటిలో మునక వేసీ వేయగానే వరుణుడాతణ్ణి బంధించాడు కృష్ణునకు ఆ వృత్తాంతం తెలిసింది. కరుణాసముద్రుడైన ఆతడు వెంటనే నందుని వరుణబంధం నుండి విడిపించాడు.

మయుని కొడుకొకనాడు శ్రీకృష్ణుని అనుయాయులను మాయోపాయంతో పట్టుకొనిపోయి ఒక కొండ గుహలోనుంచి ఆ గుహారంధ్రాన్ని పెద్ద రాతి బండతో మూసివేశాడు. శ్రీకృష్ణుడది గ్రహించి కుటిలుడైన ఆ రాక్షసుణ్ణి వధించి గోపకులను రక్షించాడు నారదా కృష్ణుడెంతటి ప్రతిభావంతుడో చూచావా?

ఇంద్రప్రీతికోసం గోపకులు ఏటేటా ఒక యజ్ఞం చేస్తారు హరి అది మాన్పించేసరికి ఇంద్రుడు క్రుద్ధుడై రాళ్ళవాన కురిసి వారికి నిలువ నీడలేకుండా చెయ్యడానికి ప్రళయకాల పర్జన్యాలను పంపాడు. ఇంద్రుని ఆజ్ఞమేరకు ఆ మేఘాలు పెనుగాలులు వీస్తుండగా- అగ్నిశిఖల్లాంటి మెరపులతో మహాభయంకరము లైన ఉరుములతో వచ్చి భూమి నలుమూలలా క్రమ్మి ఎడతెరిపిలేకుండా ఏడు రోజులు శిలావర్షం కురియడం మొదలుపెట్టాయి.

ఆ వాన జల్లుల పెల్లునకు గోపకులు సొమ్మసిల్లి "కృష్ణా కృష్ణా! రక్షించు రక్షించు" అని మొఱపెట్టారు. కృష్ణునకు కష్టమేదేముంది అయినా ఆశ్చర్యకరంగా ఆ మహానుభావుడు తన భుజస్తంభంమీద గోవర్ధన పర్వతాన్ని ఎత్తిపట్టి గోగోపకులకు ఏమీ ప్రమాదం లేకుండా ఆ యేడుదినాలు దానిక్రింద ఆశ్రయం కల్పించాడు కుమారా ఏడు సంవత్సరాలతో చుట్టుకొనబడిన విశాల

భూమండలాన్నే మోయగలిగినవాడు ఒక పర్వతాన్ని మోయడంలో వింత యేముందీ?

ఆది శరత్కాలం నిశాసమయం శరశ్చంద్రుని పండు వెన్నెల్లో బృందా వన వీధులు తెల్లగా మిలమిలలాడుతున్నాయి కృష్ణుడు రాసకేళిలో మహోల్లా సంగా వున్నాడు వేణువు తీశాడు వేణు రంధ్రాలపై సుకుమారంగా వేళ్ళుమోపి స్థాయీ భేదంతో సప్తస్వరాలు మేళవించి రాగాలాపన చెయ్యడం మొదలు పెట్టాడు. అవ్యక్త మధురమైన ఆ వేణు గానానికి మోళ్ళుకూడా చిగిర్చాయంటే గోపాంగనల హృదయాలు ద్రవించడంలో ఆశ్చర్యమేముంది? ఆ మధురధ్వని చెవినిపడగా వారందఱూ పరుగులు పెడుతూ వచ్చే సరికి శంఖచూడుడనే గంధర్వు డొకడు హఠాత్తుగా వచ్చి వారినందఱినీ ఎతుకొని పోయాడు. వారి ఆర్తనాదం విని కృష్ణుడా గంధర్వుని భుజాదర్పం అణచి వారిని రక్షించాడు అలాంటి మహామహిమాన్వితుని ఎవరు గతించగలరు?

అతడిక నరకాది రాక్షసులను ఎందఱిని వధించాడో చెప్పడం సాధ్యం కాదు అంతేగాదు భీముడు అర్జునుడు మొదలైన ధనుష్మంతులను నిమిత్త మాత్రంగా నిలబెట్టి దుష్టరాజన్యు లనేకులను సంగర క్రీడలో సంహరించి భూభారం తీర్చిన ఆ దేవదేవునకు నాకైమొక్కు నారదా లోకోత్తరుడైన శ్రీకృష్ణుని అవతార మహిమలు చెప్పాను కదా ఇక వ్యాసావతారాన్ని గూర్చి చెబుతాను శ్రద్ధగా విను

వ్యాసావతారం

ప్రతీ యుగంలో సంకుచిత భావాలు కలవారు అల్పాయుష్కులు, దుర్మా ర్గులు అయిన వారికి అగమ్యాలయిన వేదాలను విభజించి వారిని ఉద్ధరించటానికి శ్రీహరి సత్యవతీ సూనుడై అవతరించాడు

బుద్ధావతారం

చంచల మనస్కులు అసత్యవాదులు, దురాచారులు పాషండ మతావ లంబకులు లోకోపద్రవకారకులైన రాక్షసులు ధర్మవిరుద్ధంగా ప్రవర్తించడం చేత వారిని అణచి వెయ్యటానికి శ్రీమన్నారాయణుడు బుద్ధుడుగా అవతరించాడు.

కల్క్యవతారం

శ్రీహరి నామస్మరణం చెయ్యక యజ్ఞయాగాలు నిర్వహించక సత్యాన్ని కాలదన్ని పాషండ మతధర్మాలను పాటించే బ్రాహ్మణులు హీనకుల సంజాతులైన

రాజులు కలియుగంలో పెచ్చు పెరిగిపోతారు అలాంటి వారిని అణచివేయటానికి హరి కలిగా అవతరిస్తాడు అధర్మాన్ని నిర్మూలించి ధర్మ సంస్థాపనం చేస్తాడు

నారదా నీకు పుండరీకాక్షుని లీలలు సంక్షిప్తంగా చెప్పాను ఇంతకు ముందే హరి వరహాద్యవతారాలు ధరించి ఆయా యవతారాల ప్రయోజనాలు తీర్చేశాడు మన్వంతరావతారాలు కూడా కొన్ని ముగిశాయి కొన్ని ఇంకా జరగ వలసి ఉన్నాయి. ప్రస్తుతం శ్రీహరి ధన్వంతరిగా పరశురాముడుగా అవతరించి ఉన్నాడు. ఇక ముమ్ముందు శ్రీరామాద్యవతారాలు ధరిస్తాడు

ఆ మహాత్ముడు సర్వశక్తి సంపన్నుడు సృష్టి స్థితి సంహారాల నిమిత్తం మాయాగుణాలను కల్పిస్తాడు. సృష్టికి ముందు భగవంతుడు తపస్సుగా నేను (బ్రహ్మ)గా ఋషిగణంగా, తొమ్మండ్రు ప్రజాపతులుగా అవతరించి లోకాలను ఉత్పాదింపజేస్తాడు దర్మంగా విష్ణువుగా, యజ్ఞాలుగా, మనువులుగా, ఇంద్రాది దేవ గణాలుగా రాజేంద్రులుగా అవతరించి లోకాలను రక్షిస్తాడు తుదకు అధర్మంగా రుద్రుడుగా కాలసర్పంగా రాక్షస సమూహంగా అవతరించి లోకాలను లయం చేస్తాడు

ఈ విధంగా ఆ శ్రీహరి ఒక్కడే సృష్టికి స్థితికి లయానికి కారణ భూతుడై ఉంటాడు. భూపరాగ రేణువులనైనా లెక్క పెట్టవచ్చుకాని ఆ దేవ దేవుడు వివిధావతారాలను ధరించి చేసే అద్భుత కర్మలను లెక్క పెట్టడం ఎవరికీ సాధ్యం కాదు ఏదో నీకు సంగ్రహంగా చెప్పాను సాకల్యంగా చెప్పడానికి నా తరంకాదు ఇక ఇతరుల సంగతి చెప్పడం దేనికి?

వామనావతారం దాల్చిన విష్ణువు త్రివిక్రముడై విజృంభించినప్పుడు అతని పాదవేగానికి ముల్లోకాలు నలిగి హతమైపోవడమేకాక ఆ పైన ఉన్న సత్యలోకంకూడా కంపించిపోయింది అప్పుడు త్రివిక్రముడు కనికరించి ఆ సత్య లోకాన్ని రక్షించాడు ఆ దేవదేవుని పాదాగ్రమంగలి శక్తి అంతటిది

శ్రీహరి మాయాబలాన్ని నేనే యెఱుగను ఇక సనందాది మహర్షులకు మాత్రం ఏం తెలుస్తుంది? అన్యచింతనం మాని నిరంతరం శ్రీహరిని సేవించే సహస్రవదనుడైన ఆదిశేషువు కూడా అతని చరిత్ర నెఱుగడు అన్యాలోచన లేకుండా నిరంతరం తన పాదపద్మాలను ఆశ్రయించి భజించే భక్తులను శ్రీహరి కరుణిస్తాడు అలాంటి సుకృతాత్ములే ఆ శ్రీహరి మాయను దాటగలరు.

సంసార లంపటంలో కొన్నాళ్ళు కొట్టుకొని ప్రాణావసాన సమయంలో కుక్కలకు నక్కలకు భక్ష్య యోగ్యమైన శరీరమందు మమకారం విడిచి భగవంతుని ఆశ్రయించిన పుణ్యాత్ములు కొందరుంటారు చెపుతావిను నేను సృష్టి కర్తనను అహంకారాన్ని చంపుకొని రాజసాన్ని విడిచి ఆ శ్రీహరికి శరణా గతుడినైనప్పుడే అతని ప్రతిభ తెలుసుకోగలుగుతాను రజోగుణాన్ని విడిచి

పెట్టకపోతే తెలిసికోలేను శాస్త్రచర్చ జోలికి పోకుండా కేవల భక్తిజ్ఞాన యోగంతో సేవిస్తాను

అలాగే సనకాదులైన మీరు భగవంతుడైన రుద్రుడు దైత్యనాథుడయిన ప్రహ్లాదుడు స్వాయంభువ మనువు అతని పత్ని శతరూప వారికొడుకులు ప్రియవ్రతోత్తానపాదులు వారి కూతుళ్ళు ఇంద్రుడు ఋభువు వేనుని తండ్రి యగు నంగుడు ధ్రువుడు శ్రీహరి మాయను అతిక్రమించగలరు గాధి యుడు ఇక్ష్వాకుడు దిలీపుడు మాంధాత యయాతి సగరుడు రఘువు ముచికుందుడు రంతిదేవుడు ఉద్ధవుడు బలి, విభీషణుడు శిబి పార్థుడు విదురుడు అంబరీషుడు పరాశరుడు అలర్కుడు మొదలైన మహాత్ములుకూడా ఆ శ్రీహరిని చిత్తములందు నిలిపి దురంతమైన విష్ణుమాయకు అతీతులుగా వుంటారు.

నారదా వీరేకాదు స్త్రీలు శూద్రదల హూణులు శ్రీహరి భక్తియోగం చేత మాయా సముద్రాన్ని ఇట్టే తరిస్తారు ఇంతెందుకు తుదకు పశుపక్ష్యాదులు కూడా శ్రీహరి అనుగ్రహానికి పాత్రములైతే మాయను భేదించగలవు కనుక విశ్వాత్మకుడు, శాశ్వతుడు అయిన ఈశ్వరుని ఎప్పుడూ మనస్సులో నిలిపి ఆరాధించు అలా చేస్తే అవిద్య సిగ్గుతో దగ్గఱకురాక దూరదూరంగా తొలగి పోతుంది

నిరంతరం శ్రీహరిని ధ్యానిస్తూ దుఃఖరహితమైన సౌఖ్యాన్ని పొందే ధీనిధులు ఏమఱుపాటుగా నైనా అన్యకార్యాలు చెయ్యరు అమృతాన్ని త్రావెడి ఇంద్రుడు దప్పికగొని నీటికోసం నుయ్యి త్రవ్వుతాడా? అలాంటి పని ఎన్నడూ చేయడు •

జీవకోటి సంయోగ వియోగాలు చెందుతూ నశించినా సర్వశక్తిమంతుడు, సర్వాంతర్యామి అయిన విష్ణువు మాత్రం ఆకాశంలాగా శాశ్వతంగా వుంటాడు కారణ కార్యాలకు హేతువు శ్రీహరి- అతనికంటె పరులెవ్వరు లేరు. కనుక ఆతఁడి కొనియాడకపోతే ప్రకృతికి అతీతుడైన నిర్గుణ బ్రహ్మాన్ని చేరడం అసంభవం

భాగవతం వేదార్థాలను ప్రతిపాదిస్తుంది మోక్షాన్ని ఇస్తుంది అది కల్ప వృక్షం లాంటిది శాస్త్రాలన్నిటికంటె అది ఉత్తమమైనది. దాన్ని భగవంతుడు రచించాడు దాన్ని నేను నీకు సంగ్రహంగా చెప్పాను కుమారా నీవు దాన్ని విస్తృతపరచి చెప్పు

అన్ని జన్మల్లో పురుషజన్మ ఉత్కృష్టం. అందులో బ్రాహ్మణకులంలో పుట్టడం మఱీ విశేషం. కాబట్టి అశాశ్వతమైన కార్యాలుచేసి నశించకుండా

• పరువడి నుయ్యిద్రవ్వనె పిపాసితుడై సలిలాభిలాషతన్ - అను పాఠము అనుసరింపబడ్డది.

విష్ణువును సేవించి శాశ్వతపదం పొందాలి వ్రతోపవాసాలవల్లకాని జపతపాదుల వల్లకాని మోక్షం లభించదు అది ఒక విష్ణు భక్తివల్లనే సాధ్యమౌతుంది అజ్ఞానం నశించాలంటే శ్రీహరి మహిమను నిత్యం స్తుతించాలి. ఇతరులు స్తుతిస్తూంటే విని పరవశించాలి -" అని బ్రహ్మ నారదునకు చెప్పిన భాగవత సంబంధమైన ముఖ్య కథాసూచన శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు చెప్పగా ఆ మనుజేంద్రుడిలా అన్నాడు—

## పరీక్షిత్తు శుకుని ప్రపంచోత్పత్తిని గూర్చి అడుగుట

యోగీంద్రా విధాత నారదునికి చెప్పినట్లు నీవు గుణ రహితుడైన శ్రీహరి కథలు కృపాబుద్ధితో నాకు చెప్పావు నాకిప్పుడు జ్ఞానోదయమైంది నా మనస్సు నిస్సంగమైంది ఆద్యంత భావశూన్యుడు చిన్మయాకారుడు అయిన ఆ శ్రీహరియందే బుద్ధి నిలిపి అస్థిరమైన విభవాన్ని హేయమైన శరీరాన్ని విడిచి పెడతాను

అదీకాక శ్రద్ధతో శ్రీహరి గుణ సంకీర్తనం వినేవాని హృదయంలో శ్రీహరి ప్రవేశించి శరత్కాలం నీటిలోని కాలుష్యాన్ని పోగొట్టినట్లు అతని హృదయంలోని మాలిన్యాన్ని తొలగించివేస్తాడు వేసవి మండుటెండలో అడవుల్లో తిరుగుతూ దప్పికచెందిన బాటసారి యింటికి చేరి శ్రమ తీర్చుకొని మరియెక్కడకూ కదలడు అలాగే జన్మజన్మల దుఃఖాలను పోగొట్టుకొని శ్రీహరి చరణసాన్నిధ్యం చేరిన భక్తుడిక అక్కడనుండి కదలుతాడా?

యోగీంద్రా నన్ను ఎన్నో సందేహాలు పీడిస్తున్నాయి ఆ సందేహాలు నీవే తీర్చాలి ఏ ప్రాణితోను సంబంధించని ఆత్మకు భూతసంగమం ఎలా కలిగింది? అకారణ గానా? కర్మవశంచేతనా సకలలోక సృష్టికి ఆధారభూతమైనది శ్రీహరి నాభికమలం ఆ కమలంనుండి బ్రహ్మపుట్టి శ్రీహరి అనుగ్రహంతో లోకసృష్టి చేశాడు ఆ బ్రహ్మ పరమేశ్వరుని రూపాన్ని ఎలా కనుగొన్నాడూ? వారిద్దరికీ ఏ విషయంలోనైనా భేదమేమైనా వుందా?

సర్వేశ్వరుడు సృష్టి స్థితి సంహారాలకు కారణమైన మాయను విడిచి రమాధవుడై ఎక్కడెక్కడ విశ్రమింపాడు? మహాకల్పాలు, అవాంతరకల్పాలు భూత భవిష్యద్వర్తమాన కాలాలు స్థూల దేహాభిమానులై జన్మించిన దేవపితృ మనుష్యులు మొదలగువారి ఆయుః ప్రమాణం ఎంత? జీవులు ఏయేకర్మలు చేసి యేయే లోకాలకు పోతారు? వారికి దైవత్వం ఎలా ప్రాప్తిస్తుంది? ఆ కర్మలెలా చెయ్యాలి? అవి యెవరికి అర్పించాలి? ఎవరు గ్రహిస్తారు? చరాచరాత్మకములైన ఈ లోకాలు ఎలా సంభవించాయి? బ్రహ్మాండం యొక్క పరిమాణం ఎంత? మహాత్ముల చరిత్రలు ఎలాంటివి?

మునీంద్రా నీవలన ఇంకా ఎన్నో విషయాలు వినాలని వుంది వర్ణాశ్రమ ధర్మాలు శ్రీహరి అవతార చరిత్రలు యుగాలు యుగప్రమాణాలు యుగధర్మాలు ప్రతి యుగంలో మానవులు పాటించదగిన సాధారణధర్మాలు, విశేషధర్మాలు జాతి విశేషధర్మాలు రాజర్షులు నిర్వర్తింపవలసిన ధర్మాలు ఆపద్ధర్మాలు తెలిసికోవాలని వుంది

అంతేకాక మహదాది తత్వాల సంఖ్యా ఆ సంఖ్యాలక్షణం భగవదారాధన విధానం అష్టాంగ యోగక్రమం అణిమాది అష్టయిశ్వర్య ప్రకారం లింగశరీర విలయం, వేదాలు ఉపవేదాలు ఆయుర్వేదం ధర్మశాస్త్రాలు పురాణేతిహాసాలు అవాంతర ప్రళయం మహాప్రళయం ఇష్టాపూర్తాలనెడి యాగాది వైదిక కర్మలు స్మార్తకర్మలు కామ్యకర్మలైన అగ్నిహోత్రాల అనుష్ఠాన విధానం జీవసృష్టి ధర్మార్థకామాల ఆచరణం జీవాత్మ బంధమోక్షవిధానం, సర్వస్వతంత్రుడైన ఈశ్వరుడు నిజమాయవలన సర్వకర్మలకు సాక్షియై తిరిగి అంతలోనే ఆ మాయను విడిచి నిర్లిప్తంగా వుండటం- ఈ మొదలైన విషయాలన్నీ కూడా నీవలన వినాలని వుంది

“బ్రాహ్మణ శాపంవలన శోకవ్యాకుల చిత్తుడవై నిరశనవ్రతం పూనిన నీవు నే చెప్పేది ఎలా వినగలుగుతా”వని అంటావేమో? ఆ సందేహం వద్దు నీ ముఖ పద్మంనుండి స్రవించెడి విష్ణుకథా సుధాధారలను తనివితీరా ఆస్వాదించాలని కుతూహలపడుతున్నాను నా ఇంద్రియాలు ఇప్పుడు నా స్వాధీనంలోనే వున్నాయి కనుక నేనడిగిన ప్రశ్నలకు సవిస్తరంగా సమాధానాలు చెప్పి నా సంశయాలు తీర్చటానికి, పరమేష్ఠితుల్యుడవైన నీ వొక్కడవే సమర్థుడవు”- అని పరీక్షిన్నరేంద్రుడర్థించేసరికి శుక యోగీంద్రుడు బ్రహ్మనారద సంవాదాన్ని, పూర్వం సర్వేశ్వరుడు బ్రహ్మకల్పంలో బ్రహ్మకుపదేశించిన వేదతుల్యమగు భాగవత పురాణాన్ని ఈ రీతిగా చెప్పటం ప్రారంభించాడు—

“రాజేంద్రా భూతహితుడు, జ్ఞానస్వరూపుడు అయిన ప్రాణికి ఈశ్వర మాయవలన దేహ సంబంధం కలుగుతుంది ఆ సంబంధం నిద్రలో కలలో తోచిన దేహబంధాల్లాంటిదే శ్రీహరి యోగమాయా మహిమవలన జీవుడికి అలా పాంచభౌతికమైన దేహసంబంధం కలగగానే గుణప్రభావంచేత దేవమనుష్యాది రూపాలు వివిధ వయోవస్థలు పొంది “నేను నాది” అని సంసార మాయలో పడతాడు

అలాంటివాడు కూడా ఎప్పుడైనా ప్రకృతి పురుషాతీతమైన బ్రహ్మ స్వరూపాన్ని నిష్ఠతో ధ్యానిస్తే సంసార వ్యామోహం తొలగి ముక్తుడౌతాడు. జీవునకు, ఈశ్వరునకు కూడా దేహసంబంధం కనబడుతూ వుంటుంది అలా

టప్పుడు దేహధారియైన భగవంతుని భక్తితో సేవిస్తే మాత్రం ముక్తి యెలా కలుగుతుందని కదా నీవడిగినది విను

జీవుడు అవిద్యా ప్రభావంచేత కర్మానుగతమైన మిథ్యారూప దేహ సంబంధం కలిగివుంటాడు ఈశ్వరుడలా కాడు. నిజయోగ మాయా మహిమ వలన తనంతటతానే చిద్రూపకమైన[1] లీలావిగ్రహం ధరిస్తాడు కనుక ముక్తి సాధనమైన జ్ఞానంకోసం భగవంతుడైన ఈశ్వరుకు భక్తిని కల్పించాడు బ్రహ్మ చేసిన నిష్కపట తపస్సునకు మెచ్చి శ్రీహరి తన జ్ఞానానంద ఘనమైన స్వరూపంతో అతనికి సాక్షాత్కరించి భక్తియోగాన్ని ఉపదేశించాడు కనుక జీవునకు భగవద్భక్తి ఒక్కటే మోక్షాన్ని ఇస్తుంది బ్రహ్మదేవుని తపో వృత్తాంతం చెపితే నీ సంశయం తీరుతుంది చెపుతాను విను

## బ్రహ్మదేవుని తపశ్చర్య

బ్రహ్మ దేవతలందరిలోను పెద్దవాడు భగవద్భక్తియొక్క రహస్యాన్ని జీవకోటికి ఉపదేశించగలవాడు. అలాంటి బ్రహ్మకు కల్పాదియందు తన జననానికి కారణ భూతమైన పద్మం మొదలు ఎక్కడవుందో తెలిసికోవాలని కోరిక కలిగింది. నీళ్ళల్లో గాలించిచూచాడు కాని దాని మొదలెక్కడుందో తెలుసుకోలేక తిరిగి వచ్చి తన పద్మాసనంమీద కూర్చున్నాడు

ఇంతలో అతనికి విశ్వసృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగింది కాని ఎక్కడా దారి దొరకలేదు నిశ్చేష్టుడై ఎంతో చింతించాడు ఇంతలో జల మధ్యం నుండి అతనికి ఒక శబ్దం వినబడ్డది అక్షర సమామ్నాయంలో[2] స్పర్శాల్లో[3] పదునారవది (త) ఇరవై ఒకటవది (ప)- అను అక్షరద్వయంవలన నైన శబ్ద మది తప అనెడి ఆ శబ్దమే మునిజనుల పాలిటి ధనం బ్రహ్మకు ఆ శబ్దా రెండు సార్లు వినిపించింది

బ్రహ్మ ఆశ్చర్యంతో ఆ శబ్దాన్ని పలికిన పురుషుణ్ణి చూడాలని కుతూహల పడి నాలుదిక్కులూ వెదికాడు కాని కనబడలేదు తిరిగివచ్చి తన పద్మాసనం మీద కూర్చుండి కొంతసేపు ఆలోచించాడు. తాను విన్నశబ్దం తనను తపస్సు చెయ్యమని ఎవరో ప్రేరేపించినట్లు భావించాడు వెంటనే ప్రాణాయామం వహించాడు ఇంద్రియాలను జయించాడు. ఏకాగ్రచిత్తంతో వేయి దివ్య సంవత్సరాలు అతి దారుణమైన తపస్సు చేసేసరికి ఈశ్వరుడు సాక్షాత్కరించాడు. అపుడు బ్రహ్మదేవునకు వైకుంఠం కళ్ళకు కట్టినట్లు కనబడ్డది.

---

1. జ్ఞాన రూపకమైన 2 సముదాయంలో 3. 'క మొదలు మ వఱకు గల అక్షరాలకు స్పర్శములని పేరు

ఆ వైకుంఠ నగరం శుద్ధసాత్వికం అక్కడ రాజస తామస గుణ వికారాలేవీలేవు ఏ వైపు చూచినా దేవతల స్తోత్రనాదాలు వినబడుతున్నాయి అక్కడకు వచ్చినవారు తిరిగి వెళ్ళడమంటూలేదు. అనంతమైన దివ్య తేజస్సుతో అది ధగధగలాడుతోంది ఆ తేజంముందు సూర్య చంద్రాగ్నుల తేజం వెల వెల పోతోంది మణిమయాలైన సమున్నత సౌధాలతోను పుష్ప ఫల భారంతో వంగిపోయిన వృక్ష పంక్తులతోను గాలికి రెపరెపలాడే సువర్ణదండాలు గల ధ్వజాలతోను కలువల్తోను తామర పువ్వుల్లోను తొణికిసలాడే మకరందం త్రావి మత్తిల్లిన తుమ్మెదల ఝుంకృతికి నిద్రమేల్కొనెడి హంసలతో ముచ్చటగావున్న కొలకులతోను ఆ వైకుంఠ నగరం కలకలలాడుతోంది.

ఆ నగరోద్యానవనాల్లో రా చిలుకలు "నదైవం కేశవాత్పరం![1]" అని నిరంతరం ఉద్ఘోషిస్తున్నాయి గోరువంకలు "సర్వం విష్ణుమయం"[3] అని నొక్కి చెపుతున్నాయి కోకిలలు "జితంతే పుండరీకాక్ష![2]"- అని శ్రుతిమధురంగా గానం చేస్తున్నాయి నెమళ్ళు "మంగళం మధుసూదన!" అని క్రేంకారాలు చేస్తున్నాయి తుమ్మెదలు, "శ్రౌషట్, వషట్ స్వధా, స్వాహా[3]" అని రొదవెట్టుతున్నాయి. ఎక్కడచూచినా విష్ణుతేజం ఉట్టిపడుతోంది.

మేఘ పంక్తులతో విలసిల్లెడి ఆకాశంలాగా వెలుగులు చిమ్ముతూన్న ఆ దివ్యధామంలో శ్రీ మహావిష్ణువునకు ఇరువైపులా నిలబడి సునందుడు నందుడు అర్హణుడు ప్రబలుడు మొదలైన పార్శ్వచరులు ఆ దేవదేవుని సేవిస్తున్నారు. నల్లకలువల కాంతిని ధిక్కరించెడి మైచాయతో, పీతాంబరాలతో, తెల్లదామర రేకుల్లాంటి కళ్ళతో నానా విధాలైన మణిమయ భూషణాలతో ఆపార్శ్వచరులు కూడా సాక్షాత్తు శ్రీహరిలాగానే వున్నారు. వారు నిత్య యౌవనులు నిర్మల చరిత్రులు.

వారలా ఇరువైపులా సేవిస్తూండగా బంగరు తూగుటుయ్యాలపై శయనించిన శ్రీ మహావిష్ణువును కరవుదీరా చూచి బ్రహ్మ పరవశించిపోయాడు అఖిల కల్మషాలను హరించెడి ఆకాశగంగకు ఆ దేవదేవుని చరణ కమలం జన్మస్థలం. సమస్త సంపదలకు కారణమైన లక్ష్మికి ఆ మహామహుని వక్షస్థలం నివాసభూమి సూర్యచంద్రులు కరుణాతరంగితాలైన ఆ పరమ పూరుషుని కనుల జంట సృష్టి కర్త బ్రహ్మ ఆ విశ్వేశ్వరుని నాభి కమలంనుండి పుట్టాడు ఆయన వాహనం గరుడుడు. శయనం ఆదిశేషుడు. సురలూ మునులూ ఆ లోక గురువును నిరంతరం సేవిస్తూ వుంటారు.

---

1 కేశవునికంటె మరో దైవం లేదు 2 పుండరీకాక్షా! నీకు జయము జయము 3 మంత్రధ్వనులు

సౌందర్యరాశియైన రమాదేవి ఆ దేవదేవుని పాదాలు ఒత్తుతూ ఆయన కీర్తిని గానం చేస్తోంది తన తలలో తురుముకొన్న పుష్పమాలికల సుగంధానికి నలువైపులా మూగి తుమ్మెదలు ఝుంకారం చేస్తూ ఆ దేవి పాటకు శ్రుతి కల్పిస్తున్నట్లుంది.

అలా లక్ష్మీదేవి సేవించుకుంటూ సకలైశ్వర్యాలతో తులతూగుతూన్న దేవదేవుని ప్రకృతి పురుషుడు మహత్తు అహంకారం అనెడి నాల్గు శక్తులు, కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు, మనస్సు పంచభూతాలు అనెడి పదునారు శక్తులు పంచతన్మాత్రలు కూడ పరివేష్ఠించి సేవిస్తున్నాయి. అలా మహావైభవంగా కోటిసూర్యుల కాంతితో ప్రకాశిస్తూన్న శ్రీమన్నారాయణుని చూచేసరికి బ్రహ్మకు ఒళ్ళు గగుర్పొడిచింది హృదయం ఆనందంతో పులకించింది. కనుల నుండి జారిన సంతోష బాష్ప ధారలతో చెక్కిళ్ళు చెమ్మగిల్లాయి. వెంటనే ఆ దేవదేవుని పాద పద్మాలపై తన నాలుగు తలలూ మోపి నమస్కరించాడు

అపుడు శ్రీహరి తన బొడ్డు తమ్మియందు పుట్టిన తొలిబిడ్డడగు నా చతుర్ముఖుని తన పాణి పద్మాలతో స్పృశించి- 'కుమారా త్యాగబుద్ధితో చిరకాలం తపస్సమాధిలోవున్న నీలాంటి వాళ్ళను మెచ్చుకుంటాను. కాని కపటమునుల వంక కన్నెత్తయినా చూడను నీకు మేలు కలుగగాక నీ వాంఛితం ఏమిటో చెప్పు నా దర్శనంవల్ల అన్ని విపత్తులూ అణగిపోతాయి ఇంకో రహస్యం విను

నీవు నా మాట ననుసరించి తపస్సు చేశావు అయినా తపో విభవాన్ని ఒట్టికాదు నేను నీకు సాక్షాత్కరించి వైకుంఠాన్ని చూపించింది. నీయందు నాకు పరిపూర్ణమైన అనుగ్రహం వుంది అందేతనే అలా చేశాను. తపస్సు అందే ఏమనుకుంటావు? నా హృదయమే తపస్సు. తపోవృక్షానికి ఫలాన్ని నేనే తపస్సువల్లనే నేను సృష్టి స్థితి సంహారాలు చేస్తూంటాను నా భక్తికి మూలధనం తపస్సు అది గ్రహించి నీవు తపస్సు చేశావు కనుక నీ మోహం తొలిగింది'—

అని శ్రీహరి అనేసరికి బ్రహ్మ మహానందం చెంది- దేవా! ఈ లోకమంతటిలోనూ నీకు తెలియని అర్థమేముంది? అయినా నా మనోభీప్సితం యేమిటో నీకు నమస్కరించి చెపుతాను. విను.

నీ స్థూల సూక్ష్మరూపాలుకాని సకల శక్తులతో సంప్రవృద్ధాలైన బ్రహ్మాది రూపాలుకాని అవక్తాలు. నీయంతట నీవే అలా నానా విధాలైన రూపాలు ధరించి తంతుకీటం (సాలెపురుగు) లాగా ఉత్పత్తి స్థితి సంహారాలు చేస్తూంటావు. నీ సంకల్పం అమోఘం నీ లీలావిశేషాల మహిమను తెలిసికోగలిగిన పరిజ్ఞానం నాకు అనుగ్రహించు.

నీ ఆజ్ఞానుసారం నేను జగన్నిర్మాణం చేసేటప్పుడు నేనే సృష్టికర్తను

అనే అహంభావం నాకు కలుగవచ్చు అది పరిహరింపజేసి నన్ను అనుగ్రహించు - అని బ్రహ్మ వేడేసరికి పుండరీకాక్షు డతనికి ఇలా అన్నాడు—

కమల సంభవా! శాస్త్రార్థాలను విచారించి తెలిసికోగలిగిన పరిజ్ఞానం, అనన్యమైన భక్తి, ఆత్మ సాక్షాత్కారం- ఈ మూడింటిని నీవు నీ మనస్సులో పాదుకొలుపుకోవాలి అపుడు నా అనుగ్రహ విశేషంచేత నీకు నా స్వరూప స్వభావాలు నా అవతార రహస్యాలు తెలుస్తాయి. తత్వజ్ఞానం లభిస్తుంది సృష్టికి పూర్వం కర్మరహితుడనై నే నొక్కడనే వుంటాను. స్థూల సూక్ష్మ స్వరూపాలు కాని, వాటి కారణభూతమైన ప్రకృతికాని నా అంశలో లీనమైపోతాయి అపుడు నేను అద్వితీయుడనై వుంటాను. నాకంటె అన్యమైనదేదీ వుండదు సృష్టికాలంలో దృశ్యమానమైన ఈ జగత్తంతా నా రూపమే. ప్రళయానంతరం మొదలు తుదిలేని, పరిపూర్ణము, నిత్యము అయిన మహిమతో పరమాత్ముడనై వుంటాను. ఇక నీ వడిగిన జగన్నిర్మాణ మాయా విధానం చెపుతాను విను

దేని మహిమవలన లేని వస్తువు ముత్తెపుచిప్పలో వెండిలాగా వున్నట్లు భ్రాంతి కలిగి తిరిగి అంతలోనే కనబడకుండా పోతుందో అదే నా మాయా విశేషం లేనిది ఉన్నట్లు కనుపించడం ఇద్దరు చంద్రులున్నారనుకొనడంలాంటిది. అలాగే ఉన్నది లేనట్లు తోచడం చీకటి ప్రభావం. ఏ రీతిగా పంచభూతాలు భౌతికాలైన ఘటపటాదుల్లో[1] ప్రవేశించి వుంటాయో అదే రీతిగా భౌతికాలైన అన్ని వస్తువుల్లోను నేను సత్వాది రూపాలతో మిళితమై ఉంటాను.

సర్వకాలాల్లో సర్వదేశాల్లో తెలిసికోదగినది పరబ్రహ్మ స్వరూపం. అది తెలిసికోవాలని కాంక్షించే నీవంటి వాళ్ళు నేను చెప్పినది నా తత్వాత్మకమైన యర్థమని తెలిసికోగలరు. మహోత్కృష్టమైన ఈ అర్థాన్ని మనస్సులో నిలుపుకొంటే సృష్టి కార్యంలో నీకు మోహం కలుగదు'- అని పరమేశ్వరుడు బ్రహ్మదేవున కాజ్ఞాపించి వైకుంఠంతోగూడి అంతర్హితుడయ్యా"డని శుకుడు పరీక్షిత్తునకు ఇంకా ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

"శ్రీహరి అలా అంతర్హితుడయ్యాక, బ్రహ్మ మహానందంతో పూర్వంలాగా సమస్త ప్రపంచాన్ని సృష్టించాడు. అనంతరం ఆతడు ఆత్మహితంకోసం కాక కేవలం లోక శ్రేయస్సుకోరి యమనియమాలు పాటిస్తూ తపస్సు చేశాడు అనంతరం ఒకనాడు నారదుడు తన తండ్రియైన బ్రహ్మ దగ్గరకు వచ్చి ఆయన్ను యథోచితంగా పూజించి నీవు నన్నడిగినట్లుగానే భగవన్మాయను గురించి తెలుసుకోవాలని అభిలషించాడు.

అపుడు బ్రహ్మదేవుడు భక్తజన పారిజాతమైన శ్రీహరి తనకు చెప్పిన భాగవతాన్ని నారదునకు చెప్పాడు. అది చతుశ్లోక మూలకం దశ లక్షణ

1 కడవలు, బట్టలు మొదలైన వస్తుజాలంలో

సమన్వితం. సరస్వతీనదీ తీరాన నారద మహర్షి ఆ మహా పురాణాన్ని హరి భక్తుడు, ఆత్మవేది అయిన నా తండ్రి వ్యాస భగవానునకు చెప్పారు. ఆ మహానుభావుడు దాన్ని నాకు చెప్పారు. నేను నీకు ఇప్పుడు చెబుతాను. విరాట్పురుషుని వలన ఈ జగత్తు ఎలా జనించిందని అడిగావు అదొక్కటే కాదు. ఇంకా ఎన్నో ప్రశ్నలడిగావు వాటి కన్నింటికి సమాధానంగా నీకు భాగవతాన్ని వినిపిస్తాను. విను.

ఆ మహా పురాణం చతుశ్శ్లోక రూపంతో పది లక్షణాలు కలిగి వుంటుంది. సృష్టి, ప్రతిసృష్టి స్థానం, పోషణం, ఊతులు, మన్వంతరం, ఈశాను చరితం, నిరోధం, ముక్తి, ఆశ్రయం అనేవి ఆ పది లక్షణాలు. వాటిల్లో పదవదియైన ఆశ్రయ రూప బ్రహ్మం ముఖ్యం. దానిని పరిశీలించడానికే మిగిలిన తొమ్మిది చెప్పబడ్డాయి. వాటిని వివరిస్తాను: విను.

మహత్తు అహంకారం, పంచతన్మాత్రలు, ఆకాశం, గాలి, నీరు, అగ్ని, భూమి, భూతపంచకం ఇంద్రియాలు- ఇవి భగవంతుని యందుంటాయి. వీటితో జరిగే సృష్టి సర్గం.

బ్రహ్మ విరాట్పురుషుని వలన జనించి చేసే చరాచర సృష్టి విసర్గం. లోక ద్రోహులైన రాజులను వధించి లోకాలన్ని నిలిపిన ఆ శ్రీహరి కృత విజయం స్థానం. ఆ దేవదేవుడు చేసేటి భక్తజనోద్ధరణం పోషణం. కర్మ వాసనలు ఊతులు. శ్రీహరి కృపా కటాక్షంవలన సకల లోకాలను పరిపాలించెడి శక్తులవారి ధర్మాన వర్తనాలు మన్వంతరాలు. పుండరీకాక్షుడు ఆయా అవతారములందు చేసిన అద్భుతాలను చెప్పడం ఈశానుచరితం. శ్రీహరి వైకుంఠంలో శేషశయ్యపై యోగనిద్రలో ఉన్నప్పుడు సమస్త జీవులు తమతమ వ్యాపారాలు మాని తేజోహీనంగా ఉన్నప్పుడు స్థితిగతులను వర్ణించి చెప్పడం నిరోధం దీనినే అవాంతర ప్రళయం అని అంటారు. భగవత్కృపవలన జీవుడు అనేక జన్మలెత్తి పూర్వ సంచితాలైన పాపాలనుండి విముక్తుడై భగవత్సారూప్యం పొందడం ముక్తి. ఉత్పత్తి స్థితి లయాలకు కారణం ఆశ్రయం అదే పరమాత్మ. అదే బ్రహ్మశబ్ద వాచ్యం.

ప్రత్యక్షానుభవంతో తన స్వరూపాన్ని తెలియజెయ్యడానికి ఆత్మ ఆధ్యాత్మికం అధిదైవికం అధి భౌతికం అని ముత్తెఱగులయింది. ద్రష్ట[1] ఆధ్యాత్మికుడు దృష్టి సాధనమైన ఇంద్రియానికి అధిష్ఠాత ఆధిదైవికుడు. దృశ్యం[2] అధి భౌతికం. ఈ మూడు పరస్పరాశ్రయాలు. ఈ మూడింటిలో ఏ ఒకటి లేక పోయినా మిగిలిన రెండింటికి ప్రయోజనం ఏమీ వుండదు. ఆ మూడు విధాలైన ఆత్మను తెలిసికొన్నవాడే సర్వలోకాశ్రయుడు అతడే పరమాత్మ.

---

1 ద్రష్ట=చూచేవాడు 2 దృశ్యం=చూడబడేది

ఆ మహాత్మునకు ఏదో వినోదార్థం జగత్సృష్టి చెయ్యాలనే సంకల్పం కలిగింది. బ్రహ్మాండాన్ని భేదించుకొని బయటకు వచ్చారు. తనకు సుఖంగా వుండే స్థానం కావాలనుకొని తొలిగా పరిశుద్ధమైన జలరాశిని సృష్టించి దానిలో శయనించారు. అందుచేతనే ఆయనకు 'నారాయణుడు'[1] అనే పేరు వచ్చింది. అతని ప్రభావం వర్ణించడం ఎవరి తరమూ కాదు.

పురుషోత్తముడలా వేయి సంవత్సరాలు ఏకార్ణవాకారమైన జలరాశిలో యోగశయ్యపై నిద్రించి తానొక్కడయ్యుండీ అనేక విధాలుగా గోచరింపదలచి మేల్కొన్నారు. తొలిగా ఇంద్రియశక్తి మనశ్శక్తి దేహశక్తి అనే శక్తిత్రయం ఉద్భవించింది. అనంతరం క్రమంగా ప్రాణాలు, ఇతరేంద్రియాలు జనించాయి.

తరువాత వాగింద్రియం, ఘ్రాణేంద్రియం, చక్షురింద్రియం మొదలైనవి సృజింపబడ్డాయి. ఆపైన పంచభూతాలు, ఆ పంచభూతాలు ఆధారంగా వివిధావయవాలు ఏర్పడ్డాయి. ఈ విధంగా సర్వేశ్వరుని స్థూల విగ్రహం కల్పితమైంది. దీనికి కారణభూతమైన భగవంతుని సూక్ష్మరూపం ఇలా వుంటుందని చెప్పడానికి గాని మనస్సుతో ఊహించడానికి గాని సాధ్యం కాదు.

స్థూల సూక్ష్మరూపాలతో ప్రకాశించే భగవత్స్వరూపాన్ని ఆ మహాత్ముని మాయాబలంచేత మునీంద్రులు కూడా గ్రహించలేరు. జగన్నియంతయైన ఆ నారాయణుడే ప్రజాపతులను, ఋషులను, పితరులను, దేవగణాన్ని, నరులను, రాక్షసులను, పశుపక్ష్యాదులను సృజించారు. ఆ మహాత్ముడే బ్రహ్మయై విశ్వాన్ని సృష్టిస్తారు హరియై పోషిస్తారు హరుడై సంహరిస్తారు' అని శుక మహర్షి పరీక్షిత్తునకు చెప్పా"డని సూతుడనేసరికి శౌనకుడు—

"మహాభాగా పరమ భాగవతోత్తముడైన విదురుడు బంధుమిత్రులను విడిచి తీర్థాటనం చేస్తూ మైత్రేయునివలన ఆధ్యాత్మ విషయాలు తెలిసికొన్నారని విన్నాను. ఆ విషయం సమగ్రంగా వినాలని కుతూహలంగా వుంది" అనేసరికి సూతుడు - "పరీక్షిత్తు శుకుని ఇలాగే ప్రశ్నించారు. ఆ ప్రకారం చెపుతా వినండి" అన్నారు.

25002

1 పురుషపద వాచ్యుడైన నరునివలన కలుగుటచేత నీటికి నారములు అని పేరువచ్చింది. అయనం అంటే స్థానం. నారములు (నీళ్ళు) స్థానంగా కలవాడు కనుక నారాయణుడని పేరు.



# మహాభాగవతం

## తృతీయ స్కంధం

'శుక మహర్షి పరీక్షిన్నరేంద్రునకు విదురుని వృత్తాంతం ఇలా చెప్పడం మొదలు పెట్టాడు

'రాజేంద్రా పాండుసుతులు బాహుబలంతో ధార్తరాష్ట్రులను రణరంగంలో జయించి అఖండ కీర్తి నార్జించడం కౌరవ రాజ్యలక్ష్మిని హస్తగతం చేసికొని రాజ్యపాలన చెయ్యడం నీకు తెలుసుకదా

అంతకుముందే విదురుడు అడవులకుపోయి అక్కడ తపోధనుడైన మైత్రేయుని దర్శించి ఆ మహానుభావుని పాదాలపై వ్రాలి - మునీంద్రా పాండవ హితంకోరి దూత భావంతో హస్తిపురికి వచ్చిన కృష్ణుడు ధృతరాష్ట్రుని మందిరంలో ఉండకుండా నా యింటికి రావడానికి కారణమేమిటి?' అని అడిగా'డని శుకు డనేసరికి - పరీక్షిన్నరనాథుడు ఆశ్చర్యపడి 'మహానుభావుడైన విదురుడు మైత్రేయుని ఇంకా ఏయే రహస్యా లడిగాడు? ఏయే తీర్థాలు సేవించాడు? ఎక్కడ తిరుగుతున్నాడు? చెప్ప మని అర్థించాడు అపుడు శుక యోగీంద్రు డిలా చెప్పడం మొదలుపెట్టాడు.

'నరేంద్రా విను. పాండురాజు మరణానంతరం ధర్మరాజాదులు భయాక్రాంతులై వచ్చి ధృతరాష్ట్రుని ఆశ్రయించారు. కాని అసూయాపరుడైన దుర్యోధనుడు వారిని నానా కష్టాలు పెట్టాడు. విషాన్నం పెట్టించాడు. పాశబద్ధుల్ని చేశాడు గంగలో వారు నిద్రిస్తుండగా నిప్పుపెట్టించాడు. రాజసూయానంతరం అవభృథస్నాన పవిత్రయైన ద్రౌపది కొప్పుబట్టి కొలువులోనికి ఈడ్చాడు. ఇలా పాండుసూనులకు సుయోధనాదులు ఏదో ఒక అపకారం చెయ్యని దినమంటూ లేదు.

అయినా పుత్ర ప్రేమతో అంధ నృపతి వారిని వారింపడయ్యె మాయా ద్యూతంలో వారి రాజ్యాన్ని అపహరించి అడవులకు వెడలనంపి గడువు దాటాక వాడు తిరిగివచ్చి తమ రాజ్య భాగం తమకు ఇవ్వమని అడిగితే ఇవ్వడయ్యె అపుడు భక్తజన కల్పకమైన శ్రీకృష్ణ భగవానుడు ధర్మరాజు పనుపున ధృతరాష్ట్రుని కొలువునకు వెళ్ళి భీష్మ ద్రోణాదులు ఇతర రాజన్యులు విని ఆమో

దింపగా 'కౌరవేంద్రా! కౌరవ పాండవ లిరువురూ నీకు సమురే కనుక ఎలా గైనా నీవు పాండు కుమారులకు వారి పాలు వారికిస్తే ఉభయులు సుఖంగా వుంటార'న్నాడు.

కాని ధృతరాష్ట్రి డా మాటలను పెడచెవిని పెట్టేడు అపుడు కృష్ణుడు నీతి నిధియైన విదురుని కౌరవ సభకు పంపేసరికి అతడు ధృతరాష్ట్రి నుద్దేశించి యిలా అన్నాడు.

'రాజేంద్రా! పాండురాజు నీ తమ్ముడు అతని కుమారులను నీవు ఆద రించడం ధర్మం అపుడు నీ వంశం ప్రవృద్ధమౌతుంది శత్రుభయం ఉండదు. శ్రీకృష్ణునకు ప్రీతి పాత్రుడ వౌతావు కనుక ధర్మబుద్ధితో ఎవరిపాలు రాజ్యం వారికిచ్చి కులాన్ని ఉద్ధరించు నా మాట విను వేయిమాట లెందుకూ? వీరాగ్రణి యైన భీముడు నీ కొడుకుల పేరువించే తోక త్రొక్కిన త్రాచులాగా మండి పోతాడు నేను నీకు ముందే చెప్పాను; అతని చేతుల్లో నీ కొడుకుల మరణం తప్పదు.

ఈ ద్రోణుడు భీష్ముడు, కృపుడు కర్ణాదులు నిన్ను ఉద్ధరించగలరని నీవు నిజంగా భావిస్తున్నావా? అయితే విను శ్రీకృష్ణు డెవరనుకుంటున్నావు? పరమేశ్వరుడు అనంతుడు అమృతుడు. పరాత్పరుడు. అలాంటివాడు పాండవు లకు సఖుడుగా, వియ్యంగా బాంధవుడుగా, గురువుగా ప్రభువుగా వెన్నంటి తోడ్పడుతూ వుంటాడు వారిని వ్రేలెత్తి చూపగల వాడెవ్వడూ లేడు. కనుక వారి రాజ్యభాగం వారికిచ్చి వంశాన్ని బంధువర్గాన్ని కాపాడు అలాకాక క్రూరు డైన సుయోధనుని మాట విన్నావా? నీకు కులనాశం బంధునాశం తప్పదు. ఒకని కోసం నీవిలా సకలకుల వినాశానికి దారి తీయడంలో ఏం నీతి వుంది! నా మాటవిని దుర్యోధనుని విడిచి కులాన్ని రాజ్యాన్ని రక్షించు'—

అనేసరికి దుర్యోధనుడు రోష వివశుడై కర్ణ, శకుని, దుశ్శాసనుల వంక తేరిచూచి - 'ఈ దాసీపుత్రుడిలా ప్రేలుతూంటే మీరుపేక్షిస్తారా? వీనిని వెంటనే ఇక్కడనుండి వెడలనంపండి' అన్నాడు.

దుర్యోధనుని దురాలాపాలు విని విదురుడు ఖిన్నుడయ్యాడు కార్యా కార్యాలు విచారించాడు మనోధైర్యం వహించాడు మారు పలకకుండా ధను ర్బాణాలు అక్కడే విడిచి శాంతచిత్తుడై వనాభిముఖంగా వెళ్ళాడు. శ్రీహరి క్షేత్రాలన్నీ దర్శించాడు. గంగాది పుణ్య నదుల్లో క్రుంకులాడాడు.

పురాణ ప్రసిద్ధాలైన పుణ్యాశ్రమా లెన్నో మెట్టాడు. గంధమాదనం మొదలైన గిరులను గిరినికుంజాలను వికసిత పద్మమరందం త్రావి పార వశ్యంతో గానంచేసే తుమ్మెదలతోను హాయిగా నటునిటు నీదులాడే రాయంచల తోను ఎంతో మనోహరంగావున్న సరోవరాలను చూస్తూ ఆశ్రమ వనాల్లో, ఉప

వనాల్లో జన పదాల్లో, పర్వత గుహల్లో, గోశాలల్లో, యజ్ఞ వాటికల్లో దేవాయతనాల్లో కందమూలాలూ నీళ్ళూ ఆహారంగా అసంస్కార శరీరుడై అవధూత వేషధారియై తిరుగుతూ తిరుగుతూ ప్రభాస తీర్థానికి వచ్చాడు

విదురుడా నదీ తీరాన వివిధ తరులతా నికుంజాలలో ప్రశాంతంగా కాలం గడపుతూండగా పరస్పర సంఘర్షణంవల్ల అగ్నిపుట్టి వెదురు టడవి దగ్ధమైనట్లు కౌరవ-పాండవుల్లో వైరం పెరిగి దారుణ యుద్ధం జరిగిందనిన్నీ ఆ యుద్ధంలో కౌరవు లందరు నశించారనిన్నీ విని ఎంతో దుఃఖించాడు అతని మనస్సు వికలమైంది ఇక అక్కడతనికి కాలు నిల్వలేదు.

అక్కడనుండి తిరిగి బయలుదేరి పశ్చిమ వాహినియైన సరస్వతీ నదికి వెళ్ళి ఆ నదీ తోయాల్లో స్నానంచేశాడు. అనంతరం అగ్నితీర్థం, సూర్యతీర్థం శుక్రతీర్థం, వాయుతీర్థం మొదలైన పుణ్య తీర్థాలన్నీ సేవించాడు. ఇంకా అనేకానేక పుణ్యక్షేత్రాలు పవిత్రనదులు, మనోహరములైన కవాటాలతోను గోపురాలతోను విలసిల్లెడి విష్ణుమందిరాలు దర్శిస్తూ వెళ్ళివెళ్ళి మత్స్య దేశాన్ని కురుజాంగల భూములను అతిక్రమించి యమునాతటిని సమీపించేసరికి అక్కడ విష్ణుభక్తుడూ బృహస్పతి శిష్యుడూ, మహాజ్ఞానీ అయిన ఉద్ధవుడు కనబడ్డాడు.

విదురుడు మహానురాగంతో ఉద్ధవుని కౌగిలించుకొని అతని కుశలమడిగి, హరిభక్తులు పుణ్యాత్ములు కురువంశోద్ధారకులు అయిన కుంతీ పుత్రుల క్షేమం తెలిసికోదలచి యిలా అన్నాడు—

ఉద్ధవా నిజనాభి కమలమందు పుట్టిన బ్రహ్మ వేడగా శ్రీహరి యదువంశంలో రామకృష్ణులుగా అవతరించాడు ఆ మహానుభావులు భూభారం తీర్చాక తిరిగి వెళ్ళి శూరసేనుని ఇంట సుఖంగా వున్నారా? కౌరవుల ఆదరాభిమానాలకు పాత్రుడై తన చెలియండ్రను కన్నబిడ్డలకంటె నెక్కుడుగా చూచుకొను వసుదేవునకు క్షేమమేకదా

మన్మథాంశంలో కొడుకును కనాలని కాంక్షించి రుక్మిణి భూదేవతలను సేవించి వారి అనుగ్రహ విశేషంవలన ప్రద్యుమ్నుని కన్నది. యాదవ సేనానాయకుడైన అతడు సుఖంగా వున్నాడా? శ్రీకృష్ణుని కృపాతిశయంచేత పొందిన రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉగ్రసేనుడు ఎలా వున్నాడు? మహా పతివ్రత పార్వతికి కుమారస్వామి జనించినట్లు జాంబవతికి జన్మించిన సుకుమార శరీరుడు సాంబుడు క్షేమంగా వున్నాడా? శ్రీహరి సేవకుడు శత్రు భీకరుడు అయిన అర్జునునివలన విలువిద్య నేర్చిన సాత్యకి సకల సుఖాలతో తులతూగుతున్నాడా?

వృష్ణి వంశోద్ధారకా ఉద్ధవా సకల రాజలక్షణ లక్షితుడైన శ్రీకృష్ణుని పాదధూళిని ధరించి విగత కల్మషుడైన మహానుభావుడు అక్రూరుడు క్షేమంగా

వున్నాడుకదా! క్రతులను, క్రతు సమూహమును ధరించిన వేదమాతలాగా శ్రీహరిని తన కడుపున ధరించిన దేవకీదేవి యెలావుంది?

చిత్తం ఆహంకారం బుద్ధి మనస్సు అనెడి నాలుగు అంతః కరణాలకు క్రమంగా వాసుదేవుడు సంకర్షణుడు ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు అధి దైవ తాలు వారిలో అనిరుద్ధుడు అసాధారణ ప్రతిభాశాలి శబ్ద శాస్త్రానికి కారకుడు సాక్షాత్తు ఉపాసకులపాలిటి భగవంతుడు. అలాంటి అనిరుద్ధ కుమారుడు సంతో షంగా వున్నాడా? అన్యారాధనమాని శ్రీకృష్ణ నొక్కనినే తమ సర్వస్వంగా భావించి సేవించెడి ఆత్మవిదులు సత్యాసుతుడు చారుదేష్ణుడు గదుడు మున్నగు వారందరు సుఖంగా వున్నారా?

ఏ ధర్మజుని సభను జూచి దుర్యోధనుడు అసూయాగ్రస్తు డయ్యాడో ఆ ధర్మజుడు కుశలియేనా? గదా యుద్ధంలో ఆరితేరిన భీము డెలా వున్నాడు? బోయవాడై శివుడు తన్నెదిరించినపుడు శ్రీహరి కృపాతిశయంచేత ఆతనినుంచి పాశుపతాస్త్రాన్ని సంపాదించిన వల్గుణుడు స్వస్థంగా వున్నాడా? తమ తల్లి చనిపోగా కుంతి చనుబాలుగుడిచి సోదరుల సంరక్షణంలో పెరిగి పెద్దవారై ఇంద్రుని యధీనమందున్న అమృతాన్ని గరుత్మంతుడు హరించినట్లు కౌరవులను జయించి వారి రాజ్యాన్ని కైవశం చేసుకొన్న మాద్రి కొడుకులకు భద్రమేకదా!

ఉద్ధవా పాండురాజు మరణించాక పిల్లలకు దిక్కెవ్వరు లేరని భావించి ఆతనితో సహగమించక ఇంట నుండిపోయిన కుంతి జీవించి వున్నదా? తన తోడ బుట్టిన వాడైన పాండురాజు మరణించగా ఆతని పుత్రులు వచ్చి ఎంతగా అర్థిం చినా వారికి ధృతరాష్ట్రు డెంతో కీడుచేశాడు అయినా ఆతడు సుఖంగా వున్నాడా? సహోదరుడనని తలంపక నన్ను తన కొడుకులు బయటకి పంపగా ఊరకుండిన ఆ ధృతరాష్ట్రునకు నరకం తప్పదు. నీవీ రీతిగా మనస్సులో దుఃఖించడం తగ దని అంటావేమో అయితే విను

శ్రీహరి మానవాకారంలో భూలోకంలో పుట్టి నిజమాయవలన మానవులకు మోహం కల్పిస్తూ ఉంటాడు కావున ఆ దేవదేవుని మాయకు వశంగతుడ నైన ప్పుడు వికల చిత్తుడనై సాంసారికమైన దుఃఖాన్ని అనుభవిస్తాను అలాకాక ఆ మహాత్ముని కృపాతి శయానికి నోచుకొన్నవేళ సుఖంగా వుంటాను నేనేకాదు పద్మభవుడు, శంకరుడు కూడా ఆ దేవుని మాయను అతిక్రమించలేరు.

అయినప్పటికి ఆ శ్రీహరి కరుణా విశేషంచేత లభించిన విజ్ఞాన దీపాం కురంవలన నా దోషాంధకారం పటాపంచలయింది అందుచేత నే నెప్పుడూ హరి పరాయత్తమైన మనస్సుతో ఆయన దారినే నిరీక్షిస్తూ ఉంటాను 'అయితే తన ఆత్మీయులైన పాండవులు అరణ్యాల్లో అష్టకష్టాలు పడుతూవుండే కౌరవ సభకు శ్రీకృష్ణుడు దూతలాగా వెళ్ళినప్పుడు సుయోధనాదులు ఆతన్ని బంధిస్తే అన

మర్దరుగా ఎందు కూరకున్నాడు? అంటావేమో! వారిని జయింపలేకకాదు. వారి ధనమదంతో విర్రవీగుతూ లోకాన్ని బాధించే దుష్ట రాజన్యు లందరినీ సేనా సమేతంగా యుద్ధంలో మట్టుపెట్టడానికి అలా ఆ సభలో వారి దుశ్చేష్టలకు కృష్ణుడు కినుక చెందలేదు

జన్మ శూన్యుడైన హరికి దుష్టశిక్షణార్థం కాకపోతే జన్మయేమిటి? అలాగే కర్మరహితుడైన ఆ మహానుభావునకు చరాచర జీవకోటిని కర్మ ప్రవర్తనులను చెయ్యడానికి కాకపోతే కర్మతంత్ర మేమిటి? లీలామానుష విగ్రహుడైన శ్రీహరి నరులందరికి పూజ్యుడు అతడు గుణాతీతుడు సాంసారిక కర్మ లతనికి అంటవు అవి అతనికి లీలలు తనను సేవించేవారి శ్రేయంకోరి ఆ మహానుభావుడు యదు వంశంలో బలరామునకు సోదరుడై జన్మించాడు. ఉద్ధవా నిజకీర్తి చంద్రికలచే దిక్కులను అతిశయింపచేసిన ఆ కృష్ణ భగవానుడు నిశ్చలంగా సమబుద్ధితో ఉన్నాడా? అని విదురుడు అడిగేసరికి ఉద్ధవుడు ఏమీ మారు పల్కలేక పోయాడు శ్రీహరి వియోగ తాపంచేత అతని హృదయం దహించుకొనిపోయింది అతని నోటివెంట మాట రావటంలేదు పెదవు లెండిపోయాయి. దుఃఖం పొరలి వస్తోంది.' అని శుక మహర్షి పరీక్షిన్నరేంద్రుని ఉద్దేశించి ఇంకా యిలా చెప్పడం మొదలు పెట్టారు—

రాజేంద్రా విను.—అయిదేండ్ల వయస్సులో ఒకనాడు ఉద్ధవుడు - శ్రీకృష్ణునితో ఆటలాడెడి బాలకులలో ఒకనిని కృష్ణునిగా భావించి సపర్యలు చేస్తున్నాడు. తల్లివచ్చి "అన్నం, పానీయం మాని - యిదేమి పనిరా?" అన్నది కాని శ్రీకృష్ణుని పాదాంబుజ మకరంద పానాసక్తుడైఉన్న ఉద్ధవునకు తల్లిమాట చెవికెక్కలేదు. అలాటివాడు శ్రీహరి వియోగ వార్తను విదురునకు చెప్పలేక వికలచిత్తుడై ఉండడంలో ఆశ్చర్యం ఏముంది?

## ఉద్ధవుడు విదురునకు కృష్ణ నిర్యాణం చెప్పడం

ఉద్ధవు డలా ఒక ముహూర్త మాత్రం స్తంభించిపోయి అశ్రుపూరితాలైన కనులను పెడచేతితో నొత్తుతూ దురిత పర్వత భిదురుడగు[1] విదురుని చూచి యిలా అన్నాడు విదురుడా యముడనెడి కాలసర్పంయొక్క విషాగ్నికి గురియైన యాదవుల కుశలం ఏమని చెప్పమంటావు?

శ్రీకృష్ణ భాను డస్తమించాడు ఆ మహానుభావుని అస్తమయంతో ముని

---

1 పాపమనెడి - పర్వతమును భంజించెడి ఇంద్రుని వంటివాడు. భిదురము=వజ్రాయుధము .

జనుల ముఖపద్మాలు ముడుచుకొని పోయాయి. దుష్టుల నేత్రోత్పలాలు[1] వికసించాయి జార చోరుల కోర్కెలు ఫలించాయి దానవ గర్వాంధకారం అతిశయించింది పాపం తలెత్తింది ధర్మం అడుగంటింది హలకులిశ[2] పద్మరేఖలతో అతిశయించిన అరవింద నేత్రుని అడుగుదమ్ముల పుణ్య స్పర్శకు నోచుకొన్న భూదేవి భాగ్యహీనురాలైంది

సానబెట్టిన మణికాంతిలాగా స్వచ్ఛంగావున్న నీటిలో ప్రతిబింబించిన సంపూర్ణ చంద్రమండలాన్ని చూచి చేపలు జలచర బుద్ధితో అదీ ఒక జలజంతువని భ్రమించినట్లు కృష్ణానుచరులైన యాదవాదులు ఆ మహానుభావుని మాయకు అధీనులై ఆతని తమతోడి యాదవ నాయకునిగా నెంచి ఆతనితో కూడి ఆడి భోజన శయ్యాది సుఖాలు అనుభవించారేకాని ఆతని లీలామానుష విగ్రహుడైన పరమాత్మగా భావించలేదు. శ్రీహరి మాయాంబుధిలో బ్రహ్మేంద్రాదులు కూడా మునిగి తేలుతూ వుంటారు అలాంటప్పుడు ఏ పరమ భాగవతోత్తములనో తప్పితే ఇతరులను గురించి చెప్పేదేముంది? ఇక మదాంధులైన శిశుపాలాదులు ఆతని పరతత్త్వమని తెలిసికోలేక ఆతనితో వైరం పెట్టుకొని ఆతన్ని అనరాని మాట లన్నారు. అందుకు నే నెంతో మనస్తాపం చెందుతూ వుంటాను

విదురా! తపోధనులైన భాగవత శ్రేష్ఠులకు ఆత్మ స్వరూపాన్ని ప్రదర్శించి వారి శోక విశోకాలను దహింపజేసి కమలాకాంతుడైన కృష్ణుడు మానవ దేహం విడిచి అంతర్ధాన మయ్యాడు.

ఏమని చెప్పను? మానవుల శ్రేయస్సుకోసం నిజయోగ మాయచే ఆ మహనీయుడు ధరించిన దివ్యాకారం అలంకారాలకు అలంకారం సకల కల్యాణ సంస్థానం ఆ దివ్య స్వరూపాన్ని ధర్మనందనుని రాజసూయయాగ సమయంలో అందరు తనివిదీరా చూచి "బ్రహ్మదేవుని సృష్టికి కారణభూతు డీ మహాత్ముడే" యని వేనోళ్ళ సన్నుతించారు.

శ్రీహరి శాంత స్వరూపుడూ, ఉగ్ర స్వరూపుడూ కూడాను. శాంత స్వరూపుడు గనుకనే ఇతరుల అపరాధాలవల్ల వ్యథిత మనస్కుడైనా కృపాయత్త చిత్తుడై వుంటాడు ఆతడు పరాత్పరుడు జన్మరహితుడు. అయినా ప్రకృతి కార్యమైన మహదంశంవలన కాష్ఠమందు అగ్ని జనించునట్లు దేవమానవ యోనుల్లో జన్మిస్తాడు వ్రేపల్లెలో అలా జన్మించిన మనోహరాకారుడగు ఆ కృష్ణుని హాస విలాసాలకు రాసక్రీడలకు నోచుకున్న గోపాంగనలు నిరంతరం ఆ మహనీయుని దివ్యమూర్తిని దర్శించి తరించారు

దేవతల కోర్కె తీర్చటానికి ఆ హరి వసుదేవునియింట జన్మించాడు కాని

---

1 కన్నులనెడి కలువలు    2 వజ్రం

అతడు కంసుడు తనను చంపుతాడని భయంతో నందునింట్లో ఉండడం కాల యవన జరాసంధాదులకు వెఱచి మధురా నగరాన్ని విడిచి వెళ్ళడం చూస్తే నా మనస్సు వికల మౌతుంది బంధనాగారంలో నానా బాధలు అనుభవిస్తూన్న దేవకీ వసుదేవుల దగ్గరకు వెళ్ళి "జననీ జనకులారా! మిమ్మల్ని కంసుడు కష్టాలపాలు చేస్తూఉంటే నేనాతణ్ణి ఏమీ చేయలేక ఊరకున్నాను. నన్ను క్షమించండి" అని అమాయకంగా అంటూంటే ఆ మధురోక్తులు విని నేను మనస్సులో ఎంతో చింతిస్తూ వుంటాను.

కాని వాస్తవంగా ఆ శ్రీహరి అంత అసమర్థుడా? కాదు. కనుబొమ ముడి మాత్రం చేతనే సమస్త భూభారాన్ని ఇట్టే హరించి వేయగలడు అలాంటి దేవ దేవుని పదకమల మరందం గ్రోలేడి ఘను డెవ్వడో కాని ఉండడు. నేనా నంద కుమారుని ఎన్నడూ మరువలేను. తనను సేవించే వారికే కాదు. తన యెడల వైరభావం వహించిన వారికి కూడా మోక్షాన్ని ప్రసాదించిన కరుణా సముద్రు డాతడు.

మీరు ఇతర రాజన్యులు చూస్తూండగా ధర్మనందనుని రాజసూయంలో ఆజన్మమూ తనకు ఎంతో కీడుచేసిన శిశుపాలునకు యోగి జనులకు కూడా తెలియని మహోన్నత పదం కల్పించలేదూ? అలాగే కౌరవ పాండవ యుద్ధంలో నానా దేశాధీశ్వరులు శ్రీకృష్ణుని ముఖాంబుజ సుధారసాన్ని కన్నులతో గ్రోలుతూ అర్జునుని బాణపరంపరలుచే క్షతగాత్రులై మోక్షం పొందలేదూ?

ఆద్యంత శూన్యుడు అనంతుడు సమానాధిక విరహితుడు అయిన ఆ హరి ఉగ్రసేనుని రాజ్య సింహాసనాసీనుని గావించి తాను అతనికి భృత్యుడై అతని ఆజ్ఞాపాలనం చెయ్యడం నాకెంతో వ్యథ కల్పించింది అని ఉద్ధవుడు ఇంకా ఇలా అన్నాడు.

ఓయీ! విదురా! పరాత్పరుడైన శ్రీకృష్ణుడు పరమ భాగవతోత్తముడైన ఉగ్రసేనుని సేవించడంలో వాస్తవానికి అంత ఆశ్చర్యం ఏమీలేదు. —తనను సంహరించడానికి స్తనాల్లో విషం ధరించి వచ్చిన పూతనకు, చన్నిచ్చి పెంచిన యశోదాదేవికి కూడా అందరాని దివ్యపదం ఇచ్చాడు ఎంతటి కరుణాయత్త చిత్తుడో చూదావా? అలాంటివాడు నిరంతరం తన చరణాలను ధ్యానించెడి భక్త జనులను అనుసరించి సేవించడంలో వింత యేముంది? అని ఉదవు డనేసరికి విదురుడు - సరే కాని నిజదాసులకు ఇచ్చెడి పరమ పదాన్ని శ్రీహరి క్రూర కర్ములైన రాక్షసుల కెలా ఇచ్చా డనగా ఉద్ధవుడు తిరిగి యిలా చెప్పడం మొదలు పెట్టాడు—

# ఉద్ధవుడు విదురునకు శ్రీకృష్ణుని చరిత్ర చెప్పడం

విదురా కనుమూసిన శ్రీకృష్ణుని జనన చరిత్రలను చెపుతాను విను. బ్రహ్మాదులు ప్రార్థింపగా భూభారం హరించడానికి రమాకాంతుడు కంసుని కారాగారంలో ఉన్న దేవకీ వసుదేవులకు జన్మించాడు కంసు డా పసివానిని వధిస్తాడేమో అనే భీతితో వసుదేవు డాతణ్ణి అర్ధరాత్రివేళ నందవ్రజానికి తీసుకొనివెళ్ళి ఎవ్వరూ చూడకుండా ఆ నందుని భార్య ప్రక్క పరుండబెట్టి తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

తాను భగవంతుడని - యెవ్వరూ తెలిసికొనకుండా కృష్ణుడు పదకొండు సంవత్సరాలు బలరామునితో క్రీడిస్తూ - కాలం గడిపాడు - గోపాలకులతో గూడి గోవులను కాచాడు. అప్పుడప్పుడు తోటి గోపకులకు తన లీలావినోదాలు చూపిస్తూ వుండేవాడు యమునా నదీ జలాలతో ఏపుగా పెరిగి సుమించి వన సౌరభాన్ని నలుదిక్కులా గుబాళింపజేసేటి నానా విధాలైన పూపొదరిండ్లలో నెమళ్ళు, కోయిలలు, చిలుకలు గోరువంకలు పలికినట్లు మధురాలాపాలు చేసేవాడు ఒక్కొక్కప్పుడు సింహ కిశోరంలాగా గంభీరంగా వర్తించేవాడు. మరొకప్పుడు ఆలమందలను మేపుతూ మృదుమధురమైన తన వేణుగానామృతంతో గోపజన సంఘాన్ని పారవశ్యంతో ముంచి ఎత్తేవాడు అతని అమృత చేష్టలు అన్నీ ఇన్నీ కాదు.

పిల్లలు వినోదార్థం గడ్డిపోచలతో మృగరూపాలను కల్పించి తిరిగి వాటిని ఖండించే టట్లుగా శ్రీకృష్ణుడు కంసుడు పంపిన క్రూర రాక్షసులను ఇట్టే సునాయాసంగా తుదముట్టించాడు యమునా నదీ జలాల్లో తన విషాగ్ని జ్వాలలతో గోపకులను గోధనాన్ని వేగింపజేసేటి కాళీయసర్పాన్ని మర్దించి ఆ నదీ జలాన్ని పాన యోగ్యంగా చేశాడు

నందాది గోపకులు ఏటేటా వర్షం కోసం ఇంద్రప్రీతిగా మహోత్సవం చేసేవాళ్ళు కృష్ణుడు ఇంద్రునకు గర్వభంగం చెయ్యాలనే ఊహతో ఆ ఉత్సవం మాన్పించి తానే గో యాగం చేశాడు శ్రీకృష్ణుని ప్రతిభ తెలియక ఇంద్రుడు మహోగ్రుడై వలాహకం మొదలైన సమస్త మేఘాలను పంపాడు. ఆ మేఘాలు గర్జిస్తూ రాళ్ళ వాన కురిపించేసరికి గోకులమంతా వ్యాకులమైపోయింది గోవులు చెల్లా చెదరై పోయాయి

అపుడా గొల్లలందరు గొల్లుమని రోదిస్తూ కృష్ణా భక్త జన భూషణా! రక్షించు రక్షించు అని మొరపెట్టేసరికి కృష్ణుడు వారి మొర ఆలించి గో గోప రక్షణార్థం దేవతలందరు ప్రశంసిస్తూండగా గోవర్ధన పర్వతాన్ని తన చేతితో గొడుగులాగా ఎత్తిపట్టాడు.

శరదృతువులో బృందావన వీథుల్లో పండు వెన్నెలలు నిండుగా పరచి నట్లున్నాయి కృష్ణు డొకనాడు మునిమాపువేళ రాసకేళిలో మహోల్లాసంగా వున్నాడు అతని తనూ సౌందర్యానికి గోపికలు పరవశించి పోతున్నారు. అతని ముఖచంద్ర చంద్రికలు వారికి నేత్రోత్సవం కల్పిస్తున్నాయి ఆ సమయంలో అతడు త్రిభంగియై రమణీయంగా వేణుగానం చేస్తున్నాడు. ఆ వేణురవం చెవిని సోకేసరికి వ్రేపల్లెలోని గోపికలందరు పతులు బాంధవులు వారిస్తున్నా వినక శ్రీకృష్ణ చరణాసేవాసక్తితోరాగా యువతీ జన మన్మధుడైన ఆ దేవదేవుడు వారితో రాసకేళి సలిపాడు

ఒకనాడు కృష్ణుడు బలరామునితోగూడి మధురానగరానికి వెళ్ళి దుష్టాత్ము డైన కంసుని వధించి దేవకీ వసుదేవులకు కారాగార విముక్తి కల్పించాడు. సాందీపని దగ్గఱ వేదవేదాంగాలను చతుష్షష్ఠి[1] విద్యలను విన్నమాత్రంచేతనే నేర్చాడు వాస్తవంగా అతడు లోక గురుడు అతనికి ఇతర గురువులు కావాలా? అదంతా లోక విడంబనార్థమైన[2]లీల

ప్రభాసతీర్థంలో పంచజనుడను రాక్షసుని ఉదరంలో మరణాసన్నుడై యున్న గురుపుత్రుని రక్షించి గురువునకు దక్షిణగా సర్పించిన కృష్ణుని ప్రతిభ నిరుపమానం

భీష్మకుడు విదర్భరాజు అతని కొమరిత రుక్మిణి అసామాన్య సౌందర్యవతి ఆమె స్వయంవరానికి చైద్య సాల్వ మాగధ ముఖ్య రాజన్యు లెందరో వచ్చారు అప్పుడు కృష్ణుడు అనూహ్యంగా అక్కడకు వచ్చి తన భుజబలంతో వారి నందరిని వంచించి, దేవతలు గుప్తంగా ఉంచిన అమృతాన్ని గరుడుడు హరించినట్లు లక్ష్మీసమానమైన ఆ రాకుమారిని వరించి హరించి తీసికొని వెళ్ళాడు

ఒకప్పుడు నగ్నజిత్తు అనేవి రాజు మదించిన వృషభముల నేడింటికి ముక్కులు కుట్టినవానికి తన కుమార్తెను ఇచ్చి పెండ్లి చేస్తానన్నాడు అది విని కృష్ణు డచ్చటకు వెళ్ళి ఆ వృషభాల ముక్కులుకుట్టి నాగ్నజితిని పెండ్లియాడాడు. అతని బలోన్నతి సహింపక తలపడిన రాజన్యులందరిని చీల్చి చెండాడాడు సాత్రాజితి మనోభీప్సితం తీర్చడానికి అతడు దేవేంద్రుని జయించి పారిజాతాన్ని పెకలించి భూ లోకానికి తెచ్చాడు కృష్ణుడంటే సామాన్యుడా?

ఆ మహానుభావుడొకప్పుడు జగన్మయ దేహంతో ప్రకాశించెడి భూదేవి కొడుకు నరకుని శిరస్సును తన సునాభచక్రంతో ఖండించి ఆ దేవి కోర్కెపై అతని పుత్రుని రాజ్యపదంలో నిలిపాడు. అనంతరం రాజాంతఃపురంలోనికి వెళ్ళి చూచేసరికి అక్కడ నరకునిచే చెరపెట్టబడిన కన్యలు నూట పదునారువేలమంది ఆర్తజన బాంధవుడైన ఆ అరవిందలోచనునిచూచి ఆనందాశ్రువులు రాలుస్తూ

1 అరవైనాలుగు 2 లోకాన్ని అనుసరించడంకోసం

కామాతురులయ్యారు అపుడా దేవదేవుడు వారి కోర్కె తీర్పదలచి ఒక్క ముహూర్తంలో వారందరికి అన్ని రూపాల్లో గోచరించి మన్మథకేళిలో తేలించాడు. అనంతరం ఆ యువతుల కొక్కొక్కరికి పదేసిమంది ఆత్మసములైన కొడుకులను ప్రసాదించాడు

మధురా నగరాన్ని చతురంగ బలాలతో ముట్టడించిన కాలయవనాదులను సేనాసమేతంగా సంహరించాడు. తన భుజశక్తిని అర్థించిన భీమార్జునులకు విజయం కూర్చి వైరి రాజులను నక్కురగించాడు బాణాసురుడు శంబరాసురుడు మొదలైన రాక్షసవీరులను బలరామసమేతుడై సంహరించాడు అలాగే దంతవక్త్రాది దైత్యులను రణరంగంలో తుదముట్టించాడు కౌరవ పాండవ యుద్ధంలో అపార సేనా సమూహాలతో వచ్చి కురుక్షేత్రంలో మోహరించిన ఉభయ పక్ష రాజన్యులను దునుమాడాడు

రాజ్య మదమత్తుడైన సుయోధనుడు సకలరాజ సమక్షంలో కర్ణ శకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంచే కౌంతేయులకు చేసిన కీడునకు ప్రతిఫలంగా రణరంగంలో భీముని గదాహతికి తొడలు విరిగి నేలగూలి గతాయువగుటచూచి నే నెంతో సంతోషించాను- కౌరవ పాండవ యుద్ధంలో అఖిల ధరాపతులను అష్టాదశాక్షౌహిణుల సేనతోగూడా సంహరింపజేశాడు- 'ఇక నాతో సమానులైన యదువీరు లెందరో ఉన్నారు. వారిని జయించడం ఎవరితరమున్నూ కాదు మధుపాన మత్తులై వారు అన్యోన్య వైరంతో పోరి హతులై నన్ను కలిస్తేకాని భూ భారం తీర దని భావించాడు కృష్ణభగవానుడు

ధర్మజునకు నిష్కంటకమైన రాజ్యభారాన్ని అప్పగించాడు. అతనికి ఎన్నో రాజధర్మాలు ఉపదేశించాడు అతని యనంతరం వారి వంశాన్ని ఉద్ధరింపదలచి అభిమన్యువలని ఉత్తరా గర్భం నిలిపి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రంవలన ఆమె గర్భం విచ్ఛిన్నం కాకుండా చేశాడు ధర్మనందనునిచేత మూడు అశ్వమేధయాగాలు చేయించాడు అనంతరం ద్వారకా నగరంలో నిజమాయా ప్రభావంచేత నిస్సంగుడై యుండిన్నీ సంసారివలె కామమోహితుడై సుఖిస్తూ సరససల్లాపాలతో పాండునందనులను యదువీరులను కనుపెట్టుకొని ఉన్నాడు. శరత్కాలపు వెన్నెల రాత్రులలో సౌధాగ్రాల చంద్రకాంత శిలావేదికలపై కరేణువుల[1] మధ్య దిగ్గజాల్లాగా విద్యుల్లతల నడుమ మేఘాలమాదిరిగా, ముత్తెములతోగూడిన నీలమణుల సామ్యంగా యువతిజన సంయుతుడై విహరిస్తూ సతులెందరున్నారో అందరితో అన్ని రూపాలతో క్రీడిస్తూ ఆ నందనందనుడు ఆనందాబ్ధిలో నోలలాడాడు

అలా ఉండగా ఒకనాడు కొందరు మునిశ్రేష్ఠులు వచ్చేసరికి యాదవులు

---

1 ఆడేనుగులు

భోజులు వారిని అనరాని మాటలన్నారు అపుడా మునులు వారిని శపించారు. కొన్ని మాసాలు గడిచాయి అపుడు దైవయోగంచేత వారు జాతరగా ప్రభాస తీర్థానికి వెళ్ళి ఆ తీర్థంలో క్రుంకులిడి దేవముని తర్పణాలు పితృ తర్పణాలు కావించారు. బ్రాహ్మణులకు అపార ధనరాసులు కన్యా గజ తురగ రథాలు దానంగా ఇచ్చారు. అనంతరం మృష్టాన్నాలు భుజించి తనివితీరా మద్యపానంచేసి ఒకరి నొకరు పరిహాసించుకొనడం మొదలుపెట్టారు మదిరాపానంవలన ఒడలు తెలియక మాత్సర్యంతో ఒకరినొకరు పొడుచుకొని ఆ యదు భోజ కుమారు లందరు, రాపిడివలన వెదురునందు జనించిన అగ్నిచే ఆ వెదురు పొద అంతా దగ్ధమై నశించినట్లు నశించిపోయారు.

అనంతరం శ్రీకృష్ణుడు సరస్వతీనదీ తోయాల్లో క్రుంకులిడి విహిత విధులు నిర్వర్తించి నన్ను బదరీవనానికి వెళ్ళమన్నాడు. కాని నేను ఆ దేవదేవుని చరణ కమల వియోగాన్ని సహింపలేక అతని వెనువెంటనే వెళ్ళాను అతడలా వెళ్ళి వెళ్ళి ఒక రావిచెట్టు నీడలో కూర్చున్నాడు. అక్కడ నీలమేఘంలాంటి శ్యామల శరీరంతో, వికసించిన తామర రేకుల్లాంటి కనులతో పచ్చని పట్టు బట్టతో, నాల్గు భుజాలతో ప్రకాశిస్తూ వీరాసనం వేసుకొని రావిపై వెన్నుమోపిన వెన్నుని[1] కనుకార చూచి తరించాను

ఆ సమయంలో వ్యాసమునీంద్రుని మిత్రుడు పరమ తపోధనుడు అయిన మైత్రేయుడు తీర్థాటనంచేస్తూ దైవికంగా అక్కడకు వచ్చి అఖిలలోక సన్నుతుడూ పరిపూర్ణ యౌవన కళావిభాసితుడూ, కౌస్తుభాది మణిభూషణ విభూషితుడూ అసురహంతా అయిన శ్రీకృష్ణుని దర్శించాడు అపుడు శ్రీహరి ఆ తాపస పుంగవుడు వింటూండగా నన్ను క్రీగంటచూస్తూ మందహాసంచేసి యిలా అన్నాడు—

ఉద్ధవా నీవు పూర్వజన్మలో వసువుంలో నొక్కడవు విశ్వస్రష్టలైన వసువులందరు కలిసి చేసిన యొక సత్రయాగంలో నీవు నీ మనస్సులో అన్యమేదీ కోరక నా చరణారవింద సేవను అభిలషించావు అంచేత నేను నీ మనస్సులో నివసిస్తున్నాను.

ఆత్మారాముడనైన నన్ను సద సద్వివేకులై తెలిసికోలేకపోతే నేను వారికి గోచరించను నీయందు నాకు పరిపూర్ణమైన అనుగ్రహం వుంచి. నీకు ఈ జన్మ తప్పితే యిక పునర్జన్మ లేకుండా ఉండేందుకే నీ పురాకృత సుకృత విశేషంచేత ఈ ఆశ్రమంలో నీకు నా పాద కమల సందర్శనం కలిగింది పద్మకల్పంలో నా నాభి కమలమందు అధివసించిన బ్రహ్మకు జనన మరణ నివర్తకమూ,

1 విష్ణువును

శాశ్వతానంద ప్రవర్తకమూ అయిన నా మహత్వాన్ని చెప్పాను అట్టి దివ్య జ్ఞానం నీకు తెలియజేస్తారు - అని ఆ మహనీయ తేజోనిధి అన్నాడు.

ఆ మాటలు నాకు కర్ణరసాయనంగా వున్నాయి నా శరీరం గగుర్పొడిచింది నా చెక్కిళ్ళ వెంట ఆనందభాష్పకణాలు జలజలారాలాయి ఆనందాబ్ధిలో నోలలాడుతూ ప్రాంజలియై ఇలా అన్నాను—

పురుషోత్తమా నీ పద ధ్యానామృతంచే అభిషిక్తమైన నా మనస్సు ఇతర వస్తువులను వాంఛిస్తుందా? జనన రహితుడవైన నీకు ఈ సంసార బంధమేమిటి? లోకాలన్నింటినీ లయింపజేయగల నీవు శత్రుభయంతో చుట్టూ అగడ్తలు గల దుర్గాన్ని ఆశ్రయించడమేమిటి? - ఆత్మారాముడవయ్యుండీన్నీ లెక్కలేనంత మంది తరుణులతో రమించడం దేనికి? ఇదంతా నాకు అగమ్యంగా వుంది పరతత్వజ్ఞులుకూడా భ్రమపడి నిన్ను సంసార లంపటునిగా భావిస్తారు అలాంటప్పుడు నీకు నామీద పరిపూర్ణ కటాక్షం కలగటం నా అదృష్టం

నీవు మహాజ్ఞాని వయ్యుండీన్నీ ముగ్ధభావంతో ప్రమత్తునిలాగా విమోహి మాదిరిగా ఎక్కడో ఒదిగి యుండడంచూస్తే నా మనస్సు వికలమౌతుంది కమలేక్షణా నీవు పూర్వం పరమేష్ఠికి బోధించిన జ్ఞానం తెలిసికొనడానికి నాకున్నూ అర్హత కలదనితోస్తే ఉపదేశించు. ఈ సంసార సముద్రాన్ని తరిస్తాను - అని నేను విన్నవించేసరికి కృష్ణభగవానుడు నాకు పరతత్వాన్ని ఉపదేశించాడు

అలా శ్రీహరివలన పరతత్వ రహస్యం తెలిసికొని ఆ దేవ దేవుని పాదాలకు నమస్కరించాను అతని వియోగానికి దుఃఖిస్తూ బ్రహ్మకల్ప విలయ సమయందాకా ఎలాగో కాలం గడపక తప్పదు అంచేత ఈ రీతిగా తిరుగుతూ తిరుగుతూ నరనారాయణ తాపసాశ్రమమూ నానాతరులతో సంశోభితమూ అయిన బదరీ వనానికి పోతున్నాను అని ఉద్ధవు డనేసరికి విదురుడు కళవళించి శోక సముద్రంలో మునిగిపోయాడు కాని మహాజ్ఞాని కనుక వెంటనే తేరుకొన్నాడు అలా తన దుఃఖాన్ని వివేకబలంచేత శమింప జేసికొని విదురుడు ఉద్ధవునుద్దేశించి-

ఉద్ధవా శ్రీహరి కరుణించి నీకు ఉపదేశించిన జ్ఞాన రహస్యాన్ని నాకున్నూ చెప్పవా? నీవంటి పుణ్యాత్ములకు శిష్యవాత్సల్యం సహజమేకదా - అనేసరికి ఉద్ధవుడు- విదురా మునిశ్రేష్ఠుడూ సాక్షాత్తు విష్ణుకల్పుడూ అయిన మైత్రేయుడు మర్త్యలోకాన్ని విడిచిపెట్టబోతు నిరంతరం శ్రీహరిని స్మరిస్తూ వుంటాడు నీవా మహానుభావుని ఆశ్రయిస్తే అతడు నీకు సాత్వికజ్ఞానాన్ని ఉపదేశిస్తాడు - అని చెప్పి ఉద్ధవుడు విదురునితోగూడి యమునానదికి వెళ్ళి ఆ నది సైకతభూమిలో ఆ దిన శేషంగడిపి మరునాడు రేపకడ శ్రీహరి చరణధ్యానం

చేస్తూ యమునానదిని దాటి బదరికాశ్రమానికి వెళ్ళాడు అని శుకయోగీంద్రుడనే సరికి పరీక్షిత్తు- మునీంద్రా కృష్ణుడూ మహారథ సమరధులైన యదువీరులూ అందరూ నశించగా ఉద్ధవు డొక్కడు ఎలా జీవించి ఉన్నా డని అడిగాడు. అప్పుడు శుకుడిలా చెప్పటం మొదలుపెట్టాడు.

రాజేంద్రా విను- మను బ్రహ్మదేవుని అభ్యర్థనపై శ్రీహరి భూలోకంలో యదువంశంలో జన్మించాడు అనంతరం ఆతడు తనలోతానే చింతించి తెలివిని పొంది తన కులాన్ని నాశనం చేశాడు. తిరిగి ఉపనిషణ్మయమైన తన దివ్య దేహం పొందదలచి- విజ్ఞాన తత్వాన్ని గ్రహించి- "లోకంలో అందరికి బోధించ గల సమర్థుడు ఉద్ధవుడొక్కడు తప్ప ఇంకెవ్వరులేరు అతడు జితేంద్రియుడు. తనతో సమానుడు"- అని భావించి అతణ్ణి మిగిల్చాడు. అంచేతనే అతనికి మృతి లేదు. శ్రీకృష్ణుని ఆదేశంపై అతడు అనంతరం బదరికాశ్రమానికి వెళ్ళాడు

అలా ఉద్ధవుడు వెళ్ళిన తర్వాత విదురుడు మహాజ్ఞానియైన మైత్రేయుని చూడగోరి యమునా నదినిదాటి పుణ్య నదులను దివ్య క్షేత్రాలను దర్శిస్తూ గంగాతీరం చేరాడు. ఆ నదీ తోయాల్లో స్నానం చేశాడు ఆ నదీ సైకత భూమిలో యమ నియమాది క్రియానిష్ఠుడై పద్మాసనాసీనుడై నిరంతరం శ్రీహరిని మనస్సులో పాదుకొలిపి బాహ్యేంద్రియ వ్యాప్తిని పారద్రోలి వ్రతోపవాసాలతో కృశించియున్న మహాభాగధేయుడు ఆశ్రిత విధేయుడు అయిన మైత్రేయుని చూచాడు

## విదుర మైత్రేయ సంవాదం

ఆ మునీంద్రుని పాదాలకు మ్రొక్కి బద్ధాంజలియై ఇలా అన్నాడు. మునీంద్రా మానవులు సుఖాన్ని కాంక్షించి సుఖహేతువులైన కర్మలెన్నో ఆచరిస్తారు కాని దైవోపహతులై వారు వాంఛిత ఫలాన్ని పొందరు. కర్మలు ఐహిక హేతువులు వాటివల్ల దుఃఖమేకాని సౌఖ్యమూలేదు. పాప నిర్మూలనమూ కాదు సంసారచక్రంలో పడి పరిభ్రమిస్తూ పూర్వకర్మానుగతాలైన శరీరాలు ధరిస్తూ చస్తూ పుడుతూ ఎంతకాలానికి పాపనివృత్తి కానక చరించేటి మూఢు లను తరింపజెయ్యటానికేకదా నారాయణపరాయణులయిన మీవంటి పుణ్యాత్ములు లోకంలో తిరిగేది?

దురంతమైన ఈ సంసార సముద్రానికి స్వార్థం చెలియలికట్ట దార సుతాదులు బాంధవులు మిత్రులు నానావిధ జల జంతువులు అలాంటి సంసార సాగరాన్ని తరించటానికి భాగవతానుగ్రహం నావ. కనుక మునివాథా! నన్ను తరింపజేయాలనే తలంపు నీకుంటే నా సందేహాలు తీర్చు

భగవంతుడు స్వతంత్రుడు త్రిగుణాత్మకమైన మాయ అతనికి వశంగతమై ఉంటుంది అలాంటివాడు ఏయే అవతారాలెత్తి ఏయే కర్మలు ఆచరించాడు? కర్మాధీనుడుకాని అతడు తొలుత ప్రపంచాన్ని ఎలా నిర్మించాడు? ఎలా పాలించాడు? తుదకు తనయందే ఈ విశ్వమంతను లీనంచేసి యోగమాయలో ఎలా శయనించాడు? బ్రహ్మాండంలో ఎలా వర్తించాడు? తానొక్కండయ్యీ బ్రహ్మాది నానావిధ రూపాలెలా ధరించాడు? భూసుర గోసురాదులను రక్షించడానికి మత్స్యాద్యవతారాలు ధరించి యేయే ప్రయోజనాలు తీర్చాడు? బ్రహ్మాండంలోని వివిధ లోకాలను లోకాలోక పర్వతాలను ఏ తత్త్వ వేదాంచేత ఏ రీతిగా సృష్టించాడు? ఆ లోకాల్లోని జీవకోటి యెవ్వని కొల్చి జీవిస్తూంది? జనులకు కర్మలు, పేర్లు రూపాలు ఎలా నిర్దేశించాడు? ఇవన్నీ నాకు సవిస్తరంగా చెప్పు. శ్రీహరి చరిత్రను వింటేనేగాని సంసార బంధాలు తెగిపోవు - అని ఇంకా ఇలా అన్నాడు.

మునీంద్రా శ్రీహరి కథామృతాన్ని శ్రుతిపుట[1] మనెడి దోసిలితో ఎంత జుర్రినా తనివితీరదు పరాశరాత్మజుడైన వ్యాసుడు భారత కథలో శ్రీహరిని నుతించిన ఘట్టాలు చదివి నేను పులకించిపోతాను. ఇతర కథలు చదవడం నిరర్థకం ఒక్క శ్రీహరి గాథలే సాంసారిక వ్యథను పోగొట్టగలవు జ్ఞానధనులయిన నారదాదులకుకూడా వర్ణింపనలవికాని విష్ణుగాథలను విని విసుగుచెందేవాడు వెర్రివాడు నాలుగు వర్ణాలవారికి అనుష్ఠేయాలయిన ధర్మాలను శ్రీహరి అపరావతారమైన వ్యాసమునీంద్రుడు అనేక గ్రామ్య కథల్లో చెప్పాడు కాని వాటిల్లో హరి కథా వర్ణనం అంతగా లేకపోవడంచేత అతని మనస్సు వికలమయింది అప్పుడు నారదుడు చెప్పగా శ్రీహరి కీర్తనామృతం తనివితీరా త్రావి ధన్యుడయ్యాడు

కనుక శ్రీహరి స్మరణం సర్వ సుఖదాయకం. శ్రీహరి దివ్యచరిత్రను చెవులార వినని వారికి ఇహం పరం రెండూ దక్కవు అలాంటివారికి నరకపాతం తప్పదు అంతేకాదు ఎప్పుడైనా ఒక నిమిషమైనా శ్రీహరి పాద కమలాలను ధ్యానించనివాని ఆయువుకూడా క్షీణించి పోతుంది పూతేనియ త్రాగడానికి తహతహ లాడుతూ తిరిగే తుమ్మెదలాగా నేను పద్మనాభుని దివ్యమంగళ గుణ కీర్తనామృతం త్రాగాలని కుతూహలపడుతున్నాను'- అని విదురుడనేసరికి మైత్రేయుడు మృదు మధుర భాషణాలతో ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

అనఘా శ్రీకృష్ణుని కథలు వినాలనే కౌతూహలంతో నీవు నన్ను అంతగా అడిగావు నీకు శుభం కలుగుగాక నీవు మహాభక్తుడవు కనుక నీకు హరి కథల్లో ఆసక్తి ఉండడం సహజం. అందులో విచిత్రమేమీ లేదు మాండవ్యుని శాపం

1 దొప్పలాంటి చెవి

వలన హృదయోనిలో జనించిన మహాజ్ఞానివి శ్రీహరికి ప్రియుడవు కనుకనే శ్రీకృష్ణుడు తన నిర్యాణ సమయంలో నన్ను దగ్గరకు పిలిచి జ్ఞానోపదేశం చేసి అదంతా నీకు చెప్పమని నన్ను ఆజ్ఞాపించాడు అంచేత తప్పక చెపుతాను శ్రద్ధగా విను

ముందు శ్రీహరి యోగమాయవలన ఉద్భవించిన విశ్వసృష్టి స్థితి సంహారాల తీరు చెప్పి అనంతరం ఆతని మహత్వలీలలను వర్ణిస్తాను విశ్వసృష్టికి ముందు జీవకోటికి ఆత్మ ధాతువగు పరమాత్మ ఒక్కడే వుంటాడు అపుడు మాయ అతనిలో లీనమైపోతుంది అంతట సమస్త విశ్వమున్నూ అతని గర్భంలో ఇమిడి వుంటుంది కనుక అతడప్పుడు ఒంటరియై ప్రకాశిస్తూ వుంటాడు.

అతడు ద్రష్టయై యుండిన్నీ దృశ్య ద్రవ్యం (విశ్వం) లేకపోవడంవలన ద్రష్టకాకుండా వుంటాడు అనగా తానున్నా తనను లేనివానిగా భావిస్తాడు లోక నిర్మాణవాంఛ కలిగినపుడు ఆ పురుషోత్తముడు కార్యకారణ రూపమైన మాయ యందు ఆత్మాంశ స్ఫురణంగల శక్తిని నిలిపి దాని తోడ్పాటుతో జగత్తును సృష్టిస్తాడు కాలప్రేరితమైన మాయవలన మహత్తత్త్వం ఉదయిస్తుంది గుణాత్మకమైన ఆ మహత్తత్త్వమే రూపాంతరం చెంది అహంకారం అవుతుంది ఆ అహంకారం వైకారికం తైజసం తామసం అని మువ్విధాలు

వైకారిక తైజసాలు క్రమంగా సాత్త్విక రాజసాలు అని పేర్కొనబడతాయి వైకారికాహంకారం వలన మనస్సు ఇంద్రియాధిష్ఠాతలై శబ్దాది విషయం ప్రకాశంచేసెడి దేవగణాలు ఉద్భవించాయి తైజసాహంకారంనుండి జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలు ఉత్పన్నమయ్యాయి తామసాహంకారంవలన శబ్ద స్పర్శ రూప రస గంధాలు జనించాయి శబ్దంవలన ఆకాశం పుట్టింది ఆకాశం కాల మాయాంశయోగంచేత స్పర్శతన్మాత్రంవలన వాయువును కలిగించింది వాయువు ఆకాశ బలంతో రూపతన్మాత్రంవలన తేజస్సును ఉత్పాదించింది తేజస్సు వాయుయుక్తమై రసతన్మాత్రంవలన జలాన్ని కల్పించింది జలం తేజో బలంచేత గంధగుణం వలన పృథ్విని విరచించింది

అలా ఆకాశానికి శబ్దం వాయువునకు శబ్ద స్పర్శములు తేజస్సునకు శబ్ద స్పర్శ రూపాలు జలమునకు శబ్ద స్పర్శ రూప రసాలు పృథ్వికి శబ్ద స్పర్శ రూప రస గంధాలు గుణాలయ్యాయి కాల లింగ[1]మైన వికృతి[2] మాయా లింగమైన విక్షేపం[3] అంశలింగమైన చేతన[4] గల మహదాద్యభిమాని దేవగణాలు విష్టకళా సమన్వితాలు కాని అలాంటి మహదాది తత్త్వాలకు ఏకీభావం లేక

1 లింగం=చిహ్నం 2 వికారం మార్పు
3 వ్యాప్తి 4 జ్ఞానం

పోవటంచేత బ్రహ్మాండాన్ని నిర్మించలేక యోగీశ్వరేశ్వరుడైన నారాయణుని అనేక విధాల స్తోత్రం చేసేసరికి శ్రీహరి ప్రసన్నుడై పరస్పర సంబంధం లేక పోవడంచేత ఆత్మశక్తులగు మహదాదులకు విశ్వనిర్మాణ సామర్థ్యం లేకుండా పోయిందని తెలిసికొన్నాడు

కాలవేగంచేత ఉద్రిక్తమైన ప్రకృతిని పొంది అందులో తన శక్తిని పాదుకొల్పాడు అనంతరం ఇరువది యేడు తత్త్వాల్లోనూ ఒక్కసారి ప్రవేశించి వాటన్నింటికి పరస్పర సంబంధం కల్పించి విశ్వనిర్మాణ రీతిని తెలియజేశాడు అతని అనుగ్రహంచేత ప్రేరణపొంది క్రియా సామర్థ్యం పొందిన ఆ తత్త్వ సమూహం విరాట్ దేహాన్ని సృష్టించాయి పుండరీకాక్షుని కళాంశం తమలో ప్రవేశించడంవలన ఆ తత్త్వగణాలు అన్యోన్య సంబంధం కలిగి పరిణతి చెందాయి దాని ఫలితంగా ఈ చరాచర లోకాలు పుట్టాయి హిరణ్మయమైన విరాట్ విగ్రహం పొందిన పురుషుడు సకల జీవులతో కూడి జలరాశిలో బ్రహ్మాండంలో వేయి సంవత్సరాలు ఉన్నాడు

మహదాదులగు జగత్కారణములకు కార్యరూపుడైన ఆ విరాట్టు వివిధ ప్రాణులకు ఆత్మవిభు రూపం అదియే ఆదిమావతారం ఆ విరాట్గర్భం నుండియే సకల ప్రాణికోటితో ప్రపంచం ఆవిర్భవించింది. అలా తోచిన విరాట్పురుషుడు ఆధ్యాత్మిక ఆధి దైవిక అధి భౌతికములను భేదాలతో ప్రకాశిస్తూ వుంటాడు' అని మైత్రేయుడింకా ఇలా అన్నాడు

విదురా! నిజకళాకలితమైన ఆ విరాడ్విగ్రహంలో అనంతరం అగ్ని మొదలైన దేవతా సమూహానికి నివాస స్థానాలైన ముఖాద్యవయవాలు ఏర్పడ్డాయి అవి వివరంగా చెపుతాను విను తొలుతగా అతనికి ముఖస్థానం ఏర్పడ్డది దానిలో అగ్నిదేవుడు జీవులకు శబ్దోచ్చారణ సాధనమైన వాణితో ప్రవేశించాడు

అదే రీతిగా దౌడలు ముక్కు కళ్ళు చర్మం చెవులు రహస్యాంగాలు చేతులు కాళ్ళు జనించి వివిధ దేవతలకు స్థానభూతాలయ్యాయి అలాగే జనించిన హృదయం చంద్రునకు బుద్ధి బ్రహ్మకు అహంకారం రుద్రునకు స్థానాలయ్యాయి

ఆ పురుషుని శిరస్సున స్వర్గం చరణములందు భూమి నాభియందు ఆకాశం కలిగాయి సత్త్వాది గుణపరిణామాలచేత దేవతలు అమరులై స్వర్గం పొందారు రజోగుణం వలన మానవులకు వారి ననుసరించియుండు గోవులు మొదలైన పశుసంతతికి భూమి నెలవైంది తామసగుణ ప్రభావంచేత రుద్ర పారిషద భూతాది గణాలకు అంతరిక్షం ఆవాస స్థానం అయింది.

ఆ విరాట్పురుషుని ముఖంవలన వేదం జనించింది. ఆ వేదాన్ని అధ్యాపనం చెయ్యడం వృత్తిగా గల బ్రాహ్మణుడున్నూ ఆ ముఖం నుండియే జనించి అఖిల

వర్ణాలకు గురువయ్యాడు అలాగే బాహువులనుండి లోకరక్షణార్థం క్షత్రియ కులమూ ఊరువులనుండి కృషి గోరక్షణ వాణిజ్యాది కర్మలు వృత్తిగా గల వైశ్యకులమూ పాదాలనుండి సేవావృత్తి ధర్మంగాగల శూద్రకులం జనించాయి. ఈ నాలుగు జాతులవారు ఎవరి ధర్మాలను వారు పాటిస్తూ శ్రీహరి పాదాంబుజాలను భజిస్తూ ఉంటారు

యోగమాయా బలంచేత వికసితమైన భగవంతుని విరాడ్రూపాన్ని నిరూపించడానికి యత్నించటం నిరర్థకం శ్రీహరి నాభి కమలంనుండి జనించిన బ్రహ్మదేవునకే ఆ శ్రీహరి మహిమ సాకల్యంగా తెలియదు ఇక ఇతరుల సంగతి చెప్పడం దేనికి? వేదాలుకూడా ఆ పుండరీకాక్షుని మహిమను వివరించలేవు. ఇంతెందుకు? ఆ హరికే తన మాయాగతి తెలియదు. ఎందుకంటే అది అనంతం దాని కొక పరిమితి లేదు. అలాంటప్పుడు బ్రహ్మాదులకు మాత్రం ఏం తెలుస్తుంది? అని మైత్రేయుడనేసరికి విదురుడు అతనికి నమస్కరించి ఇంకా ఎన్నో ప్రశ్నలడిగాడు

'మహాభాగా నిర్గుణుడైన భగవంతుడు సృష్టి స్థితి సంహారాలు లీలలే అయినా సగుణుడెలా అయ్యాడూ? ఏమీ తెలియని బాలుడు క్రీడా విలోల మానసుడై ఇతర వస్తువులను సాధనంగా గ్రహించి ఇతర బాలకులతో క్రీడించవచ్చు కాని ఇతర సంగమాలు లేకుండా నిత్య నివృత్తుడు భగవంతునకు అన్య సాధనాల అపేక్షగల క్రీడేచ్ఛ కలగడమేమిటి? గుణమయమైన ఆత్మ మాయచే భగవంతుడు సృష్టిస్థితి సంహారాలు చేస్తూ ఉన్నాడుకదా దేశకాలావస్థలచేగాని అన్య నిమిత్తమునకాని ఆత్మజ్ఞాన విచ్యుతి చెందని జీవుడు అవిద్యా యోగాన్ని ఎలా పొందుతాడు? అతనికి కర్మబంధం ఎలా కలుగుతుంది? వాస్తవ తత్త్వం ఉపదేశించి నా మనో మోహాన్ని తొలగించు - అని విదురు డర్థించేసరికి మైత్రేయుడు ఇలా అన్నాడు—

విదురా విను వితర్కవాదాలు భగవంతుని మాయను ఎప్పుడూ విరోధిస్తూనే ఉంటాయి పరమాత్మ అఖండ అనంతుడు నిత్యుడు వాస్తవంగా బంధనాదులుగాని విపత్తులుగాని అల్పత్వ భావంగాని ఆ భగవంతుని దరి జేరవు కాని మాయాబలంచేత అవి ఈశ్వరునకు ఉన్నట్లు తోస్తుంది యథార్థంగా లేకపోయినా స్వశిరచ్ఛేదనాది వ్యాపారాలు స్వప్నంలో సాక్షియైన పురుషునకు గోచరిస్తాయి కాని జాగ్రదవస్థలో అవి తోచవు దీనికొక దృష్టాంతం చెపుతాను విను నీటియందు ప్రతిఫలించిన చంద్రబింబం ఆ నీళ్ళు కదలినప్పుడు కదులుతూ ఉంటుంది కాని ఆ కదలిక ఆకాశగతుడైన చంద్రునకు ఉంటుందా? ఉండదు అలాగే అనాత్మ ధర్మాలు దేహాభిమానియైన జీవునకేగాని సర్వభూతాంతర్యామియైన ఈశ్వరునకు సంక్రమించవు

మానవునకు ఆత్మ దేహజములైన గుణాలను శ్రీహరి చరణాంబుజ భక్తి ఒక్కటే పోగొట్టగలదు. ఇంద్రియాలు ఈశ్వర విషయాలై నిశ్చలంగా ఉంటే సకల విపత్తులు పోవడానికి హరికీర్తనం చాలు నిరంతరం శ్రీహరి చరణ కమలాలు సేవించే భక్త యోగులకు బ్రహ్మాదులకు కూడా లభించని ఉత్తమపదం లభిస్తుంది అలాంటి మహనీయుల పూర్వజన్మ ఫలాన్ని గణించడం ఎవరి తరమూన్నూ కాదు - అని మైత్రేయు డనేసరికి విదురుడు వినమ్రుడై చేతులు జోడించి శ్రీహరిని మనస్సులో ధ్యానిస్తూ మృదులోక్తులతో ఇలా అన్నాడు

మునీంద్రా నారాయణుడు లోకనాథు డెలా అయ్యాడనిన్నీ జీవునకు కర్మబంధాలు ఏ రీతిగా సంభవించాయనిన్నీ నా మనస్సులో కలిగిన సందేహం మీ వాక్యాలచేత నివృత్తమైంది ఈశ్వరుడు స్వతంత్రుడనిన్నీ జీవుడు పరతంత్రుడనిన్నీ అవగతమైంది శరీరాభిమానంచేత మూఢుడై సంసార ప్రవర్తకుడైన వానికి ఏ సంశయమూ రాదు. భక్తిమార్గంచేత పుండరీకాక్షుని తెలిసికొన్న వానికి ఏ క్లేశమూ ఉండదు కనుక వారిద్దరు సుఖంగా ఆనందంగా ఉంటారు అలాకాక సంశయ గ్రస్తుడైనవాడు క్లేశం పొందుతాడు

అనాత్మ భూతమైన ప్రపంచం వాస్తవంగా లేకున్నా ఉన్నట్లు ప్రతీతి కలుగుతుంది మీ పాదసేవచే దేహం ఆత్మ స్వరూపం కాదని తెలిసికొన్నాను. దేహాత్మ ప్రతీతి తొలగిపోయింది హరిసేవ సర్వదుఃఖ నివారకం శ్రీహరిని కొనియాడితే చాలు ఆతని అనుగ్రహానికి పాత్రుడౌతాడు కాని అలతి అలతి తపశ్చర్యలతో ఆతడు లభించడు

పరమాత్మ ఇంద్రియాది వికారాంతో మహదాదులను తొలుతగా సృజించి క్రమంగా వాటికి పరస్పర సంబంధం కల్పించడం వలన విరాడ్దేహం ఏర్పడ్డది ఆ విరాడ్దేహంలో వసించెడి ఆ పరంధాముని బ్రహ్మవాదులు వేయి శిరస్సులు వేయి పాదాలు వేయి బాహువులుగల పురుషోత్తమునిగా అభివర్ణిస్తారు. ఆ విరాట్పురుషునిలో లోకాలన్నీ ఏ అలజడి లేకుండా వుంటాయనిన్నీ పది విధాలుగా విభక్తమై ఇంద్రియార్థాలతో గూడినదై త్రిగుణాత్మకమైన ప్రాణం ఆ వైరాజ పురుషునియందు ఉంటుందనిన్నీ ఆతని వలననే విప్రాది వర్ణాలు ఉత్పన్నమయ్యాయనిన్నీ నీ వలన తెలిసికొన్నాను

ఆ నాలుగు వర్ణాలవారి వంశాలు పుత్రపౌత్ర పరంపరతో ఎలా వ్యాప్తి చెందాయి? రమాపతి ప్రజాపతులను ఎలా సృష్టించాడు? వారి వలన నవవిధ ప్రపంచం ఏ రీతిగా ఉత్పన్నమైంది? ఏ విభూతిచే ఆ దేవదేవుడు మను వంశములను మన్వంతరాధిపతులను ఏ విధంగా కల్పించాడు? వారి వంశాను చరిత లెట్టివి? భూమికి క్రింద, పైన గల లోకాలు వాటి పరిస్థితులు ఎలా వుంటాయి? వాటి పరిమాణా లెంత? మునీంద్రా నాకు ఇవన్నీ వివరించి చెప్పు.

అంతేగాదు. సురగంధర్వాది దేవయోనులు నరులు పశుపక్ష్యాదులు గగన చరములైన జీవులు స్వేదజములు అండజములు మొదలైన వారి తీరు గూడ చెప్పు. త్రిగుణ ప్రధానాలైన భగవంతుని ఆవేశావతారములగు బ్రహ్మాదులు జగదుత్పాదన రక్షణ క్రియలు వేదాల విధం శ్రీహరి సౌందర్య పరాక్రమాది గుణాలు వర్ణాశ్రమ ధర్మాలు యోగమహిమ జ్ఞానమార్గం విజ్ఞాన సాధనాలైన సాంఖ్య యోగాలు ఇతర శాస్త్రాలు పాషండ ధర్మాలు జీవుల గుణకర్మలు మోక్ష సాధనం దండనీతి పితృమేధాలు తారాగ్రహాలు తపో దానాలు వాటి ఫలితాలు - ఇవన్నీ వివరించి చెప్పు

ఇంకా మానవులను విడిచిపెట్టకుండా వెన్నంటివచ్చేది విపత్తులు ధర్మాలు ఏమిటో శ్రీహరి ఏ విధంగా ప్రసన్ను డౌతాడో? ఏ రీతినైతే గురువులు శిష్యులు గోరెడి అర్థాలను తెలియజేస్తారో! జీవబ్రహ్మలకు ఐక్యసిద్ధి ఎలా కలుగుతుందో ఉపనిషదర్థమైన జ్ఞానం ఎలాంటిదో శిష్య ప్రయోజనం కాక్షించి సజ్జనులు చెప్పేది విజ్ఞాన సాధనాలేవో ముచ్చటగా నాకు వివరించి చెప్పు - అని విదురు దర్థించగా మైత్రేయు డిలా చెప్పడం మొదలు పెట్టాడు

## విదురునకు మైత్రేయుడు భాగవత పురాణాన్ని చెప్పటం

విదురా! పూరు వంశం భూమండలంలోని మానవు లందరికిని నుతింప దగ్గది ఆ వంశంలో నీవు జన్మించి దానికి వన్నె తెచ్చావు నీవు మహా భక్తుడవు శ్రీహరి కథామృతంచేత సద్గుణా కలితమైన నీ కీర్తిలతను అనుదినం ప్రోది చేస్తూంటావు అల్ప సుఖాలను ఆశించి దుఃఖ భాజనులైన వారిని ఉద్ధరించగల భాగవతాన్ని నీకు చెపుతాను ఇది పుండరీకాక్షుని గుణ కథా సమన్వితమైన ఆమ్నాయం (వేదం)

పూర్వం ఒకనాడు ఆ భాగవతాన్ని సంకర్షణుడు పాతాళ లోకానికి తీసికొని వెళ్ళి ముకుళితనేత్రుడై అక్కడ ధ్యానసిష్ఠలో వున్నాడు అతడు మహా జ్ఞాని అతన్ని వాసుదేవు డంటారు వేయి పడగలతో అతడు ప్రకాశిస్తూ వుంటాడు ఒకనాడు సనక సనందనాది మునులు ఆ దివ్య పూరుషుని దర్శించి నమస్కరించారు గంగాస్నానంచేత తడిసిన జటా కపాలాలుగల నాగకన్యలు పతికాములై ఆ మహాభాగుని పాదాంబుజాలను సేవిస్తున్నారు

సనకాదులు ఆ మహానుభావుని ప్రశంసించి పరమాత్మ తత్త్వాన్ని తెలియ చేయమని ఒర్థించేసరికి అతడు వేదార్థసారభూతాలైన భాగవతాన్ని పద్మభవుని కుమారుడైన సనత్కుమారునకు చెప్పాడు ఆతడు సాంఖ్యానికి సాంఖ్యాడు పరాశరునకు పరాశరుడు బృహస్పతికి బృహస్పతి నాకూ చెప్పాడు. నీకు

దాన్ని నేను చెపుతాను విను ఆ శ్రీహరి చరితామృతాన్ని ఆస్వాదించి ఆనందించు. అది భగవత్ప్రోక్తము ఋషి సంప్రదాయికము పరమ పవిత్రమునైన పురుషోత్తమ స్తోత్రం

ఈ ప్రపంచమంతా జలమయమైనప్పుడు అఖిల లోకాలను తనయందిముడ్చుకొని శ్రీమన్నారాయణుడు జలమధ్యంలో వేయి యుగాలు శేషశయ్యపై దారుమధ్యంలో నిగూఢంగా ఉన్న అగ్నిలాగా నిజచిచ్ఛక్తితో కూడి యోగనిద్రలో మునిగి యున్నాడు అనంతరం కాలశక్తిచే ప్రేరితుడై పునస్సృష్టికి పూనుకొన్నాడు తొలుత అతని నాభిదేశంలో పద్మ నాళం పుట్టింది నారాయణుడా పద్మము నందు తన కళాంశాన్ని నిలిపేసరికి అది రవితేజంతో సమంగా ప్రకాశించింది ఆ పద్మంలో వేద మయుడైన చతురాననుడు (బ్రహ్మ) జనించాడు

ఆ చతురాననుడు ఆ తామర దుద్దునందు నిలిచి ఒక్కసారి కనులు తెరచి లోకాలను దిక్కులను ఆకాశాన్ని తన నాలుగు ముఖాలతో కలయజూచాడు కాని అంతా అగమ్యంగా వుంది అతనికి ఏమీ గోచరం కాలేదు యుగాంతకాలమందలి వాయువుచే సంచలించెడి జలరాశిలో జనించిన పద్మాన్ని చూచ్చిగాని ఆ పద్మకర్ణిక యందున్న తనను గూర్చికాని తనకేమీ తెలియక పోవటంచేత అతడు తన మనస్సులో "ఈ నీటిలో ఈ కమలం ఎలా వచ్చింది? ఈ కమల పీఠమందు నే నొంటరిగా ఎలా వున్నాను? నా పేరేమిటి? నా జనన హేతువేది? నా కేమీ తెలియకుండా ఉన్నదే" అని కమల గర్భుడు విస్మయావిష్టు డయ్యాడు ఆ పద్మనాళం యొక్క మూలం ఎక్కడుందో తెలిసికోవాలనుకున్నాడు. ఆ పద్మనాళం గుండా గంభీరమైన ఆ సముద్ర జలంలోనికి ప్రవేశించాడు వేయి దివ్య వత్సరాలు అన్వేషించాడు కాని భగవన్మాయచే అతనికి ఏమీ గోచరం కాక పోయేసరికి అతడు భీతుడై తిరిగి పద్మ పీఠాన్ని చేరుకున్నాడు

ఆ పద్మపీఠమందు చతుర్ముఖుడు అష్టాంగ యోగంతో వాయువును నిరోధించి నూరేండ్లు తపస్సమాధిలో ఉన్నాడు అప్పు డతనికి దివ్యజ్ఞానం కలిగింది ఆ విజ్ఞాన మహిమచేత అతనికి తన హృదయ కమలమందే కారణ స్వరూపమైన శ్రీమన్నారాయణమూర్తి కన్పట్టింది

గొడుగుల్లాంటి పడగల యందలి రత్నకాంతులచే యుగాంతపు చీకట్లను చీల్చివేస్తూ జలరాశియందు ధగధగ లాడుతూన్న శేషతల్పంపై ఆ పరమ పూరుషుడు శయనించి ఉన్నాడు ఆ మహానుభావుడు ధరించిన పీతాంబరపు కాంతి సంధ్యాసమయ మేఘకాంతిని నిరసిస్తోంది కిరీటం కనక శిఖరంలాగా వుంది ఆతడు ధరించిన ముత్యాలహారాలు కొండ చరియలనుండి క్రిందికి పడుతూన్న సెలయేళ్ళ రీతిగా వున్నాయి. తులసిమాల కొండ తటమందలి ఔషధీలత మాదిరి

రిగా ఉంది భుజాలు బోలు వెదుళ్ళలాగాను పాదాలు పాదపాల్లగాను[1] ఉన్నాయి. అతని శరీరం మరకతమణి పర్వతం లాగా మెరుస్తోంది

నానావిధ మణిభూషణాలు అతని దేహ సౌందర్యాన్ని ఇనుమడింప జేస్తున్నాయి అతని చరణ యుగళం భక్తుల పాలిటి కామధేనువు అతని కాలిగోళ్ళు అతని లలాట[2] సౌందర్యానికి ఓటుపడి అతని పాదపద్మాలను ఆశ్రయించిన చంద్రబింబాల్లాగా వున్నాయి అతని తొడలు లక్ష్మికి భూదేవికి తలగడదిండ్లు అనదగిన నీల కదళికా[3] స్తంభాల్లాగా మిలమిల లాడుతున్నాయి అతని కటి[4] ప్రదేశం మణిమయమైన మొలనూలుతోను కడిమి పుష్పాదిని తిరస్కరిస్తున్న పీతాంబరంతోను ముచ్చటగా వుంది నాభి శృంగార రసవాహినిలోని సుడిగుండం లాగా వుంది. నడుం తన గర్భంలోని లోకాలు తిరిగి తిరిగి పుడుతూ ఉండడం వలన శ్రమచే కృశించిపోయినట్లుంది వక్షస్థలం తులసి దామంతో కౌస్తుభమణి తోను ప్రకాశిస్తూ లక్ష్మీదేవి నివాస మందిరంలాగా ఉంది

అతని మెడయందలి రేఖాత్రయం[5] కేళీ సమయంలో లక్ష్మీదేవి కౌగిలించుకొనగా ఆమె చేతి మణికంకణాలు ఒరపిడికి యేర్పడ్డ గీరల్లాగా వున్నాయి బాహువులు కనక మణిమయాలైన కేయూరాలతో[6] మనోహరంగా వున్నాయి. చెక్కిళ్ళు అతని చిరునగవు వెన్నెలకు వెల్లనైన కర్ణకుండలాల కాంతులతో నిగనిగ లాడుతున్నాయి పెదవి దొండపండులాగా పగడంలాగా ఎఱ్ఱగా ఉంది ముక్కు సంపెంగ పూవు మాదిరిగా ఉంది ఆకర్ణాంతాలైన[7] అతని నేత్రాలు కమలములను కలువలను తిరస్కరిస్తున్నాయి చెవులు శ్రీకారాల్లాగా ఉన్నాయి కనుబొమలు మన్మథుని ధనువుల్లాగా ఉన్నాయి. నుదురు కృష్ణపక్షంలోని అష్టమి నాటి చంద్ర బింబాన్ని అనుకరిస్తూ ఉంది

అతడు ధరించిన మణికిరీటం నీల పర్వతంపై వెలుగొందెడి బాలసూర్య మండలంలాగా ప్రకాశిస్తోంది. ముల్లోకాలు వ్యాపించిన అతని తేజముందు సూర్య చంద్రాగ్నుల తేజానికి తావులేకుండా పోయింది యుద్ధరంగంలో రాక్షస సమూహాన్ని నాశనం చెయ్యగల చక్రాద్యాయుధాలతో అతని దివ్యరూపం దుష్ప్రాపంగా ఉంది హారాలు పూవులుగా కేయూరాదులతో అలంకృతాలైన బాహువులు కొమ్మలుగా అవ్యక్త మూలమై సర్ప పరివేష్టితమైన[8] చందన వృక్షంలాగా ఉన్నాడా దేవదేవుడు

---

1 చెట్ల మాదిరిగా 2 నుదురు 3 అరటి 4 మొల
5 మూడు గీరలు 6 బాహు పురులతో 7 చెవిదాకా వ్యాపించిన విశాల నేత్రాలు 8 సర్పములచే చుట్టుకొన బడిన

# బ్రహ్మ నారాయణ స్తోత్రం చెయ్యడం

ఆ పరమ పురుషుని చూచేసరికి బ్రహ్మకు లోకాలను సృజించాలనే భావన కలిగింది కాని అతని కప్పుడు శ్రీహరి నాభికమలం ప్రళయ జలం వాయువు ఆకాశం మాత్రం గోచరించాయి కాని యితర మేమిన్నీ కనబడలేదు అప్పుడాతడు శ్రీహరియందు తన మనస్సును చేర్చి యిలా స్తోత్రం చెయ్యడం మొదలు పెట్టాడు

దేవా మాయాగుణ ప్రభావంచేత సృష్టి రూపంలో గోచరించే నీ అద్భుత రూపాన్ని వర్ణించడం దేహధారులకు సాధ్యంకాని పని నీవు భగవంతుడవు నీ రూప మొక్కటే నిత్య సత్యం. అది నాకు ప్రత్యక్షమైంది నాకు వివేకోదయమైంది నా అజ్ఞానం నశించింది శిష్ట సంరక్షణం కోసం వివిధావతారాలు ధరించడానికి మూలమైన నీయీ రూపానికి నీ నాభికమలం వన్నెతెచ్చింది

జ్ఞానానందమయము భూతేంద్రియాత్మకమునైన రూపాన్ని ధరించిన్నీ, ఎక్కడా పొడగానని నిన్ను నేను ఆశ్రయిస్తున్నాను. జగన్మంగళ స్వరూప ధరుడవై నీ ఉపాసకులమైన మా శ్రేయస్సుకోసం ఎడతెగని ధ్యానంచేత నీవు ఈ రూపంలో గోచరించావు కుతర్కాలతో అభాగ్యులు కొందరు నిన్ను ఆదరించరు. మహాత్ములైనవారు నీ కమల సౌరభాన్ని వహించిన వేదమారుతం చెవికి సోకడంచేత కృతార్థు లౌతారు అలాంటివారి హృదయాల్లో నీవు వసిస్తావు నీ పాదారవిందాలను భజించనంత కాలమూ మానవునకు భౌతిక సంపదలను గూర్చిన భయం దుఃఖం పరాభవం ప్రయాస తప్పవు కాని మానవాత్మ నాయకుడవైన నిన్ను ఆశ్రయించినవారికి ఏ బాధా ఉండదు మోక్షం ఇట్టే లభిస్తుంది. మునీంద్రులైనా నీ నామస్మరణం మరిస్తే వ్యర్థజీవను లౌతారు నిన్ను సేవించేవారి హృదయంలో నీ వెప్పుడూ వసిస్తావు

యోగీంద్రులు నిన్ను ఏ రూపంలో భావించి ధ్యానిస్తారో వారిని అనుగ్రహించడానికి నీవు వారికి ఆ రూపంలో గోచరిస్తావు నిష్కామంగా నిన్ను భజించేవారి పట్లనే నీవు ప్రసన్నుడ వౌతావు కాని కామ్యబుద్ధిగల దేవతలనైనా సరే నీవు కన్నెత్తి చూడవు నీవు ఒక్కడవే అయినా సమస్తభూత హృదయాల్లోనూ ఉంటావు సర్వ ప్రాణుల యెడలను దయగలవాడవు కనుకనే నీవు పొడచూపుతూ వుంటావు అనన్య భక్తితో నీ పాద కమలాలను పూజించేవారిని అనుగ్రహించినట్లుగా కేవలం జప తపాలుకాని, యజ్ఞయాగాలుకాని అగ్నిహోత్రాలుకాని వ్రతాలు దానాలుకాని చేసేవారిని అనుగ్రహించవు తత్త్వజ్ఞానంచేత సమస్త భేద మోహాలను పోగొట్టజాలిన వాడవు నీవు. నీకు నా అభివందనాలు

రామ కృష్ణాది నామాలతో నీవు అవతరించగా మానవులు వివశాత్ములై అవసానకాలంలో నిన్ను స్మరించినంత మాత్రంచేత వారి జన్మజన్మాంతర పాపాలు నశించిపోతాయి వారికి మోక్షం ప్రాప్తిస్తుంది అలాంటి దివ్యావతారాలు ధరించెడి అజుడవైన నీకు నా వినయాంజలి.

సృష్టిస్థితి లయకారకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మువ్వురు మూడు శాఖలుగా మనువులు, మరీచి మొదలైన అమరలు ఉపశాఖలుగా లోక వృక్షాకారంలో వెలసిన నీకు నా నమస్కారాలు నీవు కాలాత్మకుడవు నీ పాద పూజ చేయని మూఢాత్ములను జరామరణాలు అంతం చేస్తాయి పద్మసంభవుడైన నేను నీ రూపం చూడాలని కోరి అనేక సంవత్సరాలు తపస్సు చేశాను కాని నీ రూపం గోచరించలేదు నీ అవ్యాజ కరుణచే ఇప్పుడు నీ దివ్యమంగళ మూర్తిని చూడగలిగాను నీకు నా కైమోడ్పులు.

నీవు నీ యిచ్ఛచే నానా యోనుల్లో జన్మిస్తావు అయినా విషయ సుఖాలు విడిచి ఆత్మానందానుభూతితో వర్తిస్తూ పురుషోత్తముడవని విఖ్యాతి చెందావు అలాంటి నిన్ను మనసారా అభినందిస్తాను పంచభూత ప్రవర్తకమైన మాయకు చిక్కక లోకాలన్నింటిని గర్భంలో భరించి భయంకరమైన జలరాశి నడుమ శేషశయ్యపై యోగనిద్రలో మునిగి కొంతకాలానికి మేల్కొని నీ నాభి కమలం నుండి ముల్లోకాలను సృజించావు సకల జగదంతర్యామివై నీ ఐశ్వర్యంచేత సృష్టినంతను సుఖింపజేస్తావు దేవా నీకు నా ప్రణామాలు

ఎలాంటి విజ్ఞాన బలంచేత నీవు అఖిల లోకాలను కల్పిస్తావో అలాంటి జ్ఞానాన్ని నాకు కలిగించు సృష్టి చెయ్యాలని సంకల్పించి కర్మవర్తనుడనైన నేను కర్మ వైషమ్యం చేత పాపం పొందకుండా వుండేలాగా అనుగ్రహించు నీ ఉదర పద్మమందు వసించియున్న నేను విశ్వసృష్టి చేసేటప్పుడు వేద సమూహములు నాకు శుభప్రదాలుగా తోడ్పడే రీతిగా కరుణించు అని బ్రహ్మ వినమ్రుడై పరమేశ్వరునకు వంగి నమస్కరించాడని చెప్పి మైత్రేయుడు విదురునకు ఇంకా ఇలా చెప్పడం మొదలు పెట్టాడు.

బ్రహ్మదేవుడలా తపోమగ్నుడై శ్రీహరిని స్తోత్రం చేసేసరికి ఆ దేవ దేవుడు ప్రసన్నుడై విశ్వసృష్టి చెయ్యాలనే దృష్టితో లయకాలమందేర్పడిన జలరాశిని ఒక్కసారి కలయ చూచాడు పద్మభవుని మోహాన్ని పోగొట్టి అతని కోరిక తీర్చదలచి మధురోక్తులతో ఇలా అన్నాడు

పద్మసంభవా చింతించకు నా లీలకు ప్రధానగుణమైన సృష్టి చెయ్యాలనే దృఢ సంకల్పంతో నీవు తపస్సమాధితోను భక్తితోను నన్ను ప్రసన్నుని గావించు నీ కోరిక తీరుతుంది నిష్ఠతో నీవలా చేస్తే లోకాల్లో వెలుగొందెడి నన్ను నీవు చూడగలవు నాలో ఇమిడియున్న లోకాలు దారు గర్భంలో నిగూ

ధంగా ఉన్న అగ్నిని లాగా నీకు గనపడతాయి సకల భూతాంతర్యామియైన నన్ను తెలిసి సేవించు వివిధ కర్మాను రూపమైన విధిని నానా రూపాలు గల జీవులను సృజించెడి నీ మనస్సులో నేనెప్పుడూ వసిస్తాను కనుక నీకు రజో గుణదోషం అంటదు

ఇంకో రహస్యం విను ప్రాణికోటికి కనబడని పరేశుడనైన నన్ను నీవు చూడగలిగావు నన్ను జగన్మయునిగా గ్రహించు నీకిప్పుడు కనబడిన నా స్వరూపాన్ని శేషాదులుకూడ ఊహించలేరు అభివర్ణించలేరు కనక నీవు ఏ సంశయం లేకుండా నన్ను స్తుతించు నిర్గుణుడనై లీలార్థం లోకాలను కల్పింప గోరెడి నన్ను నీవు సగుణునిగా భావించి సన్నుతించావు నాకు చాల సంతోషం కలిగింది యీ సన్నుతివలన నీ కోర్కెలన్నీ తీరగలవు అనుదినం ఈ పవిత్ర స్తోత్రం వినినవారికి పఠించినవారికి నేను కనబడి వారి వాంఛితాలు తీరుస్తాను దానధర్మాలు జపతపాలు చేయడంవల్ల వచ్చే ఫలం నన్ను స్తుతిస్తే చాలు లభిస్తుంది కనుక నీవు నీ మనస్సులో నా స్తుతి విడువకు జీవకోటిని సృష్టిస్తూనే ఆ జీవకోటియందే నిత్యమూ ఉంటాను నా ప్రీతి కొరకే నిన్ను పుట్టించాను నా లోపల అడగియున్న లోకాలను నీవు అహంకార మూలత్వంతో సృజించు అని పరమేష్ఠిని ఆజ్ఞాపించి పరాత్పరుడైన శ్రీహరి తిరోహితుడయ్యాడు

పుండరీకాక్షుని పరప్రభావంచేత బ్రహ్మ నూరు దివ్య సంవత్సరాలు భగవత్పరంగా తపస్సు చేశాడు అపుడు తన నివాస భూమియైన పద్మాన్నీ వాయువునూ జలరాశిని చూశాడు తన తపోమహిమచే లభించిన విజ్ఞానంవలన వాయువును నిరోధించాడు సమస్త జలాన్ని త్రాగాడు భగవంతుని స్మరించాడు అతనికి అప్పుడు మిన్నంటిన పద్మం గోచరించింది ఆ పద్మ కోశంలో అతనికి సమస్త లోకాలు కనబడ్డాయి అనంతరం శ్రీహరి ప్రేరణచే అత డా పద్మంలో ప్రవేశించి పదునాలుగు లోకాలను సృజించాడు అని మైత్రేయుడు పలికి విదురుని అభ్యర్థనపై కాల సామాన్య లక్షణం గూర్చిన్నీ ప్రాకృతాది సర్గాలను గురించిన్నీ ఇలా చెప్పడం మొదలు పెట్టాడు

ఆద్యంతరహితము, అవ్యయము అయిన తత్వం సృష్టికి ప్రధాన కారణం. గుణ వ్యతిరేకంచేత కాలం మహదాది రూపాలు తనను ఆశ్రయించే సరికి ఈశ్వరుడు కాలస్వరూపు డయ్యాడు. అనంతరం లీలార్థం అఖిల లోకాలను సృష్టించాడు ఆ లోకాల్లో తానుంటాడు. తనలో లోకాలుంటాయి కనుక విశ్వమునకు కార్యకారణాలు రెండు ఆ మహాపురుషుడే. అతని శరీరంనుండియే విశ్వం బహిర్గతమైంది.

ఆ పురుషోత్తముని మాయచేతనే అన్ని కాలాల్లోను సృష్టి స్థితి లయాలు జరుగుతూ వుంటాయి

సృష్టి తొమ్మిది విధాలు అందు కొన్ని ప్రాకృతాలు కొన్ని వైకృతాలు కాలద్రవ్య గుణాదులచేత ఆ నవవిధ సృష్టికి ప్రళయం మూడు విధాలుగా వుంటుంది మహత్తత్వ గణాశ్రయమైనది మొదటి సర్గం (సృష్టి) అది గుణ వైషమ్యం వలన కలుగుతుంది ద్రవ్యజ్ఞాన క్రియాత్మకమైన అహంకార సృష్టి రెండవ సర్గం. పంచతన్మాత్ర యుక్తమైన భూతసృష్టి మూడవది కర్మేంద్రియ జ్ఞానేంద్రియ జననం నాల్గవ సర్గం సాత్వికాహంకార జనితమైన దేవతా సృష్టి అయిదవది అది మనోమయం జీవులకు ఆవరణ విక్షేపం కావించు తామస సృష్టి ఆరవది ఈ ఆరున్నూ ఈశ్వరునకు లీలార్థమైన ప్రాకృత సర్గాలు మిగిలిన మూడున్నూ వైకృతాలు

పుష్పోత్పత్తిలేని రావి మేడి పనస మర్రి మొదలైన వనస్పతులు పూచి ఫలించెడి వడ్లు యవలు మొదలగు ఓషధులు పాకని మల్లె మాలతి మొదలైన లతలు గట్టి బెరడుగల వెదుళ్ళు మొదలైనవి గట్టి మొదళ్ళు గలిగి ఎత్తుగా పెరిగెడి పూపొదలు పూచి ఫలించెడి మామిడి మొదలగు వృక్షములు - ఈ ఆరు విధాలైన స్థావరాలు వైకృత సర్గంలో మొదటిది.

ఉత్తరకాల విచారంలేక ఆహారాది జ్ఞానమాత్రం కలిగి ఘ్రాణేంద్రియంతో వస్తువులను గ్రహిస్తూ దీర్ఘానుసంధానంలేని ఇరవై ఎనిమిది విధాలైన తిర్యగ్జంతు సృష్టి రెండవ వైకృత సృష్టి

రజోగుణ ప్రేరితమై కర్మకరణ సమర్థమై దుఃఖమునందును సుఖాన్ని కాంక్షించు నరజాతి మూడవ వైకృత సృష్టి ఈ రీతిగా ప్రాకృత వైకృత సర్గాలు కలిసి తొమ్మిది

ఇక ప్రాకృత వైకృతో భయాత్మకమైనది పదవ సర్గం దీనిలో దేవ భావం మనుష్యభావం కలిగి పూ(ం)సీయుత్తైన సనత్కుమారాదుల సృష్టి కేవల ప్రాకృతం. వైకృతమైన సృష్టి దేవవర్గం అది పితృవర్గం అసురవర్గం గంధర్వాప్సర స్సర్గం యక్షరాక్షససిద్ధ సర్గం చారణ విద్యాధర సర్గం కిన్నర కింపురుషాది సర్గం భూతప్రేత పిశాచ సర్గం - అని అష్ట విధాలు ఈ విధంగా ప్రాకృత సర్గాలు ఆరు, వైకృత సర్గాలు మూడు ప్రాకృత వైకృతోత్మాకం ఒకటి కూడి సర్గాలు పది విధాలైంది ఇది బ్రహ్మచేసిన సృష్టి భేదాలు

ఇలా కల్పాది సమయంలో అమోఘ సంకల్పుడైన పుండరీకాక్షుడు రజోగుణయుక్తుడై బ్రహ్మరూపాన్ని ధరించి నిజేచ్ఛతో స్వస్వరూపమైన విశ్వాన్ని కల్పించాడు ఈశ్వరుని మాయా వ్యాపారంచేత నదిలోని సుడి గుండంలో పడి తిరిగెడి వృక్షాల్లాగా దేవాసురాదులు పూర్వాపరాలు ఎరుగరు.

వారే ప్రతి మన్వంతరంలోనూ, నానా నామరూపాలు ధరిస్తారు భగవంతుడు కావించిన సృష్టిభేద మట్టిది ఇక కాల లక్షణాలు చెపుతాను విను

సృష్టిలోని పస్తుజాత మంతయు పరమాణు సంయోగమువలన ఉద్భవించినది ఘటపటాదులగు సకల వస్తువులను పరమాణువు వరకు విభజించవచ్చును పరమాణువుకంటె చిన్నది లేదు అట్టి పరమాణువులవల్లనే కాలం ఏర్పడుతోంది సూర్యగమనంచే కాలం విభక్త మౌతుంది సూర్యుడు ఒక పరమాణు ప్రదేశమును ఎంత కాలంలో అతి క్రమిస్తాడో ఆ కాలం పరమాణువని చెప్పబడుతుంది కాల పరిమాణంలో పరమాణు కాలం కంటె స్వల్పతమమైనది లేదు

అలాగే సూర్యుడు ద్వాదశ రాశ్యాత్మకమైన లోకాన్ని అతిక్రమించడానికి ఎంతకాలం పడుతుందో దానికి సంవత్సరమని పేరు. అలాంటి సంవత్సరాన్ని మహాత్మ్యమంటారు రెండు పరమాణువులు ఒక్క అణువవుతుంది. మూడణువుల కాలం త్రసరేణు వవుతుంది గవాక్ష రంధ్రాలనుండి ఆకాశానికి పోయే సూర్య కిరణాల్లో కనబడు పరాగ కణమే త్రసరేణువు మూడు త్రసరేణువుల కాలం ఒక తృటి నూరు తృటులు ఒక వేధ మూడు వేధల కాలం ఒక లవం. మూడు లవముల కాలం ఒక నిమేషం మూడు నిమేషాలు ఒక క్షణం అయిదు క్షణాలు ఒక కాష్ఠ అలాంటి కాష్ఠలు పదియేనైనయెడల ఒక లఘువు లఘువులు పదునేనైతే ఒక నాడిక రెండు నాడికలు ఒక ముహూర్తం ఆరు నాడికలైతే ఒక ప్రహరం దానినే యామం (జాము) అంటారు. ఇక దిన పరిమాణాన్ని తెలిసికొనదగిన విధానం చెపుతాను విను

ఆరు పలాల రాగితో ఒక పాత్ర నిర్మించాలి. నాలుగు మినుప గింజల యెత్తుగల బంగారంతో నాలుగంగుళాల నిడివిగల ఒక శలాకచేసి దానితో ఆ పాత్రలో ఒక రంధ్రం చెయ్యాలి ఆ రంధ్రంలో పడి నీరు ఎంతకాలంలో ఆ పాత్రను నింపుతుందో ఆ కాలం ఒక నాడిక అవుతుంది నాలుగేసి జాములైతే మానవులకు రాత్రిం దివాలవుతాయి అలాంటి రాత్రిందివాలు పదునైదైతే ఒక పక్షం. శుక్లపక్షమని కృష్ణపక్షమని పక్షం రెండు విధాలు రెండు పక్షాలైతే ఒక మాసం.

అట్టి మాసం పితృదేవతలకు ఒక దినం మానవులకు అలాంటి మాసాలు రెండైతే ఒక ఋతువు మూడు ఋతువులు ఒక అయనం దక్షిణాయనము, ఉత్తరాయణమని అయనం రెండు విధాలు. అట్టి అయనాలు రెండైతే మానవునకు ఒక సంవత్సరం. అలాటి నూరు సంవత్సరాలు మానవునకు పరమాయుస్సు కాగలదు

కాలాత్మకుడైన సూర్యుడు గ్రహ తారా నక్షత్ర చక్రగతుడై పరమాణ్వాది సంవత్సరాత్మకమైన కాలం తుదిగా ద్వాదశ రాసులతో గూడిన లోకాన్ని అతిక్రమిస్తూ ఉంటాడు అలాంటి పన్నెండు నెలలు గూడిన కాలం క్రమంగా సౌరం బార్హస్పత్యం సావనః చాంద్రం నాక్షత్రం అను మానభేదాలతో సంవత్సరం పరివత్సరం ఇడావత్సరం అనువత్సరం వత్సరం అను పేర్లను కలిగి ఉంటుంది ఇట్టి కాలపరిమాణానికి కారణభూతుడై సూర్యదేహంతో ఉన్న భగవానుడు మానవుని ఆయువును వ్యయంచేస్తూ కోరికలు కోరువారికి యజ్ఞాదులచే గుణమయములైన స్వర్గాది ఫలాలను కల్పిస్తూ ఆకాశాన సంచరిస్తాడు పంచవిధ వత్సర ప్రవర్తకుడైన ఆ మహాత్ముని పూజించు అని మైత్రేయుడనే సరికి విదురుడు—

'మునీంద్రా! ముల్లోకాల్లోని దేవ పితృ మనుష్యుల ఆయుఃపరిమాణం చెప్పావు ఈ ముల్లోకాలకు మీదనుండు లోకాల్లో నివసించు వారి విషయమూ యోగసిద్ధిచే బహిర్జ్ఞానం పొంది సమస్త భువనాలను చూచేవారి కాలగతిన్ని కూడా చెప్పు' అని అర్థించాడు అపుడు మైత్రేయుడు విదురునకు ఇలా అన్నాడు.

కృతం త్రేత ద్వాపరం కలి - అని యుగాలు నాలుగు అందు కృత యుగం నాలుగువేల యెనిమిది వందల దివ్య సంవత్సరాలు త్రేత మూడువేల ఆరేండ్లు ద్వాపరం రెండువేల నాలుగేండ్లు కలియుగం పన్నెండు వందల యేండ్లు ప్రమాణం కలిగి వుంటాయి కృతయుగంలో మొదటి నాలుగు వందల సంవత్సరాలకు సంధ్య అని తుది నాలుగు వందల సంవత్సరాలకు సంధ్యాంశమని పేరు అలాగే త్రేత ద్వాపరం కలియుగాలకు క్రమంగా మొదటి మూడు వందలు రెండు వందలు ఒక వంద సంవత్సరాలు సంధ్యలు తుది మూడు వందలు రెండు వందలు ఒక వంద సంవత్సరాలు సంధ్యాంశాలు సంధ్యకు సంధ్యాంశానికి మధ్యకాలానికే యుగమని పేరు అదే గోమేధం మొదలైన ధర్మ కార్యాలు చేయదగిన కాలం సంధ్యాంశంలో ధర్మం అల్పంగా ఉంటుంది

ధర్మదేవత కృతయుగంలో నాలుగు పాదాలు త్రేతలో మూడు పాదాలు ద్వాపరంలో రెండు పాదాలు కలిలో ఒక పాదం కలిగి సంచరిస్తుంది పాద భేదాన్ని అనుసరించి మర్యాదలు తగ్గిపోతాయి ధర్మంకూడా ఆ లెక్క ననుసరించియే ఉంటుంది ఆ పాదక్రమంలోనే భూదేవతల బుద్ధికూడా మారుతూ వుంటుంది

మూడు లోకాలకు మీదినుండెడి సత్యలోకంలో బ్రహ్మదేవుడు ఉంటాడు ఆ బ్రహ్మకు నాలుగు యుగాలు వేయిసార్లు తిరిగితే ఒక పగలు అవుతుంది రాత్రికూడా అలాగే అవుతుంది అతడు నిద్రిస్తే లోకాలు అడగిపోతాయి

వేల్కొనగానే మళ్ళీ పుడతాయి బ్రహ్మకు ఒక్క పవలైన కాలంలో పదునాలుగు మనువులు పుడతారు ఒక్కొక్క మనువు ఆయుఃకాలం డెబ్బదియొక్క మహా యుగాలు ఆ మనువుల మధ్య గలమైన కాల భాగాలకు మన్వంతరాలని పేరు మనువంశ సంభూతులైన మనులు మునులు సప్తర్షులు అఖిల జగాన్ని పాలిస్తారు ఇదే బ్రహ్మ ప్రతి దినం చేసేడి త్రిలోక సృష్టి

బ్రహ్మ అలా పవలంతా లోకసృష్టిచేస్తూ రాత్రివేళ తమోగుణాతిశయం చేత నిద్రపోతాడు అపుడు ముల్లోకాలను చీకట్లు ముసురుకుంటాయి సూర్య చంద్ర సంచారం ఉండదు. సమస్తం దేవదేవునిలో అంతర్హితమైపోతుంది అలాంటి సమయంలో శ్రీహరి శక్తితో వెలిగెడి సంకర్షణాగ్ని లోకత్రయాన్ని దగ్ధం చేసేస్తుంది ఆ అగ్నిజ్వాలల వేడిమిని భరించలేక మహర్లోక వాసులు అందరు జనలోకానికి పోతారు ఆ రీతిగా మూడు లోకాలను సంకర్షణాగ్నిచే కల్పాంతంలో చెలరేగిన ప్రళయకాల వాయువువలన అల్లకల్లోలమైన సముద్రాలు ముంచివేసి ఏకార్ణవంగా చేస్తాయి

ఆ ఏకార్ణవంలో పుండరీకాక్షుడు మంచి గంధంలాగా మల్లెపూవులాగా వెన్నెలలాగా పున్నమి చంద్రుని రీతిగా తెల్లపూవులా తెల్లగాఉన్న శేషతల్పమందు సకల లోకాలను గర్భమందు దాచికొని జనలోక నివాసులు వినుతిస్తూ ఉండగా యోగనిద్రలో మునిగి ఉంటాడు

ఇలా అహోరాత్రాలచే ఉపలక్షితమైన కాలం గడుస్తూ ఉండగా స్వభావంతో నూరు సంవత్సరాల పరిమితిగల బ్రహ్మ ఆయువు క్షయిస్తుంది బ్రహ్మ ఆయుష్కాలం రెండు పరార్ధాలు అందులో మొదటి పరార్ధం గతించిపోయింది రెండవ పరార్ధం ఇప్పుడు ప్రవర్తిస్తోంది పూర్వపరార్ధం మొదటి భాగంలో శబ్ద బ్రహ్మ పుట్టడంచేత ఆ భాగానికి బ్రహ్మకల్పమని పేరు. సముద్ర మధ్యమున శేషశయ్యపై శయనించిన భగవంతుని నాభికమలంనుండి పద్మం పుట్టిన కాలం పద్మకల్పం కనుక పూర్వపరార్ధంలో బ్రహ్మకల్పం పద్మకల్పం గడచిపోయాయి ద్వితీయ పరార్ధం మొదటి భాగంలో హరి వరాహావతారం ధరించాడు అంచేత ఆ కాలానికి వారాహ కల్పమని పేరు. ఆ వారాహ కల్పం ఇప్పుడు జరుగుతోంది

విదురా కాల స్వరూపుడు, అనంతుడు విశ్వాత్మకుడు అయిన పరబ్రహ్మను పరమాణువు మొదలు పరార్ధం తుదివరకు గల కాలం ప్రతిబంధింపలేదు అది ఆ మహామహునకు ఒక నిమేష మాత్రం కాగలదు కాలం దేహగేహాద్యభిమానులకు ప్రభువుగాని సర్వేశ్వరుని శాసింపలేదు.

ఏయే సృష్టి చేశావో వినాలని కుతూహలంగా ఉంది అనగా మైత్రేయుడు ఈ రీతిగా చెప్పడం మొదలు పెట్టాడు

విదురా విను బ్రహ్మదేవుడు తొలుత తూర్పున ఉన్న ముఖంనుండి ఋగ్వేదం దక్షిణ ముఖం వలన యజుర్వేదం పశ్చిమ ముఖంనుండి సామవేదం ఉత్తర ముఖంవలన అథర్వవేదం సృజించాడు అనంతరం అదే క్రమంలో హోత మంత్ర స్తోత్రాలైన శస్త్రాలు అధ్వర్యు కర్మమైన స్తోత్రాలు ఉద్గాతృ ప్రయోజ్యమైన ఋక్సముదాయ రూపమైన స్తోత్రం ప్రాయశ్చిత్త రూపమైన బ్రహ్మ కర్మ - ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వవేదం స్థాపత్యవేదం* ఉద్భవించాయి

పంచమ వేదమగు ఇతిహాసం పురాణం సర్వ ముఖాలవలన జనించాయి - అలాగే కర్మతంత్రాలైన షోడశ్యుక్థ్య యాగాలు చయనాగ్ని ష్టోమాలు ఆప్తోర్యామాది రాత్రాలు వాజపేయ గోసవనాలు+ - ధర్మపాదాలైన విద్య దానం తపస్సు సత్యం - బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమాలు పుట్టాయి

ఈ ఆశ్రమాలకు ఒక్కొక్కదానికి నాలుగేసి వృత్తులుంటాయి బ్రహ్మచర్యానికి సావిత్రం[1] ప్రాజాపత్యం[2] బ్రాహ్మం[3] నైష్ఠికం[4] అని నాల్గు వృత్తులు గృహస్థాశ్రమం- వార్త[5], సంచయం[6] శాలీనం[7], శిలోంఛం[8] అని నాల్గు విధాలు వైఖానసులు[9] వాలఖిల్యులు[10], ఉదుంబురులు[11] ఫేనపులు[2]- అని వానప్రస్థాశ్రమం నాలుగురీతులు— కుటీచకుడు[3] బహూదకుడు[4] హంస[5] పరమహంస[6]- అని యత్యాశ్రమం నాలుగు తెరగులు

---

* శిల్పం   + ఇవన్నీ యజ్ఞ విశేషాలు

1 ఉపనయనం మొదలు మూడు దినాలు గాయత్రిని జపించడం 2 సంవత్సరపర్యంతం వేదవ్రతాచరణం 3 వేద గ్రహణానంతరం ఆచరింప దగ్గది. 4 వివాహం మాని జన్మాంతం నిష్ఠగా ఉండడం 5 నిషిద్ధంకాని కృషి మొదలైన వృత్తి వార్త 6 కర్మోపయుక్తమైన యాచన 7 ఇతరులను యాచింపకుండుట 8 నేలరాలిన గింజలను యేరుకొనుట 9 దున్నకుండా పండినవి తినేవారు 10 క్రొత్తవి దొరికితే పాతవి పారవేసేవారు 11 ఎక్కడ ఏవి దొరికితే అవి తినేవారు 12 చెట్లనుండి రాలిన పండ్లను భక్షించేవారు 13 తన ఆశ్రమ విహితకర్మలు చేసేవాడు కుటీచకుడు 14 కర్మను విడచి జ్ఞానం ప్రధానంగా గలవాడు 15 కేవలజ్ఞానాభ్యాసనిష్ఠుడు 16 బ్రహ్మతత్త్వం తెలిసికొని నిష్క్రియుడైనవాడు

ఆన్వీక్షకి త్రయి వార్త దండనీతి- అను మోక్ష ధర్మ కామార్థాలైన విద్యలు-ఓం భూః భువః సువః- అను వ్యాహృతులుకూడ బ్రహ్మదేవుని పూర్వాది ముఖాలనుండి ఉదయించాయి ప్రణవం అతని హృదయాకాశంనుండి ప్రభవించింది

అవే కాక వివిధ ఛందస్సులుకూడా బ్రహ్మవలన జనించాయి అతని రోమంనుండి ఉష్ణిక్ఛందం చర్మంవలన గాయత్రీఛందం మాంసంనుండి త్రిష్టుప్ఛందం నరంనుండి అనుష్టుప్ఛందం ఎముకవలన జగతీఛందం మూలసారం (మజ్జ) నుండి పంక్తిఛందం ప్రాణాలవల్ల బృహతీఛందం- ఉదయించాయి "క" మొదలు "మ" వరకు గల స్పర్శ వర్ణములు జీవం అకారాదిస్వరాలు దేహం ఊష్మాక్షరాలైన శషసహ లు ఇంద్రియాలు అంతస్థాలైన యరలవ లు బలం షడ్జాది స్వరాలు ఏడున్నూ అతనికి క్రీడలు. వ్యక్తమైన వైఖరీవ్యక్తియు[1] అవ్యక్తమైన ప్రణవమున్నూ ఆత్మగాగల శబ్ద బ్రహ్మవలన పరమాత్మ అవ్యక్తాత్మకుడగుటవలన పరిపూర్ణుడును వ్యక్తాత్మకుడగుటవలన ఇంద్రాది శక్తులచే వృద్ధి చెందినవాడునై గోచరిస్తూ ఉంటాడు

తాను సృజించిన ఋషిగణం వీర్యవంతులైనప్పటికీ వారివలన సృష్టి వృద్ధిపొందకపోవడంచేత బ్రహ్మ శబ్దాత్మకమైన శరీరంకంటె భిన్నము నిషిద్ధం కాని కామంగలది అయిన శరీరం ధరించి- నేనెంత యత్నించినా ప్రజాభివృద్ధి కాకపోవడానికి కారణమేమిటి? దైవమే యేదో విఘాతాన్ని కల్పిస్తున్నాడు దైవానుగ్రహం లేనిదే ప్రయోజనం లేదని- చింతిస్తూండగా అతని దేహం రెండుగా విభక్తమై ఒక మిథునం[1] ఏర్పడింది ఆ జంటలో పురుషుడు స్వాయంభువమనువు స్త్రీ అతని భార్య శతరూప

అది మొదలు మైథున ధర్మమైన ప్రజోత్పత్తి ప్రారంభమైంది స్వాయంభువునకు శతరూపయందు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అను ఇద్దరు కొడుకులు— ఆకూతి దేవహూతి ప్రసూతి అను ముగ్గురు కుమార్తెలు పుట్టారు ఆకూతిని రుచికునకు దేవహూతిని కర్దమునకు, ప్రసూతిని దక్షునకు ఇయ్యగా వారికి కలిగిన సంతతులచేత లోకాలు పరిపూర్ణాలయ్యాయి -యని మైత్రేయుడు చెప్పేసరికి విదురుడు మహానందం చెంది శ్రీహరిని ధ్యానించి— 'మునీంద్రా స్వాయంభువుడు తొలి రాజేంద్రుడు విష్ణుభక్తుడు ఆ మహా మహుని చరిత్రవింటే జన్మసార్థకమవుతుంది కనుక నాకు అతని చరిత్ర సాకల్యంగా వినాలని వుంది — అనగా మైత్రేయుడీ విధంగా చెప్పడం మొదలు పెట్టాడు

---

1 బయటికి వెల్లడియగు వాక్యరూపమైన వాక్కు.

2 ఆడుమగల జంట

# స్వాయంభువ మనువు సృష్టి

విదురా! విను వేదశాస్త్రాలు చదివినవాడూ శ్రీహరి చరణారవిందాలు సేవించేవాడు ఎంతటి ఫలాన్ని పొందుతాడో భగవద్భక్తుల కథలు వినేవాడుకూడా అంతటి ఫలితాన్నీ పొందుతారు - అని పలికి మైత్రేయుడు భక్తి పారవశ్యంతో పులకితగాత్రుడయ్యాడు ఆతని కనులవెంట ఆనంద బాష్పబిందువులు జల జల రాలాయి కొంతసేపటికి తేర్కొని తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు

స్వాయంభువ మనువు శతరూపతోగూడి బ్రహ్మకు ప్రాంజలించి- పద్మసంభవా! సృష్టి స్థితి లయాలకు నీవే కారణభూతుడవు మేం ఏమి చేస్తే నీకు మనస్సంతుష్టి కలుగుతుందో చెప్పు పితృసేవ చేసేవానికి ఇహంలోను పరంలోను సత్కీర్తి లభిస్తుంది కనుక మాకు ఆచరణీయమైన కర్మయేమిటో చెప్పు- అని వినయంగా అడిగేసరికి బ్రహ్మ సంప్రీతుడై అతనికి ఇలా అన్నాడు—

కుమారా తండ్రి యాజ్ఞ తలదాల్చి పుత్రుడు నిజోచిత కృత్యాలు చెయ్యడం, తండ్రికి పరిచర్య చెయ్యడం శ్రీహరి సేవతో సమానం కాలదు నీవు యజ్ఞాలుచేసి యజ్ఞ పురుషుడైన శ్రీహరిని ఆరాధించు అతడు సంప్రీతుడయితే లోకాలన్నీ సుఖంగా ఉంటాయి ఊకను దంచితే అణుమాత్రంకూడా ఫలం లభించదు. అలాగే భక్తిహీనంగా శ్రీహరి సమర్పణంగా కాక యెన్ని యజ్ఞాలు చేసినా ధన నష్టమేకాని వాంఛిత ఫలం లభించదు కనుక నీవు నిష్కల్మషమైన భక్తితో యజ్ఞాలు చెయ్యి ధర్మమార్గంలో ధరాపాలనం చెయ్యి సజ్జనులను రక్షించు నీకు శుభం కలుగుతుంది— అని చతురాననుడనగా స్వాయంభువుడు— తండ్రీ నాకు నా కుమారులకు నివాస స్థానమేది? నీటిలో మునిగి యుండటంవల్ల భూమి యెక్కడా కనపడటంలేదే అన్నాడు. అపుడు బ్రహ్మ ఈ రీతిగా మనస్సులో చింతించాడు—

జలమధ్యంలో ఉండిపోయిన భూమిని ఉద్ధరించడం ఎలాగా? తొలుత సృష్టి చేసినవాడు ముందు జలాన్ని అనంతరం భూమిని సృష్టించాను. ఇప్పుడు భూమి రసాతలంలో నీటిలో మునిగి ఉంది తిరిగి సృష్టి చెయ్యటానికి సంకల్పించిన నేను భూమిని ఏ రీతిగా ఉద్ధరించగలను? అని తన మనస్సులో శ్రీహరిని సంస్మరించేసరికి అతని నాసికారంధ్రంనుండి యజ్ఞ వరాహమూర్తి బొటనవ్రేలి యంతటి దేహంతో జన్మించి ఆకాశగతుడై క్షణంలో ఏనుగంతటి ఆకృతి వహించాడు

అపుడు ప్రజా సృష్టికి నియుక్తుడైన మరీచి మొదలైన మునులు మనుకుమారులు మను సమేతులై యజ్ఞ వరాహమూర్తిని చూచి- ఔరా మనం చూస్తుండగా బ్రహ్మదేవుని నాసారంధ్రంనుండి అంగుష్ఠ ప్రమాణంలో జన్మించి

వరాహం క్షణకాలంలో ఏనుగంతటి దయ్యేనే అని ఆశ్చర్య చకితులయ్యారు. అపుడు బ్రహ్మ- నా మనస్సులోగల దుఃఖాన్ని తొలగించడానికి పుండరీకాక్షుడే ఇలా వరాహరూపం ధరించాడు ఎంతటి చిత్రం? అని వితర్కిస్తూన్న సమయంలో సూకరాకారుడైన భగవంతుడు ప్రళయకాల మేఘంలాగా గర్జించేసరికి అందరు మహానందం చెందారు

మాయామయమైన యజ్ఞ వరాహం ఘుర్ఘుర ధ్వనికి బ్రహ్మాండాలన్నీ బ్రద్దలయ్యాయి ఆ మహా ధ్వని విని జనలోకం తపోలోకం సత్యలోకంలో ఉండే వారందరు ఋగ్యజుస్సామ మంత్రాలతో స్తోత్రం చేశారు యజ్ఞ వరాహ రూపధారుడయిన సర్వేశ్వరుడా సమయంలో దిగ్గజేంద్రంలాగా చేసిన లీలా విలాసాలు అందరిని ఆశ్చర్యంలో ముంచెత్తాయి.

ఆ వరాహ మూర్తి తన విసురు వెండ్రుకలను విదలించుటవలన జనించిన వాయువేగానికి మేఘాలు చెల్లాచెదరయ్యాయి కత్తివాయిలాగా వాడియైన గిట్టల తాకిడికి దిగ్గజాలు ఆదిశేషువు చలించిపోయాయి కరకుకోరలనుండి వెల్వడిన అగ్నిజ్వాలలకు వెండికొండా బంగారుకొండా కరగి స్రవించాయి గంభీరమైన దాని ఘుర్ఘుర ధ్వనికి సముద్రాలు అల్లకల్లోలమయ్యాయి

కొంతసేపు పొరలాడుతుంది కొంతవడి రొప్పుతుంది కొంత తడవు ముట్టె ఎగిరించి ముసముసమని భూగంధాన్ని వాసన చూస్తుంది ఒకప్పుడు పదునాలుగు లోకాలను కొమ్ములతో చీల్చి చిమ్మివేస్తుంది ఒకసారి బంగారుకొండ శిఖరమును పొరపిడి రాతితో నొరసి రాపాడుతుంది ఒకమారు గిట్టలతో సప్త సముద్రాలను రొంపిగా నక్కించి ముట్టాడుతుంది ఒకవేళ తోకను త్రిప్పుతూ మింటిని నొరసి బ్రద్దలు చేస్తుంది కనుకొలకుల నిప్పు రవ్వలు రాలగా ఒక్కొక్కప్పుడు భయంకరంగా కనబడుతుంది. మరొకప్పుడు తనను సేవించిన యోగులకు ప్రసన్నంగా తోస్తుంది.

ఆలా స్వైర విహారంచేస్తూ ఆ వరాహమూర్తి సర్వేశ్వరుడు ప్రళయ సమయంలో యోగనిద్రలో ఉన్నప్పుడు జలమగ్నమైన భూమిని ఉద్ధరించటానికి జలరాశిలో ప్రవేశించేసరికి ఆ వేగాన్ని సహించలేక సముద్రుడు కంపించి తరంగ హస్తాలెత్తి నమస్కరించి "వరాహస్వామీ రక్షించు రక్షించు" అని హృదయం చెదరగా అర్థించాడు అపుడు వరాహస్వామి తన దెక్కల కొనలతో నీటిని చీల్చుకొని రసాతలంలో ప్రవేశించి భూమిని చూచాడు

ఆ సమయంలో తొలి రక్కసుడయిన హిరణ్యాక్షుడు యజ్ఞ వరాహ స్వామిని చూచి అగ్రహోదగ్రుడయ్యాడు అతనిపై భయంకరమైన గదను విసిరాడు వరాహమూర్తి ఆ గదా ఘాతాన్ని తప్పించుకొని తన కోరలతో సింహం ఎదపు దేనుగును చీల్చివేయునట్లు దేవకంటకుడైన ఆ రాక్షసుని చీల్చి

చేశాడు అపుడాతని నెత్తుట దోగిన చెక్కిలితో యజ్ఞమూర్తి సంధ్యారుణ మేఘంతో నొప్పెడి పర్వతంలాగా దర్శనీయంగా వున్నాడు అలా వరాహ స్వరూపుడైన విష్ణువు రాక్షసుని వధించి చంద్రకిరణంలాగా తెల్లగావున్న తన దంష్ట్రాగ్రంతో భూమిని పైకెత్తగా అది శ్రీహరికి నిత్యానపాయినియైన లక్ష్మీదేవి పూసిన కస్తూరి లాగా తోచింది ఆ రీతిగా భూమిని ఉద్ధరించిన వరాహమూర్తిని బ్రహ్మాదులిలా స్తోత్రం చేశారు

## యజ్ఞ వరాహమూర్తిని బ్రహ్మాదులు సన్నుతించుట

"దేవా! వేద శరీరా జయము. జయము నీ రోమకూపాల్లో సముద్రాలు లీనమై యుంటాయి. దుష్కృతులకు యజ్ఞాత్మకమైన నీ రూపం కనబడదు అలాంటి నీకు మా ప్రణామాలు

చర్మమున వేదాలు రోమములందు బర్హిస్సు (అగ్ని) నేత్రములందు సంస్కరింపబడిన ఆజ్యం (నేయి) పాదాలయందు యజ్ఞ కర్మలు తుండమందు స్రుక్కు (హోమపాత్ర) నాసికయందు స్రువం (ఆజ్యాహుతి చేయు కొయ్య గరిటె) ఉదరమందు ఇడ (హవిస్సు భుజించెడి పాత్ర) కర్ణ రంధ్రమున చమసలు (చతురస్రంగా ఉండే సామపాత్రలు) ముఖమందు ప్రాశిత్రం (బ్రహ్మ భాగ పాత్ర) నోటియందు గ్రహములు (పాత్ర విశేషాలు) కంఠమందు ఉప సత్తులను యజ్ఞ కర్మలు నాలుకయందు ప్రవర్గ్యపాత్రం కోరలందు ప్రాశీయం ఉదయనీయం అను ఇష్టులు శిరస్సున సభ్యావసథ్యములను అగ్నులు ముఖ మందు హవిర్భక్షణం రేతస్సున సోమం బాల్యాద్యవస్థలయందు ప్రాతస్సవ నాదులు సప్తధాతువుల్లో సప్త సంస్థలు (అగ్నిష్టోమాది యాగ విశేషాలు) సంధుల యందు సర్వయాగాలు కలిగిన దేవుడవు నీవు*. నీవు హవస్వరూపుడవు హవనేతవు హవభోక్తవు అఖిల హవఫలాభాసుడవు హవరక్షకుడవు నీకు మా చేమోడ్పులు

దేవా తెల్లని నీ దంష్ట్రాగ్రమందు సకల చరాచరాలతో గూడిన భూదేవి సరోవరంనుండి బయటకు వస్తున్న మదపు టేనుగు దంతాగ్రమందు సంసక్తమైన పత్ర సహితమగు పంకజం (తామర పువ్వు) లాగా వుంది అంతే కాదు దంష్ట్రాగ్రమందు నీవు ధరించిన భూమివలన నీవు శిఖరాగ్రమందు మేఘాన్నిదాల్చిన కుల పర్వతంలాగా వున్నావు. తండ్రీ స్థావర జంగమాత్మక మైన భూ చక్రాన్ని ఉద్ధరించు నీవు మా తండ్రివి. కావున నీ భార్యయగు

* వరాహస్వామి సర్వక్రతు స్వరూపుడని భావం

భూదేవి మాకు తల్లి. అరణి యందు యాజ్ఞికుడు అగ్నిని నిలిపినట్లు నీవు నీ తేజాన్ని ఈమెయందుంచుటచేత నీమె పవిత్రురాలైంది. కనుక మా తండ్రివగు నీతో పాటు మా తల్లియైన ధాత్రికిన్నీ మా ప్రణతులు.

పరమేశ్వరా నీవు రసాతలంలో వున్న భూమిని ఉద్ధరించడంలో ఆశ్చర్యమేముంది? సకల లోకాలను సృజించిన నీకది యెంతటి పని? ఇంతటి ఘనకార్యం నీలా ఎవ్వరు చేయగలరు? వేదమయుడయిన సౌకరమూర్తిని[2] ధరించి రసాతలం నుండి వెలుపలకు వచ్చేటప్పుడు నీవు నీ శరీరాన్ని విదల్చగా పైకెగసిన పుణ్య జలకణములతో సత్యలోక వాసులమైన మేం పరిశుద్ధుల మయ్యాం. సృష్టి స్థితి సంహారకర్తవైన నీ లీలలు గుర్తించడం మా తరమా? నీవు చేసే కర్మలు అపారాలు. వాటిసారం (అంతం) తెలిసికోవాలని యత్నించేవాడు మతిహీనుడు కాక జ్ఞానియా? ప్రపంచమంతా నీ యోగ మాయలో మునిగి ఉంటుందని తెలిసిన్నీ గ్రహించని మూఢులను ఏమనాలి? కనుక లోకేశ్వరా! నీ కరుణా కటాక్షవీక్షణాలతో మమ్ము సుఖపెట్టు"- అని బ్రహ్మాదులయిన ఆ మునులందరు భక్తితో యజ్ఞ వరాహస్వామిని స్తోత్రం చేశారు.

అపుడు యజ్ఞవరాహమూర్తి కాలి డెక్కలతో సముద్ర జలాలను విదళిస్తూ భూదేవిని పైకి తీసికొని వచ్చి జలోపరితలాన నిలిపాడు. ఈ శుభ చరిత్ర విన్నవారికి సకల సుఖాలు కలుగుతాయి. శ్రీహరిని సేవించేవారికి మనోరథ సిద్ధి కలుగుతుంది. మోక్షం అరచేతిలో వుంటుంది. ఇక తుచ్ఛమైన భౌతిక సుఖాలు లభించడంలో ఆశ్చర్యమేముంది? కనుక పుండరీకాక్షుని కథామృతాన్ని గ్రోలేవాడు ఇతర కథల సారబలాన్ని ఆస్వాదిస్తాడా? కల్పతరు మరందాన్ని త్రాగేటి తుమ్మెద చేదు వేపచెట్ల దగ్గరకు పోతుందా? - అని శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు ఇంకా ఇలా అన్నాడు—

నరేంద్రా మైత్రేయుడిలా చెప్పేసరికి విదురుడు- రాక్షసాంతకుని చరిత్ర ఎంత విన్నా తనివితీరకుండా వుంది. నీ అనుగ్రహంచేత యజ్ఞ వరాహమూర్తి కథ సాకల్యంగా విన్నాను. అయినా రమాధవుని గుణకీర్తనామృతాన్ని కర్ణరంధ్రమనే దోసిలితో త్రావితేగాని నరులకు సంసార తాపాలు తీరవు. శ్రీహరి యజ్ఞవరాహరూపం ధరించి హిరణ్యాక్షుని వధించాడన్నావు. వరాహస్వామి భూమిని దంష్ట్రాగ్రాన ఎలా ధరించాడు? హిరణ్యాక్షునితోటి వైరానికి కారణం ఏమిటి? ఆతణ్ణి వరాహస్వామి యెలా సంహరించాడు? అని అడిగాడు. మైత్రేయుడిలా చెప్పడం మొదలుపెట్టాడు—

మహాభాగా హరి కథలు వినాలనే కుతూహలంగల నీకు జన్మఫలం

---

1 మథించి అగ్నిని పుట్టించెడి కాష్ఠం

2 వరాహరూపము

సిద్ధిస్తుంది నన్ను నీ వడిగిన ఈ కథ పూర్వం ధ్రువుడు హరికీర్తన నిరతుడైన నారదునడిగాడు నారదుడు చెప్పిన ఆ కథ విని ధ్రువుడు మృత్యుంజయుడయ్యాడు అలాంటి శ్రీహరి సంకీర్తనము బ్రహ్మ దేవతలకు చెప్పాడు అది నేను నీకు చెపుతాను విను.

## హిరణ్యాక్ష హిరణ్యకశిపుల వృత్తాంతం

దక్షప్రజాపతి కుమార్తె దితికి సంతాన వాంఛ కలిగింది ఆమె మన్మథ తాపం భరించలేక తన పతి కశ్యపుని దగ్గరకు వచ్చింది అది సాయం సమయం. అసుర సంధ్యవేళ కశ్యపుడు యజ్ఞపతి అగ్నిపురుషుడూ అయిన విష్ణువునారాధించి హోమశాల ముంగిట కూర్చున్నాడు విరహతప్తయైన దితి ఆయన్ను సమీపించి- నాథా గజరాజులు పదాదికేకంతో అరటి కంబాలను విదళించినట్లు మన్మథుడు పుష్ప బాణాలతో నా హృదయాన్ని కల్లోల పరుస్తున్నాడు. కామాతురనై నీ పాదాల నాశ్రయించాను నన్ను కరుణించు

అదీకాక నాతోటి సవతులందరూ నీ అనుగ్రహాతిశయంచేత గర్భవతులై ఆనందంగా వుండడం చూచి నాకున్నూ సంతాన వాంఛ కలిగింది కరుణించి నా వాంఛ తీర్చు నీవు ధర్మవిదుడవు నీకు తెలియంది లేదు పతి సమ్మానానికి పాత్రురాలైన స్త్రీకి సకల వాంఛితాలు సిద్ధిస్తాయి లోకంలో యశస్సు లభిస్తుంది పుత్రవతిని లోకంలో అందరు సన్నుతిస్తారు

భర్తయే తన ధర్మపత్నియందు పుత్రుడుగా జన్మిస్తాడని శ్రుతి అగ్ని ఒకటే అయినా దీపమున ముట్టించిన దీపం రెండుకావా? ఆత్మావై పుత్రః అను వేదోక్తి నీకు తెలియనిదికాదు మా తండ్రి దక్షునికోర్కె ననుసరించి ఆయన కుమార్తెలలో మేం పదమువ్వురం పురుషవరేణ్యుడవైన నిన్ను వరించాం నా కోర్కె తీర్చు- అని దితి దీనాతిదీనంగా వేడింది కశ్యపుడు సావధానంగా ఆమెతో ఇలా అన్నాడు---

తరుణీ నీవన్నది నిజం పురుషునకు స్త్రీవలన ధర్మార్థ కామాలు సిద్ధిస్తాయి కర్ణధారుడు నౌక ఆధారంగా సముద్రాన్ని తరిస్తాడు అలాగే గృహమేధి అన్యాశ్రమవాసులందరినీ రక్షిస్తూ నిజాశ్రమంలో తన పత్ని సాహాయ్యంతో వ్యసన సముద్రాన్ని తరిస్తాడు. పురుషునిలో అర్ధ శరీరం భార్య దుర్గాధిపతులైన రాజు శత్రు వర్గాలను అవలీలగా జయించునట్లు గృహస్థుడు ఇతరాశ్రమ దుర్జయాలైన ఇంద్రియాలనే శత్రువులను పత్నిసహితుడై యిట్టే

---

1 చుక్కాని పట్టువాడు

జయిస్తాడు కనుక భార్య ఋణం తీర్చడానికి ఒక పురుషాయువుచాలదు జన్మాంతరాలుకూడా చాలవు.

అయినా నీవు చింతించకు నీ కోర్కె తీరుస్తాను కాని ఒక ముహూర్త కాలం ఆగు ఇది అసుర సంజ ఈ సమయంలో మన్మథవైరి రుద్రుడు భూత గణాలతో గూడి సంచరిస్తూ వుంటాడు ఈ ఉగ్రసమయంలో రతికేళి నిషిద్ధం. ధర్మాన్ని అతిక్రమించడం దేనికి? రుద్రుడు నీ మరది అతడు మూడు కళ్ళతో ముల్లోకాలూ చూస్తూ వుంటాడు అతని కంటబడని స్థలంలేదు మనకు బంధువైన అతడు చూస్తూండగా సంగమించడం భావ్యంకాదు బంధువేకదా మనల్ని ఏం చేస్తాడనుకోకు అతనికి అందరూ సములే అతనికి తనవారని పరవారనిలేదు అతడు సర్వసముడు నిఖిలభూతమయుడు

అతని పాదపద్మాలను సేవిస్తూ జ్ఞానులమైన మేమందరం మాయామయమైన ఐశ్వర్యాన్ని వాడిన పూలదండలాగా దూరంగా తొలగించి వేస్తాం అతని కరుణచేతనే బ్రహ్మేంద్రాది దిక్పాలకులు వైభవోపేతులై వుంటారు విశ్వనయనయగు అవిద్య అతని ఆజ్ఞానువర్తినియై వుంటుంది వేదాలుకూడా అతని రూప వైభవాలను అభివర్ణింపలేవు త్రిపుర సంహారకుడయిన ఆ దేవదేవుని- కనక భోగ్యమై ఇహపర దూరమైన శరీరాన్ని ఉపాదేయంగా[1] నమ్మి వస్త్ర మాల్యాభరణాలతో అలంకరించుకొను పామరులు కొందరు- శ్మశాన వాసుడని భస్మధారి అని, అస్థిమాల ధరుడని అపహాస్యం చేస్తారు వారు కేవలం నిర్భాగ్యులు- అని కశ్యపుడు దితికి ఎంతగానో హితోపదేశం చేశాడు

కానీ ఆ మాటలేవీ దితి చెవికెక్కలేదు కామోద్రేకాన్ని నిరోధించలేక పోయింది తెలవారుకొని వారకాంతలాగా సిగ్గువిడిచి పతి కట్టుపుట్టాన్ని పట్టి లాగింది. కశ్యపుడు కదనలేకపోయాడు భార్య నిర్బంధాన్ని తప్పించుకోలేక దైవానికి ఒక నమస్కారంపెట్టి ఆమెతో సంగమించాడు సంగమానంతరం అతడు స్నాతుడై ప్రాణాయామంచేసి బ్రహ్మ గాయత్రి జపించాడు

నిషిద్ధకర్మకు పాల్పడినందుకు దితి సిగ్గుపడి తానుచేసిన అపరాధాన్ని సహించి తన గర్భ పరిపాలనం చెయ్యమని రుద్రుని అనేక విధాల స్తోత్రం చేసింది పిల్లలని కనడంచేత ఆమె గర్భవతియై మహానందం చెందింది ఆమె గర్భ చిహ్నాలుచూచి మారీచుడైన కశ్యపుడు సంతోషించక ఆమె చేసిన అకర్మకు ఆత్మలో చింతిస్తూ ఇలా అన్నాడు—

ప్రాణేశ్వరి నీవు లోకనిందకు వెరువకుండా కామాతురవై లజ్జాభయాలు విడిచి వెలయాలిలాగా దుష్కాలంలో నాతో రమించావు. భూతగణ ప్రేరితులై మహా బలవంతులు ఉగ్రకర్ములు అయిన భద్రుడు అనుభద్రుడు

---

1 ఉత్తమమైనదిగా

అను పేర్లుగల రుద్రానుచరులిద్దరు నీకు కొడుకులుగా జన్మిస్తారు ఆత్మ బల గర్వంతో వారు భూమికి భారంగా పరిణమించి సాధువులను పట్టి పీడిస్తారు అపుడా సాధువుల అభ్యర్థనపై శ్రీహరి క్రుద్ధుడై ఇంద్రుడు వజ్రాయుధంతో పర్వతాలను కూల్చినట్లు వారిని నేలకూలుస్తాడు— అని కశ్యపుడు చెప్పగానే దితి వెల వెలబోయి—

కాను సజ్జనులను పీడించెడి వారి ఆయువు సిరి నశిస్తాయి శత్రువుల చేతిలో మృతికూడా కలుగుతుంది కాని వారు నీ కొడుకులు- కనుక వారిని అనుగ్రహించు- అని అర్థించింది అపుడు కశ్యపుడన్నాడు-

తరుణీ నీవు చేసిన విపరీత కర్మవలన ఇలాంటి దురవస్థ కలిగింది అయినా నీవు పశ్చాత్తాపంతో శ్రీహరిని ధ్యానించడంవల్లను నన్ను సేవించడం వల్లను నీ కొక శుభ పరిణామం కలుగుతుంది విను నీ కడుపున పుట్టే యిరువురు కొడుకుల్లో హిరణ్యకశిపుడనే వానికి ధార్మికుడు శ్రీహరి భక్తుడు అయినవాడు జన్మించి నీ వంశాన్ని పావనం చేస్తాడు అతని కీర్తి లతలు బ్రహ్మాండమంతా ప్రాకుతాయి మలినమైన బంగారం అగ్నిపుటంవేత పరిశుద్ధ మైనట్లు దుష్టాత్ముని కడుపున జన్మించినా హరిభక్తుడగుటవలన వంశ వర్ధనుడౌతాడు మహా యోగులుకూడా అతని శీలానికీ, స్వభావానికి ముగ్ధులై అతనిలాగా వర్తించాలని యత్నిస్తారు.

భాగవతోత్తముడైన నీ యీ మనుమడు అన్యదృష్టి లేకుండా నిరంతరం శ్రీహరి చరణ దాస్యం చేస్తూ వుంటాడు. అతడు సంసార లంపటుడుకాడు దేహాభిమానాన్ని విడిచివేస్తాడు ఇతరులు సుఖిస్తే ఆత్మలో తానెంతో సంతోషిస్తాడు దుఃఖిస్తే తానెంతో పరితపిస్తాడు ఈ విశ్వమంతా హరిమయమని భావించెడి మహాజ్ఞాని అతడు. వేసవిలో ప్రాణికోటి సంతాపాన్ని పోగొట్టే చంద్రుడులాగా ఆ పుణ్యాత్ముడు అఖిలలోకాల దుఃఖాన్ని అపనయిస్తాడు

అతడు నిరంతరం లోనా బయటా శ్రీహరి రమణీయమైన ముఖాన్ని చూస్తూ ఆనందాబ్ధిలో ఓలలాడుతూ వుంటాడు- అని కశ్యపుడు చెప్పగా దితి తన కన్నకొడుకులు శ్రీహరిచేతిలో నిహతులవుతారనిన్నీ, తన మనుమడు మహా భాగవతోత్తముడౌతాడనిన్నీ విని దుఃఖమూ సంతోషమూ కూడా చెందింది.

కశ్యపుని వీర్యంవలన ఆమె దాల్చిన గర్భం మహా తేజంతో దినదినం ప్రవృద్ధమవుతోంది తన గర్భస్థులైన కొడుకులు సురవిరోధులౌతారనే వ్యధ మాత్రం ఆమెను విడిచిపెట్టలేదు నూరేండ్ల గర్భధారణానంతరం ఒకనాడు ఆమె గర్భంనుండి ఒక మహా తేజస్సు వెల్వడి భూమిని ఆకాశాన్ని అలముకొంది రవిచంద్రుల తేజాన్ని క్రమ్మివేసింది కారుచీకట్లు ముసురాయి దేవతలు భయా

విష్ణులై బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళి ఆయన్ను యథోచితంగా ఆరాధించి యిలా అన్నారు:

దేవదేవా నీవు చరాచర జగత్తునకు అధినేతవు లోకపాలకు లందరికీ శిరోభూషణుడవు సకల బ్రహ్మాండాల్లో నీకు తెలియని దేమీలేదు ఆపత్తులో నున్న మమ్మల్ని కరుణించు కార్యరూపమైన ప్రపంచానికి నీవు కారణుడవు సకల భువనాలను సృజించింది నీవు సకల ప్రాణికోటి ఆత్మ భావాలను నీ వెరుగుదువు ప్రపంచం అంతా నీయందు లీనమై వుంటుంది నిష్కామబుద్ధితో నిన్ను ధ్యానించి జ్ఞానేంద్రియాలను జయించిన వారలకు ఏ పరాభవాన్నీ రానీయవు నీకు మా ప్రణతులు

కశ్యపుని వీర్యం దితి గర్భంనుండి అన్ని దిక్కులను ఆక్రమించి కాష్ఠంలోని అగ్నిలాగా వృద్ధిపొందుతోంది అహోరాత్ర విభాగం తెలియక లోకాలన్ని కర్మలు మానేశాయి శరణాగతులమైన మమ్మల్ని రక్షించు అని దేవతలు విన్నవించేసరికి చతురాననుడన్నాడు—

సురలారా మీ పూర్వజులూ నా ఆత్మజులూ అయిన సనకాదులు భువనాలన్నీ తిరుగుతూ ఒకనాడు శ్రీహరి పాదాంబుజాలను సేవించాలనే కోరికతో వైకుంఠానికి వెళ్ళారు ఆ మహానగరంలో అందరందరు నిష్కాములు ముముక్షువులు నిరంతరం శ్రీహరి చరణారవిందాలను సేవిస్తు ఆనంద వారాశిలో నోలలాడుతూ వుంటారు.

ఆ వైకుంఠంలో నిశ్శ్రేయం అనే ఒక ఉపవనం వుంది అది సకల ఋతుధర్మాలతో నిరంతరం మనోహరంగా వుంటుంది అర్థిజనుల కోర్కెలను తీర్చేది కల్పవృక్షాలతో ఆ వనం కనువిందుచేస్తూ వుంటుంది ఆ వనంలో పురుషులే కాదు పశు పక్ష్యాదులు కూడా శ్రీహరి నిరంతర గానంలో మునిగితేలుతూ వుంటాయి. అచట యువతీ యువకులు విమానాలను అధిష్ఠించి నిరంతరం మకరందాన్ని స్రవించేది వికసిత మాధవీ కుసుమాల పరిమళాన్ని వహించి విషయ సుఖాన్ని ప్రేరేపిస్తూ వీచెడి వాయువును తిరస్కరిస్తూ శ్రీహరి చరిత్రను గానంచేస్తూ విహరిస్తూంటారు

అచట పక్షి విశేషాలు కూడా భగవద్గుణాసక్తి కలవై యుంటాయి రాజహంసలు, పారావతాలు చిలుకలు గోరువంకలు, బెగ్గురు పక్షులు నెమళ్ళు అచటి తుమ్మెదల ఝుంకారాన్ని శ్రీహరి సంకీర్తనంగా ఉత్ప్రేక్షించి తమ కోలాహలాన్ని కొంతసేపు చాలించి చెవులార వింటూ పరవశిస్తాయి అచట మందార మల్లికాది నానావిధ పుష్పాలెన్నో వున్నాయి కాని శ్రీహరి వాటి నన్నిటిని విడిచిపెట్టి తులసిని భూషణంగా గ్రహించాడు అయినా ఆ పూవులు ఈర్ష్యపడక తులసి సౌభాగ్యాన్ని మెచ్చుకుంటూ వుంటాయి.

అచటి పూపొదరిండ్లలో మదభారంతో లేనడుము ఒల్లాడగా మణిమయాలైన ఒడ్డాణపు మువ్వల మధుర ధ్వనులతో వీనులకు విందు చేస్తూ జఘన భారంతో రాజహంసల్లాగా మందమందంగా నడుస్తూ మన్మధుని పూబాణాలను అపహసించెడి నేత్ర పద్మాలతో సవిలాసంగా మన్మధ కేళీ విహారాల్లో మునిగి తేలెడి యువతీజనుల శృంగార చేష్టలకు చలించక అచటి భక్తజనులు సంతత హరినామ చింతనం చేస్తూ వుంటారు

త్రిలోక సుందరియైన లక్ష్మీదేవి మణికింకిణీ కలితాలైన తన కాలియందెల రవళులు వీనులకు విందుచేస్తూండగా తన ప్రాణేశుని మందిరంలోని స్ఫటిక కుడ్యాలలో (గోడల్లో) తన మనోహరాకృతి ప్రతిబింబిస్తూండగా లీలాకమలంతో ఆ గోడలను స్వయంగా తుడుస్తూ వుంటుంది ఆ ఉద్యానంలో సువాసనలు గుబాళించు తులసీదళ దామాలతో ఆమె శ్రీహరి చరణాల విందాలను అర్చిస్తుంది పగడాలతో నిర్మించిన దిగుడు బావుల్లోని నిర్మల జలపూరంలో నాసటి కస్తూరిని పరిహసించెడి నల్లని కురులతో నూవు పూవు సోయగాన్ని తిరస్కరించెడి నాసికతో ముద్దులు గులుకు ఆమె ముఖం ప్రతిబింబించగా ప్రాణేశుడు తన ముఖ పద్మాన్ని ముద్దుపెట్టుకున్నాడని భ్రమించి శ్రీదేవి లోలోన చిరునవ్వులు చిలకరిస్తుంది. ఆ వనం పుణ్యానికి శరణ్యం ధర్మానికి స్థానం. సుకృతానికి ఆలవాలం

నిరంతరం హరిచరణ సేవాసక్తులైన భక్తులుండెడి ఆ చోట శ్రీహరి విముఖాత్ములు ఇతర కథా శ్రవణ నిరతులు అయిన వారికి తావులేదు భగవదారాధనకు సాధన భూతమైన నరజన్మయెత్తిన్నీ కొందరు శ్రీహరి మాయచే మోహితులై ఆ దేవదేవుని సేవింపరు అట్టివారికి ఆ స్థానం ఎన్నడూ లభించదు శ్రీహరి కథలను విని ఆనందాశ్రువులు చెక్కిళ్ళపై స్రవిస్తూండగా గద్గద స్వరంతో పులకించి పోయెడి నిరహంకారులగు సుకర్ములకు మాత్రమే అక్కడ చోటు లభిస్తుంది.

ఆ వైకుంఠం సరోవరంలాంటిది స్వర్ణశాలలతోను, గోపురాలతోను ఒప్పెడి శ్రీహరి మందిరం ఆ సరస్సులో పద్మం లాంటిది ఆ మందిరాంతరంలో ప్రకాశించెడి శేషువు ఆ పద్మంలోని దుద్దు ఆ శేషుని పడగ శయ్య ఆ శయ్యపై శ్రీహరి భృంగాకారంతో (తుమ్మెదలాగా) నివసిస్తాడు శ్రీహరి పరిపాలించెడి ఆ వైకుంఠానికి సనందాది మునీశ్వరులు వెళ్ళి శ్రీహరిని దర్శించాలనే కాంక్షతో అన్యదృష్టి లేకుండా ఆరు కక్ష్యలు దాటి ఏడవ కక్ష్యయందు ఇద్దరు ద్వారపాలకులను చూచారు

వారు కాంచన మణిమయాలైన హారాలు బాహుపురులు అంగుళీయకాలు మొదలైన ఆభరణాలు ధరించివున్నారు. వారి చేతుల్లో గదలు, బెత్తాలు వున్నాయి.

వారు ధరించిన వనమాలల సూక్ష్మ సౌరభానికి తుమ్మెదలు మూగుతున్నాయి వారు చతుర్భుజులు వారి కళ్ళు రోషాగ్నితో ఎఱ్ఱబారి వున్నాయి వారి నొసలు కనుబొమలు కుటిలంగా వున్నాయి ఆ దౌవారికులను చూస్తూ సనకాదులు వృద్ధులయ్యుండిన్నీ ఐదేండ్ల బాలకుల్లాగా కనబడుతూ నిశ్శంకంగా లోనికి వెళ్ళడానికి యత్నించేసరికి వారిని ఆ ద్వారపాలకులు దుర్భాషలాడుతూ అడ్డగించారు అప్పుడా మునులు రోషారుణిత నేత్రులై అందరూ వింటూండగా ఇలా అన్నారు—

ఓరీ శ్రీహరి దర్శనార్థం వచ్చిన మేము సాధువులం నిష్కపట వర్తనులం మమ్మల్ని నిరోధించడం మీకు తగదు మీ రెవరో మాకేం తెలుసు. కొందరిని ప్రవేశింపచెయ్యడం అనుమానం కలిగినప్పుడు కొందరిని నివారించడం దౌవారిక ధర్మం అంటారేమో అది సమంజసం కాదు ఇది వైకుంఠం ఇక్కడ కలుషాత్ములైనవారికి అడుగుపెట్టే అధికారమే లేదు కనుక మీ రలా శంకించడమే తప్పు ప్రశాంత దివ్యమంగళ విగ్రహుడు విశ్వగర్భుడునైన ఈశ్వరుని దృష్టిలో వీడు రాదగినవాడు వీడు రాదగనివాడు అను వైషమ్యం వుండదు కాక మా వేషభాషలను బట్టైనా మేము యోగ్యులమని మీరు గ్రహించలేరా?

విద్వాంసులు మహాకాశంలో ఘటాకాశంలాగా పరమాత్మయందు జీవాత్మను అభేద భావంతో చూస్తారు భగవంతుడు సర్వాత్మకుడు భూసురులమైన మాకును వైకుంఠ నాయకునకు భేదంలేదు. అంచేత రాజదండనానికి వెరచి మమ్మల్ని వారించామని మీ రొకవేళ భావిస్తే అదీ ఉచితంకాదు కనుక మీరు మందబుద్ధులై అకారణంగా మమ్మల్ని అడ్డగించారు అంచేత అనుచిత కర్ములైన మీ రిక్కడ ఉండదగరు మీరు లోభ మోహాలకు నెలవైన భూలోకంలో పుట్టండి' అని వారిని శపించారు

సనకాదుల శాపం విని జయ విజయు'లను ఆ ద్వారపాలకు లిద్దరు తల్లడిల్లి వారి పాదాలపై వ్రాలి - 'మునీంద్రులారా మీ యీ నిష్ఠుర శాపానికి మేము శోకించం. మీలాంటి సత్పురుషులను పరాభవించిన మా పాపమే ఇంతకు తెచ్చింది. అయినా మీరు అనుగ్రహించి భూలోకంలో మా భావి జన్మల్లో మాకు శ్రీహరి నామ విస్మృతి కలగకుండా చేస్తే మాకు శుభం లభిస్తుంది' అని జయవిజయులా మునీంద్రులను అలా అర్థిస్తుండగా లక్ష్మీదేవితో సరసాలాప వినోదాల్లో మునిగివున్న శ్రీహరి ఆ కలకలం విని అంతఃపురంనుండి బయటకు వచ్చాడు అతనివెంట లక్ష్మీదేవి వచ్చింది. అచ్చరలు ఆ దేవదేవునకు రాయంచల రెక్కల్లాంటి తెల్లని చామరాలు వీస్తున్నారు. ఆ వీవనలవలన జనించిన గాలికి చంద్రబింబంలాంటి ఆ తపత్రం (గొడుగు) కంపించగా దానికి చుట్టూ కట్టిన ముత్తెపు సరుల నీడ తుంపరలుపడి ఆయన శరీరం శోభావహంగా వుంది

చిరునగవును చిందిస్తూ ప్రసన్నంగావున్న ఆయన ముఖారవిందాన్ని మునీంద్రులు సన్నుతిస్తున్నారు ఆయన తనను సేవిస్తూన్న భక్తులను స్నేహార్ద్ర దృక్కులతో చూస్తున్నాడు ఆయన వక్షస్థలంమీద వైజయంతి ప్రకాశిస్తోంది కళ్ళల్లో కృపారసం తొణికిసలాడుతోంది ఆయన యోగిజన సేవ్యుడు సాధు రక్షకుడు లోకాలన్నింటికీ అలంకార ప్రాయమైన వైకుంఠానికి ఆయన అలంకారం

శ్రీహరి అలా ద్వారసీమకు వస్తూనప్పుడు ఆయన తన కటి సీమను దాల్చిన పీతాంబరంమీది మణిమయమైన మొలనూలు కాంతి నలువైపులా మెరిసి పోతోంది మెడయందు వ్రేలాడుతోన్న హారాల కాంతులతో కౌస్తుభమణి కాంతులు ఎంతో సోయగాన్ని కలిగిస్తున్నాయి విద్యుత్కాంతులను సైతం తిరస్కరించెడి ఆయన కర్ణకుండల ద్యుతులు ఆయన చెక్కిళ్ళ కాంతులకు దోహదం చేస్తున్నాయి ఆయన ధరించిన కిరీట కాంతులు నలుదిక్కులా వ్యాపించాయి.

బాహుపురులతోను కనక కంకణాలతోను మనోహరంగావున్న ఎడమ చేతిని ఆయన తన వాహనమైన గరుత్మంతునిపై వుంచాడు. మరో చేతితో లీలా పద్మాన్ని త్రిప్పుతున్నాడు ఆయన పాదపద్మములయందలి పువ్వొడిచే రంజిత మైన తులసిమాలనుండి స్రవించెడి మరంద సుగంధాన్ని వహించి వచ్చెడి గాలిని ఆస్వాదించి ఆయన్ను సేవించడానికి వచ్చెడి యోగి జనులకు ఆయన ఎంతో మనోనందాన్ని కల్పిస్తున్నాడు ఆయన మనోహరమైన ఆకృతిని చూచి అందరు పులకించిపోతున్నారు. ఆయన సౌందర్యంముందు రమాదేవి సోయగంకూడా తీసి కట్టనుపిస్తోంది పగడాల్లాగా ఎర్రనైన పెదవులపై తరళించెడి చిరునగవుతో ముగ్ధమోహనంగావున్న ఆయన ముఖపద్మాన్ని ద్వారసీమయందున్న మునులు ఏదేక దృష్టితో తనివిదీరా తిరిగి తిరిగీ చూచి పరవశించిపోయారు

ఎలాగో అతి ప్రయత్నంమీద వారు తమ దృష్టిని శ్రీహరి ముఖంనుండి మరల్చి సమస్త ఖేదాలను పోగొట్టి మనోమోదాలను కల్పించెడి ఆయన పాదపద్మా లను చూచారు పద్మరాగ మణుల్లాంటి గోళ్ళతో ప్రకాశించెడి ఆయన ఆ పాద పద్మాలను మనసులో గిల్కొలిపి తాము చరితార్థులైనట్లు భావించారు యోగులకు కూడ కానరాని ఆ దేవదేవునకు వారు మాటిమాటికి అభివందనా లర్పించారు బాహ్య నేత్రాలకు కనబడెడి దివ్యమంగళ విగ్రహంతో అలా ద్వారసీమకు వచ్చిన తేజో నిధియైన ఆ పురుషోత్తముని సనకాదులు ఇలా సన్నుతించారు

# సనకాదులు శ్రీమన్నారాయణుని సన్నుతించడం

కపిలేశ్వరా నీకు కుమారుడూ మాకు తండ్రీ అయిన చతుర్ముఖుడు మాకు రహస్యంగా చెప్పిన నీ గంభీర మనోహరమూర్తిని కనులారా చూడ గలిగాం హృదయంలోనె వున్నా దుర్జనులు నిన్ను చూడలేరు నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించిన నీ ఆశ్రితులకు కారుణ్యంతో మనోనందాన్ని కల్పిస్తావు నీ దర్శనాభిలాషతో తపించేటి యోగిజన హృదయాల్లో నీవు అధివసిస్తావని ఆత్మవిదులు మాత్రమే గ్రహించగలుగుతారు నీకు వ్యతిరిక్తాలైన ఇతర కర్మలు మోక్షమిచ్చేవి అయినా నీ భక్తులు ఆ కర్మలను పరిగణింపరు

కనుక పాపాలను పోగొట్టి శ్రీని వైభవాన్ని చేకూర్చేది నీ పాదసేవలో నిరంతరం నిమగ్నులై యుండేటి బుధజనులకు అన్యభావన వుండదు మేము తపోనిధులం పాపాలు మమ్మల్ని దరిజేరవు అయినా ఈనాడు అలిగి నీ ఆశ్రితులను శపించి పాపానికి ఒడిగట్టాం ధర్మహాని కలిగించాం మాకు నరకపాతం తప్పదు మా నేరాన్ని సహించి మమ్మల్ని రక్షించు తుమ్మెద పుష్ప సుగంధాన్ని ఆస్వాదించాలనే కోరికతో ముండ్లతో చుట్టుకొనబడిన నూత్న వికసిత కుసుమ మంజరులను దరిజేరునట్లుగా మేము అనేక విఘ్నాలకు ఓర్చి నీ చరణ సరోజాలు సేవించడానికి వచ్చాం

పరమేశ్వరా నీ పదాంబుజాలను అంటి తులసి పవిత్రమైంది అలాగే నీ కథామృతంతో నిండిన వాక్కులు సోకి మా చెవులు పవిత్రాలయ్యాయి ఇంద్రియ వశులైనవారికి కానరాని నీ అతసీ శ్యామల శరీరం[1] చూచి మా కన్నులు కృతార్థత చెందాయి అచ్యుతా నీకు మా నమస్కారములు - అని సనకాదులు శ్రీహరి చరణ కమలాలకు మ్రొక్కేసరికి ఆ దేవదేవుడు సంతుష్టుడై వారి కిలా అన్నాడు

- వారు జయవిజయులను నా దౌవారికులు మిమ్మల్ని వారించినందుకు మీరు వారికి తగిన శిక్ష విధించారు అది నాకున్నూ సమ్మతమే ఎందుకంటే సేవకులు చేసే తప్పు స్వామిది అవుతుంది కనుక మీరు నన్ను మన్నించండి. శరీరమున సంభవించిన కుష్ఠరోగం శరీర చర్మాన్ని అంతా వివర్ణం చేస్తుంది అలాగే భృత్యులు కూడని పనిచేస్తే యజమానికి యశో హాని కలుగుతుంది అతని పేరు ప్రతిష్ఠలు మంటగలిసిపోతాయి మీ మహిమవలన ఈ వైకుంఠానికి మహా యశస్సు లభించింది అది మహా పవిత్రమైంది ఆ వైకుంఠనామం చెవిసోకితే చాలు నీచులుకూడా పరమ పావనులౌతారు.

---

1 అవిసెలాగా నల్లగా నుండేటి శరీరం

అలాంటప్పుడు సాధువులైన మీకు అపకారం చేసినవారు నా యంతటి వారైనాసరే వారిని త్రుంచివేస్తాను. ఇక ఇతరులను విడిచిపెడతానా? భూసురుల చరణ సరోజాలనుండి స్రవించెడి జలం పాపనాశకమైంది. లోకపావనమైనది నేనది శిరస్సున ధరిస్తాను. అలాంటి నన్ను విరక్తునిగా భావించక సకల సంపదలకు నిలయాలైన కడగంటి చూపులతో లక్ష్మీదేవి నా వక్షస్థలాన్ని అధివసించి వుంటుంది. యజ్ఞాల్లో యజమానిచే అగ్నిజ్వాలలయందు వేల్వబడిన ఘృత ప్లుతమైన హవిస్సు[1] వల్ల నేను తృప్తిచెందను. కాని నిష్కామ బుద్ధితో ధర్మ పారగతుడైన బ్రాహ్మణుడు భుజించెడి ప్రతి కబళంతో నేను తనివి చెందుతాను.

నేనెల్లప్పుడూ అప్రతిహతమైన యోగమాయా విభూతితో విరాజిల్లుతూ వుంటాను. అయినా బ్రాహ్మణుల చరణ సరోజ రేణువులను మణిమయమైన నా కిరీటంమీద ధరిస్తాను. నా చరణ సంభవయైన గంగను శిరస్సున ధరించి ఈశ్వరుడు మున్నగు దేవతలు పవిత్రులయ్యారు. అలాంటి నేనే విప్రుల చరణాంబువులను శిరస్సున చల్లుకుంటాను. అంతటి పావనమూర్తులైన బ్రాహ్మణులు ఒకవేళ అపకారం చేసినా ఆగ్రహం చెందకుండా వారిని నాతో సములుగా భావించెడి వాడు నాకు ప్రియతముడౌతాడు.

గోవులను బ్రాహ్మణులను నన్ను దీనులను భేదభావముతో చూచేవానికి నరకం తప్పదు. అక్కడ యమభటులు వానిని గ్రద్దలు ముక్కులతో చీల్చినట్లు చీల్చివేస్తారు. బ్రాహ్మణులొకవేళ తమను పరాభవించినా చిరునవ్వుతో వారిని సన్మానించి పూజించేవారిని నేను నాతో సమానులనుగా భావిస్తాను. పుణ్యాత్ములగు బ్రాహ్మణులకు నేను అమ్ముడు పోయానంటే అందులో అత్యుక్తిలేదు. పూర్వం భృగుమహర్షి ఒకనాడు నన్ను తన్నితే నేను కినుక వహించకుండా పూజించలేదా? నా మనోభిప్రాయం తెలిసికోకుండా మీరు గర్వాంధులై మీ యాజ్ఞను అతిక్రమించినందుకు తగిన ఫలితం పొందారు. కాని వీరు భూమిపై జన్మించి అచిరకాలంలోనే తిరిగి నా దగ్గరకు వచ్చేలాగా అనుగ్రహించండి - అని అర్థించాడు.

కాని సనకాదులు శ్రీవారి అమృతోపమానాలైన వాక్యాలను వినిన్నీ తృప్తి చెందలేదు. ఎందుకంటే ఆ దేవదేవుడు పలికిన మాటలు గంభీరంగా దురవగాహంగా వున్నాయి. అనేకార్థాలు వచ్చేటట్లున్నూ వున్నాయి. తమను అభినందిస్తూ అలా అన్నాడో లేక నిందిస్తూ అన్నాడో అనే సంశయం కూడా కలిగింది వారికి. వారు ద్వారపాలకులకు విధించిన శిక్షకు సంకోచించి పుండరీకాక్షు డలా నర్మ

1 నేతితో నిండిన హోమద్రవ్యం

గర్వంగా మాట్లాడానేమో అనే భావన కలిగింది కాని వెంటనే పునరాలోచనచేసి శ్రీహరికి తమ యెడ కృప లేదని గ్రహించి పులకించిపోతూ చేతులు జోడించి నిజమాయాయోగింపున అపారమైన విభూతిని బలాన్ని కలిగిన ఆ పద్మాక్షునకు ఇలా అన్నారు

దేవా విప్రులు దేవతలందరికీ పరదేవతలు ఆ విప్రులకు నీవు అధిదేవతవు అలాంటప్పుడు నీకు విప్రులు అధినాయకులని అనడం చోద్యంగా ఉంది. సకల ధర్మాలు నీ వలన కలిగాయి ఆ ధర్మాలను నీవే ఆ యా అవతారాలు ధరించి రక్షిస్తూ ఉంటావు ఆ ధర్మాలకు ఫలమున్నూ నిర్వికారుడవైన నీవే నిస్పృహులైన యోగీంద్రులుకూడా నీ అనుగ్రహంచేత మృత్యుభయం లేకుండా వుంటారు అలాంటప్పుడు నీవు అన్యుల అనుగ్రహాన్ని ఆకాంక్షిస్తున్నావంటే ఆశ్చర్యంగా వుంది.

లక్ష్మీదేవి చరణ రేణువులు అర్థులకు శిరోలంకారాలు అలాంటి లక్ష్మి తామరపూవు పరాగంనుండి జాలువారేడి మరందం కోసం మూగే 'భ్రమరాంగన[1] లాగా భక్తు లర్పించిన తులసిదామంచే అలంకృతమైన నీ పాదాలను సేవింప గోరితే భాగవతులయం దుండెడి అనురాగంచేత నీవు ఆమెను కన్నెత్తియైనా చూడవు. నీ మహిమ యెంతటి విచిత్రమైనదో

శ్రీవత్సాంఛనసంగాగల మహాదేవా భూదేవుల పాదరేణువులు నీ శరీరానికి అలంకారాలన్నావు. లోకంలో అందరికీ విప్రుల మహిమను తెలియజేయడానికి నీ వలా అన్నావుకాని లేకపోతే నీ వెక్కడ? బ్రాహ్మణు లెక్కడ? నీ ముందు వా రేపాటి? జగన్నాయకా నీవు రక్షింపదగినవారిని రక్షించకపోతే వేదోక్తమైన ధర్మ మార్గం నశిస్తుంది అందుచేతనే నీవు శిష్టసంరక్షణం దుష్టజన సంహారం చేస్తూంటావు విప్రులయందు నీకుగల కారుణ్యంచేత నీవు పలికినయవి సమంజసంగా వున్నాయి నీ వలా వినయంగా పలికిన మాత్రాన నీకు ప్రాభవ హాని యేమిన్ని కలుగదు.

ఎందుకంటే నీవు విశ్వ కర్తవు విశ్వ పాలకుడవు నీ కేమిటి? ప్రాభవ హాని యేమిటి? అలా వినయంగా పలకడం నీ కొక లీల మునుపైన మమ్మల్ని నీవు సత్కరించడం మా యందు నీకుగల అనుగ్రహంచేతనే మా దొక విన్నపం ఈ జయవిజయుల యెడ నాగ్రహించి మేము విధించిన శిక్ష తక్కువ అనుకుంటే వారికి నీవు నీ యిష్టంవచ్చిన కఠినశిక్ష విధించు లేదా నీవు వారిని రక్షింపదలిస్తే రక్షించు. నీవు ఎలాచేసినా మాకు సమ్మతమే ఒకవేళ అనపరాధులు నిర్మలాంతరంగులు అయిన వీరి యెడల మేము అనుచితంగా ప్రవర్తించివుంటే ఆజ్ఞాపించు - అని బద్ధాంజలులై యున్న మునులకు రమాధవు డిలా అన్నాడు.

---

1 ఆడు తుమ్మెద

మునీంద్రులారా వీరు భూమిమీద అసురయోనిలో జనించి దేవతలను పీడిస్తారు లోకకంటకు లౌతారు. నాయందు వైరానుబంధాన్ని పెంచుకొంటారు యుద్ధరంగంలో నన్నెదిరించి నా చక్రాహతిచే నిహతులై తిరిగి నా సాన్నిధ్యానికి వస్తారు వైరభావంతోనైనా నన్ను స్మరించడం వలనను నా సముఖంలో నా ముఖం దర్శిస్తూ మృతిచెందడం వలనను వీరికి నా పదవి లభిస్తుంది వీరికి పునర్జన్మ వుండదు నా మనోభావంకూడా మీరు వీరి యెడల పలికిన మాటలకు అనుగుణంగానే వుంది కనుక మీరు మీ మనస్సులో ఏ విధంగానూ శంకించ కండి—

అనగా సనకాదులు పులకించిపోయారు. ఆనందాశ్రువుల కారుస్తూ వైష్ణవ లక్ష్మిని సన్నుతిస్తూ పరమేశ్వరుని వీడ్కొని నిజాశ్రమాలకు వెళ్ళిపోయారు. అనంతరం శ్రీహరి జయవిజయుల నుద్దేశించి - మీరు రాక్షసులై జన్మించక తప్పదు. నేను సర్వశక్తి సంపన్నుడనై యుండికూడా విప్ర వాక్యాలను వారింప లేకపోయాను కనుక మీరు రాక్షస యోనిలో జనించి నాతో వైరం పెట్టుకొని నిరంతరం నన్నే స్మరిస్తూ మరణానంతరం తిరిగి ఇక్కడకు వస్తారు. వెళ్ళండి - అని ఆజ్ఞాపించి లక్ష్మీదేవి వెంటరాగా పుండరీకాక్షుడు నిజమందిరాంతరం లోనికి వెళ్ళిపోయాడు

అపుడు జయవిజయులు వెంటనే నిజతేజం కోల్పోయారు ముల్లోకాల్లో అందరు హాహాకారాలు చేస్తూండగా వారు విహ్వలులై భూమండలం మీద కూలి పడ్డారు వారే యిప్పుడు దితి గర్భాగారంలో వున్నారు వారి తేజంవల్లనే మీరు నిస్తేజులయ్యారు ఇంతకూ ఆ శ్రీహరిచేసే పనులు వింతగా వుంటాయి ఆతడు సృష్టి స్థితి సంహార కారకుడు ఆద్యంత రహితుడు వికార శూన్యుడు దయానిధి మీకు తప్పక మేలుచేస్తాడు మీ కోర్కెలు సిద్ధిస్తాయి వెళ్ళండి - అని చతురాననుడు ఉపదేశించగా దేవతలు ఆనందించి నిజలోకానికి వెళ్ళిపోయారు

## జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై జన్మించడం

నూరేండ్ల గర్భధారణానంతరం దితి జగత్కంటకులైన ఇద్దరు కొడుకులను కన్నది అపుడు ఎన్నో దుర్నిమిత్తాలు తలెత్తాయి భూమి కంపించింది కుల పర్వతాలు చలించాయి. సముద్రాలు కలత చెందాయి నక్షత్రాలు రాలాయి ఆకాశం బ్రద్దలయింది పిడుగులు పడ్డాయి హోమాగ్నులు ఆరిపోయాయి ఎదురుగాలులు వీచాయి చెట్లు చిందర వందరగా కూలిపోయాయి. గ్రహాలు నక్షత్రాలు కాంతి విహీనాలైనాయి మేఘాలు నెత్తురు కురిశాయి అకాలంలో రాహువు సూర్యుని గ్రసించాడు దశదిశలా చిమ్మచీకట్లు క్రమ్మాయి పగటి

నక్కలు మోరలెత్తి ఏడ్చాయి దేవతా ప్రతిమలు ఒరిగిపోయాయి ఆవులు నెత్తురు, చీము పిదికాయి ఏనుగుల చెక్కిళ్ళయందు మదజలం ఇంకిపోయింది గృహాలు మార్మోగాయి పాపగ్రహాలు మిత్రత్వం నెరపాయి సౌమ్య గ్రహాలు వక్రగతులు చెందాయి

ఇలా ఎన్నో ఉత్పాతాలు సంభవించేసరికి రాక్షస జననోదంతం తెలియక ప్రళయమేదో వచ్చిపడ్డదని అందరు భయపడ్డారు సనకాదులు మాత్రం నిశ్చలంగా ఉన్నారు దితిసుతులు పుడుతూనే కులపర్వతాల్లాగా ఉన్నారు నేలమీద వారు కాలుమోపితే నేల కంపించిపోతోంది రత్నకేయూరాలు కుండలాలు స్వర్ణకిరీటం మణిమంజీరాలు ధరించి ఉన్నారు వారి కాంతిముందు సూర్యకాంతి వెలవెల పోతోంది

ఆ సమయంలో కశ్యపుడు తన కొడుకులను చూద్దామని దితి మందిరానికి వచ్చాడు వారికి నామకరణం చెయ్యాలనుకొన్నాడు దితి గర్భంలో తన తేజం వలన ముందుగా జన్మించిన వానికి హిరణ్యకశిపు డనిన్నీ, ప్రసూతి సమయంలో దితి ముందుగా కన్నవానికి హిరణ్యాక్షు డనిన్నీ పేరుపెట్టాడు [1]

కాలక్రమంలో హిరణ్యకశిపుడు తన బాహుబలంచేతను బ్రహ్మ యిచ్చిన వరం చేతను తనకు మృత్యుభీతి లేదని తలచి సమస్త లోకపాలకులను జయించి సంతుష్టుడై మహా తేజంతో నిర్భయంగా వున్నాడు అతని సహోదరుడు హిరణ్యాక్షుడు ఏనుగు తొండంలాంటి భుజాదండంమీద గదను ధరించి తనను ఎదిర్చి యుద్ధం చెయ్యగల వీరుణ్ణి ఎక్కడా కానక భూలోకం అంతా గాలించి స్వర్గాన్ని ముట్టడించాడు అతని మెడలో వైజయంతి ప్రకాశిస్తోంది మణి నూపురాలు ఘల్లుఘల్లుమని మ్రోగుతున్నాయి అతని దేహకాంతులు నలుదిక్కులా పిక్కటిల్లాయి అతన్ని చూచి దేవతలు గరుడుని చూచి సర్పాలు పారిపోయినట్లు నలువైపులకూ పారిపోయారు వారి నివాసాలు జిల్లేళ్ళకు ఉమ్మెత్తలకు నిలయాలయ్యాయి.

దేవత లలా శౌర్యహీనులై పారిపోవడంచూచి హిరణ్యాక్షుడు రెచ్చిపోయి సముద్ర మధ్యంలో చొరబడ్డాడు

---

1 హిరణ్యాక్ష హిరణ్యకశిపులు కవలలు పురుష వీర్యం స్త్రీ గర్భకోశంలో ద్విధా విభక్తమైనపుడు కవలలు పుడతారు మొదట ప్రవేశించిన వీర్యం శిశువై తర్వాత, వెనుక ప్రవేశించింది మొదటా పుట్టడం జరుగుతుంది. కనుక కశ్యపునుండి మొదట చలించిన వీర్యం హిరణ్యకశిపు డయ్యాడు వెనుక బయలు దేరిన వీర్యం హిరణ్యాక్షు డయ్యాడు.

వరుణుని సైనికులు వానిని చూచి భయకంపితులై ఎవరికి దొరికిన దారిని బట్టి వారు పారిపోయారు అపు డా రాక్షసుడు సముద్రంలో అనేక సంవత్సరాలు స్వైరవిహారం చేశాడు తన నిశ్వాస వాయువులచే పై కెగసిన అలలను తన గదా దండంతో అణచివేస్తూ పోయిపోయి వరుణ పాలితమైన విభావరీ పురంలో ప్రవేశించాడు

సముద్రాధి నాయకుడు పాతాళ లోకేశ్వరుడు అయిన వరుణుని జూచి హిరణ్యాక్షుడు పరిహాసంగా - లోకపాలకులలో నీవు బలాధికుడవని అందరు సన్నుతిస్తారు నిజంగా నీవు అంతటి పౌరుషశాలివే అయితే పన్నెదిర్చి నాతో యుద్ధం చెయ్యి నీ భుజబలాన్ని ప్రాభవాన్ని కాలరాస్తాను - అనేసరికి వరుణుడు పరబలం, తనబలం సమీక్షించుకొని దనుజునితో యుద్ధానికి అది తగిన సమయం కాదనుకున్నాడు రోషాన్ని దిగద్రావి ఓర్పుతో ఇలా అన్నాడు

ఓయీ మేము శాంతి కాముకులం వియపు నిష్ఠలతో చేస్తున్నాం మే మిప్పుడు కయ్యానికి కాలుద్రవ్వడం కాదు ముకుందు డొకడు తక్క మహాబల సంపన్నుడవైన నిన్ను ఎదిరించగలవాడు ఎక్కడా లేడు ఆతడు వైకుంఠంలో ఉన్నాడు. రణరంగంలో అనేక పర్యాయాలు శత్రువులను నిర్జించిన మహావీరుడు. కనుక నీవు అక్కడకు వెళ్ళు ఆతడు నీ పని సర్వం తీరుస్తాడు. ఆ మహానుభావుడు ప్రతి యుగంలోను అవతరించి దుష్టులైన రాక్షసులను హత మారుస్తూ ఉంటాడు.- కనుక నీవా శ్రీహరిని ఎదిరించు ఆతడు నీ భుజబలాన్ని అణచివేస్తాడు. నేలగూలిన నీవు అపుడు కుక్కలకు నక్కలకు ఆహారం కాగలవు. ఇపుడే అప్పటికిపో నీ దేవ ల వు తేలిపోతుంది ఇక కాగల కార్యం చెప్పడం దేనికి ? అని వరుణు డనేసరికి—

హిరణ్యాక్షుడు ఆగ్రహోదగ్రుడై నిర్భయంగా జనార్దనుని రణరంగంలో మర్దించి వేస్తానని పలికి వికుంఠ నగరానికి వెళ్ళాడు అత డలా వెళ్తుండగా అతనికి దారిలో నారదు డెదురై ఓయీ ఎక్కడికి ప్రయాణం? అని అడిగే సరికి అతడు నారదు నుద్దేశించి నేను శ్రీహరిని యుద్ధరంగంలో సంహరించి రాక్షస కులానికి సంతసం కలిగించడానికి వైకుంఠానికి బయలుదేరాను అన్నాడు అపుడా మునీంద్రుడు అలాగా అయితే సర్వేశ్వరు డిప్పుడు వైకుంఠంలో లేడే భూభారం హరించడానికి ఆతడు యజ్ఞ వరాహావతారం ధరించి రసాతలంలో ఉన్నాడు నీవు అక్కడకు వెళ్ళగలిగితే వెళ్ళు అతనితో నీకు అక్కడ తప్పక పోరు లభిస్తుంది అన్నాడు

ఆ మాటలు విని దానవేంద్రుడు అగ్నిదేవుడులాగా మండిపడ్డాడు. ఎలాగైనా శ్రీహరిని ఎదిర్చి పోరాలనే కుతూహలం వానిలో పెల్లుబికింది భయంకరాకారంతో గదను చేదాల్చి వెంటనే రసాతలానికి వెళ్ళాడు. వెళ్ళి ఎదురుగా

వరాహాకారంతో ఉన్న శ్రీహరిని చూచాడు  ఆ వరాహస్వామి దంష్ట్రాగ్రాన భూమండలం ప్రకాశిస్తోంది  పద్మాల్లాంటి తన నేత్రాల కాంతితో  అతడా రాక్షసేశ్వరుని తేజస్సును అపహరిస్తున్నట్లు  అతనివంక తేరి చూచాడు  వారింపరాని శౌర్యంతో శ్రీహరి స్వేచ్ఛగా తిరుగుతున్నాడు

కొంతసేపు మోరతో కులపర్వతాలను కుమ్ముతున్నాడు  బ్రహ్మాండ భాండాలు చిల్లులు పడేట్లు  కొంతసేపు  కొమ్ములతో  తాటిస్తున్నాడు. సప్త సముద్రాలు బురదతో నిండి యింకిపోయేలాగా  కొంత తడవు గిట్టలతో మట్టాడుతున్నాడు. సూర్యచంద్రులు ఒక ప్రక్కకు పోయేలాగా కొంతతడవు తన కురచ తోకను త్రిప్పుతున్నాడు  కొంతసేపు ఎగురుతాడు  మరికొంతసేపు భూమిని బొరియగా త్రవ్వుతాడు  వరాహస్వామి ఆ సంరంభం చూచి రాక్షసేంద్రుని గుండె ఝల్లుమంది  కనుకొలకులనుండి  అగ్ని కణాలు రాలగా రణాయత్తుడైన ఆ వరాహమూర్తిని చూచి  వనంలో సంచరించెడి వరాహమేమిటి?  జలంలో ఇలా సాటోపంగా విహరించడమేమిటి?  అని ఆశ్చర్య చకితుడై అన్నాడు

మూఢుడా  బ్రహ్మదేవుని వరమహిమవలన రసాతల గతమైన ఈ భూమికి అధిపతిని నేను  దీనిని నీవు విడిచిపెట్టు  అలాకాక  తీసికొని పోతానంటావా? నేను నీ ప్రాణాలు తీయడం నిశ్చయం  మాయావివై  ఈ భూమిని విడువకుండా దొంగతనంగా నీవు తీసుకొని  పోదలిస్తే  నా భుజబలంచేత నిన్ను  లొంగిపోయేలాగా చేస్తాను  కాని విడిచిపెడతావా? యోగమాయా  బలంచేత  కొద్దిపాటి పౌరుషంగల నిన్ను  నా గదా ఘాతాలతో  సంహరించి  రాక్షసుల  కందరకు సంతోషం చేకూరుస్తాను  నీవు లేకుండగానే దేవత లందరు ఇట్టే నశిస్తారు  అని దానవాధిపతి అన్న  కఠినోక్తులు విని  శ్రీహరి  బ్రహ్మేంద్రాదులకు  రానున్న దురవస్థను ఆత్మలో విచారించాడు  తన దంష్ట్రాగ్రాన  భూదేవి గజగజ  వణికిపోతోంది.  అప్పుడతడు  భీతిల్లిన  కరేణువుతో (ఆడేనుగుతో) గూడిన  మదకరీంద్రంలాగా వున్నాడు  దనుజుని మాటలు విని కుపితుడయ్యాడు.

తెల్లని దంతకాంతులు  ఆకాశమంతటను  అలముకొనగా  జలనిధినుండి భయంకరాకారంతో వెల్వడి వెళ్తున్న వరాహస్వామిని మదేభాన్ని వెంటాడు మకరం లాగా దనుజేశుడు వెంటాడి  ఓరీ  సిగ్గువిడిచి  లోకులు నిందిస్తారనియైనా వెరవక పిరికిపందలాగా పారిపోతున్నావా? నాతో యుద్ధం చెయ్యలేక  ఇలా పారిపోవడం బంటుతనమా?  అని అధిక్షేపించేసరికి శ్రీహరి భూమిని  జలోపరితలాన  నిలిపి దానియందు తన ఆధారశక్తిని ఉంచాడు  అపుడు దేవతలు మహానందం చెందారు కుసుమవర్షం కురిసింది  దేవదుందుభులు  మ్రోగాయి  గంధర్వులు  పాడారు. అప్సరసలు ఆడారు.

అపుడు క్రోధోద్దీపితుడైన యజ్ఞవరాహస్వామి నిజభూషణ కాంతులు నలుగడలా వ్యాపించగా గదాయుధాన్ని చేదాల్చి తన కెదురుగా వున్న రాక్షస నాయకుని చూచి యిలా అన్నాడు ఓరీ రాక్షసాధమా నీవు గర్వాంధుడవై నీవు నన్నొక వన్యమృగంగా భావిస్తున్నావు కాదూ ఔను నీలాంటి శునకాలను వెంటాడి చీల్చి చెండాడడానికి నేను వనమృగాన్నే. నీకు గుండెలుంటే నాతో యుద్ధానికి తలపడు ఊరికే ఆత్మస్తుతి దేనికి? రణకోవిదులైనవారు మృత్యుముఖంలో వుండిన్నీ తుది రక్తకణం చిందేదాకా బాటుతనంతో పోరాడుతారు కాని నీలాగా ఆత్మస్తుతికి పాల్పడరు

దురాత్ముడా పాతాళంలో ఏదో నీ నిక్షేపం వున్నదన్నావే దానిని నేను దర్పంతో హరిస్తాను చూడు. నాకు సిగ్గులేదని పారుబోతునని కదూ నీ వన్నది? అయితే రణాయత్తుడవై రా. దాటున నుండిగాని బహిరంగంగాగాని నీతో తలపడి సేనాసమేతంగా నిన్ను క్షణంలో యమపురికి పంపుతాను. అవక్ర పరాక్రమంతో ఈ భూమండలాన్ని అరాక్షసం చేస్తాను నన్నెదిరించే శక్తిసామర్థ్యాలు నీకుంటే రణభూమిలో నిలబడు. లేదా నీ హితులకు శోకాన్ని కల్పించకుండా వుండగోరితే పారిపో నన్నిక్కడే సంస్థాపిస్తానన్నావు నీ వంటివాడవే యగుదువు యముని పురంలో ఉన్న నీ బంధువర్గం అంతా నీకు స్వాగతం పలుకుతున్నట్లుంది అని శ్రీహరి నర్మగర్భంగా పలికాడు

శ్రీహరి చతురోక్తులు విని హిరణ్యాక్షుడు తొక్కతొక్కిన కాలసర్పంలాగా చిర్రుమనిలేచాడు. కళ్ళవెంట మిడుగురులు రాలాయి ఇంద్రియాలు చలించాయి కనుబొమలు ముడివడ్డాయి. రోషం మదం పెనగొనగా గదను సారించి రమాధవునిపై విసిరాడు శ్రీహరి ఆ వ్రేటు తప్పించుకొని తన గదాఘాతంతో దాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. .

అపుడు రాక్షసుడు మరో గదను చేదాల్చి వేయబోగా మురాంతకుడు అది తనను తాకకమునుపే గదాయుద్ధంలో ఆరితేరిన వాడవడంచేత అవలీలగా వైరి వక్షస్థలాన్ని ఛేదించేసరికి అతడు వ్యాకులుడయ్యీన్నూ తెలివొంది జనార్దనుని మళ్ళీ ఎదిరించాడు

ఇలా ఇద్దరూ పరస్పర జయ కాంక్షతో ఉత్తుంగ తరంగాలతో ఒకదానినొకటి తాకెడి దక్షిణోత్తర సముద్రాల్లగా తొండాలతో పరస్పరం భీకరంగా పోరాడు మదగజాల్లాగా రోషభీషణంగా తలపడు పెద్దపులులమాదిరిగా అమితమైన దర్పంతో ఒండొంటి నెదిరించి పోట్లాడు మదవృషభాల రీతిగా దారుణంగా పోరాటం సాగించారు శ్రీహరి వజ్రాయుధంలాంటి తన గదతో రాక్షసుని రొమ్ము విదారిస్తే అతడు తన గదతో శ్రీహరి నొసటిపై మోదాడు.

ఇరువురి శరీరాలనుండి రక్తం స్రవిస్తూంటే ఇరువురు పుష్పించిన అశోక వృక్షాల్లాగా వున్నారు ఒకరికొకరు తీసిపోకుండా ఒకసారి దగ్గరకువస్తూ ఒకసారి దూరంగాపోతూ పరస్పరం కొట్టుకుంటూ ఒండొరుల నెత్తురును ఆఘ్రాణిస్తూ ఒకప్పుడు తిరస్కారంగా ఒకప్పుడు పరిహాసంగా మాట్లాడుతూ మహోగ్రంగా యుద్ధంచేస్తూంటే ఆ భీకర సమరం చూడడానికి బ్రహ్మదేవుడు మునీంద్రాదులతో వచ్చి ధాత్రీ నిమిత్తంగా రాక్షసునితో పోరాడుతూన్న యజ్ఞ వరాహస్వామికి ఇలా అన్నాడు-

పరమేశ్వరా ఈ దానవుడు మహా క్రూరుడు. నా వరగర్వంచేత లోకాలను బాధిస్తున్నాడు నీవు వీనిని వెంటనే సంహరింపక కాలహరణం చెయ్యడం తగదు తక్షణం వీనిని వధించు. భూదేవికి శుభం కలుగుతుంది అదీకాక ఇది అభిజిన్ముహూర్తం వీనిని వధించడానికి అనువైన సమయం ఆలసిస్తే సంధ్యాసమయం సమీపిస్తుంది అది అసురవేళ అపుడు మాయావియైన వీనిని వధించడం సాధ్యం కాదు- అని పద్మగర్భుడనగా దేవతలు మహానందం చెందారు. శ్రీహరి మందహాసంచేస్తూ రాక్షసుని ఎదుర్కొన్నాడు అతడు పుండరీకాక్షుడైనా[1] క్రోధంచే ఎర్రవారడంచేత అతని కళ్ళు అపుడు ఎర్రదామరలలాగా వున్నాయి శ్రీహరి తన గదాదండాన్ని ఎత్తి రాక్షసుని దవుడపై కొట్టాడు కాని రాక్షసుడు ఆ దెబ్బను తప్పించుకొని భయంకరమైన గదను చే ధరించి చిత్రగమనంతో శ్రీహరి దగ్గరకువచ్చి అతని చేతిలోని గద సముద్రంలో పడేలా మోదాడు

శ్రీహరి నిరాయుధుడయ్యాడు కాని రణధర్మం పాటించి దానవుడు యుద్ధం చెయ్యకుండా ఆగిపోయాడు ఆకాశగతులైన దేవతలు హాహాకారం చెయ్యడం మొదలుపెట్టారు. అపుడు శ్రీహరి తన మనస్సులో చక్రాయుధాన్ని స్మరించుకున్నాడు తక్షణం అది భానుమండలంలాగా ప్రచండకాంతులను విరజిమ్ముతూ చలించేటి అగ్నిజ్వాలలతో శాత్రవ గర్వాంధకారాన్ని నిర్మూలిస్తూ కహ కహ ధ్వనులతో సముద్రఘోషను తిరస్కరిస్తూ వచ్చి శ్రీహరి కుడిచేతిని అలంకరించింది దేవతలు జయ జయధ్వానాలు చేశారు అపుడు శ్రీహరి చక్రపాణియై అసురేశ్వరుని ఎదుర్కొన్నాడు

అలా ఎదురొడ్డిన పరమేశ్వరునిచూచి రాక్షసుడు భయావిష్టుడయ్యాడు అయినా అధైర్యపడక గదను తీసికొని అతనిపై విసిరాడు వరాహస్వామి ఆ గదను కాలితో తన్ని మందహాసంచేస్తూ- ఓరీ నాతో గదాయుద్ధానికి రా- అని హెచ్చరించేసరికి అతడున్నూ నవ్వి గదను విసిరాడు గరుత్మంతుడు సర్పాన్ని పట్టుకొనునట్లు రాక్షసహంత దానిని తన చేతిలో లీలగా పట్టుకున్నాడు

అప్రతిమానమైన తేజంగల పరమేశ్వరుని ముందు తన బలం పనికిరాదని

1 తెల్లదామరలవంటి కండ్లుగలవాడు.

రాక్షసుడు గ్రహించాడు కాని దురభిమానంతో ప్రళయాగ్నిజ్వాలలాంటి భీకర శూలం తీసికొని శ్రీహరిపై విసిరాడు చాపల్యంతో సద్బ్రాహ్మణునిపై చేసిన అభిచార కర్మలాగా అదికూడా వ్యర్థమైపోయింది రమాధవుడు దానిని తన చక్రాయుధంతో ఇంద్రుడు వజ్రాహతితో గరుడుని రెక్కను ద్రుంచినట్లు దారిలోనే భగ్నం చేశాడు దేవతలు పొంగిపోయారు రాక్షసబలం క్రుంగిపోయింది. తన శూలాయుధం అలా చక్రాయుధంచే నిహతం కావడంచూచి రాక్షసుడు కోపంతో మైమరచి శ్రీహరిపైబడి పిడికిటితో పొడిచాడు కాని పూలమాలిక వ్రేటునకు మదగజం చలిస్తుందా? అలాగే దనుజుని ముష్టిఘాతానికి వరాహస్వామి అణుమాత్రంకూడ చలించలేదు

అపుడు రాక్షసేశుడు ఎన్నో మాయలు కల్పించాడు ఆతని మాయాబలం వలన దుమ్ము రేగి భూమండలాన్ని చీకట్లు క్రమ్మినట్లు క్రమ్మివేసింది ఆకాశాన మేఘాలు రాళ్ళు ఎముకలు మూత్ర పురీషాలు వర్షించాయి జుట్లు విరబోసుకొని భయంకరములైన కోరలతో రక్తారుణాలైన నేత్రాలతో ఆయుధాలు ధరించి భూత పిశాచములు అంతరిక్షాన కనుపించాయి అపుడు శ్రీహరి తన చక్రాన్ని ప్రయోగించి ఆతని మాయలన్నింటినీ పటాపంచలు చేశాడు దితి మనోవీథిలో తన కొడుకు హిరణ్యాక్షుని మరణం తప్పదని భాసించింది ఆమె చనుమొనల నుండి రక్తధారలు స్రవించాయి

తనుచేసిన మాయలన్నీ కృతఘ్నునకు చేసిన ఉపకారాలులాగా విఫలమయ్యేసరికి హిరణ్యాక్షుడు రెచ్చిపోయి శ్రీహరిని సమీపించి తన బాహువులు చాచి ఆయన వక్షాన్ని పీడించడం మొదలుపెట్టాడు శ్రీహరి అది తప్పించుకొని తొలగిపోయాడు కాని రాక్షసుడు విడిచిపెట్టకుండా తిరిగి పిడికిలితో పొడవడం మొదలుపెట్టాడు. యజ్ఞవరాహస్వామి అప్పుడు ఇక వీనిని ఉపేక్షించరాదని భావించి ఇంద్రుడు వృత్రాసురుని తెగటార్చినట్లు వజ్రతుల్యమైన తన అరచేతితో వాని నడుంమీద చాచి కొట్టేసరికి అతడు గిర్రున తిరిగి ఎలాగో నిలదొక్కుకున్నాడు కాని శ్రీహరి విడిచిపెట్టకుండా ఆతని కర్ణమూలాన చరిచేసరికి ఆతడు పెనుగాలికి మహావృక్షంగా నేలపైకూలాడు నోటివెంట బుడబుడమని నెత్తురు క్రక్కాడు కనుగ్రుడ్లు పైకి వచ్చాయి పండ్లుగిటుకు ప్రాణాలు విడిచాడు

అలా నేలకొరిగి కనుమూసిన హిరణ్యాక్షునిచూచి పద్మసంభవాదులు- ఔరా ఈతని అదృష్టమే అదృష్టం మోక్షకాములయిన యోగీంద్రులు యోగ సమాధితాల్చి లింగ శరీరాన్ని విడిచిపెట్టడానికి ఏ మహానుభావుని ధ్యానిస్తారో ఆ మహానుభావుడు శ్రీహరిచేతిలో ఆయన ముఖారవిందంచూస్తూ ఇతడు ప్రాణాలు విడిచాడు భగవత్పార్షదుడైన వీడు బ్రాహ్మణ శాపంచేత ఈ నికృష్టజన్మ యెత్తి తిరిగి ఆ భగవంతునివల్లనే మృతిచెందాడు కనుక వీనికి వైకుంఠవాసం తప్పదు

ఇకమీదట వీనికి జనన మరణాదులుండవు- అని భావించి యజ్ఞ వరాహరూపం ధరించిన అంబుజలోచనుని సాంజలులై అనేకరీతుల సన్నుతించారు

అలా సురవిరోధియైన హిరణ్యాక్షుని వధించిన తర్వాత వరాహస్వామి బ్రహ్మేంద్రాదుల స్తోత్రానికి మనస్సులో ఆనందిస్తూ వారందరిని అభినందిస్తూ వైకుంఠధామానికి తిరిగివెళ్ళాడు అపుడు మహోత్సాహ సూచకంగా సుర దుందుభులు మ్రోగాయి భూమిపై కుసుమవర్షం కురిసింది హోమాగ్నికుండాలు తేజరిల్లాయి రవిచంద్రులు నిజకాంతులతో ప్రకాశించారు అని శుకయోగీంద్రుడు చెప్పగా పరీక్షిన్నరేంద్రుడు-

మునీంద్రా హిరణ్యాక్ష వధానంతరం భూమండలం సమస్థితిని ఎలా పొందింది? స్వాయంభువ మనువు జననాంతరం బ్రహ్మ పశు పక్ష్యాదుల సృష్టికి ఎన్ని మార్గాలు కల్పించాడు? మహా భాగవతోత్తముడైన విదురుడు శ్రీకృష్ణుని అపకారం తలపెట్టిన ధార్తరాష్ట్రులను విడిచి తన తండ్రియైన వ్యాసభగవానునితో సాటియై తన మనో వాక్కాయకర్మలు శ్రీకృష్ణునియందే లగ్నంచేసి నానా పుణ్య తీర్థాలు సేవించడంవలన పునీతుడై మైత్రేయమహర్షిని ఇంకా ఏయే ప్రశ్నలడిగాడు?- అవన్నీ వినాలని కుతూహలంగా వుంది అనేసరికి శుకయోగి ఆ రాజేంద్రునకు ఇలా అన్నాడు

నరేంద్రా విదురుడు మైత్రేయు నుద్దేశించి ఇంకా ఏం ప్రశ్నించాడో చెపుతా విను- సకల ప్రజాపతియైన పద్మనాభుడు ప్రజాసృష్టి నిమిత్తంగా ప్రజాపతులను సృష్టించి అనంతరం ఇంకా ఏం సృజించాలనుకున్నాడు? మును సృజించిన మరీచి మొదలగు మునులు బ్రహ్మదేవుని నియోగంచేత ఈ అఖిల జగాన్ని యెలా సృజించారు? భార్యాసమేతులైకాని భార్యా విరహితంగాగాని ప్రత్యేకంగాగాని లేక అందరుకలిసి కానివారు ఏయే సృష్టి చేశారు? - అని విదురుడు ప్రశ్నించగా మైత్రేయుడిలా చెప్పాడు-

## మైత్రేయుడు విదురునకు సృష్టి సంగ్రహాన్ని చెప్పడం

కాలాత్మకుడు నిర్వికారుడు అయిన జగన్నాయకునివల్ల గుణత్రయం పుట్టింది. ఆ గుణత్రయంనుండి మహత్తత్త్వం జనించింది రజోగుణ హేతువైనది కనుక ఆ మహత్తత్త్వంనుండి అహంకారం కలిగింది దానినుండి పంచతన్మాత్రలు వాటినుండి పంచభూతాలు ప్రభవమందాయి ఆ పంచభూతాలే సృష్టికి హేతువులు కాని అవన్నీ విడివిడిగా భువన నిర్మాణ సమర్థాలుకావు అన్నింటి కలయిక వలన హిరణ్మయమైన అండం కల్పితమైంది. అది జలాంతర్వర్తియై ప్రవృద్ధ మౌతోంది. నారాయణుడనే పేరుతో విఖ్యాతిచెందిన బ్రహ్మం వెయ్యి సంవత్స

రాలు ఆ హిరణ్మయాండంలో వున్నాడు ఆ దేవదేవుని నాభియందు ఒక పద్మం జనించింది అది సహస్ర సూర్య దీప్తితో సకల జీవసంతతికి నివాస భూతమై వుంటుంది

ఆ పద్మంలో భగవదధిష్ఠితుడై బ్రహ్మ జన్మించాడు అతడు నామ రూపాత్మకమైన ఈ ప్రపంచాన్ని సృష్టించాడు అలా సృష్టికి పూనుకొని విధాత తొలుత తామిస్రం అంధతామిస్రం తమం మోహం, మహామోహం అను అవిద్యా పంచకాన్ని సృజించాడు అపుడు తనకది తమోమయదేహం అని గ్రహించి అసంతృప్తుడై ఆ శరీరాన్ని విడిచిపెట్టాడు అలా ధాత విడిచిపెట్టిన శరీరం నుండి యక్ష రక్షస్సులుదయించి అది తమకు ఆకలి దప్పులు కల్పించెడి రాత్రి సమయమని గ్రహించారు క్షుత్పిపాసాకులులయి వారిలో కొందరు బ్రహ్మను భక్షిద్దామని కొందరు రక్షిద్దామని తగవులాడారు

చివరకు కొందరు అతని భక్షిద్దామని దగ్గరకు వచ్చేసరికి అతడు- ఓరీ నేను మీ తండ్రిని మీరు నా పుత్రులు నన్ను హింసించకండి అన్నాడు- "మామాజక్షత[1] అని కొందరు "రక్షత"[2] అని కొందరు అనడంవల్ల వారు క్రమంగా యక్ష రక్షస్సులయ్యారు

అనంతరం బ్రహ్మదేవుడు తేజోమయమైన శరీరం ధరించి సత్వగుణ గరిష్ఠులు ప్రభావిభాసితులు అయిన దేవతలను సృష్టించి కాంతిమయమైన ఆ శరీరాన్ని విడిచిపెట్టగా అది పగలై దేవతలకు ఆశ్రయభూతమైంది. తదుపరి పద్మ సంభవుడు మొలనుండి అమిత చపలులైన అసురులను పుట్టించేసరికి వారు కాముకులై అతనితో రమించాలని కాంక్షించి అతనివెంటబడ్డారు అపుడు బ్రహ్మ సిగ్గుపడి అక్కడనుండి పారిపోయి శ్రీహరిని జేరి ఆయన పాదపద్మాలకు నమస్కరించి యిలా అన్నాడు-

దేవా రక్షించు రక్షించు నేను నీ యాజ్ఞను శిరసావహించి ప్రజాసృష్టి చేస్తూండగా అందులో పాపాత్ములైన ఈ అసురులు నాతో క్రీడించడానికి నావెంట బడ్డారు నేను కలవరపడి నీ చరణసన్నిధికి వచ్చాను. అనేకాక లోకంలో అందరికీ క్లేశం కలిగించినా ఆ క్లేశాన్ని తిరిగి నివారించినా అది నీ వలననే కావాలి ఇతరులకది సాధ్యంకాదు- అని సన్నుతించేసరికి శ్రీహరి బ్రహ్మదేవుని దైన్యాన్ని గ్రహించి అతని ఆ ఘోర శరీరం త్యజించమని ఆదేశించాడు. బ్రహ్మ అలాగే చేయగా ఆ విసర్జించిన శరీరం లావణ్యమయమైన స్త్రీ రూపంలో సాయం సంధ్య అయింది

---

1 తినవద్దు తినవద్దు 2 రక్షించండి

ఆమె కాలికి ధరించిన మణి నూపురాలు ఘల్లు ఘల్లుమని మ్రోగుతున్నాయి. ఆమె ధరించిన దుకూలంపై కాంచన మయమైన ఒడ్డాణం ధగధగలాడుతోంది. ఆమె నితంబం విశాలంగా వుంది ఏనుగు కుంభస్థలాల్లాగా వున్న ఆమె స్తనముల భారానికి నడుం కంపిస్తోంది తెల్ల దామరలాంటి ఆమె కన్నులు మదిరా రసాస్వాదనంచేత చలిస్తున్నాయి ఆమె ఫాలభాగం బహుళ పక్షంలోని అష్టమినాటి చంద్రబింబంలాగా వుంది ఆమె ముంగురులు మదించిన తుమ్మెదల లాగా నల్లగా వున్నాయి ఆమె నాసిక సంపెంగ పూవును తిరస్కరిస్తోంది

అలా జగన్మోహకారంతో సంధ్యాసతి హాస విలాసాలతో కంబడగా ఆ అసురులు విస్మయావిష్టులై ఆమెను కౌగలించుకొని— ఈ సౌకుమార్యం ఈ వయసు ఈ సౌందర్యం ఈ ధైర్యం ఈ సౌభాగ్య విశేషం ఏ స్త్రీకి ఉంటుంది? ఎంత విచిత్రం? అని వారు మన మందలం మన మనస్సులో కామాతురలమై బాధ పడుతూంటే మనలను చూచి ఈమె పలకదు ఉలకదు కారణ మేమిటో అని ఆ సంధ్య నుద్దేశించి యిలా అన్నారు—

తలోదరీ నీ కులమేది? నీ వెవ్వరి దానవు? ఇలా ఒంటరిగా తిరుగుతూ ఉండడానికి హేతువేమిటి? నీ రూప సౌందర్యం చూచి మోహంతో మాకు పిచ్చెక్కి పోతోంది మన్మధ వ్యథ సహింపలేకుండా వున్నాం మమ్మల్ని కవయవా?- అని ఆ అసురులు ఆమెకు దగ్గరగా వెళ్ళారు

ఆమె స్తన భారానికి వంగిన నడుం ఆకాశంలాగా వుంది ఆమె చేతిలోని పూలచెండు సూర్యబింబం రీతిగా వుంది మృదువైన ఆమె నల్లని కేశపాశం చీకటి సమూహంగా వుంది మనోహరములైన ఆమె చూపులు నక్షత్రాల్లాగా మెరుస్తున్నాయి. ఆమె మైపూత సౌందర్యాన్ని అనుకరిస్తోంది అలా నేత్రానందకరంగా వనితాకారంతో ఉన్న సంధ్యను చూచి మోహం పట్టలేక- దేవీ పద్మం ఎప్పుడూ ఒకచోటనే వుంటుంది. కాని నీ పాదపద్మం నీవు ఒకేచోట నిలకడగా ఉండకుండా తిరుగుతూ ఉండడంచేత అనేక స్థలాల్లో అనేక రీతులుగా గోచరిస్తోంది- అని వారందరు ఆమెను పట్టుకున్నారు సంధ్యాసతి రూపంలో ఉన్న పద్మభవుడు సంతోషించి తనను తాను మూర్ఛానగా గంధర్వులు అప్సరసలు పుట్టారు అనంతరం విధాత ఆ శరీరాన్ని విడిచిపెట్టగా అది చంద్రికా (వెన్నెల) రూపమైంది దాన్ని విశ్వావసువు మొదలగు గంధర్వాప్సరోగణాలు గ్రహించారు.

అనంతరం బ్రహ్మ తంద్రోన్మాద జృంభణ నిద్రారూపంబైన శరీరం ధరించి పిశాచాలను గుహ్యకులను సిద్ధులను భూతగణాన్ని సృష్టించాడు వారు

జుట్టు విరబోసికొని దిగంబరులై వుండటం చూసి కళ్ళు మూసుకొని ఆ శరీరాన్ని పరిత్యజించాడు ఆ శరీరాన్ని వారు గ్రహించారు

ఆవల బ్రహ్మ తనను అన్నవంతునిగా భావించి అదృశ్యదేహుడై పితృ సాధ్యగణాలను పుట్టించాడు అందుచేతనే వారు తమను పుట్టించిన అదృశ్య శరీరానికి కారణభూతమైన దేవభాగాన్ని గ్రహించడంచేత కర్మనిష్ఠులు శ్రాద్ధరూపంలో ఆ పితృ సాధ్యగణాలకు హవ్యకవ్యాలు ఇస్తారు

అనంతరం పద్మసంభవుడు తిరోధాన శక్తివలన నరులను సిద్ధులను విద్యాధరులను సృష్టించి వారికి తిరోధాన నామకమైన ఆ శరీరాన్ని వారికిచ్చాడు పిమ్మట నాతడు తనకు ప్రతిబింబమైన శరీరంతో కిన్నరులను కింపురుషులను సృజించగా వారు బ్రహ్మలాగానే వుండి వరుసగా ఇద్దరిద్దరు జంటగా కలిసి బ్రహ్మ పరమైన గీతాలు పాడడం మొదలుపెట్టారు

కాని తన సృష్టి అంతగా వృద్ధిచెందక పోవడానికి చింతిస్తూ చతుర్ముఖుడు పడుకొని కోపంతో కాళ్లు చేతులు కదలించగా రాలిన రోమాలనుండి సర్ప సరీసృపాలు పుట్టాయి అపుడు బ్రహ్మ తనను కృతార్థునిగా భావించి మనస్సుతో మనువులను సృష్టించి వారికి పురుష రూపమైన తన శరీరాన్ని ఇచ్చాడు అంతకు ముందు సృజింపబడిన వారందరితోగూడి మనువులు బ్రహ్మను ఉద్దేశించి— దేవా లోకస్రష్టవైన నీవు చేసిన ఈ సృష్టి ఆశ్చర్యకరంగావుంది. ఈ మను సర్గంలో యజ్ఞాది క్రియాకాండలు జరుగుతాయి ఆ హవిర్భాగాలు గ్రహించి మేము ఆనందిస్తాం-అన్నారు

ఆ తర్వాత పద్మభవుడు సమాధి యోగంతో ఋషివేషం ధరించి ఋషి గణాలను సృష్టించాడు. ఆ ఋషులకు తన శరీరంలోని ఒక్కొక్క భాగం ఒక్కొకరికి ఇచ్చాడు ఆ శరీర భాగాలు సమాధి యోగం తపస్సు విద్య విరక్తి కావడంచేత వారందరు మహామహులయ్యారు — అని మైత్రేయుడనేసరికి విదురుడు శ్రీహరిని మనస్సులో సంస్మరిస్తూ ఇలా అన్నాడు

మునీంద్రా స్వాయంభువమను వంశం పరమోత్కృష్టమైనది ఆ వంశం మిథున క్రియతో ప్రజాభివృద్ధి చేసినట్లు చెప్పావు అదీకాక ఆ మనువునకు ప్రియవ్రతుడు ఉత్తానపాదుడు అను కొడుకులుకూడ వున్నారన్నావు వారు సప్త ద్వీపవతియైన భూమిని ధర్మ మార్గాన ఎలా పాలించారు? తన కుమార్తె దేవహూతిని స్వాయంభువుడు కర్దమునికిచ్చి యే విధంగా పెండ్లి చేశాడు? ఆ దేవహూతియందు మహా యోగియైన కర్దముడు ప్రజాసృష్టి యెలా చేశాడు? అదే కాదు కర్దముడు రుచియను కన్యను దక్ష ప్రజాపతికి ఇచ్చాడనికూడా చెప్పావు.

ఆ రుచియందా మహాత్ముడు ఏ రీతిగా సృష్టి కార్యం చేశాడ ?- ఈ విషయ మంతా వినాలని కుతూహలంగా వుంది అనేసరికి మైత్రేయుడు విదురునకు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు

## కర్దముడు భగవదనుజ్ఞతో దేవహూతిని పెండ్లి యాడుట

విదురుడా విను కృత యుగంలో కర్దముడు ప్రజాసృష్టి చెయ్యడానికి బ్రహ్మచే నియుక్తుడై సరస్వతీ నదీతీరాన పదివేల దివ్య సంవత్సరాలు శ్రీహరిని గూర్చి అతి దారుణమైన తపస్సు చేశాడు అతని తపస్సునకు సంతుష్టుడై శ్రీహరి అంతరిక్షాన సాక్షాత్కరించాడు ఆ దివ్య మంగళ విగ్రహంచూచి కర్దముడు పరవశించి పోయాడు.

ఆ దేవదేవుని మెడలో రవి చంద్రుల కిరణాలతో వికసించిన పద్మాల తోను కలువలతోను కూర్చబడిన మాలిక మెరుస్తూ వుంది ఆతడు మణికంకణాలు హారకుండలాలు రత్న కిరీటం ధరించాడు. అతని వక్షస్థలం మీద కౌస్తుభ మణితో పాటు లక్ష్మీదేవి భాసిస్తోంది వెన్నెల్లాంటి చిరునవ్వుతో అతని చెక్కుటద్దం మరింత తెల్లగా వుంది నొసటిపై తుమ్మెద రెక్కలాంటి ముంగురులు నాట్యం చేస్తున్నాయి. చేతిలో శంఖం చక్రం, గద పద్మం మిలమిల లాడుతున్నాయి ఆతడు పీతాంబరం ధరించాడు.

గగనతలాన ఆ రీతిగా సాక్షాత్కరించిన రమాధవునకు కర్దముడు చేతులు జోడించి ఇలా అన్నాడు- కమల నయనా యోగులు అనేక జన్మల యోగ క్రియా నిరూఢిచేగాని సకల భూతాంతరాత్ముడవైన నిన్ను దర్శించలేరు. అలాంటి నీ చరణారవింద దర్శనం నాకు సులభంగా ప్రాప్తించింది కన్ను లున్నందుకు నాకు తగిన ఫలం లభించి నా జన్మ సార్థకమైంది నేను భవసాగ రాన్ని తరించాను

దేవా నీ మాయవలన మందమతులై కొందరు తుచ్ఛ సుఖాలాశించి నీ పాదార విందాలను భజిస్తారు అలాంటి వారికి పుణ్యలోకం లభించకపోయినా వారి మనో రథాలను తీరుస్తావు కామ విమోహితులైన అలాంటి వారిని నేను నిందిస్తాను కాని నేనే ఇప్పుడు ధర్మార్థ కామాలకు కారణభూతమైన భార్యను కాంక్షించి కల్పతరు మూల సమానములైన నీ పాదాలను ఆశ్రయిస్తున్నాను.

అయితే ఒక విశేషం వుంది నేను కేవలం స్వీయ సౌఖ్యంకోసం నిన్ను సేవించడం లేదు. నీ అభిమతానికి తగినట్లుగా కర్మమయమైన నీ ఆజ్ఞాపాలనం చెయ్యాలనేదే నా వాంఛ. అంచేతనే నేను సంసారాన్ని అవలంబించాలని కుతూ

హల పడుతున్నాను కనుక నాకు పూర్ణాయువును అనుగ్రహించు కాలచక్రం నీకు వశంగతమై వుంటుంది ఆ కాలచక్రానికి పదమూడు అరలు ఉంటాయి అవి అధిక మాసంతోగూడి పదమూడు మాసాలు దానికి మూడు వందల అరవై అహోరాత్రాలనే పర్వాలుంటాయి ఋతుషట్కం దాని నేమి చాతుర్మాస్య త్రయం దాని నాభి లెక్కింప నలవికాని క్షణాలు లవాలు ఆ కాలచక్రానికి పత్రాలు దానివేగం అపరిమితం అది అక్షరమైన బ్రహ్మమందు తిరుగుతూ వుంటుంది

అది సకల ప్రాణికోటి ఆయువును హరిస్తూ వుంటుంది అయితే అది తుచ్ఛ వాంఛలతో పశుప్రాయులైన వారి ఆయువును గ్రసిస్తుంది కాని సత్సాంగత్యం కలిగి నిరంతరం నీ కథామృతాన్ని గ్రోలుతూ దేహ ధర్మాలను విడిన నీ భక్తులను ఆయువును నెంత మాత్రమూ హరించదు మహాత్మా నీ మహిమ వర్ణనాతీతం సృష్టికి పూర్వం నీవు ఒక్కడవే కాని నీవు నీ ఆత్మ మాయచే స్వశక్తితో తంతువులను సృజించి తిరిగి వాటిని ఉపసంహారం చేసే సాలపురుగు లాగా లోకాలను సృజిస్తూ, పాలిస్తూ ఉపసంహరిస్తూవుంటావు నా మనోరథాన్ని తీర్చి నన్ను కృతార్థుణ్ణి చెయ్యి- అని కర్దముడు అర్థించేసరికి గరుడారూఢుడైన శ్రీహరి మందస్మితంతో ఇలా అన్నాడు

మునీంద్రా! నీ కోర్కె సఫలమౌతుంది. ప్రజాపతి పుత్రుడైన స్వాయంభువ మనువు బ్రహ్మవర్త దేశంలో సప్తసముద్ర పరివేష్టితమైన భూమండలాన్ని పాలిస్తున్నాడు అతని భార్య శతరూప. అతనికి పెండ్లి కావలసిన కూతురు వుంది ఆమె పేరు దేవహూతి ఆతడు రేపు తన భార్యా పుత్రికలతో కూడి నీ సాన్నిధ్యానికి వస్తాడు అతనికి నీ ప్రతిభ తెలుసు అంచేత వయోరూప గుణశీలాల్లో నీకు తగిన ఆ కన్యను నీ కిచ్చి పరిణయం చేస్తాడు. నీ కోర్కె సిద్ధిస్తుంది. నన్ను ఎప్పుడూ తన మనస్సులో స్మరిస్తూ వుంటే ఆ సుకన్య నిన్ను వరించి నీ వీర్యంవలన అతి సౌందర్యవతులైన తొమ్మండ్రు కన్యలను కంటుంది

ఆ తొమ్మండ్రు కన్యకలయందు మునీంద్రులు పుత్రోత్పాదనం చేస్తారు నీవు నా శాసనాన్ని అనుసరించి నీ అశేష కర్మలను నా కర్పించు భూతదయా పరుడవై నీయందు సకల లోకాలు కలవనిన్నీ నీయందు నేనున్నాననిన్నీ గ్రహించి నన్ను సేవించు చరమకాలంలో నీవు నన్ను చేరగలవు నీ వీర్యం వలన నేను నీ భార్యాగర్భంలో ప్రవేశించి నా కళాంశంతో నీకు పుత్రుడనై జనించి నీకు తత్వసంహితను ఉపదేశిస్తాను- అని జనార్దనుడు కర్దమ మునీంద్రునకు చెప్పి బిందు సరోవర తీరమందలి కర్దమాశ్రమాన్ని విడిచి కర్దముడు

చూస్తూండగా గరుత్మంతుని అధిరోహించి ఆతని రెక్కల కదలికల వలన జనించిన సామ ధ్వనిని వింటూ వైకుంఠానికి తిరిగి వెళ్ళాడు

అలా శ్రీహరి అంతర్హితుడైన తర్వాత కర్దముడు విమోహియై బిందు సరస్తీరాన ఆ దేవదేవుని ధ్యానిస్తూ స్వాయంభువ మనువురాకను నిరీక్షిస్తూ వున్నాడు స్వాయంభువుడు కాంచనమయమైన రథం అధిరోహించి నిజ భార్యా సమేతుడై వివాహార్హయైన కుమార్తెను వెంటబెట్టుకొని ఆమెకు తగిన వరుణ్ణి అన్వేషిస్తూ లోకాలన్నీ తిరిగి తిరిగి తుదకు బిందు సరోవరం దగ్గఱకు వచ్చాడు

శ్రీహరి కర్దమ మహర్షిని చూచినపుడు ఆ దేవేశుని కనులనుండి హర్షాశ్రు బిందువులు భూమిమీదపడి సరోవరం అయింది. అదే బిందు సరోవరం. సరస్వతి నది ఆ సరోవరాన్ని పరివేష్టించివుంటుంది. అక్కడే కర్దముని తపోవనం వుంది. ఆ సరోవరం ఒక మహాపుణ్య తీర్థం ఆ సరస్తీరాన నానావిధ వనపంక్తులు కనువిందు చేస్తూంటాయి పక్వఫలభారంతో వంగిన ఆ చెట్లపై వసించెడి పక్షుల రొదలతో దిక్కులు మార్మోగుతూ వుంటాయి రా చిలుకలు తమ కరకు ముక్కులతో ఆతరువులపైగల పక్వ ఫలాలను పొడిచి పొడిచి వాటినుండి స్రవించెడి మధురరసాన్ని ఆస్వాదిస్తూ కర్ణసుభగంగా కలకూజితాలు చేస్తూంటాయి

లేమావి చివుళ్ళను తిని కోయిలలు కషాయ కంఠంతో మధు మధురంగా గానంచేస్తుంటాయి ఆ సరోవరం గట్టున గల చీకటి మ్రాకులనుచూచి మేఘాలని భ్రమించి నెమళ్ళు పురులువిప్పి నాట్యంచేస్తూంటాయి ఆ సరస్సులో కన్నె లేడి పిట్టలు, నీటికోళ్ళు, బెగ్గురు పక్షులు, రాయంచల చక్రవాకాలు మధురధ్వని చేస్తూ విహరిస్తూ వుంటాయి అచటి వనభూమిలో ఏనుగులు, పులులు, తోడేళ్ళు, కారుదున్నలు, కోతులు ముంగిసలు ఖడ్గమృగాలు స్వైరవిహారం చేస్తూంటాయి

స్వాయంభువమనువు కర్దమముని ఆశ్రమాన్ని ఆ పరిసర ప్రాంతాన్ని చూచి పరవశించిపోయాడు. పరిమితపరిజనంతో ఆతడా తపోవనంలో ప్రవేశించి కర్దమునిచూచి భక్తితో ఆయన పాదాలకు నమస్కరించాడు. బ్రహ్మచర్యవ్రత పాలనంచేతను తపోవృత్తివలనను ఆ మహర్షి శరీరం ఎంతో దీప్తిమంతంగా వుంది. నిరశనుడై నిరంతరం తపస్సు చెయ్యడంవల్ల అతడు ఒక విధంగా కృశిం

చినా శ్రీహరి వచోమృతం తనివిదీర త్రాగి సౌక్కియుండడంవలన కృశీభూతు డుగా కన్పడలేదు జటలు నారచీరలు లేడిచర్మం ధరించి వున్నాడు నేత్రాలు తామరరేకుల్లాగా విశాలంగా వున్నాయి సానపెట్టని నూత్నరత్నంలాగా వున్న ఆ మునీంద్రుడు తనకు పాదాభివందనం చేసిన మనువునకు అర్ఘ్యం పాద్యం యిచ్చి సత్కరించాడు భగవదాదేశాన్ని స్మరించి- ఆతనితో ఇలా అన్నాడు

రాజేంద్రా నీవు మహా భక్తుడవు శిష్టపరిగ్రహం దుష్ట నిగ్రహంకోసం నీవు లోకాలన్నీ తిరుగుతూ వుంటావు నీవు అఖిలలోక పాలాత్మకుడవు నీకు నేను నమస్కరిస్తున్నాను నీవు కాంచన మణిమయమైన రథం ఆధిరోహించి ధనుర్ధారివై నీ సేనల పాదఘట్టనంకు భూమి క్రక్కదలగా నిద్రాహారాలు లేకుండా సూర్యభగవానుడులాగా సంచరించకుండావుంటే బ్రహ్మదేవుడు కల్పిం చిన వర్ణాశ్రమ ధర్మాలు ఆచార వ్యవహారాలు నశించిపోయేవి సాంకర్యం ఏర్ప డేవి జారచోరులు ప్రబలి లోకాలు అస్తవ్యస్తాలయ్యేవి ఇపుడు నీ రాకకు హేతు వేమిటి?- అని కర్దముడనేసరికి స్వాయంభువమనువు ఇలా అన్నాడు-

మహాభాగా బ్రహ్మదేవుడు తాను విరచించిన వేదములను జగద్వ్యాప్తం చెయ్యడానికి మిమ్మల్ని తన ముఖంనుండి సృజించాడు పాపభీతిని తొలగించి ధరాతలాన్ని పాలించడానికి మమ్మల్ని తన బాహువులనుండి పుట్టించాడు ఆలా బ్రహ్మకు మనశ్శరీరాలయిన బ్రహ్మ క్షత్రాలను రక్షించడం రమాధవుని విధి కనుక సాక్షాత్తు శ్రీహరి స్వరూపకుడవైన నీ దర్శనంవలన నా భాగ్యం పండింది నీ చరణ కమల కింజల్కములచే రంజితమైన నా శిరస్సు నీ వచనామృతంతో [illegible] వులు సఫలమయ్యాయి నేను కృతార్థుడనయ్యాను ఇక నా రాకకు [illegible] రాను విను

[illegible] శ్వరా ఇదిగో ఈమె నా కుమార్తె దేవహూతి భర్తృకామినయై ఆమె [illegible] యెందరో వీరులను గురించి విన్నది కాని వారందరిని [illegible] దేవమహర్షి పనుపున నిన్ను వరించి వచ్చింది కనుక ఈమె భిక్షను పరిగ్రహించు గృహమేధిక కర్మల్లో నీకు ఈమె అన్నింటను తగినది కాగందు [illegible] తనను వెతుక్కొంటూ వచ్చిన సఖ్యాన్ని విడిచిపెట్టడం తగదు [illegible] వులు విడిచిపెడతారా?

[illegible] లాకాంక్షియైనవాడు లోభిని ఆశ్రయిస్తే వున్న కీర్తి మానంకూడా చెడిపోతాయి కనుక నీవున్నూ వివాహం చేసికోవాలనే కోరికతో వున్నావని

వచ్చాను నా ప్రార్థన అంగీకరించి ఈ మెను పరిణయమాడు-మని వేడగా కర్దముడు స్వాయంభువునకు ఈ రీతిగా అన్నాడు-

అనఘా నీయీ కన్య ఇంతవరకు ఎవరినీ వరించియుండలేదు రూప రేఖా విలాసాల్లో ఈమె లక్ష్మికి సాటికాగలదు ఈమెను గురించి నేను విన్న ఒక ఉదంతం చెపుతాను విను ఒకనాటి రాత్రివేళ ఈమె నిండు పున్నమివెన్నెల్లో సౌధోపరిభాగాన చెలికత్తెలతోగూడి కాలి అందెల రవళి వీనులకు విందుచేస్తూండగా కందుకకేళిలో నిమగ్నయై వుంది ఆ సమయంలో విమానగతుడయిన విశ్వావసు వసుసను గంధర్వరాజు ఈమెనుచూచి మోహించి వెంటనే క్రిందపడ్డాడు భగవదనుగ్రహానికి పాత్రులయినవారికే ఈమె చెలిమి లభిస్తుంది అంతటి సౌభాగ్యవతి యైన ఈమె వలచి వచ్చినపుడు ఎవ్వరు కాదనగలరు?

గుణరూప శీలాల్లో ఈమె నాకు తగినది కాగలదు కనుక ఈమెను తప్పక వరిస్తాను. కాని దీనికొక కట్టడి వుంది విను ఈమెకు సంతానోత్పత్తి అయ్యేవరకే నేను గృహస్థ ధర్మాన్ని పాటిస్తాను. అనంతరం శ్రీహరి ఆజ్ఞానుసారం యోగమార్గాన్ని అవలంబించి సన్యసిస్తాను సృష్టి స్థితి లయాలకు కారణభూతుడు శ్రీహరి బ్రహ్మేంద్రాదులకుకూడా అతడే అధిపతి కనుక ఆ దేవదేవుని ఆజ్ఞను జవదాటరాదు-

అని కర్దముడనేసరికి స్వాయంభువుడు భార్యా పుత్రికల మనోగతం తెలిసికొని కర్దముడు విధించిన నియమానికి అంగీకరించాడు వెంటనే దేవహూతిని ఆ మునీంద్రునకిచ్చి విధ్యుక్తంగా పరిణయం చేశాడు. వివాహానంతరం శతరూప నూత్న దంపతులకు వివాహోచిత దివ్యాంబరాభరణాదులిచ్చింది. ఈ రీతిగా నిజ కులాచారాన్ని అనుసరించి కూతురు పెండ్లిచేసి రాజదంపతులు మహానందం చెందారు. కాని పుత్రికా వియోగం దుర్భరంకాగా వారు ఎంతో మనో వ్యాకులత చెందారు.

రాజు కుమార్తెను కవుగిలించుకొని చిబుకం (గడ్డం) పుడుకుతూ చెక్కిలి ముద్దుపెట్టుకొని శిరస్సును మూర్కొని ప్రేమాతిశయంచేత ఆమె మస్తకాని కన్నీటి ధారలతో తడుపుతూ "తల్లీ పోయివస్తాను" అని కర్దమ[illegible] క్రై కొని భార్యాసహితుడై రథారోహణంచేసి బిందు సరస్తీరమందు[illegible] మాల సౌందర్యాన్ని వీక్షిస్తూ నిజనగరాభిముఖంగా బయలువేరి

అతని రాజధాని బర్హిష్మతీపురం. తొల్లి శ్రీమన్నారాయణుడు భూమిని ఉద్ధరించడానికి యజ్ఞ వరాహరూపం ధరించినపుడు తన శరీరం విదిలించగా అక్కడ అతని రోమాలు కొన్నిపడ్డాయి అవి పచ్చని కాంతితో కుశకాశమయం బైన[1] బర్హిస్సమూహం[2] కావడంచేత ఆ ప్రదేశానికి బర్హిష్మతి అను పేరు వచ్చింది యజ్ఞక్రియలకు యోగ్యమైన ఆ దర్భలను, రెల్లును గ్రహించి మునులు యజ్ఞాలుచేసి యజ్ఞవిరోధులైన రాక్షసులను తెగటార్చారు స్వాయంభువ మనువు కూడా విస్తృతంగా అక్కడ క్రతువు కావించి మహామేధావి అయ్యాడు.

కూతురు పెండ్లిచేసి రాజదంపతులు నిజరాజధానికి తిరిగి వచ్చేసరికి పౌరులు బాంధవులు మహానందంతో వారికి ఉచితరీతిని కానుకలు పెట్టి సన్మానించారు మంగళతూర్యాలు వందిమాగధుల స్తోత్ర పాఠాలు ధ్వనిస్తూండగా వారు అంతఃపురంలో ప్రవేశించి నిరంతరం శ్రీహరి కీర్తనంచేస్తూ ధర్మార్థ కామాలు తిరస్కరించి కేవలం మోక్షకాములై కాలం గడపడం మొదలుపెట్టారు.

స్వాయంభువుడారీతిగా శ్రీహరి మంగళగాథలు వింటూ ధ్యానిస్తూ వర్ణాశ్రమ ధర్మగతులను అనుసరిస్తూ తాపత్రయం లేకుండా డెబ్బయిఒక్క మహాయుగాల కాలపరిమాణంగల తన అంతరం (స్వాయంభువ మన్వంతరం)లో ఒక జామైనా వ్యర్థం చెయ్యకుండా రాజ్యపాలనంచేశాడు'- అని మైత్రేయుడు విదురునకు మొట్టమొదటి రాజైన స్వాయంభువ మనువుచరిత్ర చెప్పి ఇక కర్దముని కథను ఇలా చెప్పడం మొదలుపెట్టాడు.

## కర్దమ ప్రజాపతి చరిత్ర

స్వాయంభువమనువు దేవహూతిని కర్దమునికిచ్చి వివాహం చేశాక ఆమె [illegible] ఏమరకగా భావించి భవునకు (శివునకు) భవానిలాగా కర్దమునకు [illegible] చేస్తూ అతని వేయికళ్ళతో కనిపెట్టుకునివుండి ఇంద్రియ [illegible] ఎందా విశుద్ధమైన మనస్సుతో తనకు అరా శుశ్రూషచేస్తున్న [illegible] దైవయోగాన్నయినా తప్పించగల సమర్థుడు కర్దముడు- [illegible]ను, తపస్సమాధిచేతను యోగమహిమకారణంగాను

1 [illegible] కాశం=రెల్లు 2 బర్హిస్సు=దర్భ

లభించేటి దివ్యభోగాలన్నీ నీవు నన్ను సేవించడంవల్ల నీకు లభిస్తాయి నీకు దివ్యదృష్టిని ప్రసాదిస్తాను. ఆ దివ్యదృష్టి ప్రభావంతో నీకు సమస్తమూ కనబడతాయి శ్రీహరి బొమముడిమాత్రాన నాశనమయ్యే తుచ్ఛభోగాలు దేనికి? అపార రాజ్య సంపదలుగల రాజులకుకూడా పొందరాని దివ్యభోగాలు నీ పాతివ్రత్య నిష్ఠవల్ల నీకు ప్రాప్తిస్తాయి. నీకు కార్యసిద్ధి కలుగుతుంది- అని కర్దముడనేసరికి దేవహూతికి ఎనలేనంత తాలగిపోయింది కనుకొలకులయందు నున సిగ్గు దొంతరలు తొలగిపోగా తలవంచుకొని వినయ సౌహార్దాలు ఉట్టిపడేలా ఇలా అన్నది- అనఘా! నీవు సర్వసమర్థుడవు యోగమాయాధిపుడవు నీ కృపా విశేషంచేత నాకు కోరిన దివ్యభోగాలు సిద్ధించడం సహజం కాని వివాహ సమయంలో నీవు సంతానపర్యంతం శరీర సంగమం చేస్తానని ప్రతిజ్ఞ చేశావు నాకా శరీర సాంగత్య సుఖాన్ని అనుగ్రహించు కామవాంఛతో నేను వికల్ప శల్యమయ్యాను నీవు నా మనోరథం తీరిస్తేనేకాని నాకు మజ్జన భోజన పానాలు రుచింపవు కనుక రతితంత్రమైన కామశాస్త్రాన్ని ఉపదేశించి అందుకు వలసిన వివిధాంబరాభరణాలు, మాల్యానులేపనాలు, మందిరారామాలు కల్పించి నన్ను సుఖపెట్టు- అని మధురోక్తులతో అర్థించగా కర్దముడు నిజయోగాబలంతో కామగమనంగల సకలభోగాలకు నిలయమైన ఒక దివ్య విమానాన్ని సృజించాడు

దాని స్తంభాలు మణిమయాలు కుట్టిమ స్థలాలు మరకత శిలాలు. గోడలు కవాటాలు వజ్రాలతోను గడపలు పగడాలతో నిర్మింపబడ్డాయి. ఆ విమానంలోని చంద్రశాలలు కాంచన కుంభాలతోను పగడపు మొగ్గలతోను మనోహరంగా వున్నాయి అందులో ఎన్నో సుందర మందిరాలు ఉద్యానాలు ఉన్నాయి. ఆ వనాల్లో ప్రేలాడుతూవుండే పుష్ప మాలికలమీద తుమ్మెదలు మువ్వల రవళిలాంటి మధుర ధ్వనులు చేస్తుంటాయి.

ఆ విమానంలోని శయ్యాగారాలలో నానా విధాలైన చీని చీనాంబరాలు పట్టుబట్టలు అమర్చబడి ఉన్నాయి అచటి అంతఃపురోద్యానాల్లోని కృత్రిమ పక్షులను చూచి అవికూడ తమలాంటి నిజమైన పక్షులను భ్రమించి హంసలు, కోకిలలు పావురాలు చక్రవాకాలు చిలుకలు నెమళ్ళు వాటితో క్రీడిస్తుంటాయి అచటి కేళీగృహాల్లో నానావిధాలైన శయ్యాసనాలు శోభాయమానంగా వుంటాయి

అందున్న వనాల్లో వనపంక్తులు అన్ని ఋతువుల్లోను ఫలపుష్పాలతో నిండివుంటాయి అది సకల సుఖావహం సకల సంపత్కరం సకలోపభోగ యోగ్యం సకల కామప్రదం అలాంటి దివ్యవిమానాన్ని రచించి కర్దముడు తానే ఆశ్చర్యపడ్డాడు కాని దేవహూతికి సంతోషం కలగలేదు ఆమె ఆశయాన్ని గ్రహించిన కర్దముడు- దేవీ అఖిల మంగళాకరము భగవద్వీరచితము అయిన ఈ బిందుసరస్సులో క్రుంకిడినవారికి సకలకామ్యాలు సిద్ధిస్తాయి కనుక నీవున్నూ ఈ సరోవరంలో స్నానంచేసి విమానం ఎక్కు- అని పక్కపతో ఆమెను బుజ్జగిస్తూ అన్నాడు

పతిసేవాయాసంచేత ఆమె వస్త్రం మలినమైవుంది సంస్కారం లేకపోవ డంచేత ఆమె శిరోజాలు జటలుకట్టాయి ఆమె శరీరం దుమ్ముకొట్టుకొని కృశించి పోయింది. పతి ఆదేశాన్ని అనుసరించి ఆమె సరస్వతీ నదీజలాల్లో పుట్టిన జల చరాలకు ఆశ్రయభూతమైన బిందు సరోవరంలో క్రుంకులిడేసరికి ఆ సరోజల మధ్యంలో సూక్ష్మాంశుకాలు ధరించి కలువపూతావులను నలువైపులా విరజిమ్ముతూ నవయౌవనంలో మిసమిసలాడుతున్న వేయిమంది కన్యలు దేవహూతిని చూచి- తరుణీ నీకు ఉపచర్యలు చెయ్యడానికి వచ్చాం. ఆజ్ఞాపించమని ఆమెను సమీపించారు.

ఆమెకు తలయంటి నలుగుపెట్టి సుగంధజలాలతో స్నానం చేయించారు. శుభ్రవస్త్రంతో తడియార్చి సర్వాంగ ధూపమిడి కస్తూరిని అలదారు. నానావిధా లైన కాంచన విభూషణాలతో ఆమెను అలంకరించారు వెలలేని దుకూలాలు కట్ట బెట్టారు షడ్రసోపేతమైన భోజనం కల్పించారు కర్పూరనీరాజనంతో నివాళి పట్టారు మనోహరమైన ఆసనంమీద కూర్చుండపెట్టి అద్దం చేతికిచ్చారు

ఆమె అద్దంలో తన ప్రతిబింబంచూచుకొని ముకిసిపోయింది తన పతి యైన కర్దముని స్మరించింది వెంటనే ఆతడు తన సాన్నిధ్యంలో కనబడేసరికి ఆమె ఆతని యోగమాయాప్రభావానికి విస్మయం చెందింది. కృతస్నానయై దేవహూతి వివాహానికి ముందు ఎలావుందో అలా వుంది. ఆమె సౌందర్యంచూచి కర్దముడు ముగ్ధుడయ్యాడు. కన్యకాసహస్రం సేవిస్తుండగా ఆతడు భార్యా సహితుడై విమానం అధిరోహించి నక్షత్రగణ పరివృతుడు తారాపథమేకుడు ఐన చంద్రుడులాగా ప్రకాశించాడు.

విమానారూఢుడైన ఆ ముని దేవ వనితాసహితుడైన కుబేరుడులాగా గగన మార్గాన సంచరిస్తూ మేరునగ కందర ప్రదేశాల్లో కొంతసేపు విహరించాడు అక్కడ దిక్పాలకులు విహరిస్తూ వుంటారు కామోద్దీపకమైన మంద సుగంధ వాయువు వీస్తూ వుంటుంది ఆ పరిసరాల్లో ప్రవహించేటి సెలయేటి నీటి తుంపర లతో అవి చల్లగా వుంటాయి దేవహూతితో మనోహరమైన ఆ గిరికందర స్థలంలో కొంతసేపు విహరించి అనంతరం అమరోద్యానాన్ని చూచాడు మానస సరో వరాన్ని సేవించాడు అలా వాయువేగంతో సమస్త భూభాగం కలయదిరిగాడు

మోక్షప్రదాయకుడు తీర్థపాదుడు అయిన పుండరీకాక్షుని సేవించేటి పుణ్యాత్ములకు పొందరాని పదార్థం ఏముంటుంది? కర్దముడు నిజపత్నియైన దేవహూతికి నిఖిల భూమండలంలోగల వింతలనుచూపించి నిజనివాసానికి తిరిగి వచ్చాడు కామాతురయైయున్న ఆమెను ఆలింగనం చేసుకొని రతికేళీ వినోదాలతో ఇష్టోప భోగాలతో ఆమెకు మహానందం కల్పించాడు అనేక సంవత్సరాలు ఒక ముహూర్తంగా గడచిపోయాయి కాలగమనం తెలియకుండా నూరు సంవత్సరాలు క్రీడావిలాసాల్లో మునిగితేలిన యనంతరం-

మునీంద్రుడొకనాడు తన శరీరాన్ని తొమ్మిది విధాలుగాచేసి తన వీర్యాన్ని పత్నిగర్భంలో తొమ్మిది విధాలుగా నిలిపాడు ఆ కారణంగా ఆమెకు తొమ్మండ్రు కుమార్తెలు పుట్టారు ఆమె మహానందం చెందింది అనంతరం కర్దముడు సన్యసింపగోరేసరికి ఆమె సంతాపంతో చెక్కిట చేయిచేర్చి కాలి వ్రేళ్ళతో నేలపై వ్రాస్తూ అన్నది-

మహాభాగా! సంతాన పర్యంతం నన్నుకూడి వర్తిస్తానని అన్నావు అలాగే నాకు కుమార్తెలను అనుగ్రహించావు బాగానేవుంది. కాని వీరికి పతు లెక్కడ లభిస్తారు? కనుక నీవు నీ పుత్రికలకు పరిణయమయ్యేంతవరకు ఆగు నాకు తత్త్వసంహిత నుపదేశించు నాకు ఒక కొడుకునుకూడా అనుగ్రహించు నా మనోభీష్టం తీర్చడానికి నీవుకాక నాకింకా దిక్కెవ్వరు? యౌవనావస్థలో అజ్ఞాన వశంచేత కేవలం కామవాంఛతో నిన్ను వరించాను నా వాంఛ యీడేరింది నాకు ఐహికభోగాల్లో విరక్తికలిగింది ఇక మోక్షమా? మహాత్ముడవైన నిన్ను సేవించడం వలన అది నాకు సిద్ధించడంలో ఆశ్చర్యంలేదు సజ్జన స్నేహం సద్గతికి దుర్జ న స్నేహం దుర్గతికి హేతువవుతుంది—

ఆని దేవహూతి వేదనతో పలికేసరికి కర్దముడు పూర్వం శ్రీహరి అన్న మాటలు స్మృతిపథంలో మెదలగా మనస్సు తిరిగి అనునయిస్తూ- తరుణీ దుఃఖించకు. అనతికాలంలో జనార్దనుడు నీ కడుపున జన్మిస్తాడు. నియమ నిష్ఠలతోను తపోదానాలతో ఆ దేవదేవుని చరణాంబుజాలను సేవించు. ఆతడు నీ పరిచర్యకు సంతసించి నీ గర్భంలో ప్రవేశించి నీ మనోరథం తీరుస్తాడు- అని కర్దమముని అనేసరికి దేవహూతి ఆనందాతిరేకంతో శ్రీహరిని నిశ్చలమైన భక్తితో యజించగా ఆ దేవేశుడు కార్దమతేజం ధరించి ఆమె గర్భంలో ప్రవేశించి కాలక్రమంలో శమీతరుకోటరం[1] నుండి అగ్ని జనించినట్లు కపిలుడుగా జన్మించాడు. ఆ సమయంలో ముల్లోకాల్లో ఎన్నో శుభనిమిత్తాలు పొడచూపాయి.

దేవహూతికి తత్వబోధ చెయ్యడానికి అలా ఆమె గర్భాన జనించిన పరబ్రహ్మస్వరూపుడైన శ్రీమన్నారాయణుని దర్శించడానికి బ్రహ్మదేవుడు మరీచి మొదలైన మునీంద్రులను వెంటబెట్టుకొని కర్దమాశ్రమానికి వచ్చి ఆ దంపతులతో ఇలా అన్నాడు—

సచ్చరితులారా! మీరు కృతార్థులయ్యారు. మీరు నిష్కపట బుద్ధితో శ్రీహరిని సేవించినందుకు మీకు తగిన ఫలం లభించింది. పరమేశ్వరుడు మీ కోర్కె తీర్చడంవలన మీ జన్మ సఫలమైంది. సకాములై భక్తితో హరిని సేవిస్తేచాలు ముక్తి లభిస్తుంది. మీ పుణ్యాన్ని మేము ఎలా కొనియాడగలం? మీరు మీ కుమార్తెలను మునీంద్రులకిచ్చి పరిణయం చెయ్యండి. వారివలన ప్రజాసృష్టి వృద్ధిపొందుతుంది. ఇపుడు మీకడుపున బుట్టినవాడు అనంతుడు ఈశ్వరుడు. జ్ఞానవిజ్ఞానయోగాలను బోధించి కర్మజీవుల నుద్ధరించడానికి పుట్టాడు. ఇతను సిద్ధులచే సేవింపబడుతూ సాంఖ్యశాస్త్రాచార్యుడై కపిలుడని విఖ్యాతి చెందగలడు- అని పలికి బ్రహ్మ హంసారూఢుడై నారదుడు సనకసనందనాదులు వెంటరాగా నిజలోకానికి వెళ్ళారు.

చతుర్ముఖుడలా తన లోకానికి వెళ్ళిన తర్వాత కర్దముడు తన కుమార్తెలకు పెండ్లి చేయదలచి మరీచికి కళయను కన్యకను అత్రికి అనసూయను అంగిరసునకు శ్రద్ధను పులస్త్యునకు హవిర్భువును పులహునకు గతిని క్రతువునకు క్రియను, భృగునకు ఖ్యాతిని వశిష్ఠునకు అరుంధతిని అథర్వునకు శాంతిని ఇచ్చి నిజకులాచారాన్ని అనుసరించి వివాహంచేశాడు. అనంతరం ఆ మునులందరు కర్దమునిచే సత్కృతులై భార్యలను వెంటబెట్టుకొని తమ తమ ఆశ్రమాలకు వెళ్ళారు.

---

1 జమ్మిచెట్టుతొర్ర

మూడు యుగాలు గడచిపోయాయి కపిలుడు భగవంతుడని యెరిగిన వాడుకావున కర్దము డొకనాడు విజనస్థలంలో ఆతనిని కలిసికొని నమస్కరించి యిలా అన్నాడు- మహాత్మా ఆత్మకృతములైన అమంగళకర్మ లనెడి దావాగ్ని జ్వాలలచే దహింపబడెడి జీవులు సంసారబద్ధులై వుంటారు వారి కెన్నడికోకాని దేవతలు ప్రసన్నులుకారు

అనేక జన్మలనుండి పరిపక్వమైన యోగసమాధిచేతను తపోనిష్ఠవలనను యోగులు నిన్ను దర్శింపగలుగుతారు అలాంటి దివ్య పురుషుడవైన నీవు నాయింట పుట్టావు సంసార సాగరంలోపడి ఈదులాడు మావంటివారిని చులకనగా జూడక పూర్వము నీవు ఇచ్చినమాటను తప్పకుండా నన్ను అనుగ్రహించడానికి నాకు సుతుడవై జన్మించావు

పరమపురుషా నీ ఆశ్రితులను రక్షించడానికి అసాధారణ బలసంపన్నుడవైన నీవు నానావిధాలైన అవతారాలు ధరిస్తూ వుంటావు విద్వజ్జనులు తత్త్వజ్ఞానంకోసం నీ పాదాలను ఆశ్రయిస్తారు అలాంటి పాదయుగళముగల నిన్ను నుతించడం నా వశమా? షడ్గుణైశ్వర్యములకు[1] నీవు కారకుడవు పరమేశ్వరుడవు ప్రకృతి పురుష మహదహంకార కాలేంద్రియాత్మకుడవు జగదాత్మకుడవు చిచ్ఛక్తివి గర్భంలో సమస్త లోకాలను ధరించిన మహానుభావుడవు అలాంటి నీవు నా కడుపున పుట్టినందుకు నీకు నాకయిమోద్పులు ఇక నేను యోగసమాధితో నీ పాదారవిందాలను మనస్సులో నిలిపి ఏ వ్యసనమూలేకుండా సంచరిస్తాను- అని కర్దముడు సవినయంగా అనేసరికి కపిలుడన్నాడు-

'మునీంద్రా నేను పూర్వం నీకిచ్చిన మాట ననుసరించి నీకు పుత్రుడుగా జన్మించాను. నాకు ఏ కోరికాలేదు నేను ఏ అవతారం దాల్చినా మునులకు తత్త్వబోధ చెయ్యడానికేకాని వేరే ఏ ఆశయంతోనూకాదు. కనుక సమస్త కర్మలు విడిచిపెట్టి వికార రహితుడవై మోక్షకాంక్షతో నన్ను సేవించు పరంజ్యోతిని ఆద్యంత శూన్యుడనునైన నన్ను నీవు నీ హృదయ పీఠకయందు నిలిపి జితేంద్రియుడవై మనో నేత్రంతో నన్ను వీక్షించు నీకు మోక్షం కరతలగతం అవుతుంది- అని కపిలాచార్యుడనేసరికి కర్దముడు ఆ మహానుభావునకు ప్రదక్షిణ నమస్కారాలుచేసి మునిజన సేవితమైన అరణ్యానికి వెళ్ళాడు

నిస్సంగంగా మౌనం పాటించాడు అగ్నిలేదు ఆశ్రమంలేదు పరబ్రహ్మను ఆత్మలో నిలుపుకొని అహంకార మమకారాలు విడిచిపెట్టాడు. దయాన్వితుడై సకల భూతములందు సమభావం కలిగివున్నాడు నిస్తరంగ సముద్రంలాగా ప్రశాంతంగా వున్నాడు. సమస్త ప్రపంచాన్ని వాసుదేవమయంగా భావించి భక్తియోగంతో పరమ భాగవతోత్తముడయ్యాడు.

---

1 ఐశ్వర్యం వీర్యం యశస్సు శ్రీ, జ్ఞానం వైరాగ్యం

కర్దముడు వనాభిముఖంగా వెళ్ళిన తర్వాత దేవహూతి బిందు సరస్సు దగ్గరవున్న కపిలుని కలిసికొని ఇలా అన్నది- అనఘా! దుష్టములైన ఇంద్రియాల ఘర్షణంవలన తపించెడి నాకు మోహాంధకారం ఎలా తొలగిపోతుంది? అంధకారావృతమైన ప్రపంచానికి సూర్యుడులాగా నీవొక్కడవే నేత్ర ప్రాయుడవై మహాతేజంతో ప్రకాశిస్తూ వుంటావు. నా మోహాంధకారం పోగొట్టగలవాడవు నీ వొక్కడవుతప్ప ఇంకెవ్వరూలేరు. నిన్ను శరణువేడుతున్నాను. నన్ను రక్షించు- అని దేవహూతి వేడగా కపిలుడు మహానురాగంతో మోక్షసాధకమైన తల్లిమాట విని మందస్మితంతో ఆమెకు ఇలా అన్నాడు-

తల్లీ! విను. బంధానికిగాని మోక్షానికిగాని జీవుని మనస్సే కారణం. అది త్రిగుణాసక్తమైతే బంధహేతువౌతుంది. నారాయణాసక్తమైతే మోక్షకారణమౌతుంది. మనస్సు అహంకార మమకారాదులనుండి విముక్తమై పరిశుద్ధమైనపుడు సుఖదుఃఖాలకు అతీతంగా వుంటుంది. అలా మనస్సు ఎప్పుడు భక్తి జ్ఞాన వైరాగ్యయుక్తమౌతుందో అపుడు ప్రకృతికంటె పరుడును పరమ పురుషుడును, పరంజ్యోతియునయిన పరమేశ్వరుని సాక్షాత్కారం లభిస్తుంది. పరతత్త్వ సిద్ధి కోసం యోగులు భక్తిమార్గంకంటె మరో మార్గం లేదంటారు.

ఇంద్రియ వ్యసనాల్లో చిక్కుకుంటే బంధం తప్పదు. అలాకాక సద్విషయాల్లో సక్తమైతే మనోనిగ్రహం లభిస్తుంది. అపుడు మోక్షమార్గం సుగమం కాగలదు. కర్మఫలాన్ని వదలి నా పాదాలను ఆశ్రయించి నిరంతరం నన్ను ధ్యానిస్తూ నా కథా ప్రసంగాలను చెవులారా వింటూవుండే భాగవతులను తాపత్రయాలు దరిజేరవు. సత్సాంగత్యంవలనను, నా కథా శ్రవణంవల్లను, కైవల్య ప్రదాలైన శ్రద్ధాభక్తులు కలుగుతాయి. ఎవరైనాసరే, నేను కల్పించిన ఈ జగత్తును చూచి నాయందు భక్తిభావాన్ని పెంపొందచేసుకుంటే విరక్తుడౌతాడు. ఐహికాముష్మిక భోగాలయెడకూడా విముఖుడై భక్తి జ్ఞాన యోగ మార్గాలతో మనస్సును నిగ్రహించి ప్రత్యగాత్ముడనగు నన్ను పొందగలడు- అని కపిలుడనేసరికి దేవహూతి భక్తి, యోగం, యోగాంగాలు, తత్త్వావబోధం- వీటన్నిటిని గురించి సాకల్యంగా వినాలని కుతూహలం వ్యక్తం చేసింది. అపుడు కపిలాచార్యుడు ఇలా చెప్పడం మొదలుపెట్టాడు-

అమ్మా! విను. ఫలాపేక్షలేకుండా ఇంద్రియాలను మనస్సును నాయందు ...ంపచెయ్యడమే భక్తి. అలాంటి అవ్యాజమైన భక్తి ముక్తికంటెకూడ ఉత్కృష్టమైనది. అంచేతనే సకలార్థతత్త్వం తెలిసి వేదవిహిత కర్మలు ఆచరించే దేవగణం భగవత్సేవయందే ఆసక్తికలిగి వుంటారు. భుక్తాన్నాన్ని జఠరాగ్ని ఎలా ...స్తుందో అలా విష్ణుభక్తి లింగదేహాన్ని నాశంచేస్తుంది.

నిర్మలమైన భక్తితో కొందరు మహాత్ములు సర్వకర్మలు విడిచిపెట్టి నా పాదారవిందయుగళమునందే మనస్సును నిలిపి నన్నే కీర్తిస్తూ మోక్షాన్నికూడ కాంక్షించరు భాగవతోత్తములైన మరికొందరు అందమైన ముఖనేత్రాలు కలిగి కోరిన కోర్కెలనిచ్చేది నా వివిధావతారాల వైభవాన్ని కొనియాడుతూ ఆయా అవతారాలలో నే పలికిన పలుకులు పారవశ్యంతో చెప్పుకుంటూ నా మధుర హాసం నా వివిధ విలాసచేష్టలు తమ మనస్సులను ఆకర్షించగా సొక్కిపోతూ మోక్షాన్నికూడా కాంక్షించరు అయినప్పటికిన్నీ వారికి అణిమాద్యష్ట[1] విభూతి సేవితము నిత్యానంద సుధాయకము అప్రమేయమునైన వైకుంఠం లభిస్తుంది . ఆ పుణ్యాత్ములక్కడ కాలచక్రంలో చిక్కుకోకుండా శాశ్వతంగా సకల సుఖాలు అనుభవిస్తూ వుంటారు వారికి నేను సముడనై, కుమారునివలె ప్రేమాస్పదుడనై, మిత్రునివలె విశ్వసనీయుడనై గురువువలె ఉపదేష్టనై ఇష్టదైవమునై వారిని కంటికి రెప్పలా చూస్తూ వారికి కాలచక్రభీతిలేకుండా చేస్తాను. అంతేకాదు భువిలోగాని దివిలోగాని దార పశుపుత్ర పరివారంతో తగుల్కొనక విశ్వతో ముఖుడనైన నన్ను అనన్య భక్తితో కొలిచెడివారిని మృత్యురూపమైన సంసార సముద్రంనుండి తరింపజేస్తాను అలాకాక అన్యులను సేవించెడివారికి భవభీతి తప్పదు.

నా యాజ్ఞను శిరసావహించి గాలివీస్తుంది. సూర్యుడు తపిస్తాడు అగ్ని జ్వలిస్తుంది ఇంద్రుడు వర్షిస్తాడు మృత్యువు భీతిల్లి పరువులు పెట్టుతుంది కనుకనే విజ్ఞాన వైరాగ్యాలతో కూడిన భక్తియోగంతో పరమపదం కాంక్షించి యోగులు నా చరణ సరోజాలను ఆశ్రయిస్తారు. స్థిరమైన భక్తితో మనస్సును నాపై పాదుకొల్పితేచాలు పరమపదం కరతలామలకమౌతుంది- అని కపిలుడు తల్లికి భక్తియోగాన్ని గురించి చెప్పి యిక తత్వలక్షణాన్ని ఇలా చెప్పడం మొదలుపెట్టాడు- —

అమ్మా నీకు భక్తియోగాన్ని గురించి చెప్పాను ఇక తత్వ లక్షణాలు వివరిస్తాను విను అవి తెలిస్తే మానవునకు ఆత్మస్వరూపం తెలుస్తుంది ప్రకృతి లక్షణాలనుండి విముక్తుడౌతాడు మనస్సులో కలిగే సందేహాలన్నీ తీరిపోతాయి ఆత్మజ్ఞానంవలన మోక్షం కరతలామలకమౌతుంది

ఆత్మ అనాది. అతడు పురుషుడు సత్త్వాది గుణాలు అతనికి ఉండవు అతడు స్వయంజ్యోతి విశ్వసృష్టికి అతడే కారణభూతుడు. అతడు లీలావశంచేత గుణత్రయాత్మకము అవ్యక్తము భగవత్సంబంధి అయిన ప్రకృతిలో ప్ర స్తాడు. అలా ప్రకృతి పురుష సంయోగంవలన ప్రజాసృష్టి జరుగుతుంది.

1 అణిమ మహిమ, గరిమ లఘిమ ప్రాప్తి ప్రాకామ్యం వశిత్వం- ఇవి అష్టవిభూతులు.

దతని పూర్వజ్ఞానం మరుగునపడి వ్యామోహంతో తానుకూడా గుణాత్మకుడవు కుంటాడు అలాంటిస్థితిలో అతడు జీవుడనబడతాడు అప్పటినుండి అతడు జరిగే పనులన్నింటికి తానే కర్తయని భావిస్తాడు దానితో అతనికి పారతంత్ర్యం కలుగుతుంది.

వాస్తవంగా ఆత్మకు కార్యకారణ కర్తృత్వాలుండవు ప్రకృతికి అధీన మైనపుడు అతనికి అవి సంక్రమిస్తాయి- అని కపిలుడు చెప్పేసరికి దేవహూతి- పురుషోత్తమా సదసదాత్మకమైన (ఉన్నట్లు లేనట్లుతోచెడి) ఈ ప్రపంచానికి కారణభూతులు ప్రకృతి పురుషుల పరే వారి లక్షణాలుకూడా నాకు సదసద్వి వేచనా పూర్వకంగా చెప్పు- అని అర్థించింది అపుడు కపిల భగవానుడిలా చెప్పడం మొదలుపెట్టాడు

అమ్మా విను జ్ఞానులు ప్రకృతిని అయిదు విధాలుగా వివరించారు (1) త్రిగుణాన్వితమై వ్యక్తమయ్యేవి (2) అవ్యక్తమైనది (3) నిత్యమైనది (4) సదసదాత్మకమైనది (5) ప్రధానమైనది అనగా మొదటి నాలుగు లక్షణా లకు ఆధారమైనది- అని

ఈ అయిదు విధాలైన ప్రకృతి ఇరవైనాలుగు తత్వాలతోకూడి ఉంటుంది పంచభూతాలు, పంచతన్మాత్రలు జ్ఞానేంద్రియపంచకం కర్మేంద్రియ పంచకం అంతఃకరణ చతుష్టయం (మనస్సు బుద్ధి చిత్తం అహంకారం)- ఈ ఇరవై నాలుగు తత్వాలతో కూడిన ప్రకృతి సగుణబ్రహ్మకు నివాసం

పై ఇరవైనాలుగు తత్వాలుకాక కాలం అనే ఇరవై అయిదో తత్వం ఒకటి వుంది పురుష శబ్ద వాచ్యుడైన ఈశ్వరుని పౌరుషమేకాలమని కొందరంటారు కాలంవల్లనే సమస్త సృష్టి జరుగుతూ ఉంటుంది దీనిచుట్టూ ఇరవైనాలుగు తత్వాలు అల్లుకొని ఉంటాయి. అపుడు పురుషుడు అహంకారంచేత మోహితుడై ప్రకృతి సంసర్గంవలన జీవుడై ప్రకృతి గుణాలైన భయామలకు లోనౌతాడు ఇలా ఆత్మమాయవలన తత్వాంతర్గతుడైన జీవునివలన ప్రకృతి సంక్షుభిత మౌతుంది

జగత్తుకు కారణమైన ఆ ప్రకృతియందు అపుడు పురుషుడు తన వీర్యాన్ని (చిచ్ఛక్తిని) ప్రవర్తింపజేస్తాడు అంతట నా ప్రకృతినుండి హిరణ్మయమైన ... దాన్నే మహత్తత్వం అంటారు అందులో భగవంతుడు ...ంతో ప్రకాశిస్తూ కాలప్రపంచానికి బీజప్రాయుడౌతాడు అయినా ... లయవిక్షేపాలేవీ ఉండవు— అని కపిలాచార్యుడు ఇలా మొదలుపెట్టాడు.

...ష్టి నిర్మాణక్రమ న్ని చెపుతానువిను సృష్టిని నిర్వహించడానికి

నాల్గువ్యూహాలున్నాయి[1] వాసుదేవం సంకర్షణం, అనిరుద్ధం ప్రద్యుమ్నం అని అవి దివ్యాలు సర్వజనసేవ్యాలు. వాటిలో వాసుదేవ వ్యూహం సర్వప్రధానమైనది అది ఊర్మిషట్కానికి[2] అతీతంగా వుంటుంది షడ్గుణాలతో[3] కూడి వుంటుంది. దాని నుండి క్రియాశక్తిరూపకమైన అహంకారం జనిస్తుంది ఆ అహంకారం వైకారికం తైజసం తామసం అని త్రివిధాలు వైకారికం మనస్సునకు ఇంద్రియాలకు భూతపంచకానికి ఉత్పత్తిస్థానమై వుంటుంది.

వైకారికమైన అహంకారాన్ని అధిష్ఠించి వేయిపడగలతో గూడిన అనంతుడు సంకర్షణుడనే పేరుతో ప్రవర్తిస్తాడు అది రెండవదియైన సంకర్షణ వ్యూహం అది కర్తృత్వం, కార్యత్వం కారణత్వం మొదలైన వివిధ లక్షణాలతోగూడి వుంటుంది

తైజసాహంకారంనుండి మూడవదియగు అనిరుద్ధవ్యూహం ఏర్పడుతుంది అది ఇంద్రియాలకు అధీశ్వరం సకల యోగీంద్రసేవ్యం.

సాత్వికాహంకారాన్ని ప్రద్యుమ్నుడధిష్ఠించివుంటాడు అది నాల్గవదియైన ప్రద్యుమ్నవ్యూహం- ఈ నాల్గు వ్యూహాలు సృష్టికి మూలాధారాలు ఈ వివిధాహంకారాలనుండి మహదాది తత్త్వాలు ఉత్పన్నమవుతాయి ఈ తత్త్వాల పరస్పర సమ్మేళనంవలన వాటికి జీవోత్పత్తి సామర్థ్యం కలుగుతుంది ఆ సమయంలో పరమాత్మ వానియందు ప్రవేశిస్తాడు ఆతని ప్రవేశంవలన ఆ తత్త్వాలన్నీ పరస్పర ఘర్షణం చెందుతాయి అపుడు అందుండి ఒక అండం పుడుతుంది

ఆ అండంనుండి మహాశక్తి సంపన్నుడైన విరాట్పురుషుడు ప్రభవిస్తాడు ఆ విరాట్పురుషునకు క్రమంగా వివిధావయవాలు ఏర్పడుతాయి[4]- అని చెప్పి కపిలుడు తల్లికోరికపై ఇంకనూ భక్తియోగాన్ని గురించిన్నీ పురుషునకు విరక్తిని పుట్టించెడి జీవుల నానావిధ క్లేశాలను గురించిన్నీ జీవుని గర్భయాతనను గురించిన్నీ వివిధ కర్మ ఫలగతులను గురించి సాకల్యంగా వివరింపగా ఆమె మహానందంతో కపిలుని వేవిధాల ప్రస్తుతించింది కపిలుడారీతిగా తల్లికి ఆత్మమార్గం చెప్పి యథేష్టంగా వెళ్ళిపోయాడు.

కపిలుడు నిర్గమించిన తర్వాత దేవహూతి ఆతడుపదేశించిన తత్త్వమార్గాన్ని అనుసరించి సరస్వతీనదీతీరస్థమైన తన ఆశ్రమంలో జటావల్కలధారిణియై మహోగ్రమైన తపోభారంతో కృశించి కపిలనామధేయుడైన శ్రీమన్నారాయణుని

---

1 వ్యూహం అంటే నిర్మాణసాధనం

2 క్షుత్పిపాసలు, శోకమోహాలు జరామృత్యువులు- ఈ ఆరిం లంటారు 3 తపస్సు దానం శౌచం శమం దమం సత్యం-

4 విరాట్పురుషునియందుండి విశ్వదేహంయొక్క ఉత్పత్తిని గుఱి ద్వితీయస్కంధంలోను తృతీయస్కంధం పూర్వభాగంలోను

నిరంతరధ్యానంచేస్తూ కర్దమమహర్షి కల్పితాలైన సకల భోగవస్తుజాలాలతోగూడిన ఆ ఆశ్రమాన్ని విడిచిపెట్టింది అనంతరం యోగశక్తిచే ఆకాశానికి ఎగసి శ్రీహరియందు కలిసిపోయింది

ఆ దేవి మోక్షానికి వెళ్ళిన క్షేత్రం సిద్ధిపదం అనే పేరుతో ప్రసిద్ధికెక్కింది. తల్లిని వీడ్కొని వెళ్ళిన కపిలాచార్యుడు సిద్ధచారణాదుల పొగడ్తలు వింటూ సముద్రాభిముఖంగా వెళ్ళాడు సముద్రుడు ఆయన్ను సంపూజించి చరితార్థుడయ్యాడు. అనంతరం సాంఖ్యాదారులచే పొగడబడుతూ యోగమార్గాన్ని అవలంబించి ముల్లోకాలకు శాంతి చేకూర్చేందుకు కపిలుడు ఉత్తర దిక్కుగా నిర్గమించాడు— అని మైత్రేయమహాముని విదురునకు చెప్పినరీతిగా శుకయోగీంద్రుడు పరీక్షిన్నరేంద్రునకు చెప్పాడని సూతుడు శౌనకాది మహామునులకు వచించాడు అపుడు వారందరు మహానందంచెంది- "మునీంద్రా నీవాగమృతం ఎంతగ్రోలినా మా మనస్సులు తృప్తిచెందకుండా వున్నాయి. అనంతర వృత్తాంతంకూడ వినిపింప"మని అర్థించారు.

—.∴ —


25002

# ఎమెస్కో వచన మహాభాగవతం

## (మొదటి సంపుటం)

శ్రీ పోతన మహాభాగవతమునకు అనుకృతి

## అయినంపూడి గురునాథరావు

**శతావధాని కీ॥ శే॥** శ్రీ కోట వీరాంజనేయ శర్మగారి ఎమెస్కో వచన రామాయణం ప్రచురణ పూర్తి కాగానే- అనూహ్యంగా శ్రీ దేవీ భాగవతమును వచన రూపంలో వెలువరించాలని సంకల్పం కలిగింది.

ఈ సంకల్పము కలుగుటయే తరువాయి- మా చూపులు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషా చతుర్ముఖులు అయిన విద్వాన్ శ్రీ అయినంపూడి గురునాథ రావుగారి దెస ప్రసరించాయి. శ్రీ గురునాథరావుగారు మా కోరిక ననుసరించి- శ్రీ దేవీభాగవతమును ఆంధ్రీకరణములో సంస్కృత మూలమునకు తీసిపోకుండా సరళవచన రచనములో ధారాళముగా రచన గావించారు. ఆ రచనను పూర్తిగా మూడు సంపుటాలుగా వెలువరించి యున్నాము.

ఎమెస్కో రామాయణమును సమాదరించినట్లుగా శ్రీ గురునాథరావుగారి రచన శ్రీ దేవీభాగవతమును పాఠకులు సహృదయముతో భక్తిపూర్వకముగా సమాదరించియున్నారు. ఈ సమాదరణ- మమ్ములను ఆయనచే- బమ్మెరపోతన శ్రీ మద్భాగవతమును ఆంధ్రలోకమునకు సరళవచనములో అందించ తలంపునకు పురికొల్పినది.

బమ్మెరపోతన భాగవతము అనగానే భక్తి ప్రపూరితమైన గాథలు- గజేంద్రమోక్షము, ప్రహ్లాద చరిత్ర, వామన చరిత్ర, రుక్మిణీ కళ్యాణం, అంబరీష రాఖ్యానము- ఈ భక్తమణుల మూలసూత్రమైన వాసుదేవతత్వమూ మనలో పొరలుతుంది. హరికి, యోగివరులకూ అభిలషితమైన భాగవతగాథలు క్తిలో ముంచి పచ్చలతురాయిని కూర్చిన బమ్మెరపోతన తెలుగు కావ్యం థను సంపూర్ణముగా సరళ తెనుగు వచనంలో అందజేస్తున్నాము.

-పుటములనుకూడ పాఠకులు భక్తిప్రపత్తులతో సమాదరించగలరని

Nandini

శ్రీ శ్రీ గురుగౌరాంగౌ జయతః

శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసకృతమగు

# శ్రీమద్భగవద్గీత

*

శ్రీ గౌడీయ వైష్ణవాచార్యవర్య శ్రీల విశ్వనాథచక్రవర్తి కృతమగు "సారార్థవర్షిణీ" భాష్యము ననుసరించి శ్రీల ఠాకురు భక్తివినోద ప్రణీతమగు వంగభాషయందలి "రసిక రంజన" నామ మర్మానువాదమునకు ఆంధ్రానువాదము, మూల శ్లోకములు, ప్రతిపదార్థముతోఁగూడిన ఆంధ్ర గీతాభాష్యము

*

ఆంధ్రానువాద సంపాదకుడు :

శ్రీ ధామ మాయాపురస్థిత శ్రీ చైతన్య మఠమునకును, తదీయ శాఖా గౌడీయ మఠములకును అధ్యక్షులగు

త్రిదండిస్వామి

శ్రీశ్రీ మద్ భక్తివిలాస తీర్థగోస్వామి మహారాజుగారు

*

ఆంధ్రానువాద రచయిత:

యల్లాపంతుల జగన్నాథం, బి.ఏ.,

ఉపదేశక భక్తితిలక

శ్రీ గౌడీయమఠము, గుంటూరు-1.

*

సర్వస్వామ్య సంకలితము ]

[ మూల్యము రు. 5.00